


చెన్నపట్టణము ఆగష్టు ౧౯౨౬

సంపుటము 3 అక్షయ సంవత్సరము శ్రావణమాసము సంఖ్య ౮


# ఆతిథ్యము


కొమాండూరు కృష్ణమాచార్యులుగారు (సాహితీసమితి)


౧

శ్రీమంతమగు చోళ సీమకంతకును
సీమంతరత్నమై చెన్నారుచుండు
కార్పాసికారామ గ్రామంబునందు
వరదార్యుఁ డనునొక్క వైష్ణవోత్తముఁడు
సాంగవేదార్ణవసాంయాత్రికుండు
శ్రీనివాస పదాబ్జ సేవాపరుండు
ద్వయసద్మవదనుఁ డద్వంద్వుఁ డనఘుఁడు
నిజకుటీరంబున నివసించుచుండు
ఆవైష్ణవాగ్రణి యర్ధాంగలక్ష్మి
లక్ష్మిసమాఖ్యచే రాజిల్లుభామ
పదునెన్మిదేడుల ప్రాయంపులేమ
ఆమె సౌందర్యంబు నభినుతింపంగ
సర్వాధిపునకైన శక్యంబుగాదు
పసిఁడికి నెత్తావి ప్రాపించినట్లు
రూపంబునకు ననురూపంబులైన
గుణసంపదలచేత కోమలియొప్పు
సద్వైష్ణవాచార సంప్రదాయమున
వర్ధిల్లి ద్రవిడప్రబంధంబులెల్ల
నర్థయుక్తంబుగ నాచార్యునొద్ద
కరతలామలకంబుగా గ్రహియించె

పతియె దైవంబుగా పడఁతి భావించి
భాగవతాచార్యబహుపూజనములు
పరమభక్తిని సల్పుఁ బద్మాయతాక్షి
అమ్మహాసాధ్వియు సద్వైష్ణవుండు
వసియింతు రొకపర్ణవాసంబునందు
స్వాధ్యాయపరుఁడయి సద్బ్రాహ్మణుండు
ఉంఛవృత్తియె జీవనోపాధిగాఁగ
విష్ణుపూజావిధుల్ విడువక సలుపు.

౨

ఆగ్రామముననుండు నర్థపసముఁడు
మన్మథాకారుండు మదనాతురుండు
వైశ్యకుమారుండు వనితాప్రియుండు
ఫాలాక్షునైనను బంటుగాఁజేయు
తరుణిరూపమునకు దాసుఁడై యతఁడు
లక్ష్మీకటాక్షలాలసుఁడై మెలంగు
అష్టమీచంద్రఖండాయితంబైన
ఫాలభాగంబునఁ బద్మాయతాక్షి
తీర్చినసిందూరతిలక మాతనికి
భ్రూచాపనిహితమూ పుష్పసాయకుని
విరహిశోణితసిక్తవిషమాస్త్రమయ్యె
దక్షిణానిలబాలుదౌష్ట్యంబుచేత
వనితాముఖంబుపై వ్రాలుముంగురులు
వానిపాలికి మోహపాశంబులయ్యె
చైత్రవేళల సాంధ్యసమయంబులందు
గంధమాల్యంబులఁ గైసేసి యతఁడు
సితదుకూలంబులు చింగులుజార
వింతగా ధరియించి వెడఁదఫాలమున
సిందూరతిలకంబు చిరుతగాదిద్ది
మృగనాభిగంధముల్ మేనిపైనొలయ
తాంబూలవాసనల్ తనరాకఁ దెలుప
వేత్రలతాహస్త విన్యాసమొప్ప
తరుణీకుటీరంబు దాపుననున్న
రథ్యపై విహరించు రమణీకటాక్ష
మొకనాఁడుగాకున్న నొకనాటికైన
తనమీఁదఁ బ్రసరించు తలపుసిద్ధించు
నని యడియాసల నాకాముకుండు.

వనితాలలామంబు వానిచేష్టితము
పలుమారు వీక్షించి పతిరక్తగాన
వర్జించుచుండును వానిదర్శనము.
వనితామతల్లిని వంచింపఁగోరి
చతురదూతీవాక్య సరసబోధనల
వివిధభూషణముల వివిధాంబరముల
వివిధమార్గంబుల వెలఁదికై యతఁడు
పడరానిపాట్లెల్లఁబడి పాటుగామి
గ్రుక్కిళ్లుమ్రింగుచుఁ గుసుమసాయకుని
చేతి కీల్బొమ్మయై చింతతోనెపుడు
నిట్టూర్పుపొగలచే నిజముఖాబ్జంబు
వాడిపోవఁగ దేహ పాండిమం బమర
తనకపోలము హస్తతలమున నూది
మదనజ్వరంబుచే మఱిమఱి క్రాఁగి
కార్శ్యవైవర్ణ్యముల్ కాయంబుగప్ప
క్షీణచంద్రునిపోల్కిఁ జిక్కుచునుండె.

౩

శాంభవఫాలాగ్ని సదృశతీక్ష్ణంబు
పరిపక్వశాల్మలీ ఫలవిదారకము
మృగతృష్ణికాముగ్ధ మృగసమూహంబు
దావపావకదగ్ధ ధరణీరుహంబు
బకజానుదఘ్నంబు బహుతటాకంబు
గ్రీష్మోష్మపరిశుష్క కేదారచయము

పశ్చిమానిలభిన్న బహుపాంథజనము
ఉదుటుతోఁ బొడసూపె నుష్ణాగమంబు
అట్టినిదాఘంబు నం దొక్కనాఁడు
వైష్ణవాగ్రణియైన వరదదేశికుఁడు
కాల్యకృత్యములు సక్రమముగాఁ దీర్చి
ఉంఛవృత్తియె జీవనోపాధిగాన
అరిగె భిక్షార్థియై యచటి పల్లెలకు
అతిసాధ్వియగు వరదాచార్యగృహిణి
అన్నవస్త్రములకు నైన లేనట్టి
సంసారమగుట నాచ్ఛాదనంబునకు
వస్త్రమొక్కటెయౌట వనజాయతాక్షి
మడి కారవైచి తా మందిరంబందు
గృహకవాటముమూసి గేహకార్యముల
నవరించుకొనుచుండె సాధ్వీమతల్లి.

౨

దారుణపాషండ దావపావకుఁడు
చార్వాకజైనాది శైలదంభోళి
బౌద్ధమత్తేభేంద్ర పంచాననంబు
మాయామతధ్వాంత మహితభాస్కరుఁడు
పాశుపతాహీన వైనతేయుండు
కాణాదకదళికాగంధగజంబు
కపిలచాపలలతాఖరలవిత్రంబు
కౌమారిలకుతంత్రగాఢ కాంతార
ఖండన చణతర్కకర్కశహేతి
మథితత్రయ్యన్తాబ్ధి మంథాచలంబు
శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంతకర్త
శ్రీ భాష్యనిర్మాణ శేముషీధనుఁడు
కాషాయకైతకీ కాంచనాంబరుఁడు
దండత్రయోజ్జ్వల దక్షిణకరుఁడు
ఊర్ధ్వపుండ్ర విభూషితోరుదేహుండు
బ్రహ్మసూత్ర పవిత్రవక్షస్స్థలుండు
జలజపత్రాయతచారులోచనుఁడు
ఆజానుదీర్ఘ బాహార్గళద్వయుఁడు
తప్తకాంచన వర్ణతనుసుందరుండు
ద్రావిడామ్నాయార్థ తత్త్వవిదుండు
త్రయ్యన్తవాక్యసంరక్షణార్థంబు
క్షితిపైని వెలసిన శ్రీనివాసుండు
రామానుజుఁడు యతిరాజశేఖరుఁడు
కతిపయశిష్య సంఘంబుతో వచ్చి
వరదార్యగృహ బహిర్ద్వారంబుఁ దట్టి
ఉచ్చైస్స్వరంబున నొగిఁ బిల్చుటయును
అమ్మహాసాధ్వి యిట్లాత్మఁ జింతించె:
"మట్టమధ్యాహ్నమై మటమటఁ గాలు
సమయంబునందు నాచార్యుండు వచ్చె
జీర్ణవస్త్రంబుతో శ్రీవారి నెట్లు
సేవించుదాన నే సేవింపకున్న
నరుగు హతాశుఁడై యాచార్యుఁ డిపుడు
బహుజన్మకృతపుణ్య పరిపాకముననో
రంగనాయకకృపాలవలేశముననో
భగవానుఁడైన శ్రీభాష్యకారుండు
దాసవర్గముపైని దాక్షిణ్యమొప్ప
విచ్చేసె నిప్పుడు విఖ్యాతయశుఁడు."
అనికరతాళంబు లతివ సల్పుటయు
ఆచార్యపాదు లాధ్వని యాలకించి
తనహాళిపై శాటి తక్షణంబూడ్చి
ఇంటిలోనికివైచె నింగితం బెఱిఁగి
అమ్మహాసాధ్వియు నతిభక్తితోడ
స్వామిశరీరసంసర్గంబువలన
అతిపవిత్రంబైన యంబర మపుడు
పలుమారు కన్నుల భక్తి నద్దికొని

ఆనందబాష్పలోలాంబక యగుచు
నద్దాని ధరియించి యర్ఘ్యపాద్యాది
సత్క్రియావిధులచే సపరివారముగ
నాచార్యుఁ బూజించి యాతిథ్యమీయ
మనసైన నిట్లని మానిని తలఁచె:

"పంగువుపై గంగ వారినయట్లు
నిరుపేదకు వరాలనిధి చిక్కినట్లు
పటుక్షుధాతురునకుఁ బరమాన్నమట్లు
యతిశేఖరుండు మాయతిథియై వచ్చె
క్షితిపైని వెలసిన శ్రీ మహావిష్ణు
వని చెప్పుదురు బుధులాచార్యు నెపుడు
ఆచార్యుఁడే దైవమని చెప్పు శ్రుతులు
అర్థంబు ప్రాణంబు నాచార్యుకొఱకె
ధరియించు వాఁడెపో తగినశిష్యుండు
సంసారవారాశి సంతరింపంగ
నావయై కడతేర్చునరుఁడ గురుండు
శాశ్వతసుఖమిచ్చు సద్గురుఋణము
శతజన్మములనైన శక్యమే తీర్ప?
పిడికెడు గింజ లీ పేదయిల్లాలి
ఇంటిలో లేవయ్యె నెట్లు సిద్ధించు
నాతిథ్యసత్కార మక్కటా! విభుఁడు
చెంతపల్లెలకేగె శిలమొనరింప.

ఆర్యు లేతెంచిన నాయన దెచ్చు
నల్పధాన్యంబుతో నాతిథ్యమగునె?
కూడని పనియైన గురునికై యిపుడు
గావించి సంతృప్తుఁ గావింపవలయుఁ
గానిచో వ్యర్థంబుగాదె జన్మంబు
కలివైరి పరకాలకవిపుంగవుండు
వైష్ణవార్చనలకై బహుధనంబులను
చౌర్యవృత్తి వహించి సంగ్రహింపండె?
కాంచనబౌద్ధ విగ్రహము హరించి
రంగమందిరగోపురములు నిర్మించె
అతనిస్వర్ణస్తేయుఁ డనుటచితంబె
శ్రీవైష్ణవాతిథ్యసిద్ధికై యతఁడు
ప్రచ్ఛన్నరూపుఁడౌ పరమపూరుషుని
అంగుళీయక శేషమైన లేకుండ
సకలధనంబులు సంగ్రహింపండె?
అయ్యాళువారున కఘము సేకురెనె
ప్రజలునాకై సేయు పాపకార్యములు
పుణ్యంబు లగును నన్నోబ్బనాఁడిసేయు
పుణ్యమైనను బాపభూయిష్ఠమగును
అనిభగవానుండె యానతీయండె
ప్రత్యక్షదైవంబు పరమగురుండు
మలపూరితంబైన మానవదేహ
మవనశాశ్వతంబగుట తథ్యంబు
కావున గురునికై కాయంబు నమ్మి
ఆతిథ్యకైంకర్య మాచరించుటయె
సద్ధర్మమగును నిస్సంశయంబింత.

కలఁడు గ్రామంబునఁ గామాతురుండు
తరుణుండు వైశ్యుండు ధనమదాంధుండు
అతనికి నీకాయ మమ్మియాచార్యుఁ
బూజింతు నరకమో పుణ్యలోకంబొ
దాన నయ్యెదియైన ధన్యనేయగుదు!"

అని నిశ్చయించి యయ్యకలంకచరిత
ఆచార్యుతోఁడ ని ట్లతిభక్తిఁ బలికె
"ఆతపాహతిచేత నాయాసపడితి
రార్యులు స్వాములు నతికాలమయ్యె
దాసురాలి కుటీరతలము మీపాద
పాంసులేశముచేత పావనంబయ్యె
విశ్రమింపుఁడు దేవ, వివిధవస్తువులు

ఆచార్యకృపచేత నచిరకాలమున
శ్రీ వారిసన్నిధిఁజేర్చు నీదాసి"
అని యనుజ్ఞాతయై యమ్మహాసాధ్వి
ఆ వైశ్యగృహమున కాక్షణం బరిగి
మందస్మితముఖాబ్జమాధుర్యమునకు
ముగ్ధుఁడై దిగ్భ్రాంతి మోముపై దృష్టి
మరలింపలేక తన్మయత వీక్షించు
నాతనిజూచి యత్యాదరంబొప్ప
కలకంఠకోమల కాకలీఫణితి
పలికె నిట్లని సిగ్గు పాయంగఁ ద్రోచి:

"వైశ్యావతంస, నీవాంఛితం బిపుడు
సిద్ధించు; నర్థినై చేరవచ్చితిని
మద్గురుపాదులు మాగృహంబునకు
కతిపయశిష్యసంఘంబుతో నిపుడు
విచ్చేసియున్నారు వివిధవస్తువులు
పాత్రసామగ్రియుఁ బంపవేఁడెదను
నేడు పున్నమరేయి నీ హర్మ్యమునకు
స్వాయముగావత్తు నాచార్యులయాన!"
అనఁ గడు విస్మితుండై వైశ్యసుతుఁడు
చిత్తమం దిట్లని చింతించె నపుడు:

"ఏమిఁ నోముఫలంబొ యిన్నాళ్ల కిపుడు
మనసిచ్చి నాతోడ మాటాడె మగువ
కన్నెత్తి చూడని కమలాయతాక్షి
మరుని తూపులమాఁపు మధురంపుఁజూపు
పరపె నాపై భామ పలుమాఱు నేఁడు
మొగమైనఁ జూపని ముద్దరా లిపుడు
బింబాధరోష్ఠంబు విచ్చి నాతోడ
చిరునవ్వువెన్నెలల్ చిప్పిలుచుండ
నభిసరించెద నంచు నాడిన దహహా!
నిక్కంబగునొకో నేవిన్నదిపుడు
వనితకంఠరవంబొ వల్లకీరవమొ
కాదు నిక్కమ మదె కాంతకట్టెదుట
భాగ్యలక్ష్మియపోలెఁ బల్కరించెడిని
పరిణతచంద్రికా ప్రాసాదపృష్ఠ
సీమల నీరాత్రి చెలితోడఁ గూడి
మంతనంబులు సల్పి మన్మనోరథము
లీడేర్చుకొనుటకు నిదియె నాకదను"
అని చిత్తమున నెంచి యతివ వెన్వెంట
శాకతండులసూప సకలపదార్థ
తతులు ఘృతంబులు దధిభాండములును
పరిచారకులచేతఁ బంపె నాక్షణమ
ఆమహాసాధ్వియు నాపదార్థముల
నాచార్యసన్నిధి నర్పించిభక్తి
ప్రాంజలియై తాను పజ్జనిల్చుటయు
అతివసాహసమును నమితధైర్యంబు
భక్తియు జ్ఞానంబుఁ బ్రజ్ఞావిశేష
మఖిలపదార్థంబు లపుడ కూర్చుటయు
వీక్షించి యతిరాజవిబుధుఁ డాశ్చర్య
మగ్నుఁడై వచియించె మగువతో నపుడు
"అమ్మ! విష్ణ్వారాధనార్థంబు! నీవె
పాకంబు లొనరింపు పచనకార్యమున
సాయంబుసేయు మచ్ఛాత్రవర్గంబు"
అని యానతిచ్చి మాధ్యాహ్నికవిధులు
సక్రమంబుగఁ దీర్చి ఛాత్రులతోడ
పరమపతివ్రత భక్తితో నిడిన
అమృతోపమంబగు నాతిథ్య మపుడు
యతిరాజశేఖరుం డత్యాదరమున
గ్రహియించి శిష్యసంఘంబును దాను
అధ్వఖేదమువాయ నటవిశ్రమించె.

౫

ఉంఛవృత్తికి నేగి యూరూరుదిరిగి
శ్రాంతుఁడై యపరాహ్ణ సమయంబునందు
వరదార్యుఁ డాత్మ నివాసంబుఁ జేరె
చేరి యతీశ్వరు శిష్యాళితోడఁ
గనుఁగొని విస్మయా క్రాంతచిత్తమున
భార్యఁ గన్గొన నామె పతితోడ నపుడు
ఏకాంతమున వృత్తమెల్లను దెల్ప
పరమహర్షంబునఁ బల్కె నాతండు:

"దేవి, పత్నివిగావు దేవతా సతివి
భాగ్యవశంబున భార్యవైనావు.

ఈదృశంబగు జ్ఞాన మీగాఢభక్తి
కన్నది విన్నది గాదు మున్నెపుడు
నీకతంబున దేవి, నేఁడు నాకులము
పరమ పావనమయ్యె భాష్యకారుండు
పరమ దరిద్రుని పంచలో నేఁడు
షడ్రసోపేతమౌ సరసాన్నములను
భుజియించునటె పూర్వపుణ్య మెట్టిదియొ!
సార్థకమయ్యె నాజన్మ మీనాఁడు
పూజ్యురాలవు నీవు పూఁబోణి, నాకు.

విష్ణుసాయుజ్యంబు వెలఁది, నాకింక
నీపతిత్వముచేత నిర్ణీతమయ్యె,
పరమపదాధీశు పాదాబ్జసేవ
కలదు దానున కింక కాంత, నీవలన
సార్థకమయ్యె నాచదువు లీనాఁడు!"
అనుచు మహానంద మంతరంగమున
నిలువక బాష్పాంబు నిధులు రూపమున
నేత్రాంచలంబుల నిండి స్రవింప
తరుణిని నిజభుజాంతరమునఁ జేర్చె
భార్య నీరీతి సంభావనఁ జేసి
భాష్యకారుని దివ్యపాదద్వయంబు
శిరమునధరియించి శ్రీపాదతీర్థ
మాచార్య భుక్తశేషాన్నంబుఁగొనుచు
వ్యాఖ్యాన మొనరించు నర్థంబులెల్ల
శ్రద్ధతోవినుచుండె చాలసేపతఁడు

౬

అపరాంబునిధిఁగ్రుంకె నాదిత్యుఁడంత
సంజకెంజాయలు చదలరంజిల్లె
ఆవాసవృక్షంబు లాశ్రయింపంగ
ఖగకులంబులు వారె గగనంబునందు
ఉడుగణంబులు దోఁచె నొక్కటొక్కటిగ
ప్రాచీముఖంబునఁ బాపటబొట్టు
ఆకాశవారాశి యమృతంపుఘుటిక
రాజమార్గంబుల రత్నదీపంబు
అభిసారికలపాలి యగ్నిగోళంబు
దేవతాలోకైక దివ్యభక్ష్యంబు
ఉడురాజబింబ మయ్యుదయాద్రిఁదోఁచె
ఆచంద్రికాధౌత హర్మ్యాగ్రసీమ
పూవులసెజ్జపై పూఁబోణిరాక
కెదురుచూచుచు వైశ్యుఁడేశబ్దమైన
వనితాగమనమంచు వాకిలిఁజూచు
ప్రళయార్కునిగ నెంచుఁ బ్రాలేయకిరణు
దక్షిణానిలుఁ జూచు దావాగ్నిపగిది.

ప్రసవ తల్పముఁజూచు వహ్నికల్పముగ
క్షణమొక్కయుగముగ సతికయివేచి
వైశ్యుండు గాటంపు వలపుతోనుండె.

౭

వరదార్యగృహిణి యవ్వానరాంతమున
చల్లని నీట మజ్జన మాచరించి

మిసిమిదువ్వలువలు మేన ధరించి
అతఁడు పంపిన భూషణావళు ల్దాల్చి
అంగంబు మాటుగా నవగుంఠనముగ
ధవళోత్తరీయంబు ధరియించి యబల
సహజసుందరముఖచంద్రబింబమున
ఖేదకళంక మొక్కింతి గాన్పింప
సతి వెనువెంటరా భర్మపాత్రమున
యతిరాజరాజభుక్తాన్న శేషంబు
శ్రీపాద తీర్థంబు చెలువొప్పఁగొనుచు
అభ్రంకషంబైన యా వైశ్యగృహము
అల్లనఁజొచ్చి బాహ్యాంగణవేది
భర్త నిల్వఁగ బంచి పద్మాయతాక్షి
కక్ష్యాంతరంబులు గడచని వేగ
హర్మ్యసోపానంబు లలసత నెక్కి
చంద్రాతపమనోజ్ఞ సౌధాగ్రసీమ
విరుల పానుపుపైన విరహార్తిఁదూలి
ప్రాచీదిశామూల పర్యంకమందు
ఏకకళావిశిష్టేందునిపోల్కి
నున్న కాముకుఁజూచె నుత్పలనేత్ర.

౨

పెన్నిధిఁగన్నట్టి పేదచందాన
సాత్త్వికభావముల్ సందడిగొనఁగ
నతఁడు ప్రత్యుత్థాన మాచరించుటయు
లలితకోకిలకలాలాపానుకారి;
మధురకంఠంబున మానినిపల్కె
"క్షణకాలమిప్పుడు శాంతింపుమయ్య!
నీయధీనంబయ్యె నిజమునామేను
మూఁడుయామంబులు ముందున్న వింక
ఓర్చితివిన్నాళు లొక్కక్షణంబు
సైరింపు మింద్రియచాపలం బిపుడు
భాష్యకారుల దివ్యపాదతోయంబు
తత్ప్రసాదంబును ధన్యాత్మ, నీకు
గొనివచ్చితిని వానిఁ గొనుము సద్భక్తి
భగవత్ప్రసాదంబు బహుదుర్లభంబు
గురుపాదు లింక నీకు గ్రామమునకు
విజయంబుసేయుట వీక్షింపఁగలమె ?
బహుజన్మకృత పుణ్య పరిపాకముననో,
విష్ణుదేవునికృపావీక్షణంబుననో,
శ్రీపాదతీర్థంబు సేవింపనయ్యె
సోమరసంబును సుధయునుగూడ
ఆచార్యపాదతోయంబులసరియె ?
అఘమర్షణస్నాన మవభృథస్నాన
మాచార్యపదధూళి కవిసాటియగునె?
ఆజ్యసంస్కృతమైన యలపురోడాశ
మాచార్యభుక్తశేషాన్నతుల్యంబె ?
పరమపవిత్ర మీభగవత్ప్రసాద
మనితరలభ్యమై యనఘ, లభించె
శ్రీనివాసకృపా విశేషంబుచేత
సేవింపు మిదియ నిశ్శ్రేయసం బొసఁగు
సంసారవారాశి సంతరింపంగ
లేదు సుఖోపాయలేశంబు నీకు
తుచ్ఛేంద్రియసుఖంబు తుదకున్న యదియె.
చంద్రికాధవళ మీచైత్రరాత్రంబు
ప్రాకృతకాయంబు భవదధీనంబు
నవయౌవనము మహోన్మాదకారణము
జగదేకధన్వి యాశంబరవైరి
శమనుండు చండశాసనుఁడు కుమార,
నిరయంబె కోరెదో నిశ్శ్రేయసంబొ
వదలితి నీకింక వాంఛింపు మొకటి!"
అనుటయు నాతఁ డాయమవాక్కు తనకు

సమ్మోహనాస్త్రమై స్తంభింపఁజేయ
తద్భక్తశేషంబు తద్దయు భక్తి
భక్షింపఁ దత్ప్రభావమున నాక్షణము
ఉదయించె నతనికి నుత్తమజ్ఞాన
మపుడు పశ్చాత్తప్తుఁడై వణిజుండు
అమ్మహాదేవి పాదాబ్జయుగ్మంబు
ఫాలంబు సోకంగఁ బలుమారు మ్రొక్కి
గాత్రము సర్వ మాకంపంబు నొంద
గద్గదకంఠుఁడై కన్నులనీరు
గ్రమ్మ నిట్లనిపల్కె కాంతతో నతఁడు
"అమ్మ సైరింపు నా యపరాధశతము
బాలిశత్వముచేతఁ బాపంపు తలఁపు
తలఁచితి నీయందుఁ దల్లివి నీవు
తండ్రి నీపతి నాకుఁ దనయుని తప్పు
తల్లిదండ్రులు గాక తక్కినవారు
సైరింపఁగలరమ్మ, సాధ్వీమతల్లి!
భాష్యకారుల దివ్యపాదపద్మముల
దాసునిగా నన్నుఁ దల్లి, యర్పించి
ఘోరసంసారాంధకూపంబునందు
ప్రాణావశిష్టమై పడిన యీపశువు
నుద్ధరింపుము మ్రొక్కుచుంటి నోయమ్మ,
ఎంతకాలంబైన నింద్రియతృష్ణ
శమియింపదాయె నీచండాలునకును
ఆజ్యధారాహుతి, నగ్నికైవడిని
దినదినంబును భోగతృష్ణ దీపించె
యతిరాజపదసేవ యను సుధదక్క
దేవి, దాసుని బ్రోచు దివ్యౌషధంబు
అన్యమెద్దియు భువి నరసిన లేదు
తల్లి నీకరుణచేఁ దరియించువాఁడ!"

అనిపాదముల వ్రాలి యతఁడు ప్రార్థింప
విస్మితయై యామె విభునకంతయును
వినిపింప నాతండు విస్మయంబొంది
'ఆచార్యపాదతోయ ప్రభావంబు
అస్మదాదులకు శక్యంబె, యూహింప'
అని చిత్తమున నెంచి యమ్మహాద్విజుఁడు
దయతోడ వానిప్రార్థనము గైకొనుచు
అభయప్రదానంబు నాతని కొసఁగి
ఆమరునాఁడె రామానుజాచార్య
పదసన్నిధికిఁ జేర్ప వాగ్దత్త మొసఁగి
కరుణతో వాని యక్రమము సైరించి
భార్యనుగూడి యావాసంబుఁ జేరె.

౬

అరుణోదయంబున నావైశ్యసుతుఁడు
స్నాతుఁడై ధౌతవస్త్రంబులుదాల్చి
అఖిలధనంబులు యతిశేఖరునకు
గురుదక్షిణగ సేవకులు గొనిపోవ
ప్రాపకుఁడై ముందు వరదుండు నడువ
పరమపావనమైన వైష్ణవగృహాను
తాను బదాతియై తద్దయుభక్తి
చేరంగఁ జని గేహసీమ నూరుజుఁడు
ఉదయాచలంబుపై నుష్ణాంశుపోల్కి
రత్నపీఠంబున రాజిల్లువాని
హవ్యవాహనుఁడు దేహముదాల్చినట్లు
బ్రహ్మతేజంబున భాసిల్లువాని
పంచాస్యపన్నగ ప్రతిభటంబులును
శంఖచక్రాంకిత చారుమూలములు
ఆజానుదీర్ఘంబులైన బాహువుల
దివ్యసుందరుఁడయి దీపించువాని
శ్రీనివాసుని దివ్యసింహపీఠంబు

కరణి విశాలమై కన్పట్టుచున్న
విపులవక్షముతోడ విలసిల్లువాని
పద్మాక్షమాలికా బంధురంబయిన
దివ్యకంధరముతో దీపించువాని
సకలలోకత్రాణ శక్తంబులైన
పద్మపత్రాయతాంబకములవాని
విమలవైద్యుతలతా విశదప్రదీప్త
యజ్ఞసూత్రపవిత్రితాంగంబువాని
ధవళోర్ధ్వపుండ్ర విస్తారమైయొప్పు
విశదఫాలముతోడ విలసిల్లువాని
జ్ఞానపావకధూమ జాలంబురీతి
శిరమునసన్నని శిఖగల్గువాని
అఖిలవేదాంతవిద్యారహస్యములు
ఆత్మశిష్యుల కుపన్యాసించు వాని
ఛాత్రాళిసేవింపచారు పీఠమున
నిత్యసూరులతోడ నిండు కొల్వుండు
శ్రీనివాసునిలీలఁ జెన్నొందువాని
వాత్సల్యవారాశివలె నొప్పువాని
శాంతిరూపంబైన చందంబు వాని
పుణ్యవిగ్రహము నాఁ బొలుపొందు వాని
విష్ణుభక్తికి రూపు వెట్టినరీతి
విమలతేజముతోడ విలసిల్లువాని
వజ్రహస్తుండైన వాసవులీల
దండత్రఁగుసనాథ దక్షిణకరుని
జరతారుణాతపచ్ఛాయల నొప్పు
కాషాయచేలంబుఁగటిఁదాల్చు వాని
పద్మాసనస్థుఁడౌ బ్రహ్మవిధాన
పద్మాసనస్థుఁడై భాసిల్లువాని
అఖిలకల్యాణగుణాకరుం డయిన
శ్రీభాష్యకారుని సేవించిభక్తి
శుద్ధాత్ము నిట్లని స్తుతియించె నతఁడు
"దేవ! నాయజ్ఞానతిమిరంబు వాప
ధరణికి దిగిన మార్తాండుఁడ వీవు,
మహితవేదాంతాబ్ధి మథియించి విబుధ
జీవాతువైనట్టి శ్రీభాష్యసుధను
భువి వెలయించిన పుణ్యుండ వీవు
సకలాగమనిధానసంరక్షణంబు
సేయంగ వైకుంఠసీమ వోనాడి
దండత్రయముఁదాల్చి ధరణికి దిగిన
నారాయణునిసైన్యనాథుండ వీవు
తాథాగతకథావిధాన జీమూత
పటలిఁ దోలిన మహాబలుఁడవు నీవు
దయతోడఁ జేతనోద్ధరణంబు సేయ
తిరుమంత్ర మొసఁగిన ధీరుండ వీవు
శ్రీనివాసుని యాజ్ఞ శిరసావహించి
ఉభయవిభూతుల నురుకృపాదృష్టిఁ
బాలింప నేకాతపత్రసామ్రాజ్య
సింహాసనము నధిష్ఠించితి వీవు.

వృత్తిచేఁ బశువునై వేషంబుచేత
నరుఁడనై చేసితి నానావిధముల
అపరాధములు భూసురావళికెల్ల
లేదు శ్రీహరిభక్తి లేశంబు నాకు
మూర్తిఁదాల్చిన పాపపుంజ మీజనుఁడు
ఆర్తశరణ్యుండ వనఘ, రక్షింపు.

భోగేచ్ఛ యనుదినంబును వృద్ధిఁగాంచె
త్రికరణంబులచేత దినదినమేను
అఘపర్వతంబుల నార్జించుచుంటి
లేదు పశ్చాత్తాపలేశంబు నాకు
కలిగిన తత్పాపకార్యంబు మరలఁ
గావించునే లజ్జగల మానవుండు

మూర్తిఁ దాల్చినపాప పుంజమీజనుఁడు
ఆర్తశరణ్యుండ వనఘ, రక్షింపు.

దేహాభిమానినై దేశికచంద్ర,
మోహాంబునిధిలోన మున్గుచునుంటి
త్వద్దాసదాసుల దాస్యంబునందు
దాసుని నియమింపు ధన్యుండనగుదు
పద్మాసహాయుండు వశ్యుండు నీకు
కావున స్వజనుల కలుషంబులెల్ల
హరియింప శక్తుండ వాచార్యచంద్ర!

మూర్తిఁ దాల్చినపాప పుంజ మీజనుఁడు
ఆర్తశరణ్యుండ వనఘ, రక్షింపు"

అని యిట్లు నుతియించు నావైశ్యు నపుడు
సాంద్రదయాపూర్ణ శాంతేక్షణముల
వీక్షించి మధురగంభీరవాక్యముల
యతిసార్వభౌముఁ డిట్లానతియిచ్చె
"వత్స, నిర్వేదంబు వలదు! శాంతింపు
నిఖిలహేయప్రత్యనీక విగ్రహుఁడు
జ్ఞానబలైశ్వర్య చాతుర్యవీర్య
మార్దవార్జవధైర్యమాధుర్యశౌర్య
సౌందర్యసౌగన్ధ్య సౌశీల్యనిత్య
నిరతిశయౌజ్జ్వల్య నిత్యలావణ్య
సత్యపరాక్రమ సత్యసంకల్ప
సత్యకామత్వాద్యసంఖ్యేయదివ్య
కల్యాణగుణరత్నగంభీరజలధి
ప్రత్యగ్రవికసిత పద్మాంబకుండు
జలదనీల స్వచ్ఛచారుదేహుండు
కాంచనకటిచేల కమనీయమూర్తి
ఆజానులంబితాయతచతుర్భుజుఁడు
వికచపంకజనిభ విమలపాదుండు
మకరకుండలదివ్యమణిహారకటక
కౌస్తుభశ్రీవత్సకాంచీకలాప
గ్రైవేయకాద్యసంఖ్యాకభూషణుఁడు
శార్ఙ్గకౌమోదకీ శంఖచక్రాది
నిరతిశయోజ్జ్వల నిత్యాయుధుండు
శేష శేషాశన శ్రీసైన్యనాథ
పరిజన సేవితపాదపద్మండు
శ్రీభూమినీళల చిత్తానువర్తి
పరమయోగులకైన భావింపరాని
అఖిలైకమంగళాయతనవిగ్రహుఁడు
శరణాగతత్రాణశాశ్వతవ్రతుఁడు
ప్రణతార్తిహరుఁడు ప్రపన్నరక్షకుఁడు
అఖిలజగద్విభుం డస్మద్విభుండు
శ్రీనివాసుఁడు భువి చేతనకోటి
గావంగ బద్ధకంకణుఁడయి యుండ
భవభీతి నీకేల వైశ్యకుమార!"

అనుచుఁ బ్రత్యగ్రరక్తాంబురుహంబుఁ
బురుడించు నిజపాణిపుటమున వాని
శిరమును స్పృశియించి శిష్యవర్గమున
నాతనినొకనిగా నంగీకరించి
అవ్యాజరక్షకుం డాయారుజునకు
కరుణతోఁ బంచ సంస్కారంబు లొసఁగె.

వైష్ణవత్వము గాంచి వైశ్యోత్తముండు
జితకాముఁడై భక్తి శ్రీభాష్యకార
చరణంబులే నిత్యశరణంబు లనుచు
భావించి యాచార్య పారతంత్ర్యమున
పరమప్రసన్నుఁడై భాగవతాగ్ర
గణ్యుఁడై సుఖముండెఁ గలకాల మతఁడు.




విద్వాన్ డి. రామమూర్తి శాస్త్రి గారు

చమత్కారమనునది మనుజుని మనోవికాసమునకుఁ గారణము. కవి ప్రతిభా కల్పితములగు కావ్యములం దెట్టి చమత్కారము లనేకములు గానవచ్చుచున్నవి. తాదృశవివిధకావ్యచమత్కారములను యథావస్థితముగ నిరూపించునది యలంకారశాస్త్రము. కావున వ్యాకరణాదిశాస్త్రములవలె నియ్యదియుఁ గవిప్రయోగానుసారముగనే రచింపఁబడిన దనుటకు సందియము లేదు.

"పూర్వశాస్త్రాణి సంహృత్య
ప్రయోగా నుపలభ్య చ,
యథాసామర్థ్య మస్మాభిః
క్రియతే కావ్యలక్షణమ్."

అనుదండ్యాచార్యవాక్యములే యుపరి నిరూపితాంశమునకుఁ బ్రబలప్రమాణములు.

ఋగ్వేదాది వైదికవాఙ్మయ గ్రంథభాగములం దచ్చటచ్చట నగపడు సాలంకారరచనావిశేషములను బట్టి తత్పూర్వమునఁగూడ నలంకారవిషయములను బ్రతిపాదించు నలంకారగ్రంథము లుండియుండు ననియు, బుద్ధచరిత్ర (అశ్వఘోష కృతము), రామాయణాదు లతిరమ్యముగా ననేక చమత్కారములతోడను, ననేక రచనావిశేషములతోడను నలరారుచుండుటంజేసి యంతకుమున్నుగూడఁ గావ్యరచనామార్గములను విశదీకరించు నలంకారగ్రంథము లుండియుండవచ్చు ననియుఁ, గాన నలంకారగ్రంథరచన యతిప్రాచీనకాలము నుండియు నారంభింపఁబడి యుత్తరోత్తరాభివృద్ధి నొందుచున్న దనియుఁ బాశ్చాత్య విమర్శకు లూహించియున్నారు.

కాని కావ్యరచనామార్గములనుగాని, కావ్యచమత్కారములనుగాని ప్రతిపాదించు నలంకారగ్రంథము లక్కాలమున రచియింపఁబడినవి కానంబి నాయూహ లెంతవఱకు సత్యములో నిర్ణయింప వలనుపడకున్నది.

మఱియుఁ గాంత స్వాభిలషితమును బ్రకాశముగ భర్తకుఁ బ్రకటింపక తనహావభావవిలాసములచే నద్దాని నెట్లు వ్యంగ్యరూపముగఁ బ్రకటించునో యట్లే కావ్యకాంతయుఁ బాఠకునకుఁ బ్రవృత్తినివృత్తిరూపములగు ననేకచమత్కారములను వ్యంగ్యరూపముగా బోధించును. అట్టికావ్యములే యలంకారగ్రంథరచనకు ముఖ్యాధారము లగుటచేతను గాంతాసమ్మితముగాఁ బ్రవృత్తినివృత్త్యాది చమత్కారవిషయముల నుపదేశించుటయే కావ్యముల ముఖ్యోద్దేశ మగుటచేతను, గాంతాసమ్మితముగ నట్టిప్రవృత్తినివృత్తిరూపోపదేశము చమత్కారయుత సరసశబ్దార్థరచనవలననే సిద్ధించుచుండుటచేతను గావ్యములన్నియు సాలంకారరచనలతోడనే యలరారుచుండును. ఉన్నదున్నటుల వర్ణించిన నకావ్యము చమత్కారాధాయకమును, గాంతాసమ్మితమును, బ్రవృత్తినివృత్త్యాదిచమత్కార విషయోపదేశసమర్థమును, విద్వజ్జనమనోరంజకమును గానేరదని తలంచి కవులు వక్రోక్తి నాశ్రయించి యద్భుతకల్పనాది చమత్కారముల నెన్నెన్నో నెలకొల్పి గావ్యములను జిత్రించియున్నారు.

మఱియు మీఁదవ్రాసినప్రకార మలంకారగ్రంథరచనకు వాఙ్మయమే ముఖ్యాధార మగుటచేతను, వాఙ్మయవైచిత్ర్యప్రతిపాదకాలంకారగ్రంథములు వాఙ్మయానంతరమునఁ బుట్టినవే యనుట కడ్డంకి లేకుండుటచేతను గావ్యములలోనుండు చమత్కారములనుబట్టి వాఙ్మయానంతరమునఁ బుట్టఁదగిన యలంకారగ్రంథములు తత్పూర్వమునఁగూడ నుండెడివని చెప్పుటకు వలనుపడదు గదా! మఱియుఁ బాణిన్యాదులకువలె నలంకార గ్రంథ

కర్తలకు దివ్యజ్ఞానమును మనము ప్రసాదించి యుండ లేదుకదా! వాఙ్మయ మెప్పటినుండి యభివృద్ధిలోనికి వచ్చెనో యప్పటినుండి యలంకారగ్రంథరచన యారంభించియుండును గాన నెప్పటినుండి యలంకార గ్రంథ రచన యారంభించియుండుననియు, నాదిగ్రంథములెవ్వి యనియు శంకించుటకుఁగాని, నిశ్చయించుటకుఁ గాని యవకాశము గానరాదు.

ఇచటఁ బ్రకృతమున నగపడు నలంకారగ్రంథములలోఁ బ్రాచీనము లెవ్వి? నవీనము లెవ్వి? ప్రాచీన గ్రంథములవలనఁ దెలియుఁ బ్రాచీనాలంకారికు లెవ్వరు? ప్రాచీననవీనగ్రంథములకు విషయనిరూపణావసరమునఁ గల తారతమ్య మేమి? అను నంశములుమాత్రమే విమర్శాసహములై యుండును.

ప్రకృతమున విమర్శకనిర్ణీతపూర్వములగు కాలములను బట్టి యలంకారశాస్త్రమున భరత భామహ దండి వామనులగ్రంథములే ప్రాచీనతమము లని నిశ్చిత మగుచున్నది. కాని, 'రామశర్మ, మేధావి, అచ్యుతోత్తరుఁడు, శాఖవర్ధనుఁడు, రాజమిత్రుఁడు' మున్నగు నాలంకారికులు భామహునికన్నఁ బూర్వమున నుండెడివారని భామహుఁడు తత్తన్మతభేదముల క్రిందఁ దత్తత్సందర్భములం దుదాహరించిన యీక్రింది శ్లోకములవలన స్పష్టముగాఁ దెలియుచున్నది.

"నానాధాత్వర్థగంభీరా
యమకవ్యపదేశినీ;
ప్రహేలికా సా హ్యుదితా
రామశర్మాచ్యుతోత్తరైః"

"తప్త ఉపమాదోషా
స్సప్తమేధావినోదితాః;
సంఖ్యాన మితి మేధావి
నోత్ప్రేక్షాభిహితా క్వచిత్."

శాఖవర్ధనస్య:
"సమాహితం రాజమిత్రే
యథాక్షత్త్రియయోషితామ్;
దృష్టంవా సర్వసారూప్యం
రాజమిత్రే యథో దితమ్."

మఱియు,

"పూర్వశాస్త్రాణి సంహృత్య
ప్రయోగా నుపలభ్యచ;
యథాసామర్థ్య మస్మాభిః
క్రియతే కావ్యలక్షణమ్.

కావ్యశోభాకరాన్ ధర్మా
నలంకారాన్ ప్రచక్షతే;
తే చాద్యాపి వికల్ప్యంతే
కస్తాన్ కార్త్స్న్యేన వక్ష్యతి.

కింతు బీజం వికల్పానాం
పూర్వాచార్యైః ప్రదర్శితమ్.
తదేవ పరిసంస్కర్తు
మయ మస్మత్పరిశ్రమః."

అను దండ్యాచార్యుని యుపోద్ఘాతమునుబట్టియు, నాలోచింపఁ దత్పూర్వమునఁగూడ నలంకార విషయములను బ్రతిపాదించు నలంకారగ్రంథము లుండెడివని ధ్వనిత మగుచున్నది.

"పూర్వశాస్త్రాణి=కాశ్యపవరరుచి ప్రభృతీనా మాచార్యాణాం లక్షణశాస్త్రాణి; పూర్వాచార్యైః కాశ్యపవరరుచి ప్రభృతిభిః; మాత్రాభి ర్గణనా యత్ర సాజాతిరితి కాశ్యపః."

అని వ్యాఖ్యాతలర్థము చేసియుండుటచేతను, కాశ్యపవరరుచులనునలంకారగ్రంథకర్తలు దండికంటెఁ బూర్వముండెడివారనియు ధ్వనితమగుచున్నది. సంస్కృతాలంకారవాఙ్మయమున భరతముని ప్రణీతనాట్యశాస్త్రమే సర్వాలంకారగ్రంథములలోఁ బ్రాచీనమని విమర్శకలు కొందఱభిప్రాయపడియుండుటం జేసి,

పూర్వాశ్శాస్త్రాణిభరతాదిప్రణీత శాస్త్రాణి;
పూర్వాచార్యైః.

అని మఱికొంద ఱర్థమును జేసియున్నారు. హిందూదేశమున నంతరించిన గ్రంథసమూహములో నాగ్రంథములు గూడఁ జేరెనో లేక మతగ్రంథసంరక్షణమందే బద్ధకంకణులగు ప్రాచీనులచే నుపేక్షింపఁబడి క్రిమిదోషాదుల వలననశించెనో కాని యుపరి నిరూపితకాశ్యపవరరుచి రామశర్మరాజమిత్రాదికవికృతాలంకార గ్రంథములు దురదృష్టవశమున దృగ్గోచరములు గాకున్నవి.

## భరతనాట్యశాస్త్ర ప్రాచీనత

ఇఁక నాట్యశాస్త్ర మలంకార గ్రంథములలో నెల్లఁ బ్రాచీనమనువారి యుక్తులను గొంచెము విమర్శింతును.

నాట్యశాస్త్రమున నలంకారము లతిస్వల్పముగాఁ బ్రతిపాదింపఁబడెననియు, వృత్తిరీత్యాది కావ్యసామగ్రియు నతిసూక్ష్మమార్గము నాశ్రయించి నిరూపింపఁబడెననియు నానంతరాలంకార గ్రంథములు విపులముగా నలంకారాది విషయములఁ బ్రవర్తించుచున్న వనియుఁ గాన నలంకారవిషయములను సూక్ష్మమార్గమున విశదీకరించు నీనాట్యశాస్త్ర మలంకారగ్రంథములలోఁ బ్రాచీన మగుననియు సిద్ధాంతీకరించి యున్నారు. కాని నాట్యాంగనిరూపక మగు నాట్యశాస్త్రమున నలంకారాది కావ్యచమత్కారములను నిరూపింప నవసరమే లేదు. ఐనను నాట్యము నాటకాది దృశ్యకావ్యనిష్ఠమును నగుటంచేసి ప్రస్తావవశమున వృత్తిరీతి రసాలంకారాదికావ్యసామగ్రి యతిసూక్ష్మమార్గమునఁ బ్రవర్తింపఁబడియుండును. మఱియు నిందు నాట్యమునందు నవయవవిన్యాస పద్ధతియుఁ దత్తత్సమయోచితావయవవిక్షేపపద్ధతియు మున్నగు నాట్యసంబంధివిషయములే సామాన్యముగాఁ బ్రతిపాదింపఁబడినవి. కాన, నియ్యది కావ్యస్థ వైచిత్ర్యములను విశదీకరించు నలంకారగ్రంథము గాదని తోఁచుచున్నది. నాట్యనిష్ఠ చమత్కారములను నిరూపించుటయే నాట్యశాస్త్రముఖ్యోద్దేశ మగుటచేతను, కవ్యంకిత నాట్యశాస్త్రనామమే యియ్యది యలంకారాదికావ్యగమత్కారనిరూపకాలంకారగ్రంథము గాదని సాక్ష్యమిచ్చుచుండుటచేతను ప్రాచీనాలంకారగ్రంథములన్నియు కావ్యాలంకారము, కావ్యమాల, కావ్యానుశాసనము, కావ్యాదర్శము, అని యిట్లు కావ్యాదిపదనామములతో నలరారుచుండుటచేతను,వృత్తిరీత్యాది కావ్యసామగ్రియు దండ్యాది ప్రాచీనాలంకారిక గ్రంథముల ననుసరింపక. నవీనాలంకార గ్రంథమార్గమునే యనుసరించుచుండుటచేతను, నియ్యది కావ్యసామగ్రినిగాని కావ్యచమత్కారములను గాని నిరూపించుటకు రచింపఁబడిన యలంకారగ్రంథము గాదనియు, నలంకార గ్రంథములకు మార్గదర్శకమును గాఁజాలదనియుఁ దోఁచుచున్నది. ఇందుల కనుగుణముగా భరతుఁడు రసస్వరూప ప్రతిపాదకాలంకారగ్రంథ మొకటి రచించెననియు, నక్కారణమున నాతనికిఁ బ్రసిద్ధికల్గెననియు నొక్క 'విభావానుభావ'అనుసూత్రమే మిగిలి యాగ్రంథము నశించెననియు నొక ప్రతీతిగలదు. మఱియుఁ గొందఱు విమర్శకు లలంకారగ్రంథములలో నగ్నిపురాణ మతిప్రాచీనమనియు, నలంకారగ్రంథరచనకు మార్గదర్శకమనియు, నభిప్రాయపడియున్నారు. ఇందు "కావ్యాదిలక్షణము, నాటకనిరూపణము, శృంగారాది రసనిరూపణము, రీతినిరూపణము, నృత్యాద్యాఙ్గికకర్మనిరూపణము, అభినయాదినిరూపణము, శబ్దాలంకారములు, అర్థాలంకారములు, శబ్దార్థాలంకారములు, కావ్యగుణవివేకము, కావ్యదోషవివేకము," అను నామములుగల పదునొకొండధ్యాయము లలంకారవిషయములను బ్రతిపాదించుచున్నవి. సామాన్యముగా నలంకారగ్రంథములందు నిరూపింపఁబడు విషయములన్నియు నిందుఁ బ్రతిపాదింపఁబడుటయే కాక నాట్యశాస్త్రవిషయములును నిందలంకార విషయములతోపాటు జోడింపఁబడియున్నవి. ఇందుఁ బ్రతిపాదింపఁబడిన యలంకారవిషయములలోఁ గొన్ని ప్రాచీనాలంకార గ్రంథములనుండియుఁ గొన్ని నవీనాలంకార గ్రంథములనుండియు నుద్ధృతములైనట్లు కానవచ్చుచున్నవి. కావున నలంకార శాస్త్రసంపూర్ణతా సంపాదనమునకై యిందుఁ బ్రాచీననవీనాలంకార గ్రంథవిషయములను సందర్భానుసారముగా సంగ్రహించి నిరూపించి యుండునని తోఁచుచున్నది.

ఇఁకఁ జరిత్రాత్మకమగు నీపురాణమున నలంకారశాస్త్రవిషయకథనమునకుఁ బ్రసక్తియేమని యాలోచింపవలసి యున్నది. అగ్నిపురాణమున నలంకారశాస్త్రవిషయములేకాక ఛందోవ్యాకరణవైద్య జ్యోతిషకామరత్నాది శాస్త్రవిషయములును, దాయభాగాది ధర్మశాస్త్ర విషయములును, బ్రతిపాదింపఁ బడియున్నవి. మఱియు నిం దమరనిఘంటువు సంపూర్ణముగా ననువదింపఁబడినది. అమరమందువలెనే యిందును దత్తద్వర్గములు తత్సమాననామములతోడనే నిర్దేశింపఁబడినవి. విషయమునందుఁగూడ నంతగా భేదము లేదు.

పురాణములు ముఖ్యముగా దేశచరిత్రను దెలియఁ జేయుటకొఱకు రచియింపఁబడినవి. కావున రాజవంశ, రాజపరిపాలనాది విషయములు పురాణములలో నర్ధాధికభాగమును వ్యాపించియుండును.

హిందూదేశమునఁ బ్రాచీనకాలమున దేశచరిత్రను బ్రధానముగఁ దెలియఁజేయు గ్రంథములు లేవు. కాని యరుదుగాఁ గొందఱుకవులు తామెఱింగిన దేశచరిత్రను సంక్షేపముగా వ్రాయుచుండిరి. వానినే మనమిపుడు పురాణములని వ్యవహరించుచున్నాము. రానురాను హిందూమహాజనులకుఁ బ్రకృతిశాస్త్రములందును దేశచరిత్రయందునుగల స్వల్పరుచియునంతర్ధానమయ్యెను. మతవిషయములం దభిరుచి యెక్కుడయ్యెను. అక్కాలముననే పురాణాదులు దైవప్రోక్తములయ్యెను. అక్కాలముననే కవులు, ఋషులును దేవతలును నైరి. దివ్యజ్ఞానసంపన్నత, సర్వజ్ఞత మున్నగు నసాధారణధర్మము లక్కాలముననే వారికిఁ బ్రసాదింపఁబడినవి. అయ్యుగముననే పురాణాదులు మతగ్రంథములుగా మారినవి. భారతరామాయణాదు లీతెగలోఁ జేరఁదగినవే! పురాణములందుఁ బెద్దలు ఋషిప్రోక్తములనియు వేదతుల్యములనియు నధిక గౌరవముంచుటేకాక దైవసమములుగా వానిని భావించి యారాధించుటయు నారంభించిరి. కావునఁ జరిత్రాత్మకములగు భారతరామాయణాదులం దితరవేదాంతవిషయములవలె నిట్టివిషయముల నిటీవలివృద్ధులు "పురాణములందు సర్వవిషయములును గలవు. పురాణములందుఁ బ్రపంచమంతయు నిమిడియున్నది. పురాణములనుండియే యన్నివిషయములను శాస్త్రకర్తలు సంగ్రహించివివరించిరి." అనుగౌరవమును వాని కీయఁదలంచి తత్తచ్ఛాస్త్రములనుండి తత్తద్విషయముల సంగ్రహించి యచ్చటచ్చటఁ గలిపి యుందురు. మఱియు నిట్లు తరువాతి వారలు గ్రంథములు విద్వజ్జన మనోరంజకము లగుటకొఱకుఁ దత్తద్విషయములఁ బ్రసక్తి లేకున్నను మూలగ్రంథములందుఁ జొనుపుట సంప్రదాయసిద్ధమై యున్నది. కావున, నగ్నిపురాణమునందలి యలంకారాదివిషయములు మూలగ్రంథస్థములు గావనియు, నక్కారణమున నగ్నిపురాణ మలంకారగ్రంథములలోఁ బ్రాచీనము గానేరదనియు నాకుఁ దోఁచుచున్నది. మఱియు నలంకారవిషయము లిందుఁ గొన్నిస్థలముల నతిసంక్షేపముగాఁ బ్రవర్ణింపఁబడి యుండుటచేతను, స్ఫుటము లగు నలంకారభేదములే యిందు సూక్ష్మమార్గమున విశదీకరింపఁబడి యుండుటచేతను, స్థూలదృష్టి నీగ్రంథమును బరిశీలించువారలకు మాత్ర మియ్యది యలంకారగ్రంథములలోఁ బ్రాచీనమను భ్రాంతిని బుట్టింపకపోదు.

## దండిభామహులు

ఇఁక భామహదండి వామనుల గ్రంథములే యలంకారవాఙ్మయమున నతిప్రాచీనము లనియు, నలంకారగ్రంథములకు మార్గదర్శకము లనియుఁ దేలుచున్నది. వామనకాలము పాశ్చాత్యాద్యనేకవిమర్శననిర్ణీతపూర్వక మగుటంజేసి యాతనింగూర్చి వ్రాయుట యనావశ్యకము. ఇఁక భామహదండ్యాచార్యులలో నెవ్వరు ప్రాచీను లెవ్వరు నవీను లనునంశమును గొంచెము విమర్శింపవలసి యున్నది.

ప్రాచీనాలంకారికులెల్లరు భామహుని గ్రంథమునుండి తత్తద్విషయములను, దమగ్రంథములలో నుదాహరించుచుండుటచేతను నాఖ్యాయికాది విషయనిరూపణావసరమున దండి, భామహోక్తవిషయములను విమర్శించుచుండుటచేతను, బ్రతాపరుద్రీయకర్త విద్యానాథుఁడు 'తదుక్తం దండినా, తదుక్తం ప్రాచా భామహేన, పూర్వేభ్యో భామహాదిభ్యః', అని భామహుని దండికంటెఁ బ్రాచీనునిగా భావించియుండుటచేతను నలంకారవిషయము భామహుని గ్రంథమునకంటె నధిక

ముగా దండిగ్రంథమునఁ బ్రతిపాదింపఁబడియుండుట చేతను భామహుఁడు దండికంటెఁ బ్రాచీనుఁడు కానోపునని విమర్శకు లభిప్రాయపడుట కవకాశముగలదు.

కాని కొన్నికొన్ని స్థలములందు దండ్యుక్త విషయములను భామహుఁడుగూడ విమర్శించినట్లు గానవచ్చుచుండుటం జేసియు, నలంకారవిషయనిరూపణావసరమున భామహుఁడు దండ్యుక్తాలంకారములను 'కేచి' త్పక్షముగానిరూపించుచు నచ్చటచ్చట దండ్యుక్తాలంకారముల కలంకారత్వము లేదని ఖండించుచున్నట్లు గానవచ్చుచుండుటంజేసియు, రామశర్మ మేధావి మున్నగు నాలంకారికుల మతభేదముల క్రింద దండ్యుక్తాలంకారముల కన్న నాలుగైదలంకారములను భామహుఁ డధికముగాఁ బ్రతిపాదించియుండుటం జేసియుఁ, బ్రతిజ్ఞాహేతు దృష్టాంతహీనాదులు దోషములా, కావా, యని విచారించుట కర్కశప్రాయమన్న దండిని భామహుఁ డాక్షేపించినట్లు స్పష్టపడుచుండుటంజేసియు, భామహదండులకుఁ జాలకాలమంతరముండదనియు,సమకాలికులుగూడనై యుండిన నుండవచ్చుననియుఁ దోఁచుచున్నది. సమకాలికులగు విద్వాంసులకు మత్సర మధికముగా నుండుట సుప్రసిద్ధము. మఱియు నొకరినామముల నొకరు నిరూపించికొనక 'కేచి' త్పక్షముగా నిపుణముగాఁ దమ తమ గ్రంథములందుఁ బరస్పరమతములను దూషించుకొనుచుండుటయు సుప్రసిద్ధము. ఇట్లు పూర్వ పూర్వులను నానంతరులుగూడదూషింపఁజాలరుగాని పైని వ్రాసిన ప్రకారముదండివిషయములనుగూడ భామహుఁడు విమర్శించుచున్నట్లగపడుచుండుటంజేసి సమకాలికులేమో యను సందేహముగూడఁ గల్గుచున్నది. కాని యెవరిగ్రంథములు ముందులోకమున వెలువడినవో యనునంశముమాత్రము నిర్ధారణచేయ శక్యముగాదు. కాని కవీశ్వరులందఱు భామహునిఁ బ్రాచీనునిగాను, భామహుని గ్రంథములను బ్రాచీనతమములనుగాను భావించియుండుటంజేసి భామహదండులు సమకాలికులైనను భారవి బ్రతికియున్నంతవఱకు మాఘునకు లోకమునఁ బ్రసిద్ధిలేనట్లు దండికి భామహుని కాలమునఁ బ్రసిద్ధిలేకుండుటంజేసి భామహునిగ్రంథములే లోకమునందు వెలువడియుండుననియు,విద్వజ్జన హృదయంగమములై యుండెడివనియు, నూహింపవచ్చును.

ఇఁక భామహదండులు సమకాలికులే యగునపుడు భామహు నాలంకారికులు ప్రాచీనునిగాను భామహుని గ్రంథమును బ్రాచీనతమముగాను భావించుటకుఁ గారణమేమని శంకింపవచ్చును.

విద్య, లోకవ్యవహారము, వాక్చాతుర్యము మున్నగువిషయములసమానమగు తెలివితేటలుగలయిరువురుపండితులులోకముననుండిరనుకొందము. అందొకనికి నదృష్టవశమునలోకమున నధికప్రఖ్యాతికల్గును. దానవాఁడువేనోళ్లఁగీర్తింపఁబడుచుండును. మిగిలినవానికి వాని దురదృష్టవశమున మొదటివాని యంతటిఖ్యాతి లోకమునఁ గల్గకుండును. దాన నాతనికి లోకమున నంతప్రసిద్ధి లేకుండును. కొంతకాలమునకు వీరిర్వురును మృతులగుదురు. పిదప లోకులు వీరిర్వురును సమకాలికులను నంశమునుఁ గొలఁదికాలమునకు మఱచెదరు. లోకప్రసిద్ధి ననుసరించి యందధికప్రసిద్ధపురుషుఁడే ప్రాచీనుఁడనియు దాతముత్తాతల మాటలనుబట్టియు వారివారి ప్రామాణ్యవాదములను బట్టియు నాతని గ్రంథములే ప్రాచీనతమము లనియు నిశ్చయింపఁబడును. కావున నిట్లే భామహదండులు సమకాలికులైనను దండికంటె భామహుఁ డధిక ప్రసిద్ధిగలవాఁడగుటంజేసి భామహుఁడు ప్రాచీనుఁడనియు నాతని గ్రంథములను బ్రాచీన తమములనియుఁ గవులు భావించియుండవచ్చును.

మఱియుఁ గొందఱు

"నాసిక్యమధ్యా పరిత
శ్చాతుర్వర్ణ్య విభూషితా,
అస్తి కాచి త్పురీ యస్యా
మష్టవర్ణాహ్వయా నృపాః."

అను శ్లోకమునఁ గాంచీపట్టణమునఁబల్లవరాజులు గలరని ప్రతిపాదించుటంబట్టి దండి క్రీ. వెనుక 8-వ శతాబ్ది నుండియుండునని తరుణవాచస్పతి వ్యాఖ్యానము ననుసరించి వ్రాసియున్నారు. కాని, పల్లవరాజులు కృష్ణాకావేరీ నదుల మధ్యమందుఁ గల కాంచీపట్టణమును రాజధానిగాఁ జేసికొని క్రీ. వెనుక 150 నుండి 10-వ శతాబ్దమువఱకు రాజ్యమును జేయుచుండిరనియు, క్రీ. వె. 10-వ శతాబ్దమునఁ జోళులు వారిరాజ్యము నాక్రమించి

రనియు, శివస్కందవర్మ అనురాజు క్రీ. శ. 150-వ శతాబ్దిని బ్రబలుఁడై యుండెడివాఁడనియు, క్రీ. శ. 4-వ శతాబ్దమున నార్యులు దక్షిణహిందూస్థానమునకు వచ్చుసరికి వీరు ప్రబలులై యుండిరనియుఁ గొందఱు చరిత్రకారులు వ్రాసియుండుటంజేసి దండి 4-వ శతాబ్దముననో, 2-వ శతాబ్దముననో యుండి యుండు ననుట యుచితము. భామహుని దండికంటెఁ బ్రాచీనునిగాఁ జేయుటకొఱకై దండి నెనిమిదవ శతాబ్దికిఁ ద్రోయుటకన్న రెండవశతాబ్దినో, నాల్గవశతాబ్దినో యుండుననుటయే యుచితము. కావ్యాదర్శ ప్రణాళినిబట్టి కూడ నయ్యదియలంకారగ్రంథములలోఁ బ్రాచీనతమమనియే నిశ్చిత మగుచున్నది. మఱియు భవభూతిగ్రంథము నుండి 'దోర్దండాంచిత' అను శ్లోకమును దనగ్రంథములో నుదాహరించిన యేడవశతాబ్దమునకంటెఁ గ్రిందివాఁడు కాని వామనుఁడు దండి నవలంబించియే రీతి లక్షణము నుదాహరించెనని సర్వవిమర్శకాభిప్రాయ మగుటం జేసి దండి రెండవశతాబ్దమువాఁడో నాల్గవశతాబ్దమువాఁడో యైయుండనోపును. కావున సంస్కృతాలంకారవాఙ్మయమునఁ గావ్యాదర్శమే ప్రాచీనమేమో యని తోఁచుచున్నది.

## దండికావ్యాదర్శము, భామహాలంకారము

సంస్కృతవాఙ్మయమున రానురాను వేనవేలలంకారగ్రంథములు ప్రబలియుండుటం జేసియు వానిని గూర్చి విమర్శకు లనేకులు సమీచీనముగ విమర్శించియుండుటంజేసియు వానినిఁగూర్చిముచ్చటించుట యనావశ్యకము. కాన నిఁకఁ బ్రాచీన నవీనాలంకారగ్రంథములకు విషయనిరూపణావసరమునఁ గల తారతమ్యమును దండిభామహగ్రంథములకుఁగల పరస్పరసంబంధమును దిఙ్మాత్రముగాఁ జూపుచున్నాను:

"ప్రకృతానాకులశ్రవ్య
శబ్దార్థపదవృత్తినా,
గద్యేన యుక్తోదాత్తార్థా
సోచ్ఛ్వాసాఖ్యాయికా మతా"

వృత్త మాఖ్యాయతే తస్యాం
నాయకేన స్వచేష్టితమ్,
వక్త్రంవా పరవక్త్రంచ
కాలే భావ్యర్థశంసిచ.

కవే రభిప్రాయకృతైః
కథానైః కైశ్చి దంకితా,
కన్యాహరణసంగ్రామ
విప్రలంభోదయాన్వితా.

నవక్త్రాపరవక్త్రాభ్యాం
యుక్తా నోచ్ఛ్వాసవ త్యపి,
సంస్కృతం సంస్కృతా చేష్టా
కథాపభ్రంశభాక్ తథా.

అన్యైః స్వచరితం తస్యాం
నాయకేనతు నోచ్యతే,
స్వగుణావిష్కృతా కుర్యా
దభిజాతః కథంజనః.

అని బంధం పునర్గాథా
శ్లోక మత్రాది తత్పునః
యుక్తం వక్త్ర స్వభావోక్త్యా
సర్వమేవైత దిష్యతే".

భా. ౨౫, ౩౦, ౧.

ఇట్లు భామహుఁడు కథాఖ్యాయికలకు భేదమును వర్ణించియున్నాఁడు.

అపాదః పదసంతానో
గద్య మాఖ్యాయికా కథా,
ఇతి తస్య ప్రభేదా ద్వా
తయో రాఖ్యాయికాకిల.

నాయకేనైవ వాచ్యాన్యా
నాయకే నేతరేణవా,
స్వగుణావిష్క్రియా దోషో
నాత్ర భూతార్థశంసినః.

అపి త్వనియమో దృష్ట
స్తత్రా ప్యన్యై రుదీరణాత్,
అన్యో వక్తా స్వయం వేతి
కీదృగ్వా భేదలక్షణమ్.

వక్త్రం చాపరవక్త్రంచ
సోచ్ఛ్వాసత్వంచ భేదకమ్,
చిహ్న మాఖ్యాయికాయా శ్చేత్
ప్రసంగేనకథాస్వపి.

ఆర్యాదివత్ప్రవేశః కిం
నవక్త్రాపరవక్త్రయోః,
భేదస్తు దృష్టో లంభాది
రుచ్ఛ్వాసోవాస్తు కిం తతః.

తత్కథాఖ్యాయికే త్యేకా
జాతి స్సంజ్ఞాద్వయాంకితా,
అత్రైవాంత ర్భవిష్యంతి
శేషా శ్చాఖ్యానజాతయః.

కన్యాహరణసంగ్రామ
విప్రలంభోదయాదయః,
సర్గబంధసమాఏవ
నైతే వైశేషికాగుణాః.

కవిభావకృతం చిహ్న
మన్యత్రాపి నదుష్యతి,
ముఖ మిష్టార్థసంసిద్ధ్యై
కింవా నస్యాత్ కృతాత్మనామ్".

౨3-3౦. కావ్యాదర్శ. ౧.

అని దండ్యాచార్యు లుపరినిరూపితభామహోక్త కథాఖ్యాయికాలక్షణములను విమర్శించి కథాఖ్యాయికలకు భేదములేదని ఖండించియున్నాఁడు.

"నాయకం ప్రా గుపన్యస్య
వంశవీర్యశ్రుతాదిభిః,
న తస్యైవ వధం బ్రూయా
దన్యోత్కర్షాభిధిత్సయా.

యది కావ్యశరీరస్య
నసవ్యాపి త యేష్యతే,
న చాభ్యుదయభాక్ తస్య
ముధాదౌ గ్రహణం భవేత్".

భా. ౧. ౧౨.

అని భామహుఁడు వర్ణించిన నాయకవర్ణనరీతినిదండి యిట్లు వివర్శించియున్నాఁడు:

"గుణతః ప్రాగుపన్యస్య
నాయకం తేన విద్విషామ్,
నిరాకరణ మిత్యేష
మార్గః ప్రకృతిసుందరః.

వంశవీర్యశ్రుతాదీని
వర్ణయిత్వా రిపో రపి,
తజ్జయా న్నాయకోత్కర్ష
వర్ణనంచ ధినోతి నః.

భా. ౨.

"గతో౽స్త మర్కో భాతీందు
ర్యాంతి వాసాయ పక్షిణః,
ఇత్యేవ మాది కింకావ్యం
వార్తా మేనాం ప్రచక్షతే".

అని దుష్టమని భామహుఁడు నిరూపించిన పైశ్లోకమును దండి

"గతో౽స్తమర్కో భాతీందు
ర్యాంతి వాసాయ పక్షిణః,
ఇ తీదమపి సాధ్వేవ
కాలావస్థానివేదనే".

అని సాధువుగా నిరూపించియున్నాఁడు. ఇఁక నీ క్రింద నుదాహరింపఁబడిన దండ్యుక్త విషయములను భామహుఁ డిట్లు విమర్శించియున్నాఁడు.

"వామాంషహో మిత్రధరై
ర్వ్యాప్తం వ్యోమాభి నందతి"

అని దండి 'పరిహారికా'అను ప్రహేళికాభేదమునకు లక్ష్యముగా నుదాహరించిన శ్లోకపాదమును,

'వామాంషహో మిత్రధరై
ర్వ్యాప్తం వ్యోమేత్యవాచకమ్,
సాఘూ దరూఢం వాచ్యేఽర్థే
నాభిధానం ప్రతీయతే".

అని భామహుఁడు వాచకమను దోషమునకు లక్ష్యముగా నుదాహరించెను.

భామహుఁడు దండ్యుక్తాలంకారముల నన్నిటిని దత్తన్మతభేదముల క్రింద నుదాహరించుచు వానిలోఁ గొన్నిటికిమాత్ర మలంకారత లేదని ఖండించియున్నాఁడు.

"హేతుశ్చ సూక్ష్మో లేశశ్చ
వాచా ముత్తమభూషణమ్"

అను దండిచెప్పిన శ్లోకపాదమునే గ్రహించి

"హేతుశ్చ సూక్ష్మో లేశశ్చ
నాలంకారతయా మతః,
సముదాయా భిధానస్య
వక్రోక్త్యనభిధానతః".

అని ఖండించెను. ఇట్లే

"ప్రతిజ్ఞాహేతుదృష్టాంత
హాని ర్దోషో నవే త్యసౌ,
విచారః కర్కశప్రాయ
స్తే నాలీఢేనకింఫలమ్."

అని ప్రతిజ్ఞాహేతుదృష్టాంతాదిదోషముల విచారణవిషయమున నుపేక్షించినదండిని

"ప్రతిజ్ఞాహేతుదృష్టాంత
హీనం దుష్టంచ వర్ణ్యతే,
ప్రాయేణ దుర్బోధతయా
శాస్త్రాద్బిభ్య త్యమేధసః.
తదుపచ్ఛందనాయైవ
హేతున్యాయలవోచ్చయః,
ప్రథమాలీఢమధవః,
పిబన్తి కటు భేషజమ్.
స్వాదు కావ్యరసోన్మిశ్రం
శాస్త్రమప్యుపయుంజతే.
న సశబ్దో న తద్వాచ్యం
న స న్యాయో నసాకలా,
జాయతే యన్న కావ్యాంగ
మహో భారో మహాన్ కవేః".

అని భామహుఁ డుక్షేపించియున్నాఁడు. ఇట్లే దండి ప్రతిపాదింపని వ్యాకరణవిషయములను దాను బ్రతిపాదించుచు భామహుఁడు దండిని

'ధీరై రాలోకితప్రాంత
మమేధోభి రసూయితమ్'

అని నిందించియున్నాఁడు. మఱియు దండి నిరూపించినయుపమాప్రపంచమును

"మాలోపమాది స్సర్వోఽపి
నజ్యాయాన్ విస్తరో ముధా."

అని యాక్షేపించియున్నాఁడు.

"ఆవృత్తిమేవ సంఘాత
గోచరాం యమకం విదుః;
తత్తు నైకాంతమధుర
మతః పశ్చా ద్విధాస్యతే."

అని యమకలక్షణనిరూపణావసరమున

"తత్తు నైకాంతమధురం"

అన్న దండిని భామహుఁడు

"కావ్యాన్యపి యదీమాని
వ్యాఖ్యాగమ్యాని శాస్త్రవత్,
ఉత్సవ స్సుధియా మేవ
హంత దుర్మేధసో హతాః"

అని నిందించియున్నాఁడు.

"అవిశేషేణ పూర్వోక్తం
యది భూయోఽపి కీర్త్యతే,
అర్థత శ్శబ్దతోవాపి
తదేకార్థం మతం యథా.

అనుకంపాద్యతిశయో
యది కశ్చిద్వివక్ష్యతే,
న దోషః పునరుక్తోఽపి
ప్రత్యుతేయ మలంక్రియా."

అని యేకార్థమునకు "పునరుక్త"మను దానిని పర్యాయ పదముగా దండి వాడియున్నాఁడు. ఈ యర్థమునే భామహుఁడును నిట్లనువదించియున్నాఁడు.

"యదభిన్నార్థ మన్యోన్యం
తదేకార్థం ప్రచక్షతే,
పునరుక్తమిదం ప్రాహు
రన్యేశబ్దార్థభేదతః.

నశబ్దపునరుక్తంతు స్థాల్యా
దత్రోపవర్ణ్యతే."

ఇట్లే భామహుఁడు దండి చెప్పిన యలంకారములను గేచిత్పక్షముగా నీక్రిందివిధమున నుదాహరించియున్నాఁడు.

"స్వభావోక్తిరలంకార
ఇతికేచి త్ప్రచక్షతే,
ఆశీరపిచ కేషాంచి
దలంకారతయా మతః.

భావికత్వంచ నిజగు
రలంకారం సుమేధసః,
భావికత్వ మితి ప్రాహుః
ప్రబంధవిషయం గుణమ్,
ప్రత్యక్షా ఇవ దృశ్యంతే
యత్రార్థా భూతభావినః."

ఇట్లు భావికమును ప్రబంధవిషయ గుణముగా దండియే చెప్పియున్నాఁడు.

కావున నిట్టిసందర్భములనుబట్టి భామహుని కాలమునకే యలంకారములు దండికాలమునకన్న నెక్కుడు పెరిగినవని చెప్పవచ్చును గాన భామహగ్రంథమునన్నై దలంకారములే;

"అనుప్రాస స్స యమకో
రూపకం దీపకోపమే
ఇతివాచా మలంకారాః
పంచైవాన్యైరుదాహృతాః"

అని చెప్పఁబడినవి. దండిగ్రంథమున ముప్పదియాఱు రున్నవి. కాన నలంకారవిస్తృతి నాశ్రయించి భామహుఁడు దండికన్నఁ బూర్వుఁడను సిద్ధాంతము సముచితముగా లేదని చెప్పవచ్చునుగదా! మఱియు,

"తత్ర వైదర్భగౌడీయా
వర్ణ్యేతే ప్రస్ఫుటాంతరౌ"

అని దండి చెప్పిన రీతిద్వయమును భామహుఁడుగూడ;

"వైదర్భ మన్య దస్తీతి
మన్యంతే సుధియో పరే,
తదేవచ కిల జ్యాయ
స్సదర్థమపి నాపరమ్.

గౌడీయ మిద మేతత్తు
వైదర్భ మితి కిం పృథక్,
గతానుగతికన్యాయా
న్నానాఖ్యేయ మమేధసామ్.

అలంకారవదగ్రామ్య
మర్థం న్యాయ్య మనాకులమ్,
గౌడీయమపి సాధీయో
వైదర్భమితి నాన్యథా".

అని విమర్శించిన ట్లగుపడుచున్నది. ఉపరినిరూపిత ప్రమాణములనుబట్టియు, భామహుఁడు దండిగ్రంథమును జూచినట్లు స్పష్టపడుచున్నది. దండియు నచ్చటచ్చట భామహగ్రంథమును విమర్శించినట్లు స్పష్టమగుచున్నది. కావుననే దండిభామహులు సమకాలికులని చెప్పవలసివచ్చినది. మఱియు నలంకారములు భామహగ్రంథమునందు సుమారు నలువది యగపడుచున్నవి. మఱియు వ్యాకరణాదివిషయములను దండికంటె భామహుఁడధికముగా నిరూపించియున్నాఁడు. కావున దండిభామహులు సమకాలికులైనను దండియే భామహుని కన్నఁ గొంచెముపూర్వుఁడై యుండునేమోయని తోఁచుచున్నది. ఇట్టిసందేహ గర్భితప్రమాణములనుబట్టి భామహుఁడు దండికన్నఁ బూర్వుఁడను జనశ్రుతిని నిరాకరించి సమకాలికులని యంగీకరించుటుచితమా యని యొకవేళ యెవ్వరైన శంకింపవచ్చును. కాన భామహుఁడు దండికంటెఁ బూర్వుఁ డనుటకుఁగూడ నిట్టిప్రమాణముచే యాధారములై యుండుటంజేసి యుభయపక్షములును సమీచీనములేయని సమ్మతింపవచ్చును.




# వలపు సందడి

పూడిపెద్ది వెంకటరమణయ్య గారు

నిన్ను దూరానఁగని పిల్వ నీసహస్ర
నామముల నుత్తమంబైన నామమేర్చి
అర్ఘ్యపాద్యాదివిధుల నిన్నాదరింపఁ
దలఁచి పన్నీరు స్వర్ణపాత్రమునఁ దెచ్చి.
కెరలి మధుపర్క మిడఁ గేతకీ ప్రసూన
దళములను జీరి నూత్నవస్త్రంబు నేసి,
గోవు నిడ నింటఁబుట్టి నేకూర్మితోడఁ
బెంచు నావున కిందిర పేరుపెట్టి,
నీకు నాపైనిగల ప్రేమ నిర్ణయింపఁ
గట్టుదిట్టములైన వాక్యములఁ బేర్చి,
ద్వారమున నిల్చి నీవచ్చుదారిఁజూచి
లలితమైనట్టి నీలోత్పలంబుమాడ్కి
తొలకరిందోఁచు మేఘంపుఁ దునుకవోలె
నీలమాణిక్యరచిత పాంచాలికగతి
శ్యామలాకృతిగల పంచశరునియట్లు
అల్లనల్లనఁ దోతెంచినట్టి నిన్నుఁ
గాంచినంతనె నామతి గలఁగిపోయె!
తావులేదయ్యె నన్యచింతనములకును!
చేయవలసినవెల్ల విస్మృతములయ్యె!
చేయఁగూడదని పను లెన్ని చేసినానొ!
కోరి భవదీయపూజకై కూర్చికొనిన
వస్తుజాలంబు సర్వంబు వన్నెఁదరుగు
తెలిసి తోడుత నింక వర్తింపఁగలను
నన్ను మన్నించిరాఁగదే! నందతనయ!

(రాధిక)





# భారత ప్రయోగములు

అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు

౧

## కలుగు ధాతువు

కర్ణపర్వము—

సీ. శ్రమమునకై నేను సకలాంబకంబు లె, క్కుడు వెననేయ నయ్యెడకునొక్క-
యాఁ బెయ్య యుఱికి నాయజ్ఞానమున నంప, తాఁకునఁ గూలిన దానిగలుగు
బ్రాహ్మణుం డధికకోపంబున నిది హోమ, ధేనువత్సం బిట్లు దీని శల్య
నిహతంబుఁ జేసితి నీవు నావచన శ, ల్యంబున నిహతుండ వగుము నీకు
సమర మేకాగ్ర నిర్భరోత్సాహవృత్తి, నడువ నరదంబు చక్రంబు పుడమిఁ గ్రుంగ
వలయు నెవ్వీరుమార్కొని గెలువఁగోరి, శ్రమముచేసెద వతనిచేఁ జావు మీవు.

కర్ణపర్వము-మూఁడవ ఆశ్వాసము—

క. బలమును శౌర్యము తేజము, గలఁడని కౌరవులు నమ్మి కర్ణుని నీతోఁ
దలపెట్టిరి నీ బాణం,బులఁ గూలెడు నతఁడు గీర్తి వొందెదు నిన్నున్.

ద్రోణపర్వము—

చ. అనిలతనూజు లావుగలఁడందురు సాత్యకి శౌర్యశాలినాఁ
జను ద్రుపదుండు సంగర విశారదభావము పూనియుండు మా
త్స్యునిఁ బటువిక్రమాఢ్యుఁడని చూతురు పాండవు లిందఱుండి యొ
క్కనికిఁ గడంగలేర నినుఁ గావఁగ నేమన నేర్తుఁ బుత్రకా!

భీష్మపర్వము—

ఉ. పాడియు సత్యముంగలరు పాండుతనూజులు, నీదుపుత్త్రు ల
ప్పాడికి నోడ, రత్తెఱఁగు పాపము సేయఁగఁ జూచి తీవు న
క్కీడిటుసేయ కేలుడుగు? గెల్వదె ధర్మువు? వారిగెల్పు మీ
యోడుటయున్ ధ్రువంబు విదురోక్తులు వింటిమి కాదె యిమ్మెయిన్.

భీష్మపర్వము—

ఉ. నెవ్వగ యింతయేల? విను నీ కెదురెవ్వరు? నీదుతమ్ములం
దెవ్వరు చూచినన్ జగము లిన్నియుఁ గెల్వఁగలారు లావునన్
గ్రొవ్విన భీష్మునోర్చు రణకోవిదుఁడైన శిఖణ్డి యేను నీ
కొవ్వనివారినెల్లఁ గ్రమయుక్తి లయంబొనరింతు నెమ్మెయిన్.

౨

షష్ఠ్యంతవిశేష్యమునకుఁ బ్రథమాంతము విశేషణమగుటకు లక్ష్యము

కర్ణపర్వము—

ఉ. మేరువుపోలె నొప్పిన సమీరణపుత్త్రుని పేర్మియున్ మహా
దారుఁడు ధర్మనందను నుదాత్తతయున్ విజయానుజన్ము లే
పారఁగ నున్నసొంపును నహంకృతి యేర్పడఁ ద్రౌపదీసుతుల్
వీరలమీఱి పోల్పెనఁగు లీలయుఁ జూడుము సూతనందనా!

౩

గుఱిచి—గుఱించి

శల్యపర్వము—

ఆ. నేలఁ గూలి మ్రానుపోలె నిట్టున్న య, పాపకర్ముఁ గుఱిచి పాడితెలుఁగు
తేటపడఁగ నేల మాటలాడెదరు మీ, రెఱుఁగఁ దరదముల మహీశులార!

చ. అనవిని యన్నరేశ్వరుఁడు హాసముతో నతనిం గుఱించి యి
ట్లనుఁ దనుజానుజన్మసుహృదాప్త సహాయులు సన్నఁగాదె శ
ల్యునిగొని మమ్ముఁ గెల్చి సకలోర్వియు నేలుట కుత్సహించి తీ
పనుపుట లేల మాను మిదిపాటిగఁ బట్టుము రమ్ము పోరికిన్

౪

అకారసంధి

శల్యపర్వము—

గీ. శంకలేక కడఁగి సభకట్టు పాంచాలి, నంటరానిదాని నొంటిచీర
తోనయున్న సాధ్వి వేనలిపట్టి యీ, డ్పించినతనిఁ జూడుఁడంచుఁ బొదలి.

## ౫

### స్ఫురణ, స్ఫురణము, చరిత్రాదులలోనిది

కర్ణపర్వము—

క. హరిమేని కాంతియును నరు, కిరీట రత్నాంశువులును గిరికొన, రథర
థ్యరుచులు బెరసి విచిత్ర, స్ఫురణంబునఁ దేజరిల్లెఁ జూడు కుమారా!

చ. వరుణుఁడు నీళ్ల చేఁ జెడునె? వాయుసఖుండు మహేంధనోత్కర
స్ఫురణ నడంగునే? నరుఁడు పోరుల నేపఱు తూలకల్గు నె
వ్వరికిని వానిఁ గీడ్పఱుపవచ్చునె? గాలిఁ బరాభవింపఁగా
దొరకొనినన్ జలంబుమెయి దోయధియంతయుఁ ద్రోవ వచ్చినన్.

## ౬

### గర్వగరిష్ఠుండగు నన్ను ఇత్యాదులు ప్రాయిక గ్రహణముచే రక్షితంబులయ్యె నను బాలవ్యాకరణమునకు లక్ష్యము

కర్ణపర్వము—

గీ. అకుటిలుండగు నాకు నత్యంతకుటిల, వృత్తి నహితంబు సేసెద విత్తెఱంగు
మిత్రవంచన మారయ మైత్రి సప్త, పదకృతోఁ ఖ్యాతి యనియెడి పలుకు వినవె?

శల్యపర్వము—

సీ. సీయొగి యేను భూనాయకుఁ డగుటొప్ప, రాజకోటికిఁ బరిగ్రహముననునె
నిను ననిన్ దెగటార్చి నేలఁ బాలించెద, నను నోర్చితేనిఁ బెంపున సుఖంపు
మేమిటివాఁడవై యిచ్చితిఁ బుడమినీ, కనియెడుమాట యిట్లాడి తీవు
నీవు ధరిత్రి యీ నేర్చినఁ గురుకులం, బునకు నిట్లాఱడిఁ బొంద నేల?
శాంతినొందుటకై ధర్మసంవిధాన, కరణ మొనరింపవచ్చిన కమలనాభు
వాక్యవృత్తిఁ బాటింపక వాడిసూది, మోపినంతైనయర్విఁ యీనోప నంటి.

కర్ణుఁడు శల్యునితో

కర్ణపర్వము కర్ణుఁడు శల్యునితో—

క. జనులెట్టిది శత్రువిధం, బనిచెప్పెదు రట్టి చంద మారయఁగా దు
ర్జనితుఁడగు నీకు నామెడ, వినుము కలిగె దీనమనసు విచ్చెం గుటిలా!





# సాహిత్యము - శాస్త్రము

చర్ల నారాయణ శాస్త్రి గారు

ప్రపంచమునఁ బ్రతి భాషయు, నొకప్పుడు వ్యావహారిక భాషగా నుండియుండును. ఇది యెవరును గాదనఁజాలరు; ఈసిద్ధాంతము ననుసరించి యొకప్పుడు సంస్కృతభాష కూడ వ్యావహారిక భాషగా నుండెననుట నిర్వివాదము. భారతకాలము యొక్క ప్రారంభమున భారతీయులైన యార్యులు సంస్కృతభాషతో మాట్లాడుచుండిరనియు, వ్యాస మహర్షి యొక్క మూలగ్రంథము ప్రత్యక్షమైన వ్యావహారిక భాషయందు వ్రాయఁబడియుండెననియుఁ జెప్పుటకుఁగూడ నేవిధమైన సంశయమును లేదు. మహాభారత కాలమున సంస్కృతభాష వ్యవహారమున నుండెనా? లేదా? యనునదిమాత్రము గొప్పప్రశ్నము. నిస్సందేహముగా భగవద్గీతవంటి కొన్ని భాగములు ప్రాచీనమైన మూలభారతమునందలివే యని స్థిరపఱుపఁబడియున్నవి. అందలిభాష సరళము, ప్రవాహతుల్యము గూడ నై యున్నది. ఆభాషయందు నేబంధనములును లేవు. అందు దీర్ఘములు దుర్బోధములునగు సమాసములు లేవు. కనుక అయ్యది ప్రత్యక్షముగా మాట్లాడువారి యొక్క భాషయని మన హృదయమునకుఁ దోఁచును. సమస్తమైన మహాభారతముయొక్క (సౌతికృతభాగముయొక్క) భాషకూడ వ్యావహారిక భాష వలెఁ గనుపట్టుచున్నది. భారతకాలమున (వ్యాస వైశంపాయనుల కాలమున) సంస్కృతభాషను మాట్లాడుచుండెడివారు. పంజాబు (పాంచాలము)నందలి స్త్రీలయొక్క మాటలయందు గ్రామ్య భాషలోని కొన్నినింద్యభేదము లున్నవి. ఆభేదములకుఁ గొన్నియుదాహరణములు కర్ణుఁ డిచ్చియుండెను. ఆభేదములవలనఁ బై యనుమానము బయలుదేఱు చున్నది.

> ఆహు రన్యోన్యసూక్తాని
> ప్రబ్రువాణా మదోత్కటాః,
> హే హా తే హే హా తే త్యేవం
> స్వామిభర్తృహతేతిచ. (కర్ణప.)

సంస్కృతభాషయందు 'హే హా తే, హే హా తే,' అను నివి సరియైనవి కావు. వీటియొక్క యుపయోగము స్త్రీలముఖమునుండి యగుచుండెడిది. దీనివలన సంస్కృత భాషయొక్క యుపయోగమును స్త్రీలుకూడఁ జేయుచుండెడివారని తెలియుచున్నది.

## సంస్కృతభాష

మహాభాగతకాలముకంటెఁ బూర్వము అనఁగా గ్రీసుదేశస్థు లాక్రమింపక మునుపు, హిందూస్థానమున నిమ్నజాతులలోని జనులయందు సంస్కృతభాష ప్రచారములో లేదు. ఈభాషయొక్క ప్రచారము విద్వాంసులైన బ్రాహ్మణులు విద్వాంసులైన క్షత్రియులు మొదలైన యున్నతజాతులయందే యుండెను. ఇట్లు కాని యెడల బుద్ధుఁడు తన నవీనధర్మముయొక్క యుపదేశమును మాగధీభాషయందుఁ జేయఁడు. అనార్యులును, నసంస్కారులును నగు లోకులకారణమున సంస్కృత శబ్దము లపభ్రంశములై వేఱువేఱు ప్రాంతములయందు వేఱువేఱురీతులఁ బ్రాకృతభాషలు పుట్టినవి. అనార్యులైనజనులకు సంస్కృతభాషయొక్క కఠినమైనయుచ్చారణవచ్చుట సంభవముకాకుండెను. ఈప్రకారముగా సంస్కృతభాషయొక్క కఠినరూపములు తద్విశేషములు వైశ్యులయొక్కయు శూద్రులయొక్కయు భాషణముల యందు నష్టమైనవి. సులభములైన రూపములయొక్క

ప్రచారము కూ నారంభమయ్యెను. సరళమైన యుచ్చారణములను బ్రసన్నములైన రూపములవల్లను బ్రాకృత భాషలు బయలువెడలినవని సారాంశము. ఇవి గాక యనార్యులయొక్క మ్లేచ్ఛభాషలుకూడ నచ్చటచ్చట వ్యవహరింపఁబడుచుండెడివి. కాబట్టి యాపదములుకూడ సంస్కృతభాషయందుఁ బ్రవేశించుచుండెను.

"నార్యా మ్లేచ్ఛంతి భాషాభి ర్మాయయా న చరం త్యుత" (ఆదిపర్వము). ఈవచనములవలన "ఆర్యులు మ్లేచ్ఛశబ్దములను వ్యవహరించెడువారు కారు" అని యర్థము నున్నది. టీకాకారుఁడు మ్లేచ్ఛశబ్దమున కర్థము 'అపశబ్దము' అని వ్రాసియుండెను. అదియు నుచితముగా నున్నది. అనార్యులు లేక మ్లేచ్ఛులు సంస్కృతమును మాట్లాడుటలోఁ బొరపడుచుండిరి; లేక అనార్యులు సంస్కృతములోని కఠినమైన యుచ్చారణములను కొంచెము కొంచెముగాఁ జేయుచుండి రనుటకూడ సంభవము. ఇందుచేత మ్లేచ్ఛులవలె మాట్లాడరాదని యనుచుండుట యార్యులకు పండుకయైనది. ఏదోయొకటి కానిమ్ము. మెల్ల మెల్లగా మహాభారతకాల పర్యంతమున ననార్యులును వారియొక్క సాంకర్యమునఁ బుట్టినవారును సమాజమున మిగుల వృద్ధినొందిరి. అట్లేవారియొక్క ప్రాకృత భాషలే మహత్త్వమును జెందినవి. సంస్కృతము కేవలము విద్యాపీఠములయందును,యజ్ఞశాలలయందును నుండెను. మహాభారతమునందలి ఉన్నతవర్ణముల స్త్రీలు, సంస్కృతమును మాట్లాడుచున్నారు; కాని 'సుబంధువు, కాళిదాసు' మొదలగువారి నాటకములయందు నుచ్చవర్ణములందలి స్త్రీలుకూడఁ బ్రాకృతమును మాట్లాడుచున్నారు. దీనివలన "మహాభారతకాలమునఁ బ్రాకృత భాష యుచ్చవర్ణస్త్రీలయందుఁ బ్రవేశించి యుండలేదు" అని యనుమానము చేయవలసియున్నది.

"దేశాంతరములనున్న మ్లేచ్ఛులతోఁగూడ వ్యవహారమును జేయునిమిత్తము భారతీయులైన యార్యులకు బొత్తిగా భిన్నమైన మ్లేచ్ఛభాషను మాట్లాడుకొనుటకు నభ్యాసము చేయవలసెఁగాఁబోలు" నని యూహింపవలసియున్నది. పంజాబునందు సికిందరుయొక్క యాక్రమణమైన తరువాత నీవిషయ మింకను నావశ్యకమైయుండును. ఆదిపర్వమున విదురుఁడు యుధిష్ఠిరుని గజారూఢునిగా నొనర్చుటకై వారణావతమున "తుమ్ జిస్ ఘర్మే రహ్నే కేలియే జా రహే హో, ఉస్ ఘర్మే లాఖ్ అది జ్వాలాగ్రాహీపదార్థ భరే హుఏ హై." (నీవునివసింపఁబోవునింటిలో లక్కమొదలైనమండుపట్టి పదార్థములు నిండియున్నవి) అని యొకఁడు మ్లేచ్ఛభాషయందు మాట్లాడెను. ఆభాష నితరులు తెలిసికొనలేకపోయిరి. ఇపు డిది మనకుఁ గోయభాషగా నుండవచ్చును. ఎవరైనను మాట్లాడునపుడు నంతయో కొంతయో తెలియకున్నచో దానిని గోయభాష యని చెప్పెడువాడుక కలదు. అదియట్లుండనిండు. భారతీయార్యులు సంస్కృతభాషయందుమాట్లాడునపుడు ప్రసంగవశమున నితరభాషాపదములుకూడ వచ్చుట సంభవించెను. దాని ననుసరించి మహాభారతమున సురంగశబ్దము యావానీ (గ్రీకు) భాషనుండి వచ్చినది. అయినప్పటికి నిట్టిశబ్దముల సంఖ్య మిక్కిలి తక్కువగానుండెను. కేవలము ప్రాకృత భాషాశబ్దములు అనగా దేశభాషయందుఁ బ్రచలితములైన శబ్దములుకూడ మహాభారతమందుఁ గొలఁదిగానేయున్నవి. ఏమూకశబ్దము ఇట్టి శబ్దములలోనిదే. ఋగ్వేదమందుఁ గూడఁ కొన్నిచోట్ల ననార్యభాషలోని శబ్దములుకలవు. ఈవిషయమును ఆవేదము నభ్యసించువారు గౌరవింతురు. సంపూర్ణదృష్టితోఁ జూచినయెడల "మహాభారతమున (బ్రాకృతము) దేశ్యము, లేక యనార్యుల మ్లేచ్ఛశబ్దములు, యావానీభాషలోని శబ్దములును మిక్కిలి తక్కువగా నున్నవి.—వ్రేళ్లమీఁద లెక్కపెట్టఁ దగినన్ని మాత్రము కలవు.

## ప్రాకృతముయొక్క చర్చలేదు.

మహాభారతకాలమునఁ బ్రాకృతభాషలు వ్యాపకముగా నుండెను. కాని, మహాభారతమునం దెక్కడను వాటియొక్కచర్చ యగుపడదు. ఇది యాశ్చర్యముగా నున్నది. బహుశః ఇట్టిచర్చ గావించుటకు సమయమే రాకపోయియుండును. మహాభారతముయొక్క చాండాలురుకూడ సంస్కృతమును మాట్లాడుచున్నారు. ఇందు నాశ్చర్య మేమియు లేదు. వ్యాసమహర్షి యొక్క మూలగ్రంథము సంస్కృతమునందే వ్రాయఁబడి యుండెను. అప్పటి కింకను బ్రాకృతభాషలయొక్క పుట్టుకకూడఁ గాలేదనుట నిశ్చయము. సౌతి క్రీస్తునకు నించుమించుగా

250 సంవత్సరములకంటెఁ బూర్వము మహాభారతమున కు వర్తమానస్వరూపము నిచ్చియుండెను. అప్పుడు, ప్రాకృతభాషలు పుట్టినవి. వేయియేల? ఆభాషలను జనసామాన్యము మాటలాడ నారంభించి రనుట కూడ సత్యము. కాని, మూలగ్రంథము సంస్కృతములో నుండిన కారణమున దానికాయ యీవృద్ధినొందిన గ్రంథము నందుఁ బడినది. అసలు బౌద్ధధర్మమునందు విరోధము వలన నీమహాభారతగ్రంథము తయారైనది. బౌద్ధధర్మము ప్రాకృతమాగధిని జేతఁబట్టియుండెను. దానియందలి పగవలన సౌతి సనాతనధార్మికులయొక్క ప్రాచీనమైన సంస్కృతభాషనే తనగ్రంథమందు నెలకొల్పెను. భారతీయార్యులయొక్క సనాతనధర్మగ్రంథము లగు వేదము, వేదాంగములు మొదలైనవి సంస్కృతమునందే యుండెను. అదిగాక, బౌద్ధధర్మముతోడి విరోధకారణమున సౌతికి సంస్కృతమున్న నభిమానము మెండయ్యెను. ఈప్రకారముగా, మహాభారతకాలమునఁ బ్రాకృతభాషలు పుట్టియున్నప్పటికిని మహాభారతమునందు సంస్కృతమే యుపయోగింపఁబడెను. ఇంతియే కాదు, ఆ సమయమున విద్వాంసులయొక్కభాష సంస్కృతమే. బౌద్ధసాహిత్య మింకను స్థిరపడియుండలేదు. అనఁగా, మహాభారతకాలమున భిన్నభిన్న శాస్త్రములయందున్న సాహిత్యమంతయు సంస్కృతములోనే యుండెను. ఆసాహిత్యమే మోయిపుడు చూడవలసియున్నది.

## వైదికసాహిత్యము

మొదట వైదికసాహిత్యమే విచారింపవలయును. మహాభారతమునాఁటికి వైదికసాహిత్యము దాదాపుగా నంతయుఁ దయారై యుండెను. అన్ని వేదములయొక్క సంహితలు తయారైనవి. వాటియొక్క బ్రాహ్మణములు కూడఁ దయారయ్యెను. అనుశాసనపర్వముయొక్క యీ వాక్యమందు *ఋగ్వేదమునఁ బదివేల ఋక్కులున్నవని స్పష్టముగాఁ జెప్పఁబడెను.

"దశేదం ఋక్సహస్రాణి
నిర్మథ్యామృత ముద్ధృతమ్"
(శాంతిపర్వము, 1. అ. 246.)

వేదములయొక్క రచన అపాంతరతముఁ డను ఋషి కావించెనని మహాభారతమునందున్నది; వేదముల యొక్క విభిన్నభాగములను స్వయముగా వ్యాసమహర్షి రచియించి యుండెనని మహాభారతమునకు మొదటనే చెప్పఁబడినది.

"వివ్యాస వేదా న్యస్మాత్స
వేదవ్యాస ఇత్యుచ్యతే."

అపాంతరతమునికిఁ బ్రాచీనగర్భుఁడని యింకొక పేరుగలదు. వీరియొక్కయవతారమును వ్యాస మహర్షి మహాభారతమున (శాం. అ. 346) లోఁ జెప్పెను. వేదములయొక్క వ్యవస్థను గావించిన యపాంతరతముఁడు పురాణఋషియగుట ప్రసిద్ధము. శౌనకుఁడు ఋగ్వేదమునకుఁ బూర్ణమయిన యనుక్రమణికను జేసెను. శౌనకుఁడు వ్యాసునికంటెఁ బూర్వుఁడని కాఁడని నిశ్చయముగాఁ జెప్పుటకు శక్యముగాకున్నది; అయినను ఋగ్వేదసంబంధమున శౌనకునికి విశేషమహత్త్వము కలదు. ఎందుచేతననఁగా వారు ఋగ్వేదములోని మంత్రముల నెక్కడ నేవిధముగా నుపయోగింపవలసినదియు నియమము గావించియుండిరి. అనుశాసనపర్వమున 30వ యధ్యాయమునందు శౌనకునియొక్క వంశావళియున్నది. ఈ యధ్యాయమున నీకథ కలదు. పూర్వము వీతహవ్యుఁడని పేరుగల యొకక్షత్రియుఁడుండెను. అతఁడు భృగుమహర్షి యొక్క వాక్యమాత్రమున బ్రహ్మఋషియయ్యెను. ఈ రాజునకుఁ గృత్సమదుఁ డను పేర నొక పుత్రుఁడు కలఁడు. ఋగ్వేదముయొక్క మొదటిమంత్రమునకు ఋషి యితఁడే. ఇతనికొమారుఁడు సుచేతుఁడు. సుచేతునికొడుకు వర్చసుఁడు. ఆతనివంశమున 'రురు' వుదయించెను. శునకుఁడు ఈరురువునకే పుత్రుఁడయ్యెను శునకునకుఁ బుత్రుఁడు శౌనకుఁడు; సౌతి యీ శౌనకునికి మహాభారతమును వినిచెను. ఈశౌనకుఁడు మహాభారతకాలము (క్రీస్తునకుఁ బూర్వము రమారమి 300 సం.) కంటె మునుపటివాఁడని తలఁచినయెడలఁ బూర్వోక్తమైన శౌనకునివంశమందు నితఁడు మఱియొకశౌనకుఁడు కావలయును. లేదా, ఏవిధముగా భారతప్రణేతయగు వ్యాసుఁడు వే

---

* వాస్తవమునఁ గొన్ని ఋక్కు లెక్కువయున్న వని టీకాకారుఁడు చెప్పెను.
"ఋచాం దశసహస్రాణి ఋచాం పంచశతానిచ, ఋచా మశీతిః పాదాశ్చైతత్పారాయణ ముచ్యతే."

ములయొక్క వ్యవస్థను జేసియుండెనో ఆవిధముగానే మహాభారతముయొక్క ప్రథమశ్రోతయగు శౌనకమహాఋషికూడ వేదములయొక్క సర్వానుక్రమణికను రచియించెనని సరిపుచ్చవచ్చును.

వేదములు మూఁడున్నవి. మఱియు నచ్చటచ్చట నాల్గవ యథర్వణవేదముయొక్కయుఁ జర్చయున్నది. ప్రతివేదమునకు బ్రాహ్మణభాగము వేఱుగా నున్నది. తండి ఋషి యజుర్వేదముయొక్క తాండ్య మహాబ్రాహ్మణమును శివానుగ్రహమువలనఁ జేసియుండెనని యనుశాసనపర్వమునఁ జెప్పఁబడినది. ఈతండి శివసహస్రనామములను జేసెననికూడ వ్రాయఁబడెను. మహాబ్రాహ్మణకర్తయగు తండియే యీశివసహస్రనామమును జేసినట్లు లంగీకరింపనియెడల దాని 'నుపమన్యువు' చేసియుండుననుట సంభవము. అనుశాసనపర్వముయొక్క 17-వ యధ్యాయమునందు నిట్లు నుడువఁబడినది. అనుశాసనపర్వముయొక్క 16-వ యధ్యాయమందు 'తండి' యొక్క వృత్తాంతముకలదు. శుక్ల యజుర్వేదమునందలి 'శతపథము' యొక్కకథ మహాభారతములో శాంతిపర్వముయొక్క 418-వ యధ్యాయమందుఁ గలదు. ఈరెండిటికిని గర్తయాజ్ఞవల్క్యుఁడు ఆతఁడు మొదటఁ దనమేనమామయగు వైశంపాయనునితో యజుర్వేదమును బఠించెను; కాని మామతోఁగూడఁ గొంచెము జగడమువచ్చి యావేదము నుమిసి సూర్యుని యారాధనమున నతఁడు క్రొత్తయజుర్వేదమును నిర్మించెను. ఆఖ్యాయిక ననుసరించి యీశుక్ల యజుర్వేదమున్నది. సూర్యుఁ డతనికిట్లు వరదానమును గావించెను. "ఇతరశాఖలనుండి గ్రహింపఁబడిన ప్రకరణములను, నుపనిషత్తులను గలిగియున్న సాంగయజుర్వేదము నీయందు స్థిరముగా నుండఁగలదు." దీనికి ననుసరణముగా యాజ్ఞవల్క్యుఁ డింటికివచ్చి సరస్వతిని ధ్యానించెను. అంతట సరస్వతి ప్రత్యక్షమగుటయు నామెను, బ్రకాశదాతయగు సూర్యుని, నిద్దఱను బూజించి యాతఁడు ధ్యానముచేసెను. అపుడు కథయొక్కవర్ణన ననుసరించి, యాజ్ఞవల్క్యుఁడు తనవిషయమున జనకునితో నిట్లు చెప్పుచున్నాఁడు. "సంపూర్ణమైన శతపథము, రహస్యము, ఇంక నితరములు, అన్యశాఖలనుండి తీసికొనిరాఁబడిన భాగములును నావలన నావిర్భవించినవి. ఆపిదప నామామకుఁ గ్లేశమును గలిగించుకొఱకు నూఱుగురిని శిష్యులుగాఁ జేసికొంటిని. తిరుగ నెప్పుడు నీ (జనకునియొక్క) తండ్రి యజ్ఞము చేసెనో, అప్పుడు యజ్ఞముయొక్క సంపూర్ణాధికారమును నాచేతిలోఁ బెట్టుకొంటిని. మఱియు వేదపాఠముయొక్క దక్షిణకై వైశంపాయనునితో జగడమాడి దేవతలయెదుట సగము దక్షిణను దీసికొంటిని. సుమంతుఁడు, జైమిని, పైలుఁడు, నీతండి, ఇతర ఋషులు వీరందఱకు నీవ్యవస్థ సమ్మతమయ్యెను. సూర్యుని వలన నాకు 15 యజుర్మంత్రములు ప్రాప్తించినవి. రోమహర్షణునితోఁ బురాణములయధ్యయనముకూడ నొనర్చితిని."

ఈవర్ణనచేతఁ గొన్ని మహత్త్వపూర్ణములైన యనుమానములు లభించుచున్నవి. అందు మొదటిది యిది. యజుశ్శాఖీయులగు వైశంపాయన యాజ్ఞవల్క్యుల జగడము వలన శుక్లయజుర్వేదము పుట్టినది. యాజ్ఞవల్క్యుఁడు దానిని సూర్యునుండి సంపాదించెను. దానిలోఁ బదునైదుమంత్రములను సూర్యుఁడు ప్రత్యేకముగా నిచ్చెను. మిగిలినవి ప్రాచీనశాఖలలోనివే (వీనిని జదివెడుపద్ధతి యొక్కటియే; కృష్ణయజుర్వేదముకంటె వేఱుగా నున్నది.) ఈవేదముయొక్క ప్రసిద్ధమైన శతపథబ్రాహ్మణమును యాజ్ఞవల్క్యుఁడే యొనర్చెను. ఈబ్రాహ్మణమందుమాత్రము స్వరమున్నది. (ఇతరమైన వేదముల యొక్క బ్రాహ్మణముల యందు స్వరము లేదు. వాటి యందు స్వరహీనమైన గద్యముకలదు) దీనినిఁబట్టి యీ బ్రాహ్మణము అన్నిటికంటెఁ బ్రాచీనమై యుండునని తోఁచుచున్నది. ఈకథవలన దీనియొక్క రచనాకాలము కూడఁ బరికింపఁబడుచున్నది; అనగా నీ బ్రాహ్మణము భారతయుద్ధమునకుఁ దరువాత రచింపఁబడినది. ఎందుచేతననఁగా: వ్యాసశిష్యులగు సుమంతుఁడు, జైమిని, పైలుఁడు, వైశంపాయనుఁడు వీరికి నీయాజ్ఞవల్క్యుఁడు సమకాలికుఁడు. వేయియేల? యాజ్ఞవల్క్యుఁడాతని శిష్యవర్గములోనివాఁడే. భారతయుద్ధము తరువాత శతపథబ్రాహ్మణము నిర్మితమయ్యెనని పూర్వమే నిర్ణయింపఁబడినది. మఱియు దానివల్లనే భారతయుద్ధము యొక్క కాలముకూడ నిశ్చయింపఁబడెను. వ్రాయఁబడిన కథవల్ల మహాభారతకాలము ఈపుక్కిటి పురాణములయొక్క పరంపరలవలనఁ దెలియఁదగియున్నట్లు కనుపడుచున్నది.

యాజ్ఞవల్క్యుఁడు శుక్లయజుర్వేద మొకటి యెక్కువ చేసినంతమాత్రమున నూరుకొనలేదు. ప్రాచీనయజుర్వేదముతోఁగూడ స్పర్ధించి యజ్ఞమున నావేదమునకు వచ్చునట్టి దక్షిణయందు వైశంపాయనునితోపాటు సగము భాగమునుగూడఁ బుచ్చుకొనెను ఈ విషయముగా నీకథ మిక్కిలి మనోరంజకముగను ఐతిహాసికదృష్టినిబట్టి మహత్త్వముతోఁ గూడినదిగను నున్నది.

ఇదిగాక వనపర్వముయొక్క 138-వ యధ్యాయమందు 'అర్వావసువు' రహస్యసౌరవేదమును రచించెనని వర్ణింపఁబడినది. (ప్రతిష్ఠాంచాపివేదస్య సౌరస్య ద్విజసత్తమః) సౌరవేదము సూక్తవేదమునందు నున్నట్లు తెలియుచున్నది. కాఠకబ్రాహ్మణమున నీలకంఠునిచేత వర్ణితమైన యొక యాదిత్యాక్షరీమంత్రము దీనియందు ముఖ్యముగానుద్దేశింపఁబడినది. ముఖ్యముగామంత్రములను, బ్రాహ్మణములను, వేదము లనుచున్నారు. బ్రాహ్మణములయందే యుపనిషత్తులుకూడ నంతర్భవించియున్నవి. అయినప్పటికి నొక్కొకచోట నవి వేఱుగా నిర్దేశింపఁబడినవి. సభాపర్వములో 5-వ యధ్యాయమునకుఁ బ్రారంభమున నారదుఁ డీవిధముగా స్తుతింపఁబడెను.

"వేదోపనిషదాం వేత్తా
ఋషిః స్సురగణార్చితః"

మహాభారతకాలమున నేయేయుపనిషత్తులు ప్రసిద్ధముగా నుండెనో చెప్పఁజాలము. దశోపనిషత్తులు బహుశః మహాభారతముకంటె మునుపటివే యైయుండును. వేదములలోని దశోపనిషత్తులకంటె నతిరిక్తముగా ననేకోపనిషత్తు లీకాలమునఁ బ్రసిద్ధములై యున్నవి. శాంతిపర్వములో 342-వ యధ్యాయమున ఋగ్వేదమందు 21000 శాఖ లున్నట్లు వర్ణింపఁబడినది; ఇంకను సామవేదమున 1000 శాఖలు, అట్లే యజుర్వేదమునందు 56 + 8 + 37 = 101 శాఖలు నున్నట్లు చెప్పఁబడెను. కాని యిప్పుడు వేదములయందు నిన్నిశాఖలు కనుపడుటలేదు. ఈకారణముచేత, భిన్నభిన్నములైన యుపనిషత్తులను దమమనసువచ్చినట్లుగా నేదో యొకవేదమునకు నుపనిషత్తులని చెప్పఁదొడఁగిరి.

నారదునియొక్క వర్ణనలో ముందుగా "ఇతిహాస పురాణజ్ఞః పురాకల్పవిశేషవిత్" అని చెప్పఁబడెను. ఈ పురాకల్పములకు సంబంధము వేదములతోడనే యున్నది. ఈపురాకల్పములు మఱేమియుఁ గ్రొత్తవి కావు. వేదములయందుఁ జెప్పఁబడిన వేఱు వేఱు మాటలే. ఈకాలమునఁ బురాకల్పములమాట యెచ్చటను లేదు; అయినను బ్రాచీనకాలమునందుఁ బురాకల్పము లని పేరుగల వేఱ్వేఱు చిన్నగ్రంథము లుండియుండును. ఉపనిషత్తులవలె నవికూడ వేదముల యొక్క భాగములుగా నెంచఁబడియుండును. కాని, యీకాలమున వాటియొక్క యంతర్భావము పురాణములయందుఁ, బక్షాంతరమున బ్రాహ్మణములయందు వర్ణితమైన కథలలో నగుచున్నది.

## వేదాంగవ్యాకరణము

వేదాంగముల విషయమున నిపుడు విచారము గావింపఁబడుచున్నది. మహాభారతమున షడంగముల మాట మాటిమాటికి వచ్చియున్నది. నారదుని "న్యాయవిద్ధర్మతత్త్వజ్ఞః షడంగవి దనుత్తమః" అని వర్ణించియుండెను. మహాభారతములో నీషడంగములు చెప్పఁబడినవి. ఈక్రిందిశ్లోకమున షడంగముల వర్ణన యున్నది.

"ఋక్సామాంగాంశ్చయజూంషిచాపి
ఛందాంసి నక్షత్రగతిం నిరుక్తమ్,
అధీతంచ వ్యాకరణం సంకల్పం
శిక్షాంచ భూతప్రకృతిం నవేద్మి.
(ఆదిపర్వము, అ. 170.)

ఈశ్లోకమునఁ జెప్పఁబడిన షడంగములు ఛందస్సు, నిరుక్తము, శిక్ష, కల్పము, వ్యాకరణము. జ్యోతిషమును ఈశాస్త్రములన్నియు మహాభారతకాలమునఁ దఱచు సంపూర్ణముగా నభ్యసింపఁ బడుచుండెడివి. ఆవిషయముల యందు భారతీయార్యులకు జ్ఞానమధికముగా నుండెను. అందు విశేషముగా వ్యాకరణాభ్యాసము జరిగి యాకాలమునఁ బాణినియొక్క వ్యాకరణము పుట్టినది. పాణినివ్యాకరణము ప్రపంచములోని వ్యాకరణము లన్నిటికన్న మిన్నయైనది. పాణిని తనవ్యాకరణమునకు ఏనియమములను బాటించెనో ఆనియమ[illegible] భిన్నభిన్నములైన వ్యాకరణములందుఁగూడ గ్రహింఁ బడినవి. పాశ్చాత్యపండితులు గావించిన వ్యాకర

మటువంటిదే. నిశ్చయముగా నిటీవలఁ గావింపఁబడిన తుల నాత్మకములైన వ్యాకరణములకెల్లఁ బునాదివైచినది పాణినీయమే ఈవ్యాకరణము ప్రపంచమందలి భాషా పండితు లందఱకును సమాదరణీయముగా నుండెను. పాణిని యాద్యవ్యాకరణకర్త కాఁడన్నమాట స్పష్టము. ఆతఁడు గావించిన యద్వితీయవ్యాకరణము కేవలము పాణినియొక్క బుద్ధిబలమునకుఁ బరిణామముకాదు. వానికంటెఁ బూర్వముకూడ వ్యాకరణశాస్త్రముయొక్క యభ్యాసము విశేషించి జరుగుచుండెను. పాణినికంటెఁ బూర్వము శాస్త్రకారు లీవిషయముమీఁద ననేకగ్రంథములను రచియించియుండిరి. తాత్పర్యమిది: వ్యాకరణము వేదాంగము, కాఁబట్టి దానియొక్క యభ్యాసము భారతీయయుద్ధకాలము మొదలుకొని మహాభారతకాలము వఱకు ముఖ్యముగా జరిగియుండెను. కాని మహాభారతమున ఏవ్యాకరణశాస్త్రకారునియొక్కయుఁ బేరు రాలేదు. ఇంతవఱకునున్న మహాభారతమునఁ బాణినియొక్క పేరుకూడ లేదు. అయినను పాణిని మహాభారతకాలమునకు ఇటీవలివాఁడని చెప్పుటకు వీలుకాదు. వర్ణింపఁబడకుండుట యొక ముఖ్యప్రమాణము కానేరదు. "మహాభారత కాలముకంటెఁ బూర్వమే పాణిని యున్నాఁడనుటకుఁ గారణమున్నది. మహాభారతమున భాష్యము మాటయున్నది.(పాణినివ్యాకరణము వేదాంగ ...గా నెంచఁబడుచున్నది.) వైదికులుకూడ దానినిఁ బఠిం...న్నారు. ఈవ్యాకరణముమీఁదఁ గాత్యాయన ...కములు, పతంజలి మహాభాష్యముకూడ నున్నది. ...ప్లనపర్వముయొక్క 80-వ యధ్యాయమున ఈ...న్నది:

...చ భాష్యవిదః కేచిత్
యేచ వ్యాకరణే రతాః,
...ంతే పురాణంచ
ధర్మశాస్త్రాణి చ్యథాపి తే."

...డు భాష్యపదము వ్యాకరణము యొక్క...ముతో నున్నదనియు నియ్యది పతంజలికృత మహాభాష్యము నుద్దేశించి ప్రయోగింపఁబడిన దనియు మొట్టమొదటఁ దోఁపవచ్చును. కాని యట్లనుకొనుటకు వీలులేకున్నది. ఏమనఁగాఁ బతంజలి మహాభారతకాలమునకుఁ దరువాతవాఁడని నిశ్చయింపఁబడియెను. అపుడు వానియొక్క మహాభాష్యమునకు మహాభారతమున వర్ణనము సంభవింపదు. ఇచ్చటి భాష్యశబ్దమునకు వ్యాకరణముతో విరోధము స్పష్టముగాఁ జూపట్టుచున్నది. ఈ కారణములచేత నీభాష్యము వేదమునకో, లేదా మఱియొకశాస్త్రమునకో కావలయును. పతంజలియొక్క మహాభాష్య మిచ్చట నుద్దేశింపఁబడ లేదని చెప్పుటకు నేవిధమైన యాటంకమును లేదు. ఇక్కడభాష్యపదము నిరుపపదముగాఁ గూడ నున్నది. ఇదిగాక యనుశాసన పర్వమున **14** వ యధ్యాయములో నిద్దఱు గ్రంథకర్తల యొక్క నామము లున్నవి.

"శాకల్యః సంగితాత్మావై నవ వర్షశతాన్యపి;
ఆరాధయామాస భవం మనోయజ్ఞేన కేశవ!
భవిష్యతి ద్విజశ్రేష్ఠః సూత్రకర్తా సుతస్తవ;
సావర్ణిశ్చాపి విఖ్యాత ఋషి రాసీత్కృతేయుగే;
గ్రంథకృల్లోక విఖ్యాతో భవితా హ్యజరామరః."
(అను. **14**. శ్లోక. **100-104**)

ఈశ్లోకములయందు నొకసూత్రకారుఁడు శాకల్యుఁడు, రెండవవాఁడు సావర్ణి అని యిద్దఱు గ్రంథకారుల వర్ణనకలదు. శాకల్యుఁ డేశాస్త్రమున సూత్రములు రచించెనో, యిదిమాత్ర మిచ్చటఁ జెప్పఁబడలేదు. సావర్ణి యీ (ఫలాని) శాస్త్రమునందు గ్రంథమును వ్రాసెననికూడఁ జెప్పఁబడలేదు. కాని శాకల్యుని పేరుపాణిని సూత్రముల (లోప శ్శాకల్యస్య మొదలైనవాని) యందు వచ్చుచున్నది. దీనిఁబట్టి యీశాకల్యుఁడను సూత్రకారుఁడు పాణినికన్నఁ బ్రాచీనసూత్రకర్త కావచ్చునని తెలియుచున్నది. కనుక నిది యనుమానింపఁ దగియుల్లది.

సంపూర్ణము



# కృతి నామకరణము

అనంతపంతుల రామలింగస్వామి గారు

భావకవిత్వ సంపద లపారముగాఁగల ఖండకావ్యముల్
    నే విరచించి యన్నిటిని నీటగు పొత్తముగా ఘటించి సం
  భావనఁ జేయుచుంటిని విభావరి నాకృతినామ మేమనం
  గావలె నంచుఁ గొంతదనుకన్ వెనుకన్ గొనినాఁడ నిద్దురన్.

ఉ. అద్దమరేయి నొక్క పురుషాకృతి దోఁచెను స్వప్నమందు నా
  కద్దిర! పంగనామముల నాస్యమునన్, రుదురాక పేరులున్
  పెద్దవి కంఠసీమమునఁ, బిల్లిని జంకను, దాటియాకులన్
  కొద్దిగ నొక్కచేత, నొకకుంచెను రెండవచేతఁ బూనుచున్.

గీ "వీథినాటకమున హాస్యవేషధారుఁ, డటులవచ్చితి వెవ్వఁడవయ్య! నిన్ను
  నెప్పుడో చూచియుండిన చొప్పు దోఁచు,ననుము భవదీయవృత్తాంత" మనఁగ నంత.

గీ. "పరిచితుఁడ నేను నీకు నన్మఱచినావు, నిదురమత్తునఁ బోనిమ్ము నేను గినియ
  రామలింగకవియగు నానామ మోయి! నాదునావాసము తెనాలినగర మండ్రు."

క. అను చాతఁ డనిననుడులను, విని భక్తి నమస్కరించి ప్రీతి నడిగితిన్
  "విను కవిశేఖర! యిట కే,పనిమీఁదను వచ్చినావొ పలుకు" మనంగాన్.

క. "నాపేరఁ బరగువాఁడవు, నాపద్యము లరసి ప్రీతి నను మెచ్చుచు నే
  రేపును మాపును నాకృతు,లే పఠియించెదవు కాన నెలమిన్ గొంటిన్.

క. నిను నా శిష్యునిఁగాఁ గై,కొనినాఁడను గవిత నీవు గూర్చిన పొత్తం
  బున కేది తగినపేరని, యనుతాప మిదేల విను మదశ్వచరితమున్.

సీ. తపనీయ మణిమయోద్దామ ప్రభాభాసి, తోత్తుంగసింహాసనోజ్జ్వలంబు
  కవిగాయకవితానగంభీర గీతాసు, ధారసధారా ప్రపూరితంబు
  సకలశాస్త్రేతిహాసార్థవిత్పండిత, పాండిత్యచర్చాతి మండితంబు

గాంగేయపార్థ విక్రమకళా కవితాంధ్ర, పీఠసింహాసమూహా విలసితంబు
నవ్యనాట్యకళాసమున్నతపయోను,సంగవారాంగనాపాంగ మంగళంబు
వ్యజనయుగ్యంత్రపుత్రికాభ్యంచితంబు, నాతతం బాంధ్రరాయసభాంగణంబు
కొలువుదీరిచి రాయలు గూరుచుండె, సింహపీఠిక నా సభాసీమయందు
విజయఘంటిక మ్రోయఁగఁ బ్రజలు నలర, వందిమాగధు లాతని ప్రతిభఁజాట.

గీ. అంత నొక చిత్రలేఖకుఁ డటకువచ్చి, యశ్వ చిత్రపటముఁదెచ్చి యవనిధవున
కిచ్చె నద్దాని రాయలు మెచ్చికొంచుఁ, జూపి సభ్యుల కిట్లు సంస్తుతులు సల్పె.

ఉ. 'ఎంతమనోజ్ఞమై తనరు నీజవనాశ్వ విచిత్ర లేఖనం
బింతయు లోటుపా టుచట నెంచఁగరాదు సజీవఘోటి న
త్యంతముఁ జూచినట్టులగు దాఁటెడుగుఱ్ఱము దాఁటుచున్నటే
వింతచెలంగ వ్రాయఁబడె వేలకుమించినమూల్య మీఁదగున్.'

గీ. అనుచుఁ గొనియాడి చిత్రలేఖనముఁ జిత్ర,కారునకు వేనవేలు రూకలు నొసంగి
'కలఁడె యొక్కఁడైన నీచిత్రకారు మించఁ, జాలెడునతండు నాదు నాస్థానమందు.'

గీ. అనుచు భూజాని యాతని పినుతిచేయఁ, గుపితమతి నొచు నేనంటి 'గుతలనాథ!
పఱగు నీతేజి యీచిత్రపటము వదల, దిందుఁగలచిత్ర మేమొకో సందియంబు.

చ. తగులదు మెత్తగాఁ దరిసి తాఁకిన, భీతిఁ గలంగఁ జేయఁగాఁ
నెగురదు, కొంతచెమైన సకిలించదు, వాలము ద్రిప్ప, దిట్టి ద
శ్వగణమునందు నున్నె సగబాలుఁ గనంబడ దెట్టిచిత్ర మీ
పగిది విచిత్ర చిత్రములు వందలు వేలు రచింపకుందునా!'

అనఁగ వసుధేశుఁ డాడె నా కంత నిటుల, 'భావనముఁజేయవలెఁ జిత్రపటముఁ దెలియ
భావశూన్యన కది కుడ్యభావ మొసఁగు, నీకళారహస్యం బిదే లోకమందు.

వందలు వేలు వ్రాయఁగలవాఁడవు నీవు సెబాసు! సత్కవీ!
యిందుగ నొక్కచిత్రపటమున్ రచియించుము దానితోడ నీ
యందునఁ గల్గుప్రజ్ఞ తెలియం దగు'నంచు క్షితీశుఁ డాడె న్నే
ౕందున కొప్పికొంటి సభయందున నందఱు నబ్రమొందఁగన్.

కొలువుఁ జాలించి భూమీశతిలకుఁ డేగె, తేపకడ లేచి మఱునాఁడు తేనిద్దైన
యాసభాభవనాంతరమందుఁ గుడ్య,సీమ నొకచోట వ్రాసితిఁ జిత్తరువును.

ఉ. రాయలు వచ్చి యంత నపరాహ్ణమునందున నాంధ్రరాజనై
జాయతవైభవంబున సభాంగణసీమకుఁ బల్కె నిట్టులన్

'హేయవిధానఁ గుడ్యతల మీఁగతిఁ బాడొనరించె నెవ్వఁ డో
రా' యను నంతనే నలధరాధిపుఁ గాంచుచు మాఱువల్కితిన్.

ఆ. 'గోడఁ బాడుచేయుజాడ కా దది నేను, గోడమీఁదఁ గడఁకఁ గూర్చినట్టి
చిత్తరువది కాని క్షితినాథ! వేఱొండు, కాదు దానిఁగాంచ నాదుమనవి!'

శా. 'ఔరా! చిత్తరువేది? కుడ్యమున హేయంబౌ మసిన్ బూసి యా
మోరన్ గుంచెను వెల్లఁ గొట్టి యిటు హాస్యోక్తిప్రజం బాడుదే?
పారంబన్నది లేదె యెంతకుఁ ద్వదభ్యస్తాతిహాస్యోక్తిక
య్యారే! యియ్యది యాచిదంబరరహస్యప్రాయ మౌనే మొకో?'

గీ. అనుచు భూనాథుఁ డించుక యలిగిపలుక 'భావనముఁ జేయవలెఁ జిత్రపటముఁ దెలియ
భావశూన్యున కది కుడ్యభావ మొసఁగు, నీకళారహస్యం బిదే లోకమందు.'

మ. అని నేనాడినమాటలన్ గినుకఁ దా నాలించి 'నీచిత్రలే
ఖనమం దొప్పెడు భావమున్ దెలుపు ప్రఖ్యాతంబుగాఁ నద్ది నేన్
వినెదన్, నా కది నచ్చకుండు నెడ నీనేరంబు సైఁపన్ జుమా'
యనె ధాత్రీశుఁడు, 'వల్లె' యం చతనికే నావెన్క నిట్లాడితిన్.

చ. 'అడిగిన భావమున్ దెలుప నౌ,నటు లెందఱికంట వీలగున్,
బుడమిని సాధ్య మద్దియగుఁ బో, కృతికర్త గతించు వెన్క నే
వడువున నద్ది బోధపడు, పాఠకు లెందును స్వీయశక్తిచేఁ
దొడరి గ్రహింపఁగావలె గృతుల్, కృతిపాఠకధర్మ మెంచరే!

చ. కవులును జిత్రకారకు లఖండగభీరవినూత్నభావముల్
ప్రవిమల దివ్యసత్కృతుల రాశులఁ జేతురుగాని, తత్కృతి
ప్రవరరహస్యభావవిభవప్రతిబింబితపూర్ణతత్త్వమున్
వివిధజనాళి నేర్వఁగ వివేకము బుద్ధియు నీయనేర్తురే?

గీ. ఆత్మరూపము దేహామై యలరునటులు, భావరూపము చిత్రమై బరగు, భావ
రహితచిత్రము జడ మాత్మరహితదేహ, మటులు భావము జీవన మఖిలమున

ఉ. రంగులు రేఖలే నయనరమ్యవిచిత్రపటంబునందు ము
ఖ్యాంగము లంచు భ్రాంతిపడు నాతఁ డెఱుంగఁడు దాని తత్త్వమా
రంగులవెన్క గుప్తమగుఁ బ్రాంచిత భావవిశేష మొంచు తె
ల్విం గలవానికే తెలియవీలగుఁ జిత్రకళారహస్యముల్.

ఉ. ఉన్నది యున్న దంచనుచు నుండెడువాఁ డధముండు, తెల్విమై
నున్నది లేదటం చనుచునుండెడు నాతఁడు మధ్యముండు, లే
కున్నది యున్నదం చనుచు నుండెడువాఁ డిల నుత్తముండయా
నెన్నఁగ ముత్తెఱంగులు మహిన్ గలయట్టి విమర్శకుల్ నృపా!

మ. కచపాశచ్యుత కేశలేశ మొకచోఁ గన్పట్టఁ దన్నైల్యస
ద్రుచులన్ దత్పరిమాణ మెంచి యది యేలోలాక్షిదో, యామె నే
రుచు విద్యావిభవంబు లెట్టివో, వయోరూపంబు లేపాటివో
వచనం బెట్టిదో, పోల్చునాతఁడె కళావైదగ్ధ్య సంపూర్ణుఁడౌ.

చ. ఒకపరమాణువున్ గను చయోమయమై మును బొల్చు నీప్రపం
చగపరిణామతత్త్వమును సాంతముగా మది నూహసేయుటే
ప్రకటవిమర్శకప్రథితలక్షణ మియ్యది నిక్కమో ప్రభూ!
వికటకవీశువాక్కని యుపేక్షవహించి హసించఁ బోకుఁడీ!

చ. అటుల నుపేక్షఁ జేయు నెడ నక్కట సత్కళలెల్ల గొడ్డుపో
వుటయె ఘటిల్లు నంతఁ బరిపోషిత భావకవిత్వజీవమున్
బటుతరచిత్రలేఖన మభావతమస్స్థితిఁ గాంచుఁ గాన నిం
తటను మదీయచిత్రరచనాప్రతిభోన్నతి సన్నుతింపుఁడీ!

సీ. గండుమొగఱులెత్తి కొండ లుద్దండత, నెగురుచున్నటుల భావించుకొనుఁడి
బ్రహ్మాండచండార్తిఁ బాపనిర్జరు లింద్రు, వేఁడుచున్నటుల భావించుకొనుఁడి,
ఇంద్రుఁ డుచ్చైశ్రవం బెక్కి వజ్రాయుధం, బెత్తిపోవునటు భావించుకొనుఁడి
చిత్రంబునందు విచిత్రంపు మసిపూఁత, యే మబ్బులంచు భావించుకొనుఁడి,
అట్టిమబ్బులఁ జొచ్చిన యాసురేంద్రు, వాజివాలాగ్ర మీకనఁబడెడుఁ దెలుప
టంచు భావించుకొనుఁ డింక నగును దీని, పేరు భావతురంగంబు ధారుణీశ!'

క. అనునాదు నుపన్యాసం, బును విని పార్థివుఁడు నవ్వి, మోమెత్తి యనెన్,
'ఘనచిత్రకళానిధి! నీ, యనుపమ చిత్రకళ సార్థకాఖ్యం బయ్యెన్.

క. అనుపమ సత్కృతికిఁ బ్రయో, జన మానందంబు, మాకు సంధిలె నది నీ
వినుతవిచిత్రము కతనన్, గననల్పమె నీదు చిత్రగతకౌశలమున్

మ. భళిరా! యింతటిదాఁక నీకుఁ గవితాప్రావీణ్యమే కల్గుటన్
దలఁతున్ జిత్రకళాధిదేవతయు, నిన్గామించుటల్ నేఁడుగాఁ,

గలిగెఁ భావతటాక నిమ్నతమపంకస్థానమై, తావకో
జ్జ్వలచిత్ర ప్రతిమావిలాసకలనా సౌకర్య మొప్పారెడున్.

ఉ. భావతురంగమంచుఁ బరిపాటిగ నియ్యది పేరుఁగాంచి యిం
దే విలసిల్లుఁగాక!' యనికృష్ణవిభుండు వచించి, దానిపై
నావిమలాక్షరంబులు రయాన లిఖింపఁగఁ జేసి, యంత నా
కావిభుఁ డిచ్చెఁ గాన్కలపు డచ్చటిసభ్యులు మచ్చరింపఁగన్.

శా. ఆనాఁడాదిగఁ బెక్కువత్సరము లాయాస్థానమందుండె వి
న్నాణంబై తగునాదుచిత్తరువు, వెన్కన్ శత్రు లయ్యాంధ్రసం
స్థానంబెల్ల జయించి దుర్గమును బ్రాసాదంబులన్ గొట్టి! విం
తే నాభావతురంగముం గలిసె నాఁడే మంటిలో నక్కటా;

చ. మఱిచిరి లోకులందఱును మామకభావతురంగనామ మా
తరుణమునుండి, దానిచరితంబును గ్రమ్మఱ నేఁడుచాటి, త
త్పరమవిచిత్రనామము సదా భువి నిల్చెడునట్లు చేయ నీ
గురుని మహాజ్ఞ యైనదనుకొంచుఁ దద్వరకార్యమూనుమా!

ఉ. మామకభావనాశ్వమగు మాతృక తావకభావగీతికా
దామనియుక్త సత్కృతికిఁ దానిఁ దలంచుచు నుంచుమోయి! నీ
వీమహి నీదుపాత్రమున కింతట భావతురంగనామ, మా
నామమె బాటు నీదురచనాగతభావగభీరతత్త్వమున్."

మ. అతఁ డీరీతిని బల్కి తత్క్షణమె మాయంబయ్యె, నా కంతలో
స్మృతిగల్గెన్, గనువిచ్చిచూచుటనె నాచెంతన్గనన్ దోఁచె మ
త్కృతభావోన్నత ఖండకావ్య విలసద్విఖ్యాత సద్గ్రంథ, మా
కృతికిన్ "భావతురంగ" నామమిడి తత్కీర్తిన్ ప్రతిష్ఠించితిన్.

శా. ప్రాచుర్యోజ్జ్వలకీర్తి రూపలలనారక్తుండునై, హాస్యవా
చాచాతుర్యగుఁడై, విమర్శనకళాచంద్రుండునై కాకవి
ప్రాచీనాహిమయూరుఁడై, కవిజన ప్రాలంబుఁడై యస్మదీ
యాచార్యుండగు "రామలింగకవి" నే నర్థించి కీర్తించెదన్.






శ్రీ వాసుదేవరావు

(ఏకాంక నాటిక)

ఈనాటికలో వచ్చేపాత్రలు:—

లక్ష్మిదేవి
కమల—లక్ష్మీదేవికూతురు
సుభద్ర— ,, కోడలు
జానకమ్మ } పొరుగింటి
రత్నమ్మ } స్త్రీలు
వసంతరావు—లక్ష్మీదేవికి అల్లుడు, బి ఏ.,
కేశవరావు— ,, కొడుకు, బి.ఏ.,బి. యల్.

౧

[స్థలం: మైలాపూరు: మేడయింటి క్రింది భాగంలో కచేరిసావిడి. గోడలకు ౨, ౩ రవివర్మ చిత్రపటాలు, కొన్నిఫొటోలు; సావిడి కిరుప్రక్కలా గదులు; ముందరిభాగంలో ముంగిలికి దగ్గరగా కూచుని సుభద్ర రాత్రి వంటకు బియ్యం మేరుతున్నది. ఇంకోప్రక్కన కమల గోడఆనుకొని 'పుల్లు' పనిచేస్తున్నది. పగలు 3 గంటలవేళ. సుభద్రకు ౧౮ యేండ్లుంటాయి. పసిమివన్నె మేను. మధురకలం కారీచీర కట్టుకున్నది. కమలకు ౧౬, ౧౭ యేండ్లుంటవి. కొంచెమించుమించుగా సుభద్ర మేనిచాయవంటిదే. ఆకుపచ్చని బనారసుచీర కట్టుకొన్నది. గావయల్సు జాకెట్టు. వేరువేరు పనుల్లో వీరు ఏకాగ్రచిత్తంతోటి వుండగా బయటనుంచి లక్ష్మీదేవి ప్రవేశిస్తూన్నది.]

లక్ష్మీదేవి

ఏమే—పిల్లా? బియ్యమెంతేరావు? (అని సమీపించి కోపంతో) ఇదేనా-ఇంతేనా నీవేరిందీ? నాలుగు శేరులైన లేవే? పొద్దుటి నుంచీ చేస్తూచేస్తూన్నావు.చూడబోతేయింత. చూచేవాళ్లకేమీ—అమ్మయ్యో! ఇంట్లోపనులన్నీ తానేచేస్తూన్నట్లుండవద్దూ.ఆకొంచెం కూడా యిప్పటికి కాకపోతే యింకెట్లా?ఇంట్లో వేరేపనులేమైనా వున్నవా? నడిరేయి వరకూ ఈవక్కపనేనా? అయ్యో! దిక్కుమాలిన దానా? నాకెక్కడ దాపరించావే!

[సుభద్ర మారుపలక్కుండా బియ్యం మేరుతున్నది. కండ్లు నిండుకడవలైనవి. ఒక్క చుక్కైనా కిందపడకుండా జాగ్రతచేసింది.]

కమల (పుల్లు కుట్టుతూనే)

అమ్మా! ఈమధ్య వదినెకు చూపు కూడ తగ్గినట్లుంది. మధ్యాన్నం పప్పులో ఎన్నిరాళ్లున్నాయనుకున్నావు. నోట్లో పెట్టుకో లేకపోయాను.

లక్ష్మీదేవి

మరేమంది? అదొక్కటే తక్కువనుకున్నాను. అన్ని అవలక్షణాలూ వున్న వన్న

మాంటే! దృష్టి తక్కువే? ఇంకకంళ్లకు అద్దాలు తగిలించుకుని కులకవద్దూ? అందుకే? కానీ యెవరు వద్దన్నారూ? అద్దాలు తగిలించుకుని మొగుడిచేయిపట్టుకుని 'యస్-ఫుస్' అని మాట్లాడుకుంటూ తిరుగుతుంది కాబోలు! కానీ, అయ్యేవన్నీ కానీ; ఇంట్లోపనిపాట లంటే—నాకెందుకమ్మా? ఏమైనా అన్నానా, నా పేరుచాటిస్తారు! నేనే చెడ్డదాన్ని, రాక్షసిని, వేపుకో తింటాను. పనిపాటలు చేస్తే చేతులు అరిగిపోవూ? నేనింతగా అరుస్తూ వున్నా యెట్లుందో చూడు!సిగ్గా, అభిమానమా! బెల్లం కొట్టినరాయి! సంగనాచి! ఇంట్లో మే మంటే లెక్కా? అయ్యయ్యో!పాడుచదువు! అందులోను రెండు ముక్కలు ఇంగ్లీసు చదివితే భూమీ ఆకాశాలు కనబడవు! ఇల్లూవద్దు, కాపరంవద్దు, పనిపాటలూవద్దు,మ రేమీవద్దు. మొగుడియెదుట కాళ్లు చాపుకుని కూచోని చదువుకో మంటే వల్లకాటిచదువు! —నాకెందుకమ్మా! దిక్కుమాలినసావాసం, పెద్దా, చిన్నా, మట్టూ, మర్యాదా లెంచుతారా? పగటివేళే మొగుడితో గుసగుసలు ముచ్చట్లు; అందరి యెదటే, పకపక నవ్వులూ! ఛీ జన్మం తగలబడా! సిగ్గుమాలిన—

కమల

అమ్మా, నేను మాత్ర మింగ్లీషు చదువుకోలేదా! నేనంత సిగ్గుమాలిన దాన్నైనానా ?

[అంతలో హ్యాట్, బూట్, సూట్, నెక్‌టై, కాలర్ తగిలించుకుని వసంతరావు ప్రవేశించును.]

వసంతరావు

ఓ, మై డియర్, హౌ డూ యూ డూ? (ఓహో! నా ప్రియురాలా నీవు ఎట్లా ఉన్నావు?)

కమల

ఎప్పు డీరావడం?

వసంతరావు

ఇప్పుడే. (అని ఆమె చేయిపట్టుకొని) నాకేమీ తోచటం లేదు. నీ విక్కడికివచ్చి నాలుగు రోజులైనవి కదా! ఒక్క జాబు రాయరాదా? నీవు దగ్గర లేకుంటే నిమిషంకూడా నాకు ఏమీ తోచదని నీకు తెలిసిందేకదా? పుట్టింటికి వెళితే మేము జ్ఞాపకంలో ఉండమని నేనంటూనే ఉంటాను. నీవు దగ్గర లేకపోవడం చేత నాకేమీ తోచకపోయె. పోనీ, జాబైనా వచ్చివుంటే కొంత నయంగా వుండేది. అదీ లేదు.

కమల, (సిగ్గుతో)

ఊళ్లోనే ఉత్తరా లేమిటి? అయిందంతా యెన్నాళ్లు ?

వసంతరావు

ఔను నీ కట్లనే వుంటుంది. ఎన్నాళ్లా? నాలుగు సంవత్సరాలు కాలేదు? ఊళ్లోనే వుత్తర మెందుకంట! అత్తగారూ, మీరే చెప్పండి; ఒక్కకార్డు రాస్తే తప్పా? మైలాపూరులో కమల. రాయపురంలో నేను. ఒక్క ఉత్తరం రాయకూడదా? న్యాయం మీరే చెప్పండి.

లక్ష్మీదేవి

అవునే అమ్మాయీ; రాసి ఉండరాదే? వీరికేమి తోచలేదట కాదా? రెండు ముక్కలు రాస్తే తప్పా? పోనీ నాకైనా తోచింది కాదు; రాయమనే ఉందును.

వసంతరావు

ఆతీర్పు నాపక్షమే అయింది. నీవు ఓడిపోయినావు. ఒప్పుకొంటావా?

కమల (మరింత సిగ్గుతో)

ఇదేమిటే అమ్మా? నీవూ అట్లాగే అంటావేమమ్మా? సరిగ్గా కోసైడైనా లేదు. వచ్చే పొయ్యే, ట్రాంలు, మోటార్లు, బస్సులు తలుచుకొన్నపుడెల్లా రావచ్చునుగదా.?

లక్ష్మీదేవి

ఔనులే రాయకపోవడం కూడా ఒక్కందుకు మంచిదే. అమ్మాయి ఉత్తరం రాసి ఉంటే ఇప్పుడు ఇక్కడికి వచ్చి ఉండేవారేనా? రాయకపోబట్టే ఎట్లాగో వచ్చారు. ఆఁ! ఇదేమిటి, నిలబడే? అమ్మాయీ! కూర్చోమనవేమే పిల్లా సుభద్రా, లోపల ఏమిచేస్తున్నావు? రాక రాక అల్లుడుగారు ఇంటికి వచ్చారుగదా? కుర్చీ తెచ్చిపెట్టాలని నీకు తోచలేదే? ఇంట్లో వాళ్లంటే నీకళ్లకు ఆగముగదా? వచ్చిన పెద్ద మనుషులు ఎక్కడ కూర్చుంటారు అనుకొన్నావు? అంత లక్ష్యంలేదేమే? ఎల్లకాలము ఒక్కటేదున్నపోతు స్వరూపమేనా? అయ్యో ఖర్మమా!

వసంతరావు

ఎందుకు? వద్దులెండి అత్తగారూ!

[సుభద్ర కుర్చీ తెచ్చిపెట్టి వెళ్లిపోవును.]

కమల

కూర్చుందురు (అని చెయ్యిపట్టుకొని చిరునవ్వుతో కూర్చోపెట్టును.)

వసంతరావు

వద్దు; కూర్చోటానికి నాకు తీరికలేదు త్వరగా వెళ్లాలె.

లక్ష్మీదేవి

అంత తొందర ఎందుకు? రాత్రికిక్కడ——

వసంతరావు

లేదు, అత్తగారూ——లేదు. చాలా తొందరపనిఉంది తప్పకుండా వెళ్లాలె. క్షమించండి మరొకప్పుడు——

కమల

వినకపోతే ఏంచేదాం? కప్పు టీఅయినా——

లక్ష్మీదేవి

(బిగ్గరగాఁ) సుభద్రా! ఏంచేస్తునావు? పొయ్యిఅయినా రాజేశావా? ఎందుకుచేస్తావు? తిండికి——(అనుకొంటూ వెళ్లిపోవును.)

వసంతరావు

(కమలను చెంతకు లాక్కొని బుజ్జగిస్తూ) నీవు ఎప్పుడు వస్తావు కమలా? ఈ నాలుగురోజులు నాలుగు యుగాలవలె తోచింది. కోర్టులోనుంచి యింటికి పోవడంతోటే ఏమో ఇల్లంతా బావురుమంటుంటుంది. బీచ్కుపోదామంటే రాణీగారులేనిదే పోవడానికి బుద్ధిపుట్టదు. ఏదైనా చదువుకుందామంటే

తోచడు. ఆఁ! చెప్ప మర్చాను; విల్సన్ దొర గారు ఇంగ్లండు వెళ్లుతున్నాడు. మోటారు సైకిలు అమ్ముతాడట; దానికి సైడ్ కారు ఉంది; కొనుక్కుందా మనుకొన్నాను. ఇష్ట మేనా? నేను సైకిల్ మీదా, రాణీగారు సయిడ్ కారులో! రోజూ బీచికి, ఇష్టంవచ్చినచోట్లకి రాణీ సాహేబాగారు షికార్లు చేస్తుంటారు కాబోలు! (బిగ్గరగా నవ్వుతాడు)

[వారిద్దరు భావి సుఖానందంలో మునిగి ఉంటారు. కమల ముసిముసినవ్వుతో మొగుడిపక్కన నిలిచివుంటుంది.]

[సుభద్ర ఫలాహారంపళ్లెం ఒకచేత, టీకప్పు రెండోచేత పట్టుకొనివచ్చి వీళ్లదగ్గర బల్ల మీదపెట్టి వెళ్లిపోవును.]

వసంతరావు. (ఫలాహారం పుచ్చుకుంటూ)

ఊఁ, కానీ, కమలా, నీవుకూడా కానీ, సిగ్గెందుకూ?

కమల

కానీండి, నేను తర్వాత పుచ్చుకుంటాను.

వసంతరావు

ఇంక తర్వాత యేమిటి? ఇంతెవరు తినాలెనని! కానీ, కానీ, ఇదుగో!

(అంటూ ఆమెను దగ్గరికి లాక్కొని ఒక్కముక్క నోట్లో తురుముతాడు.)

[కమల సిగ్గుపడుతుంది.]

లక్ష్మీదేవి

(తనలోనే నవ్వుకొంటూ) తీసుకోరాదే అమ్మాయీ; అంతప్రేమతో ఇస్తూవుంటే వద్దనడ మేమిటి?

కమల (సిగ్గుతో చిరునవ్వు నవ్వుతూ)

నీవూ తగిందానవే నమ్మా! ఎక్కడెట్లా వుండాలెనో—

వసంతరావు (నవ్వుతూ)

నాకు తెలీదు కాదూ? నీపుట్టిల్లేగా; ఎదట ఉన్నది మీ అమ్మేగా! మరి—

లక్ష్మీదేవి

అవును, తప్పేముంది? సంతోషించే వాళ్ళమే కాని, దుఃఖపడేవాళ్ళం కాము కదా!

కమల

అయితే మాత్రం? నీవూ వీరికి తగినట్టే మాట్లాడితే—

వసంతరావు

నిజం పలకడాని కెవరైతే నేమి? అత్త గారు నిజమే పలికారు గాని, నీకింత—

లక్ష్మీదేవి

పిల్లా, సుభద్రా—అబ్బా! పిలిచిపిలిచి నానోరు నొప్పెత్తడమే కాని, మరేమీ లాభం లేదు. ఎక్కడుంటుందో?—సుభద్రా

[సుభద్ర వచ్చి, తలవాల్చుకుని నిలబడుతుంది]

లక్ష్మీదేవి (కోపంతో)

తలవంచుకుని నిలబడ్డానికి కాదు నిన్ను నేనుపిలిచింది. చేతులు కడుక్కోవడానికినీళ్లూ, తుడుచుకోవడానికి తువాలూ, తెచ్చిపెట్టు. మొద్దుస్వరూపమా!

[సుభద్ర లోపలికి పోయి నీళ్లూ తువాలూ తెచ్చిపెట్టి వెళ్లబోతూన్నది.]

కమలవదినా, తాంబూలం తయారైందా?

వసంతరావు

వదినకు చెప్పక పోతే నీవే తయారు చేయ రాదూ?

లక్ష్మీదేవి

అక్కర లేదు. ఆకులకు సున్నం రాచి పెట్టింది.

[సుభద్ర తాంబూలపుపళ్లెం తెచ్చిపెట్టి వెళ్లును]

[కమల ఆకులుచుట్టి 'కిల్లీ' కట్టి వసంతరావు నోట్లో పెట్టును.]

వసంతరావు: (లేచి)

ఇంక శలవండీ, కమలాబాయి రాణీసాహేబా, జ్ఞాపకంవుంచండీ; దయవుంచండి. త్వరలోనే యింటికి వస్తారు కాదూ? అత్తగారూ, నాలుగైదు రోజుల్లో కమలను పంపించండి. అవిడ యింట్లో లేకపోతే నాకొక్క గడియ కూడా యెట్లాగో వుంటుంది.

లక్ష్మీదేవి

పంపడ మేమిటి? వచ్చి, యిక్కడ రెండు రోజులుండి, తీసికెళ్ళండి. ఔను, లేండి. మేము పిలవడమే కాని, బీదవాళ్ళింటికి వస్తారా?

వసంతరావు

అత్తగారూ, అట్లాంటా రేమిటి? రాక పోవడ మేమీ? రాలేదా?

లక్ష్మీదేవి

దానికేమి లేండి. వచ్చి నిలబడ్డట్టే వెళ్ళి పోవడమేగా?

వసంతరావు

ఈమారు తప్పక రెండు రోజులే కాదు; పదిరోజులుంటా లేండి. మైడియర్, కమల్, గుడ్‌నైట్!

(నిష్క్రమించును)

[మా వాత్సల్యంతో మా ఆనందంతో బిడ్డను కౌగిలించి, ముఖంనిమిరి, చుబుకం ఒత్తుతూ]

లక్ష్మీదేవి

మా అమ్మకు దిష్టితీయాలె! భార్యాభర్తలు ప్రేమఅంటే ఇదే! అదృష్టమంటే మాచిట్టితల్లి దే! కాకుంటే——వుందిగా, అన్నిటికీ దిక్కుమాలింది!

[అని, ఆనందబాష్పాలతో బిడ్డను ముద్దుడుకుని, దృష్టితీసును; కమల సిగ్గుతో, పట్టరాని ఆనందంతో తల్లి కౌగిట్లో అణిగివుంటుంది.]

(తెరపడుతుంది)

౨

[స్థలం మైలాపూరు; లక్ష్మీదేవమ్మగారి యిల్లు; వంటయింటిదగ్గర పంచపాళి; నాలుగు గంటలవేళ; ఇరుగూపొరుగిండ్లస్త్రీలురత్తమ్మా, జానకమ్మా కూచునుందురు. కమలా లక్ష్మీదేవమ్మలూ మాట్లాతూ వుంటూరు. ఆదగ్గరగానే సుభద్ర నూతిదగ్గర బట్టలుతికి ఆరవేస్తూ వుంటుంది.]

లక్ష్మీదేవి

రత్తమ్మ వదినే, నిజం చెప్పుతున్నాను. గర్వంఅనుకో, మరేమైనా, అనుకో, మన కమలా అంటే ప్రాణమిస్తాడు వసంతరావు. ఒక్క నిమిషం కనబడకపోతే యేమో లోకమంతా

పాడుపడ్డట్లే వుంటుందట; ఔను, ఎందుకుండ దంటా! నాతల్లి అటువంటిదే! బుద్ధిమంతు రాలే! అంత ప్రేమకూ తగ్గదే!

రత్తమ్మ

నిజమే; మీకమల మంచి చక్కంది కూడాను; సుకుమారి, మల్లెమొగ్గ! ఇదుగో, జానకక్కా,కమలకు ఇంగ్రీసూ వస్తుందంటా! మరి బుఱ్ఱయి వుందనుకున్నావా? ఏమాత్ర మైన అహంభావంవుందా! చూడు, యిప్పటి ఇతరపిల్లలను; మొగుడూపెళ్ళాం 'యిస్సూ, ఫస్సూ' అనుకుంటూ ఎరికలభాషవలె మాట్లా డుతుంటే మా కేంతెలుస్తుంది?

కమల (మిక్కిలి సిగ్గుతో) ఇదేమత్తా, యిట్లాంటావు?

జానకమ్మ

నీవు ఇంగ్రీసు మాట్లాడవూ?

లక్ష్మీదేవి

మాట్లాడకేమీ? అన్నీ ఇంగ్రీసే! మొన్ననే బలేతమాషాగావుంది. అల్లుడుగారు ఇంటికివచ్చారు. రావడంతోటే 'మైడియర్ కమల్! డియర్ కమల్' అంటూనేవచ్చాడు. వచ్చాడు; దొరలూ దొరసాలూ చేస్తారు— ఆవిధంగా చేతులూ చేతులూకలుపుకున్నారు. దాని కేమంటారమ్మాయీ? ఆఁ, 'షేక్యాండ్' కాదూ!

ఆహాహా!ఏమో, ఆతెల్లవాళ్లు మాట్లాడి నట్లే గుసగుసలు సాగించారు. చూడగా నా కెంతో కౌతుకంగా వుంది.

కమల (సిగ్గుతో) ఏమిటమ్మా!

రత్తమ్మ

ఓసిపిల్లా, నీమాటేనా? నీవొక్కదానవే అయితే అబ్బురం. లోకమంతా యిట్లాగే వుంది. మాలలిత వుందిగా, అదీ యింతే; మొగుడూ పెళ్లాం కలిసి చేతుల్లో చేతులువేసు కుని సాయంత్రంపూట షికార్లు వెడుతారు. రోడ్డులో యెందరో వస్తూ పోతూ వుంటారు కదా! ఆచేయీచేయీకలుపుకోకపోతేయేం?

జానకమ్మ

అయ్యో! దానికేమిలే. మీ లలిత కేమి? చాల మంచిసంబంధమే దొరికింది. మొగుడు చక్కనివాడూ, చదువుకొన్న వాడూ, కల వాడూ; పెళ్లాన్ని మల్లెమొగ్గలాగ చూసు కుంటూ వుంటాడు.

లక్ష్మీదేవి

అట్లాగా? మాకమలకూ యెందులోనూ లోటులేదు. సుమండీ? ఎవడోదొరమోటార్ సైకిల్ కొనమన్నాడట. రేపోమాపో కొంటా డు. ఇప్పటికి కొనేవున్నాడేమో?అది తెలీలేదు. అల్లుడు సైకిల్‌మీదా ఆయనదొరసానిగారూ మరిచా-రాణీ సాహేబాగారు—మాఅల్లుడు అమ్మాయిని అట్లనే పిలుస్తాడు సుమండీ—! పక్కన కుర్చీమీదా! మరేం? రోజుకు ఒక్క సారైనా యిక్కడికి వస్తూవుంటారు. కాదే, తల్లీ!

జానకమ్మ

ఏమోనమ్మా, ఈషికార్లపిచ్చి అందరికీ బాగానే పట్టింది. మాసరస్వతీ రోజూ షికా ర్లు తప్పదుకదా. ఇంకో విశేషం. స్వంతంగా

బగ్గీబండి వుందికదా! మొగుడుపక్కనతమాషా చూస్తూ కూర్చొని వుంటాడాయె. మన సరస్వతీ గుర్రాన్ని లగాంలుపట్టి తోల్తుంది. బహు బాగా బండితోల్తుంది.

కమల

నేనూ తోలగలను. అందులోనేముంది? బ్రహ్మవిద్యా?

లక్ష్మీదేవి

ఔను. రెండురోజుల అలవాటు!

[జానకమ్మా, రత్నమ్మా లేతురు]

లక్ష్మీదేవి

పిల్లా, మహాలక్ష్మీ, (ఎగతాళిగా) కుంకం బరిణె తీసుకరా.

[సుభద్ర కుంకుమపు బరిణెతెచ్చి అందరి నొస్టా పెట్టితానూ పెట్టుకుంటుంది.]

[అందరు సుభద్రనుచూచి పరిహాసంగా నవ్వుకుంటూ వెళ్లిపోతారు.]

సుభద్ర (తనలో)

ఎవ్వ రెంతచేస్తేమాత్రమేమి? నా ఆరాధ్య దేవత ప్రసన్న ముఖంతో వుంటే అదే నాకు పదివేలు. ఇటువంటి కష్టా లెన్నైనా భరించగలను.

(తెరపడుతుంది)

3

[స్థలం, మైలాపూరు, లక్ష్మీదేవమ్మ ఇల్లు. చావడి; లక్ష్మీదేవమ్మ దీపారాధనకు వత్తులు చేస్తూన్నది. కమలందగ్గరనే కూచోని వుల్లు పని చేస్తూవుంటుంది. సుభద్ర గోధుమలు విసురుతూ వుంటుంది. సాయంత్రం ౬ గంటలు.

లక్ష్మీదేవి (కమలతో)

నీవుచూడబోతే లలితను మొగుడు కొట్టి కొట్టి చంపుతున్నాడంటావు ఆతల్లి చూడబోతే 'మాతల్లికి చాలామంచిచోటు దొరికిం'దని ఉబ్బుతూవున్నది. కొంచెముంటె కొండంతలుచేయడం ఆమె కలవాటే. నాచిట్టితల్లిని గురించి నేను మాట్లాడటంతోటే తానూ తనబిడ్డను నాబిడ్డతోపోల్చింది.నాతల్లినిగురించి నేనన్నమాటలువిని ఓర్వలేకపోయింది పాపం.

కమల

అంతేనా? మన జానకమ్మగారి సరస్వతి నంట, ఆవిడ ఆడబిడ్డా, అత్తా, కలిసి బాగా తన్నారట. కొరివితో కాలుస్తామని కొరివి తెచ్చారట.

లక్ష్మీదేవి

చచ్చినవాళ్ళ చేతులైనా పడిపోవూ? కోడలిని కొట్టడానికి వాళ్ళకు చేతు లెట్లా వస్తాయో! వాళ్ళు నరజన్మమెత్తలేదూ? ఛీఛీ! నాకవన్నీ లేవమ్మ! కోడలిని కన్నబిడ్డకంటే ఘనంగా చూచుకోవడమే నాకిష్టం. అందుకే నీఅత్త నామనసుకెక్కింది. ఆహా ఏమాప్రేమ? కొడుకేమి చేసినాసరే! ఆమెకు సంతోషమే; సమ్మతమే.

అత్త సరస్వతిని కొట్టిందిగా? కొట్టివుంటుంది. ఏంచేసిందో ఆపిల్ల. వద్దన్న పనిచేస్తే పెద్దవాళ్లు కొట్టారా, వూడ్చిపెట్టారా? పోసీలే మనకెందుకు? ఒకళ్లనొకరు వృథాగాకొట్టరు. అయినా ఆజానకమ్మ చెడ్డబడాయిఖోరులెద్దు! నాబిడ్డ మంచినిగూర్చి చెప్పినప్పుడు వాళ్లచె

వులు తూట్లుపడతాయేమో! అనుకోవద్దు మరి మనమంతా తనబిడ్డకూడా చాలమంచిదని!

(సుభద్రనుచూచి, కోపంతో)

ఏమేపిల్లా! ఈరోజంతా విసరుతూ వుంటావా? ఛీఛీ! నీబతుకు తగలబడా! ఏపనిచెప్పినా ఇంతేనా! ఏమావిసరడం?- నాబొంది నీతల! చేతకాకపోతే చేతకాదని యేడవరాదూ? చేసుకుంటానుగా నేనే! ఇంక నా కీరాత్రి ఫలారం లేదన్నమాటే! పెళ్ళివిందు తద్దినం నాటికైనా అయ్యేటట్లులేదే!

సుభద్ర

అయింది.

లక్ష్మీదేవి

అయింది! ఏమయింది? నడిరేయి! నా తలకాయి, నీబొంద! మాట కింద బడనీయవు కదా! నేను నోరెత్తితే వెంటనే మారు పలికావె! ఊరుకుంటే నీముల్లె పాడై పోదూ! మాట మాటకూ బదులు చెప్పితేనేకాని స్వారస్యంగా వుండదు. మరి జాణతనమంతా మాటకుమాట జవాబిస్తూ అత్తగారి కన్ను పొడవద్దూ మరి?

(ఇంతలో కేశవరావు కోర్టులో నుంచి యింటికి వచ్చి డ్రెస్సు తీస్తూ వున్నాడు)

కేశవరావు

అమ్మా, యివ్వేళ చెడ్డ దాహమేస్తూ వున్నది. టీచేస్తానా?

లక్ష్మీదేవి

నన్నెందు కడుగుతావు,నాయనా! ఉన్నదిగా నీపట్టపురాణి—మాప్రేమతో టీకాచి పెట్టేది? ఆవిడకు టీచేయాలెనని తెలీదా? మేము చేస్తే నీకు రుచికరంగా వుండదేమో!

కేశవరావు

ఎవ్వరైనా చేయండి. చెడ్డ దాహంవేస్తూ వున్నది.

[సుభద్ర లేచి వంట యింట్లోకిపోయి టీ కాచుతూ వున్నది.]

లక్ష్మీదేవి (వెంటనేపోయి)

(బిగ్గరగా) ఆహాహా! ఎంత ప్రేమగల భార్యవే! మొగుడంటే యెంత ప్రేమా? యెంత శ్రద్ధా? ఇంక వాడనుకోవద్దూ-ఇంట్లో నాభార్యకంటే నాకెవరు దిక్కులేదని! మాకూ నీయంత కాకపోయినా కొంచెమైనా శ్రద్ధవుందిలే. వగలమారిని బయలుదేరావు మొగుడి యెదుట టీ చేయడానికి—

కేశవరావు

నీవే కాదామ్మా, చేయమన్నావు! మళ్ళీ పూరికే కోప్పడతా వెందుకూ?

లక్ష్మీబాయి

ఔ నయ్యా, అవును; నేనే పూరికే వృథాగా కోప్పడతాను;పీడిస్తాను; తిండి పెట్టడం లేదు; ఏమీ లేదు. అది గాలితినే జీవిస్తూ వుంది. ఇంతగా బలుస్తూ వున్నది. ఇంక తల్లి యెందుకు నాయనా, నీకు? తల్లి అంటే నీకిప్పుడు గిట్టకొచ్చింది ఇంట్లో దాసీదానైనాను. పెళ్ళామే—

కేశవరావు

అమ్మా, నిన్నిప్పుడేమన్నానని యింత కోపం?

లక్ష్మీదేవి

ఔను, మళ్ళీ ఆమాటే! ఊరికూరికే కోప్పడతాను. నాకు ప్రేమా లేదు. నాకు మద మెక్కింది. ఏం చేస్తాము నాయనా! నీకు తల్లి అంటే గిట్టక పోయింది. పెళ్ళాన్ని వెంట వేసుకొని అనరాని మాటలన్నీ అంటు న్నావు. దానికి అలుసిచ్చావు! ఇంకా నయం! నన్ను నీవు కొట్టడంమాత్రం లేదు. ఇంక రెణ్ణాళ్లుపోతే అంతా అవుతుంది. తల్లి చస్తే మేలనిపిస్తూన్నది నీకు. నీకు పెళ్లామే యెక్కు వయింది! దానిబోధనలే నిన్నింత చేసింది. మరి చిన్నప్పటినుంచీ నిన్ను పెంచకపోయిందీ? నీ కష్టసుఖాలకూ పనికిరాకపోయిందీ? ఔను; మరి నీకదే స్వర్గమయింది! అదే వైకుం ఠమయింది! ఇంక మేమెందుకు? కూలికి పొట్ట పోసుకొనేవాళ్ళం; ఇంట్లో చాకిరిచేస్తామేమో! కూడు తింటామేమో!

[సుభద్ర టీ, ఫలాహారం తెచ్చి కింద బెట్ట డానికి వంగుతుంది. చేతిలోనిది కేశవరావు అందుకుని ఆమెనుచూచి చిరునవ్వు నవ్వు తాడు. ఆమే అట్లనే చిరునవ్వునవ్వి వెళ్ళిపో తుంది. అదిచూచి]

లక్ష్మీదేవి

నవ్వండి నవ్వండి ఆనవ్వేమిటో బాగా నవ్వరాదూ? అణచడమెందుకు? ఈపిచ్చి దానివాగుడు మీకు నవ్వుపుట్టించదూ? మరీ లజ్జ, అభిమానమా, సిగ్గా, భయమా? ఏముంది మరీ? ఇంట్లో పెద్దా పిన్నా, భయమా భక్త్యా? ఉన్నామాత్రం, జమా, కర్చా? పెద్దల కళ్లు పోయినవి. మరీ! ఛీఛీ! సిగ్గుమాలిన బతుకు; దానికి లేకపోయినా నీకైనావుండవద్దూ లోకం యేమనుకుంటారోఅని! నీకుమాత్రమెందుకుం టుంది? దానిచేతిలోని తోలుబొమ్మ! ఇంత భ్రష్టమా! భగవంతుడా, ఇంతకంటే భ్రష్టం నేను చూడకముందే నన్నెత్తుకో పోరాదా! వీళ్ళని-సిగ్గూ ఎగ్గూలేని వీళ్ళనిద్దర్నే-వదలిపో దునే! నేను చూడలేను, నాయనా, ఈఅనా చారం, నేను చూడలేను తండ్రీ!

(అని యేడుస్తుంది)

కమల

ఎందుకమ్మా! నీవేడవడం? నీకింత కష్టంగా, దుఃఖంగా వుందిగాని, అన్నయ్య కేమాత్రమైనా.

కేశవరావు

కమలా, నీనాలుకకూడా చురచుర లాడు తోన్నట్లుందే.

(అని 'టీ' తాగి వెళ్ళిపోతాడు)

లక్ష్మీదేవి

అవునమ్మా! అవును, నేను నాబిడ్డ దుర్మా ర్గులం! రాక్షసులం; పెళ్ళాంమాత్రం దేవత! అయ్యో! ఏమ్మందుపెట్టిందో; తలకేమి నూ రిందో? అయ్యో! నాబిడ్డడు మునుపిట్లా వుండ లేదే! నాకన్నతండ్రి మాయలమారి చేతులో చిక్కిపోయినాడే! మందులమారి వలలో పడి పోయినాడే? అయ్యో! కర్మమా! ఇంకేమి అవుతుందోకదా! ఇంతకూ మనకర్మం; ఇటు వంటిది ఎవరేమిచేస్తారు?

కమల

నిజమేనమ్మా, నిజమే.

[లక్ష్మీదేవి, కమల సుభద్రను తిట్టుతూ వుంటారు. తెరపడుతుంది.]

౪

[స్థలం లక్ష్మీదేవమ్మగారి యిల్లు. వంటయింటి ముంగిట పంచపాళి. ప్రవేశం: లక్ష్మీదేవమ్మ రత్తమ్మ, జానకమ్మ; లోకాభిరామాయణంతో కాలక్షేపం చేస్తూ వుంటారు. కమల కొత్తగావచ్చిన 'భారతి' చదువుతూ వుంటుంది. సుభద్ర అంట్లకప్పెలాలూ, గిన్నెలూ తోలుస్తూ వుంటుంది. సాయంత్రం ౪ గంటలవేళ)

లక్ష్మీదేవి (విసుక్కుంటుంది)

అబ్బబ్బబ్బా! ఏమికాలమోగాని వదినా, యిప్పటివాళ్లు సిగ్గూ బిడియమూ వదిలేశారు కదా! ఏకోశానైనా పెద్దా చిన్నా అన్న పరువూ మర్యాదా వున్నదా! ఇదితగును, ఇది తగదు. అన్నజ్ఞానం వున్నదా! ఛీ ఛీ! ఏం పాపకర్మమో!

రత్తమ్మ

ఇంతగా విసుక్కోవడాని కేమయింది వదినా?

లక్ష్మీదేవి

అయిందేముందీ? నాతలకాయ! నాబొంద! సిగ్గుంచేటు! మావాడికోసం చిన్నప్పటినుంచీ నేనెన్ని పాట్లుపడ్డానో నీకూ తెలుసును. కాని వాడి కేందుకుంటుంది ఆమాత్రం జ్ఞానం? పెళ్లామే పెద్దదేవత అయింది నేనంటే గిట్ట కొచ్చిందమ్మా! దాసీదాన్ని చూచినట్లే! ఇన్నాళ్లూ యింటికి రావడంతోటే అమ్మా, అమ్మా, అమ్మా అంటూ నేవచ్చేవాడా! ఇప్పుడమ్మామేమయిందో? నోటినిండా అమ్మా అని పిలవనేపిలవడాయె; కోర్టునుంచి రావడం ఆలస్యం. పెదవులనిండే చిరునవ్వు-ఓరచూపులు-ఏంకావాలె నన్నా తానే ముందుగా పోతుంది. ఆహాస్యాలూ, ఆనవ్వులూ, అయ్యో ఆ అనాచారం - ఆసిగ్గుమాలినతనం - నేను చూడలేనమ్మా! ఏమని చెప్పకో మన్నావు? సిగ్గుమాలిన బ్రతుకు? (అని యేడుస్తుంది.)

రత్తమ్మ

వదినా, యేడిస్తే యేంవొచ్చింది? నీకోడలైనా అంత దుర్మార్గురాలు కాదే; ఎంతో సాధువుగా వుంటుందే. లక్ష్మీదేవి

(విసుగుతో - కోపంతో నెటికలు విరుస్తూ) చచ్చినపీనుగు! సాధువుతనం కాలిపోనూ! గోముఖవ్యాఘ్రం అంటారే-ఆమాట దీనికే సరిపోతుంది! వాడు మొదటినుంచీ యీ మోస్తరుగానే వుంటే నాకింత విచారం వుండేదికాదు. ఈమధ్యనే వచ్చింది వాడికీ చేటుకాలం! ఏమని పెద్దమ్మయింట్లో కాలుపెట్టిందో అప్పటినుంచే పుట్టింది వీనికి! అమ్మా వద్దూ, తోడూవద్దూ, ఎవరూవద్దు. పెళ్లామో పరబ్రహ్మమో అనుకున్నాడు; స్వర్గలోకమో యింద్రలోకమో అనుకున్నాడు. పోనీ, తల్లీ వద్దూ-తోడూవద్దూ-లోకాని కైనా వెరవ్వాలెనా? అదీలేదు. నేను చూడలేనమ్మా! నా కండ్లయెదటనే వాళ్ల గుసగుసలూ, నవ్వులూ పకపకలూ! ఛీ!—— నేను కండ్లుమూసుకున్న తరువాత యింకేముంది? వాళ్లయిష్టమేఇష్టం.

జానకమ్మ

అయ్యో! ఇది కాలమహిమ కలికాలం ఒక్క మీవాడే అనుకొని తపిస్తున్నావు,

కాని, యెక్కడ చూడబోయినా యిదేగతి. ఎవరింట్లోనూ నింతే. మావాడు చూడరాదూ? ఏ మాభోజనానికి కాస్తసేపు వంటింట్లోకి రానిస్తాడో తక్కిన వేళంతా గదిలోనే! ఏమాలోచనలో; ఏ ముచ్చట్లో ఏమో! వాళ్ళకే తెలియాలె; భగవంతుడికే తెలియాలె! ఇంట్లో పనిపాటలు ముట్టుకోడు కదా! ఇక్కడి చెంబుతీసి అక్కడ పెట్టడుకదా! ఎప్పుడు చూసినా చేతిలో పుస్తకం! ఆ పుస్తకాలు కాలిపోనూ! నేనేమైనా అన్నానా 'మాసుఖం నీవు చూడలేవా, ఓర్చలేవా, కళ్లు కుట్టినాయూ' అంటాడు. 'నీకూతురు ఏం చేసినా నీకు బాగా వుంటుంది. మేము మాట్లాడినా చురచురలాడు తూంటావు' అంటాడు. ఏం చేదును? నోరు మూసుకుని కళ్లువిప్పికొని అన్నీ చూస్తూ వుంటాను.

రత్తమ్మ

అయ్యో! నే నేమని చెప్పకోనూ? మా వాడో? మీవాళ్లింకా నయం. మావాడు సదా సర్వదా ముచ్చట్లు, పైగా అదురూ బెదురూ, లోకలజ్జా పెద్దాపిన్నా పరువూ మరియాదా యేముందీ! 'మణీ మణీ' అంటూ వెంట వెంటనే వుంటాడు. ఈకాలం వాళ్ళకు ఇదో పెద్దరోగం; పెళ్లాన్ని పేరుతో పిలవడమే! మేమెరుగ మమ్మా! ఇంకా కొన్నాళ్లు గడిస్తే పెళ్లాలూ మొగుళ్ళను పేర్లతోనే పలుస్తారేమో! మన కాలంలో మంచికి తలుపుదగ్గర పేరు చెప్పమంటే సిగ్గుతోచచ్చి సున్నమయ్యే వాళ్లం. ఇప్పుడదంతా యేమీ లేదు. ఏమైనా నేనంటే 'మనిషికి పేరెందుకు పెట్టాలె? అందరూ పిలిస్తే తప్పలేదు. నేను పిలిస్తే మాత్రం తప్పా! కట్టిపెట్టు పూర్వాచారం, నీచాదస్తం నీసణుగుడు' అంటాడు. ఇంకా నేను నోరు తెరవడమే! దుఃఖించి యేంలాభం? అనుభవించాలె తప్పదు.

లక్ష్మీదేవి

అదుగో, చూడు అన్నిపనులూ తానే చేస్తున్నది. పాపం అని మీరనుకోవద్దూ! నంగనాచిలాగ అంట్లు తోలుస్తూవుంది. వగలమారి! ఏమీ యెరగదు. మొగుణ్ణి వేలికొనమీద ఆడిస్తుంది! పూర్వం మానాయన ఇట్ల వుండేవాడే కాదు. మీరెరుగరూ? ఇప్పుడు బొత్తిగ మారిపోయినాడు. తలకు ఏంపోసి నూరిందో? చెవుల్లో యేమేమి బోధిస్తూ వున్నదో! దృష్టితీయాలె మొహానికి! ఎంతైనా ఆడదానికింత బడాయి తగదు. మాట్లాడదు, ముచ్చ! మూగి—.

కమల

నిన్నచూడలేదు అమ్మా. అన్నయ్య రావడంతోటే ఫలాహారపళ్లెం చేతపట్టుకుని యెదట ధైమని నిలబడ్డదీ? నేనున్నాను కదా, యివ్వనూ? తానే యియ్యాలె కాబోలు! నాకెందుకమ్మా! ఏమైన అన్నానా! 'నాలుక చురచుర లాడసాగిందే' అంటాడు. రెణ్ణాళ్లుండి పోయేదాన్ని. అమ్మ వున్నంతవరకే నాకు పుట్టిల్లు. (కంట నీరువిడుస్తుంది)

లక్ష్మీదేవి

నాచిట్టితల్లీ, నాఅమ్మా, బెంగపెట్టుకోకే తల్లీ! వాడినాలుక చీలిపోనూ! నిన్ను అంతమాటన్నాడమ్మా! పోనీలే, అంటే అన్నాడులే!

నన్నే లెక్కచేయనివాడు, నిన్ను లెక్కపెడ్తా
డా? పోసిందిబలంగా! బాగా వాడికితల కెక్కిం
ది! నాకర్మం; ఎవరేంచేస్తారు? నేనున్నంతవర
కూనీకేమీతక్కువ కానీనులేఅమ్మా! బంగా
రంవంటి మొగుడు చిక్కాడునీకు; అరచేత
పెట్టుకున్నాడు; మల్లెమొగ్గలాగ చూస్తున్నా
డునిన్ను; అదేచాలును. వీళ్ళయిల్లుకాలా!
వీళ్ళయింటికి నీవు రాకపోతే మాత్ర మేమి?
అన్నవాళ్లు అనుభవిస్తున్నారులే! వీడితప్పు
కాదు. అంతా యీపెద్దమ్మ చేస్తూవుంది.

జానకమ్మ

అయ్యో! వదినా వగచియేంలాభం? అం
దరి యిండ్లలోనూ ఇంతే; ఇది కలికాలం. మన
కాలం అయిపోయింది! చెప్పుకోబోతే ఎన్నో
వున్నవి. ఎందుకు? కడుపు చీల్చుకుంటే కాళ్ల
మీద పడుతుంది. ఇంక మనంఅన్నీ—యింటి
పెత్తనాలన్నీ—వాళ్ళకేవదలేసి, రామాకృష్ణా
గోవిందా అనుకుంటూ ఏదో, చేతనైనంత
దానధర్మాలుచేస్తూ భగవంతుణ్ణిసేవిస్తూ వుండ
వలసిందే. కాలం మారిపోయింది. కలికాలం!

రత్తమ్మ

అంతే అట్లాగని కళ్ళుమూసికుని వుండా
లసిందే. అదీ లాభం లేదు.

చాలాపొద్దుపోయింది ఇండ్లకు వెళదాం.

[సుభద్ర కుంకుమతెచ్చి వీళ్ళనొస్ట బొట్టు
పెడుతుంది.]

జానకమ్మా, రత్తమ్మా

(సుభద్రను) శెలవండీ దొరసానిగారూ!.

(అని వెళ్ళిపోతారు)

సుభద్ర (తనలో)

ఎవరెంతతిట్టితే నేమి? ఎన్నికష్టాలు
పెడితేమాత్ర మేమి? ఒక్కరుమాత్రం నావంక
చిన్నచూపు చూడకుండా వుంటేచాలు; ఆ
వక్క చిరునవ్వులోనే నాకు పరమానందం
కలుగుతుంది. ఇంకా యీలాంటి చిత్రాలు
వందలుజరిగినా చూస్తూ వోరుస్తాను.

భగవంతుడా! నీవే నాకు దిక్కు.

(నమస్కరిస్తుంది)

[తెరపడుతుంది]






వారణాసి వేంకట నరసింహ శాస్త్రి గారు

పండితపుత్త్రుఁ డంచు ననుఁ బల్కెదు రందఱు విద్య నాకు రా
కుండినమాత్ర మేమి? యశమున్నది పొమ్మనెదోరి, నీవు నీ
పిండము నీకుఁ దత్పదవివేకము చాలదు చాలెనేని యి
ట్లుండుదొ? ఉండఁగాఁగలవొకో? తుదకిట్టిఁడవైతి వేమనన్?

ఉ. పండితుఁడన్న నేమొ? మఱి పండితపుత్త్రుఁ డటన్న నేమొ?
యాఱెండింటికిం బ్రభేదము నెఱింగెడి నంతటిశక్తికూడ నీ
కుండమి సంభవించె నోహోహో గ్రహచార మభాగ్యదేవతా
తాండవభూమి యయ్యెనుగదా! భవదీయశిరంబు డింభకా!

ఉ. పండితపుత్త్రుఁ డంచనెడివారలు నీకడఁ బెద్దపాండితీ
శౌండిమ మున్నదంచు భ్రమసంపదఁ బిల్చెద రంచు జిత్తమం
దుండినదేమొ? కాని వెడమూహసుమీ యది సత్యమంచు నీ
వుండకు నిన్ను వారు మదిలో గ్రహియించిరి వెఱ్ఱిపప్పగాన్.

ఉ. శ్రీవరుపాదపంకరుహసేవ నశేషవిశేషహృద్యవిద్యావ్ర
తులైన యాధునికు లందఱకుం గురువర్యులైనవా
రో వెడగా! త్వదుత్తమకులోద్భవులే, మఱి వారు శారదా
దేవికి నాదపీఠమను తేకువ దెచ్చిరిసూ కులాసకున్.

శా. సాక్షాద్వ్యాసుఁడు నీపితామహుఁడు శశ్వత్కీర్తియుక్తుండు ముక్
ప్రేక్షాశాలురు మెచ్చ గ్రంథచయముల్ నిర్మించియున్నాఁడు నీ
వీక్షింపఁగలవాఁడవంచు మదిలో నెంతేని మోదించి త
ద్వీక్షాభారము పూనవేమి, రుచిలేదే గ్రంథముల్ చూడఁగాన్?

ఆ, తాతయెంతవాఁడొ? తండ్రియెంతటివాఁడొ? నీదుకులమునందు నెగడుపూ
పురుషు లెంతవారొ? బంత్తిగాఁబరికింప, వెఱ్ఱి వెంతవాఁడవైతి వహహా!

ఉ. ఆతతకీర్తిశాలిగద రా! భవదీయ పితృవ్యుఁ డల్లవి
ద్యాతరుణీస్వతంత్రుఁడుగదా! తలపోయఁగ నీదుతండ్రి వి
ఖ్యాతిసమగ్రు లందఱుగదా! వచియింపఁగనేల పెక్కు ము
త్తాతలనాఁటినుండి విబుధప్రవరుల్ భవదీయవంశజుల్.

ఆ. నిన్నుఁ జూచి నేఁటికెన్నేఁడులో యయ్యె; కాని మీఁదు కుశల మేరు దఱుచు,
తెలిసికొనుచునుంటిఁ దెలుపఁగల్గినవారు, తారసించినపుడు తప్పకుండ.

గీ. మహితమాణిక్యములవంటి మంచిపుస్తకంబులెన్నెన్నొ మీయింటఁ గలవు గనెదె?
చెదపురుంగులుకొన్నింటిఁ జెఱిచెననుచు, వింటి నీమగ్న గుండెలు వ్రీలి పడగ.

గీ. ఎంద తెండలో వచ్చి నీయింటఁ జదివి, విద్యలను దేఱి చక్కఁగా వెలుఁగుచుండ
అక్కటా! తుద కొక్కముక్కైన లేక, కూరుచుంటివె? యిటు వెఱ్ఱిగోడ వగుచు.

ఆ. ఎంతవారియింట నెంతవాఁడవు నీవు, కలిగినావు నేఁటికాలమునకు;
చెట్టు చెడెడివేళఁ బుట్టనందురు కుక్క, మూతిపిందె దానిఁ బోలి తయ్యొ!

ఆ. చదువువద్దు నద్దు సంధ్యయుఁ బోనిమ్ము, రానిదానికొఱకు రభసమేల?
ఉన్న దేదొ? పోవనున్నదియును యేదొ? చూచుకొనవు యెంత శుంఠవో కద?

గీ. సరససాహిత్యగ్రంథాలు చదువువారు, దఱచు శాస్త్రార్థములు సేయఁదలఁచువారు
నగుచు శిష్యులు దన్నెపు డనుసరింపఁ, జూడ మనసౌచు మీతండ్రినాఁడు చెల్లె.

గీ. ఆలకించితిఁ బరిణయమయ్యె ననుచు, సంతసించితి; నీకిల్లు చక్కదిద్దు
కొనఁగలంతటి నేర్పైన కుదురదయ్యె, ననుచు విని చాలవగచితి నాత్మలోన.

గీ. అయినవంశంబు మీయది యడుగువట్టె, నామరూపాలు లేవు నీనాఁడు ఘనత
కెక్క నీవంకఁ గనుగొని వెక్కిరింపు, చుండె, యభిమాన మనుసది యొదవదు కద!

ఆ. నవ్వఁ జూచెడివారికి నవ్వసందు, దెప్పఁ జూచెడివారికి దెప్పసందు
యిట్టి యవకాశముల నెందు కీయవలయు, నీవు పరులకు శుంఠవై పోవుటఁ గడ!

ఆ. భూమి, బుట్ర, నీదు పూర్వోద్భవులు చాల, కూర్చిరెల్ల నీదు కొఱకుఁ గాదె
ఆలివంకవారి కందిచ్చి దానిని, గిక్కురనవు గోళ్లు గిల్లికొనుచు.

గీ. వారు మాత్రము నిన్నెంతవఱకుఁ జూడఁ, గలరు నీత్రోవలను నీవ కాంచవలయు
చెట్టుపయి కెక్క వానినిఁ జిగురుదాఁక, పట్టి త్రోయంగ నెంతటివానికగునె?

ఆ. ధర్మపిండ మొరులు తగువేళఁ బడవేయ, మెక్కి దాని వీథు లెక్కఁబోదె
ఒరులచేతిక్రింద నొదిగియుండెడిపాట్లు, లేవు నీకుఁ దెలివిలేదుగాని.

ఆ. చేతులందుఁ బెట్టి శిరము నాఘ్రాణించి, నిన్నుఁ గాంచి మెచ్చి నీదు తాత
బ్రతికి బట్టకట్టువాఁడైన వీఁడొను, మేటియనియెఁ దుదకు మేటివైతి.

గీ. అవుర! నీతండ్రికడ శుభమస్తటన్న, వారు విద్యలలోఁ జాలఁ దేఱినారు
తప్పిపోలేదు డింభ! నీతండ్రి చదువు, నీకు మాత్రము ప్రాప్తము లేకపోయె.

ఆ. వెడలుచున్న ముందు వెనుక తాటాకులు, కట్టుచున్నవారు కాంచలేవు
నీవు వినుము నేను నిజమాడుచుంటిని, నిన్నుఁ జూచి జాలినెగడు కతన.

చిత్రము ౨




చైత్యాలయము 1. వాయవ్యము నుండి కనబడురీతి.




చైత్యాలయము 1. ఆగ్నేయమునుండి కనుబడురీతి.




చైత్యాలయము 1,యందలి సింహాసనము: ఆగ్నేయమునుండి కనుబడురీతి.




చైత్యాలయము 1.కి తూర్పుననుండు విహారము.

## చిత్రము 3



రామతీర్థమునందు దొరకిన శిలావిగ్రహములు, ఛత్రములు, శల్యనిధానములు

ఉ. చెప్పెడిమాటలం జెవులు చేరిచి మక్కువ నాదరింపఁగా
నొప్పవదేమి? యెంతటియయోగ్యుఁడవైతివి మీదువంశమం
దెప్పుడు నిట్టివారు జనియింపరు దక్కుల నైజకీర్తిచేఁ
గప్పిరి నీదుపూర్వు లనఁగా మఱి యేమనుకొంటివో జడా!

గీ. నీదు వెఱ్ఱితనము నిఖిలంబుఁ గనుగొని, ఆడి యుప్పుఁజప్పనైనమాట
లైన గ్రంథసమితి నపహరింపఁగ వారు, వీరు నిట్టు లీవు వినవె మాట?

ఆ. గొడ్డుగోతవడిన బెడ్డవిసరువారె, కాని లేవదీయఁ బూనువారు
చాలతక్కువయ్య! ఆలింపునామాట, వృద్ధినొందెదీవు వింటివేని.

గీ. తాతతండ్రుంపోలిక తగులువడదు, లేనిమాటలు మనకేల మేనమామ
యైన కాఁడిట్లు యెక్కుడిదయ్య, యింతఁ దక్కుమాలినపోలిక దగెను నీకు.

గీ. లోకువై పోక యాలికి లోకమునకు, నేను జెప్పెడిమాటల నిజముఁదెలిసి
పండితతనూజ! నీవు మీవారివోలె, నడచుకొనునట్టి యత్నంబు నడుపుమయ్య!

చ. అరయఁగ నేఁడు మూఁడుపురుషాంతరగాథలు నేనుజెప్పఁగా
నెఱుఁగుదు నాఁటనుండి మఱి యిచ్చిన నెందును బుచ్చుకొన్నఁడా
మరుగరు క్రొత్తచోటులకు నర్భక! మీ మొదలింటివార ల
క్కరణికి మార్చె నఘటనకారుఁడు దీనికిఁబైనఁ దోషమగ్గా.

గీ. మాటగాని పరాయ సంబంధమనుచు, వారుఁగూడను గడుమంచివారల యట
మనకుఁ గల్గిన బంగారుమంచివన్నె,దైన కమసాలి యేమిచేయంగఁగలఁడు?

చ. మును పోకనాఁడు మీదుకులముఖ్యుల నెవ్వరి కొక్కకాని యొ
క్కనికిఁ దటస్థమయ్యెననగా వినియుంటి పరాయబాంధవం
బనుకొనరాదుగాని మఱి యామహనీయులు పట్టిమ్లేచ్ఛలం
చనెదరు వారిమూలమున నాపద కూరెనటండ్రు పూర్వులన్.

ఆ. ఎంతవఱకు నిజమొ యెఱుఁగరాదది నాకుఁ, గథకుఁగలవె కాళ్లు పృథివిఁగిట్ట
నట్టివారు లేరె యామాట లటులుంచి, నేఁటిబెడఁద దాటు నేర్పుగనుము.

గీ. పెద్దలున్నారు వారలయొద్దఁ జేరి, చెప్పుమాటలువిని మేలు చెందుమయ్య!
డిల్లవడి యిచ్చటచ్చట డేకులాడఁ, నేటికిటు మీనమేషంబు లెన్నికొనుచు.

గీ. దైవ మనుకూలుఁడైన సత్వరముగానె, నీకుఁ గలిగిన లోపముల్ నిలుపఁబోవు
పడినగోడలు పడినట్టు లెప్పటికిని, ఉంపఁజూచినవార లీ యుర్విఁ గలరె?

ఉ. అంతయొ, యింతయో! దంఁప! నర్భక బాంధవముంటఁ జేసి
నేనింతగఁ ద్రవ్వి చెప్పితి మఱేమియుఁ జిత్తములోఁ దలంపక
త్యంత ప్రయత్నమూని యొకయింత వివేకముఁ గాంచదేని నా
స్వాంతము చల్లనౌను వినియందఱు మెచ్చెద రయ్య! ఆత్మలన్.




(ఒక కల్పిత కథ)

రాజా వాసిరెడ్డి శ్రీ దుర్గా సదాశివేశ్వర ప్రసాద బహద్దరు గారు

ఒకనాడు ఉదయాన మోటారులో ఇద్దరు పురుషులు హుద్దాసంతో కలియ దిరుగుచుండిరి. వారిలో ఒకడు ఒడ్డూపొడుగూ గలిగి ఎర్రగాబుర్రగా కొంచెము వర్చస్విగా నున్నాడు. అతడువేసిన సూటు, హేటు, బూటు, లక్షణాలుచూస్తే ఆయనొక దొరగారి లాగుంటాడు. మాటలో నడకలోగూడా దొరన్ని అనుకరించాలెనని చూస్తాడు. కాని అది పట్టుపడుతుందీ, శతపుత్రాలు పెట్టినా స్వభావం మారుతుందీ; పైగా ఆయన మాటలు వింటే ఎక్కువ ఆంగ్లభాషా జ్ఞానం ఉన్నట్టూ కనుపడదు. ఎందుకో యింతశ్రమ; ఈవికారపు అనుకరణము; వింత విన్యాసము. ఇన్ని తంటాలు పడ్డా ఆ తెల్లతోలుమాత్రం లభించలేదు. ఆయిద్దరిలో ప్రధానుడీయనే లాగుంది. అయినా రెండవవాడప్పుడప్పుడు యీయనమీద విసుగుకొంటుండేవాడు. వాడు "ఏం సామి! ఎందమాద్రివీడు మీకు పుడికాదు." అని వచ్చీరాని అరవతెనుగులో సణుగుతూ ఉండే మాటలవల్ల వాడొక బ్రోకరని మొదటివానికి యింటికొరకు తిరుగుతూ ఉన్నారని మన మూహింపవచ్చును.

బ్రోకరిల్లు త్రిప్పిత్రిప్పి విసిగి లోలోపల గొణుగుకొంటూ మైలాపురంలో ఒకబంగాళాను తీసుకొనివెళ్లినాడు. ఆబంగాళాచాల పెద్దది. వెలుతురూ గాలీ బాగా వస్తున్నవి. ఎండిపోతూపోతూ ఉన్న పూలచెట్లు, క్రోటన్లు ఉన్నవి. ఆపైన తోటగూడా ఉన్నది. కుళాయి లున్నవి. అంతా బాగానే ఉన్నది. అయితే యెందువల్లనో కాని యింటినిండా గబ్బిళా లున్నవి. ఎక్కడజూచినా పెంటే. ఎవరూ ఊడుస్తున్నట్టూ లేదు. ఆబంగాళాను చూచేచూడడంతోనే మన నల్లదొరగారి కేమి తోచినదోగాని ఇది యిట్లాయెందుకున్నదా అని యేమాత్రం ఆలోచించలేదు. ఆత్రముతో 'అద్దె యెంత' అద్దె యెంత? అన్నాడు. "ఇంద మాద్రి పిశాచి వీడుదా యీకామాటికి రొంబ యిష్టమైంది." అనుకొని "ఏమండి అద్దె నెలకు ఏబత్తు రూపాయి దా జొను" అన్నాడు. దొరగారు "జేషు మన అదృష్టం యింత చౌకలో యింత సౌకర్యమైన యిల్లు యెవరికి చిక్కుతుంది" అని సంతోషిస్తూ "ఇంకొక మాటేమైనా ఉన్నాదా?" అన్నాడు. "మాట గీట ఏం లేదయ్యా! ఏం సామీ; యింతపెద్ద వీడుండే; ఏబత్తు రూపాయి యెక్కు వంటారే" అన్నాడు బ్రోకరు. దొరగారు సరే అని ఒప్పుకొని యింటివాండ్లకు 3 ఏండ్లకు అద్దె కరారు వ్రాసి యిచ్చినాడు. బ్రోకరు కేదో చేతిలో పెట్టినాడు. వాడది చాలదంటాడు తానిస్తానన్నదే అంతంటాడు దొర. చివరకు పెద్దమనుష్యులు చెప్పినట్లు విని బ్రోకరును బలవంతంమీద తృప్తిపరచి పంపినాడు. దొర ఆ యింటి తాళపుచెవి తీసుకున్నాడు. తెల్లవారి సామానులతో గూడ వచ్చి ఆ యింటిలో ప్రవేశించినాడు.

"పాప మీయ నెవరో మోసపోయి వచ్చి యీ దయ్యాలకొంపలో కాపురం పెట్టినాడు. ఎలా నెగ్గుతాడో యేమో" అని వీథివారు గుసగుస లాడుతూ ఉండేవారు. కాని యెవరూ ఆయనతో చెప్పలేరు. ఆయనతో ఎవరికీ పరిచయం ఉన్నట్టు కనుపడదు. ఆయన ఆవీథికేకాకుండా ఆయూరికే క్రొత్తవాడు లాగుంది. లేకపోతే ఆయన యింటికి స్నేహితు లెవరైనా రారా? ఆయ నేస్నేహితునైనా చూడబోడా? ఆయన పుట్టూ పూర్వోత్తరము లెవరికీ తెలియవు. ఉద్యోగం సద్యోగం ఏమీ ఉన్నట్టూ కనపడదు. ఏదీ లేకపోయినా చేతిలో డబ్బుమాత్రం మెదులుతూనే

ఉండేది. అది చూచి తేరసంపాదనగాళ్లు, కబుర్లరాయళ్లు, బడాయికోర్లు, బడితెపూజగాళ్లు, ఆయనచుట్టూ చేరినారు. ఆయననూరక పొగడుతూ ఉండేవాండ్లు. స్తోత్రపాఠాలు వినడమంటే ఆయనకు సర్దా.

అయితే వారీప గ్యాలకొంపకు రావడానికి కొంచెం జంకుతూనే ఉండేవారు. ఒకనాడు దొరగారితో ఆకాస్తా వెళ్లబొడినారు. ఆయనా ఆమాట వినడంతోనే కొంచం గాభరా పడ్డాడు. కాని ఆత్మసందేశాలు గ్రహించే రాయబారుల ఉపన్యాసాలు విన్నప్పటినుండి దయ్యాలతో మాట్లాడవలెనని ఆయన కుతూహలపడుతూ ఉండేవాడు. ఆ సంగతులన్నీ తన స్నేహితులకు చెప్పి ఫర్వాలేదులెమ్మన్నాడు. ఆ సమాధానాలతో వారికి గుండెబెదరు తీరుతుందీ? అయినా డబ్బుమీద తీపుచేత రావడం మానలేకపోయినారు. ఈ సందడిలో దొరగారిచరిత్ర మేమిటో మెల్లగా లాగినారు. ఈయన గోదావరిజిల్లా వాడట. రెండో మూడో బేవారసు ఆస్తులు యీయనకు సంక్రమించినవట. అది చేతిలో బెట్టుకొని మద్రాసులో దర్జాగా కాలంగడుపుటకు చేరినాడట. పేరు రాజారావట. మనకు కావలసిన దింతవరకే. ఇక మనము రాజారావందాము.

ఇంట్లో నౌకర్లు చాకిర్లను బలంచేసినాడు. ఆయన యిల్లు యెప్పుడూ సురప్రదానసమయంలో ఆదిన్యప్రదేశములాగున గడబిడగా ఉంటున్నది. ఎప్పుడూ విందులే ఎప్పుడూ డేన్సు వినోదాలే; ఇన్ని ఉన్నా, ఆయనకు ఇంట్లో స్వీయులైన ఆడవాళ్లెవరూ లేరు. 'పాపమేలా అవస్థపడుతూ ఉన్నాడో' అని ఆలోచిస్తారేమో? బోలెడు డబ్బు పెట్టి రాగిబొమ్మ రామానుజులను, పిల్లిబొమ్మ ప్రియురాండ్రను, తెల్లముగపు దివ్యకాంతలను చేరదీసినాడు. క్రొత్త సావాసగాండ్రూ, తానూ అచ్చమైన ఆసీమసరుకుతో ఆనందిస్తూ ఉండేవాడు: వీటితో పాటు ఉండదగిన షోకులు అన్నీ అలవాటైనవి. అసల్ రకపు చించిర్డీ స్నేహితులు దొరికినారు. చేతిలో ధనం పుష్కలంగా ఉన్నది. భూమి ఆకాశాలు ఏకతాళం వేయవచ్చు ననుకొంటుండేవాడు రాజారావు. ఆయనకు ఏదైనా అధికారం సంపాదించాలెనని బుద్ధి పుట్టింది. అది తనస్నేహితులతో చెప్పినాడు. వారు కూడ సెబాసన్నారు. అందుకు పెద్దపెద్దవాళ్ల స్నేహం చేయవలెనని అందరూ తీర్మానించినారు. దానికి మార్గమేమిటా అని ఆలోచించినారు. స్పెన్సర్ డి. ఎంజిన్ వగైరా హోటళ్లకు, యూరోపియన్ క్లబ్బులకు, అలవాటైనారు. బీచివెంట షికార్లు సాగించినారు. మెసానిక్ లాడ్జిలో మెంబర్లైనారు. రాజారావిప్పటికొక స్నేహితుని సంపాదించినాడు. ఆయన ఒక పెద్ద ఉద్యోగిఅల్లుడు. అల్లుడంటే అంకుశమేకదా! ఆయనద్వారా ఉద్యోగానికి ప్రయత్నిస్తున్నాడు రాజారావు. ఆ ఉద్యోగిఅల్లుడు అదిగో యిదిగోఅని ఊరిస్తూ డబ్బు వడవేస్తున్నాడు.

ఇంతలోనే ఆవీధిన పంచాయితీకోర్టు ఎన్నికలు వచ్చినవి. అందులో మెంబరైతే బాగా ఉంటుదని స్నేహితులంతా రాజారావుకు సలహా యిచ్చినారు. అసలే ఉద్యోగపు పిచ్చిలో ఉన్న రాజారావుకు అది చక్కని సలహాగా తోచింది. ఎన్నికల సన్నాహం సాగించినాడు. ఈ ఎన్నికలకు ఓటర్లలిస్టు అభ్యర్థుల నియోజనం మొదలైన చిల్లర కర్మకాండ యేమీ లేదు గదా? తలగలవాడెల్ల తగినవాడే. మొలత్రాడు కట్టినవాడెల్ల మొనగాడే. ఇవంతా ఎందుకు? మూతిమీద మీసముంటేసరి మొగసిరివాడే. ఓటేయటానికి యోగ్యుడౌతాడట వాడిబుర్రలోనిది బురదైనాసరే.

ఎన్నికరోజు వచ్చినది. ఆనాడు రాజారావు తన సహచరులను ఊరుమీద విడిచినాడు. వారు విజృంభించి అదరించి బెదరించి అందరి నోకదొడ్డిన తోలినారు. రాజారావు వారికి సంతర్పణముచేసి, సోడాపానీయముతో "తృప్తాస్మః" అనిపించి తమలపాకు బీడాలతో భూరిదక్షిణలుసమర్పించుకొని ఎన్నికలమహాయజ్ఞము జరిగించినాడు. రాజారావు కంతటితో తృప్తి గాలేదు. ఎందుకంటే కొంచెం ఊహాపోహలుగలవాళ్లు తనదగ్గర తల లెగురవేసి తనప్రతిపక్షికే ఓటిస్తారేమోనని ఆయన కనుమానం. అందుచేత ఆగమతంతుగూడా ఆచరించవలెననుకొన్నాడు. తన శ్రీరామసేనకు చెవిలో ఏమో ఊదినాడు. ఈమారు వారు ఎలుకలగుంపు, ఏనాదిగుంపు, కత్తెరగుంపు, కసాయిగుంపు, గోసంగిగుంపులనుగూడా పెట్టి,

తాగించి, తలకు నైపెక్కించి, తంపనాలుపాడించి లాగుకొనివచ్చినారు. ఈవిధంగా వారిచేత ఎన్నికల వరిడీ మహాలక్ష్మమ్మకొలువు కోపించినాడు. దానితో తనకు ఓట్లు వెల్లికొల్లలుగా వచ్చినవి. రాజారావు నెగ్గినాడని ఎన్నికలఅధికారి ప్రచురించినాడు.

రాజారావుకు ఆశ అంతతో ఆగలేదు. ఆపంచాయితీకోర్టుకు ప్రెసిడెంటుకావలెననుకొన్నాడు. అయితే మైలాపురం పెద్దపెద్దలాయర్లకు ఉనికిపట్టే. సాధారణంగా వారంతా స్వరాజ్యపక్షంవారై ఉంటారే. తనకక్కడ స్థానముంటుందా అని దిగులుపడ్డాడు. ఫర్వాలేదులెమ్మని స్నేహితులు ధైర్యంచెప్పి ఆయనను లాయర్లదగ్గరకు తీసికొనివెళ్లినారు. రాజారావు లాయర్లతో తనస్థితి నిట్లు చెప్పుకొన్నాడు:— "అయ్యలారా, నేను కాలానికి కట్టుబడి యిట్లా ఉన్నాను. మహాత్ముడంటే నాకూ భక్తిఉన్నది. గవర్నమెంటుతో ప్రస్తుతం నాకొక పనిఉన్నది. అందుకని యీపాడుగుడ్డలు వేసుకోవలసివచ్చింది. అయినా ఇవన్నీ పాతగుడ్డలే. ఇప్పుడు క్రొత్తగా విదేశీగుడ్డలు కొనడంలేదు. ఇవి చిరిగిపోతే ఖద్దరే కడుతా. ఖద్దరంటే నాకూ అభిమానమే. ఇంట్లో ఖద్దరే వేస్తానండి. ఇప్పుడేమిటి? మావాళ్లంతా తాతతరాలనుంచి ఖద్దరే కట్టేవాళ్లు. ఇప్పుడుగూడా మా యింట్లో పరుపులకంతా ఖద్దరే. మానౌకర్లకు నేనిచ్చేదంతా ఖద్దరే. నేనూ ఏదో ఒకటి ఖద్దరుగుడ్డ వాడుతున్నాను. ఈ తువాళ చూడండి. అస్పృశ్యత నరకద్రోకాలె నని ఎన్నాళ్లనుంచో అనుకుంటూనే ఉన్నాను. త్రాగుబోతుతనాన్ని తరిమి వేయవలెనని గూడా అనుకొనేవాడినే. యీతావాతా ఇప్పుడు మీనయపల్ల పంచాయితీకోర్టు ప్రెసిడెంటు కావలెనని ఉన్నది. నాకు అడ్డుతగలకండేం. మీరేమిచెప్పితే అది చేస్తా. మీకు పరమభక్తుడను. నేనిప్పుడేమి చెప్పితే నేమి లాభం? మీరు నా స్వభావం చూడకపోతారా? ఇంతకూ నన్నే నేను పొగుడుకోవలసి వచ్చిందే అని చింత" అని కాంగ్రెసువాలాలతో కల్లిబొల్లి మాటలు చెప్పినాడు. ఈతని దైన్యము, ఉద్యోగపుపిచ్చ చూచి కాంగ్రెసువాలాలు నవ్వుకొన్నారు. ఈ ప్రభుత్వపు పంచాయితీకోర్టుగొడవ కాంగ్రెసువాలాలకు అక్కరలేదని పాప మామానవుడు అనుకోలేక పోయినాడు. ఒక జస్టిస్‌పార్టీ అభ్యర్థి రాజారావుకు పోటీగా నిలిచినాడు. జస్టిసువారి కాస్థానం దక్కనీయకపోతే నిరంకుశం నిర్మూలమైపోతుంది. పాపమితనుంటే ఏదో ఉపాయంగా నడుచుకొంటాడనుకొన్నారు కాంగ్రెసువారు. రాజారావుకు కొంతవరకు సహాయంచేసినారు.

రాజారా వీవిధంగా బ్రతిమాలుకోవలసిన వారిని బ్రతిమాలి, లాలించవలసిన వారిని లాలించి, బెదరించవలసిన వారిని బెదరించి, ఎట్లాగైతే నేమి తనకార్యం ఒడ్డెక్కించుకొన్నాడు. ఆ పంచాయతీ కోర్టుకు ప్రెసిడెంటైనాడు. అప్పుడాయనకు సంతోషం పొంగి పొర్లిపోయినది. తన స్నేహితులతో చెప్పి తనకు ప్రశంసకసభ చేయించుకొన్నాడు. అయితే దాని ఖర్చులకు తానే డబ్బు యిచ్చుకొన్నాడు లెండి. ఆ సభలో కార్యక్రమమేమిటంటారా? ఫలహారాలు, ఉపహారాలు, యిష్టాగోష్టులు. ఎక్కడ విన్నా ఆయన శూరుడు, వీరుడు, కార్యదక్షుడు, దేశాభిమాని అను పొగడ్తలే. అంతటితో తన స్వసామర్థ్యపు తూకము మఱచిపోయినాడు. రాజారావు ఉబ్బి తబ్బిబ్బగుచున్నాడు. ఎప్పుడు తెల్లవారుతుందా ఎప్పుడు వెళ్లి తాను ఆ అధికారపు కుర్చీలో కూర్చుంటానా అని ఆ రాత్రిఅంతా బులపాటం పడుతున్నాడు. నిద్రపట్టలేదు. ఎట్లా పడుతుంది? ఊహాల తరంగాలు పొర్లి పొర్లి వస్తూ ఉండినవి. తెల్ల వారినది.

రాజారావు కాల్యకృత్యాలు తీర్చుకొని దుస్తులు తగిలించుకొని తనమిత్రులు యింకా రాలేదేమా అని విసుగుకొంటున్నాడు. ఆయనకేమి పనిఉన్నది. "పాటి మీద దేవరకు పాటిమీదనే ధ్యానముగదా?" ఇంతలో స్నేహితులు వచ్చినారు. అంతా కలిసి గ్రామచావడికి వెళ్లినారు. అక్కడ పంచాయితీదార్లందరూ సభతీరినారు. ఏవో కేసులు విచారణకు వచ్చినవి. రాజారావు కుర్చీలో దర్జాగా కూర్చున్నాడు. రికార్డు కట్టలు విప్పినాడు. సీలు చేత దీసుకొన్నాడు. ఎర్రసిరాకలం పట్టుకొన్నాడు. ఇంతవరకు అంతా దర్జాగానే గడచిపోయినది. కాగితాలు తేరిపార చూచినాడు. పాప మామానవుడికి అన్నికాగితాలు ఒక్కతీరుగానే కనిపించినవి.

దేనిమీద ఏమి చర్య జరుపవలెనో, ఏమి వ్రాయవలెనో, ఎక్కడ సంతకం చేయవలెనో, ఎవరికి యెస్సు పంపవలెనో తెలియలేదు. తికమకపడుచున్నాడు. ఆ అవస్థ చూచి మెల్లగా ఒక స్నేహితు డాయన దగ్గరకు చేరినాడు. ఆయన మాత్ర మింతకంటె తక్కువ వాడా? ఆయనకూ తెలియలేదు. అయితే ఆయనొక నియోగం చేసినాడు. "ప్రెసిడెంటుగారికి సుస్తీగా ఉన్నది. డాక్టర్ గారు బుద్ధితో విశేషం పనిచేయ వద్దన్నారు. కనుక యీనాటికి సభ చాలిస్తే బాగన్నాడు." సెందుదొరికినది. బ్రతుకుజీవుడా అని కేసులను వాయిదా గూడ చెప్పకుండానే గబుక్కున లేచి సరాసరి యింటికి వెళ్లినాడు. కాని అక్కడకూడా యిదే చింత. "ఈపాడు ఉద్యోగమెందుకు వచ్చిందిరా దేవుడా! ఈపని యిట్లా నిర్వహిస్తానా" అని అది దీనితో పగలంతా ఆగడచినది. ఆరోజు సరిగా భోజనంకూడ చేయలేదు. నడిరేయికూడా అయినది. అంతా గాఢనిద్రలోనున్నారు. రాజారావుకు నిద్రపట్టలేదు ఈసమస్య తేలనూ లేదు. శ్లేష్మంలోపడ్డ యీగవలె తన్నుకొంటున్నాడు. ఆసమయాన ఆయనయెదుట నొకవ్యక్తి సాక్షాత్కరించినది. ఆ వ్యక్తి మెల్లగా యిట్లన్నది: "తమ్ముడా! చింతపడకు నీకు ఫర్వాలేదు. నేనున్నానుగా. నిన్నిప్పటినుండి నే నావేశిస్తున్నాను. పనులన్నీ నేను చేస్తాను. అయితే నీవు నాకొక ఉపకారం చేయాలి" అని. రాజారావుగుండె గుబిల్లుమన్నది. నిబ్బరించుకొన్నాడు. "ఎవరునీ" వన్నాడు. "నాయనా! నాకథ చాలాఉన్నది; సంగ్రహంగా చెప్తాను విను. నేనీ యింటి ఖామందును. నాపేరు బాలయ్య; వకీలుని; కార్పొరేషన్ మెంబరు కావలెనని యెన్నోపాట్లు పడ్డవాడిని. ఒకమారు జస్టిసుపార్టీ వాడినిగా ప్రయత్నించి ఓడిపోయినాను. రెండోమారు ఏపార్టీ వాడినంటే బాగా అని ఆలోచించినాను. ఇండిపెండెంటుపార్టీ వాటంపార్టీగా ఉందిరా అని దానిలో దిగినాను. కాంగ్రెసువాలాల నాశ్రయించినాను; ఎన్నోతంటాలు పడ్డాను. కాని చివరకు గురికి బెత్తెడువారలో ఎగిరిపోయినాను. ఈమారైనా ప్రయత్నించి గెలుద్దామనుకొన్నాను. మాయదారి మృత్యువు నన్ను మ్రింగివేసినది. ఈఎలక్షన్లు అయ్యేవరకైనా నన్నుంచండయ్యా అని ఆమృత్యుభటులను బ్రతిమాలినాను. భంగపడినాను. నామీద ఆబండగుండెమొండి ముండకొడుకులకు దయ రాలేదు. అప్పటినుండి నేను దయ్యాన్నై తగినవాడెవడు తటస్థపడుతాడా అని యిట్లా తిరుగుతున్నాను. నాఅదృష్టంవల్ల యిప్పటికి నీవు చిక్కినావు. నాయనా! అయినవాళ్లెవరూ నాజోలి అంటించుకోనటమే లేదు. నీధైర్యసాహసాలు చూస్తే నీవే నాకు తగినవాడవని తోచినది. ఈయింట్లో నీవున్నప్పటినుండీ నీకూనాకూ బాదరాయణసంబంధం కలిసినది. నీద్వారా నేను ముక్తిపొందాలి. తండ్రీ! కార్పొరేషన్ ఎలక్షన్లు వస్తున్నవి. దానిలో నీవీవార్డుకు మెంబరు కావాలి. నిన్ను నేనావేశించుకొని ఉండి ఆకార్యాలలో పాల్గొని సంతోషిస్తాను. మెంబరుకాగలనా అని సందేహించకు. నేను నిన్నావేశించి నాపలుకుబడి ఉపయోగించి గెలిపిస్తాను. ఇదే నీవుచేయవలసిన ఉపకారం." అన్నది ఆ వ్యక్తి.

రాజారావు మరింత దిగులుపడ్డాడు. నోట మాటరాలేదు. "అమ్మయ్యో! దయ్యము నన్నావేశిస్తానంటుందే. ఇదేమి గోలరా దేవుడా! నేను మళ్లీ మనుష్యులలో కలుస్తానా" అని ఆలోచిస్తూ ఉన్నాడు.

"పిచ్చిపిచ్చి ఆలోచనలు చేయకు. నేనునీమంచికే చెపుతున్నాను. వినకపోతే చెడుతావు" అన్నదిదయ్యము. అప్పుడు "దయ్యాలలో మేలుచేసేవి కూడా ఉంట"వని సైకాలజీవారు చెప్పినమాటలు రాజారావుకు చటుక్కున జ్ఞాపకమునకు వచ్చినవి. ఏమైనా కానీ అని మొండిధైర్యం తెచ్చుకొని సరే'అట్లాగే చేస్తా'నన్నాడు రాజారావు. దయ్య మతనిని ఆవేశించినది.

అప్పటికి తెల్లవారవచ్చినది. రాజారావిప్పుడు మామూలు రాజారావుగాడు. బాల రాజారావు అయినాడు. అతని ఉత్సాహం ద్విగుణమైనది. పిమ్మటస్నేహితులను లేపినాడు. ఈసంగతి చెప్పుదామా, చెప్పితే వాండ్లు భయపడుతారేమో అని ఆలోచించి యిప్పుడే చెప్పవద్దనుకొన్నాడు. తర్వాత కోర్టుకు వెళ్లినాడు. ఎన్నాళ్లనుంచో ఉన్న నిల్వకాగితాలన్నీ బయటకు తీసినాడు. వాటిమీద అడ్డదిడ్డంగా చకచకా బరికినాడు. ఆకోర్టులో తనతీర్పుకు ముగ్గురు అడ్డుతగులుతుండేవారు.

వారిలో ఇద్దరికేవో ఆశలుగొల్పి వశపరుచుకొన్నాడు. ఇక నౌకరున్నారు. పెద్ద ఉద్యోగిఅల్లుడు, తన స్నేహితుడుగదా! అప్పీలు చేసినా ఫర్వాలేదు. లెక్కిస్తున్నాడు. 5 మీటింగులకు హాజరు కాలేదని జబర్దస్తీ సెక్షన్‌తో ఆఒకమెంబరును తొలగించినాడు. ఇక తనయిష్టం నిరాఘాటంగా సాగుతూ ఉన్నది. కేసులు టపాకాయలవలె ప్రేలగొట్టుతూ ఉన్నాడు. స్నేహితులు వీడి కీర్తి యెక్కడ వచ్చినదిరా అని ముక్కుమీద వ్రేలువేసుకొనుచున్నారు. కాంగ్రెసువారినిచూచి నప్పుడు వంకవంక దణ్ణాలుపెట్టి చిరునవ్వుతో మెల్లగా తప్పించుకొని తిరుగుతూ ఉండేవాడు.

ఇంతలో కార్పొరేషన్ ఎలక్షన్లు సమీపించినవి. అభ్యర్థిగా నిల్వమని రాజారావును దయ్యము తొందరించుచున్నది. అతనికీ దానిమీద ఆశపుట్టినది. అయితే ఏపార్టీతరఫున నిలిస్తే తాను గెలుస్తానా అని ఆలోచిస్తూఉండగా దయ్యముప్రత్యక్షమైనది. "నాలుగు ప్లాటుఫారం లెక్చర్లిస్తూ పత్రికలలో హడావిడిగా పేర్లు వేయించుకొంటూ దేశసేవకులమని పేర్లు పెట్టుకొని వీలుచిక్కినప్పుడేదో ఉద్యోగం లటుక్కున నోటవేసుకొనే మనబోటివాళ్లకి గాంధీ సన్యాసియముడులాగా దాపురించినాడు. అగ్నిపరీక్ష తెచ్చిపెట్టినాడు. మెదిలితే స్వార్థత్యాగమంటాడు. ఏదో పదిడబ్బులు మూటగట్టాలి నని గదా మన మిందులో దిగడం; స్వార్థత్యాగంచేసి నోట మట్టిగొట్టుకొంటామ? అయితే ఏమిచేస్తాము! కానికాలం వచ్చినది. ఆయన మహిమ కడ్డులేకుండా ఉన్నది. దేశమంతా ఆ గోచిపాతరాయడి మాటఅంటే తలమీద పెట్టుకొంటున్నది. కాంగ్రెసుముద్ర నిరాఘాటంగా చెల్లిపోతూ ఉన్నది. లేకపోతే మొన్న మొన్న తలవెళ్లపెట్టిన కుజ్జుకుంక చేత సురేంద్రనాథబెనర్జి అంత వాడు అమాంతంగా ఓడపోవలసిన గ్రహచారమా! కాబట్టి ఎలక్షనులు కాస్తా అయ్యేవరకూ మనం కాంగ్రెసులో చేరవలసినదే. అందుకు కావలసిన వేషాలు నేను వేయిస్తూ ఉంటానులే అట్లా నడుచుకో. తర్వాతసంగతి చూతాము" అని చెప్పి రాజారావులో దయ్యము లీనమైనది. అంతటినుండి బాలరాజారావు కాంగ్రెసు నాయకులచుట్టూ రోజుకు పదిమార్లు తిరుగసాగినాడు. అధికార్లదగ్గరకు వెళ్లేటప్పుడు సిల్కులు, గ్లాస్గోలువేస్తూఉన్నా కాంగ్రెసువారిదగ్గరకు గనంబరు ఖద్దరువేసుకొనే వచ్చేవాడు. ఈగబ్బిలపు వేషమేమయ్యా అంటే "అదీ ఖద్దరేనోయ్! ఖద్దరుఖద్దరని నాప్రాణం తీస్తారేంరా. మీరంతాలో కానుభవంలేనిపిచ్చిపిల్లకాయలురా. నాబుద్ధి, నాపెంకెతనం; నాజబర్దస్తీ, నావేషం చూడండి. అని గబగబా నాలుగూ అరచి బూకరిస్తూ ఉండేవాడు. నాజీవితకాలానికి సగిపోయేవందా ఇప్పుడే యిస్తా; నన్ను కాంగ్రెసువాలాగా మార్చండి. అజ్ఞానస్నానం చేయించండి." అని కాంగ్రెసు వారి నాశ్రయిస్తూఉండేవాడు. ఇవన్నీ నిష్కామ్యంగా చేస్తున్నాడా అంటారేమో? తనను ఆవార్డుకు కాంగ్రెసు తరఫున అభ్యర్థిగా నిలుపమనేకోర్కె అందులో అడగి ఉన్నదిలేండి. చివర కదికాస్తా బయట పెట్టినాడు. పక్కా కాంగ్రెసువాలా లెందరోఉండగా యీ గోడమీద పిల్లినినిలుపుట బాగుండదలేదనుకొన్నారు. కాంగ్రెసుసభవారు "నీవుచేరితే కాంగ్రెసుమెంబరుగా చేరి ఉండు; ఈతూరికి నిన్ను కార్పొరేషన్‌కు పంపుటకు వీలుగాదు. కాంగ్రెసు మెంబర్లా కార్పొరేషన్‌కు వెళ్లాలంటే అక్కడ స్థానాలుండునా! ఉద్యోగస్వీకారమే యీపార్టీకి పరమార్థముగాదే" అని వారు బాలరాజారావుతో చెప్పినారు. దయ్యాని కంతటితో ఆశపోలేదు. "అయ్యలారా! మిమ్ముల నిట్లు అడుగుతూ ఉన్నది కేవలము రాజారావే అనుకొనకండి; ఇదివరకు మీవల్ల సహాయం పొందినవాడిని; మీకు కొద్దోగొప్పో పరిచితుడను; వకీలును; నేనాయన నావేశించిఉన్నాను; బాలయ్యను. నన్నైనా మీరు చేర్చుకోరా? ఎట్లాగైనా నన్ను మీరు కార్పొరేషన్‌లోకి పంపించరా? నామిత్రులంతా నాకే సహాయం చేస్తానంటున్నారు. నేను తప్పక గెలుస్తాను. నన్నే మీతరపు కేండిడేటుగా పెట్టుకొంటే కాంగ్రెసుగౌరవం దక్కుతుంది. మావంటివాళ్లున్నప్పుడే మీ కాంగ్రెసుకైనా గౌరవం. నాలాగా దిట్టంగా బూకరించేవాడు లేకపోతే కార్పొరేషన్ అంతా నిద్రపోతూ ఉండదా? నావిగ్రహంచూచైనా ప్రతిపక్షులు హడలిపోతారే. ఇంకొకమారు నే నీలోకంలోనైనా ఉంటానో లేదో. నాయనలారా! కార్పొరేషన్‌హాలులో

ఎలక్ట్రిక్ పంకాలు పట్టుకొని నా పితృదేవతలెట్లు తల్లక్రిందుగా వ్రేలాడుతూ ఉన్నారో చూడండి. నేను కార్పొరేషన్ మెంబరుని కాకపోతే వారికి పుణ్యలోకాలు లేవట. పితృలోకంలో వారు సుఖించుటకు నోటుండదట! వారి చెరవిడిపించుటకైనా నన్ను పంపరా? ఈమాత్రం పుణ్యంకట్టుకోరా? నన్నొక నాయకుడినిచేయరా? పదుగురిలో తలవంపు చేస్తారా, బాబూ! కాంగ్రెసని వెఱ్ఱి అభిమానంతో పిల్లమూకమాటవిని నావంటివాడిని, త్రోసిరాజంటారా? ఇది న్యాయమేనా?" అని తన పేరుగూడా బయటపెట్టుకొని మొరపెట్టినది దయ్యము. ఇట్టి అధికారపు కొసవెఱ్ఱివాడికి కాంగ్రెసుపక్షమున నిలుపుట సుతరాం పనికిరాదని కాంగ్రెసువారు మఱింత గట్టి చేసుకొన్నారు; ససేమిరా అన్నారు. ఇక కాంగ్రెసువారి నాశ్రయించి ఫలము లేదనుకొన్నాడు బాలరాజారావు. తనకిక తోడెవరా అని చింతించినాడు. ఎందుకైనా మంచిదని మెల్లగా తన మిత్రుడు ఉద్యోగి అల్లుని ద్వారా ఉద్యోగి నాశ్రయించినాడు. ఆయన పక్షములో చేరినాడు. ఉద్యోగి దగ్గరమాత్రం ఆయన దయ్యము ముచ్చట తేలేదు. ఆయన బెదురుకొంటాడేమో నని ఆయుద్యోగి ప్రజలకయిష్టుడుగా ఉన్నాడు. కాన ఉద్యోగికీ తనకూ సంబంధమున్నట్టు ఇతరు లెవరితోనూ చెప్పలేదు.

తర్వాత తనకు ఓట్లకొఱకు ప్రచారం ప్రారంభించినాడు. "కాంగ్రెసువాళ్లంతా దొంగలు, పిచ్చివాళ్లు, ద్రోహులు, స్వార్థపరులు. అది బ్రాహ్మల పక్షము" అని యేమేమో కాంగ్రెసు వాదులను తెగించి బజారునపడి తిట్టి దిగపోయసాగినాడు. తాను చెప్పే మాటలలో యేమైనా సత్యమున్నదా? ప్రజలు విశ్వసిస్తారా? అని సందేహింపలేదు. తెగించినవానికి సముద్రము మోకాలిబంటి అన్నారుకాదా! అబద్ధాలపెండ్లికి నావి వరుస లెందుకు? ఒకనాడు తనకు ఓట్లిమ్మని చెప్పుటకు మీటింగు పెట్టినాడు. దానిలో తనశక్తి సామర్థ్యములగూర్చి, కాంగ్రెసువారి అసమర్థతనుగూర్చి ఉపన్యసింప సాగినాడు. తన ఒడ్డూ పొడుగూ చూడమన్నాడు. ధైర్యంగాపోట్లాడుతానన్నాడు. అవసరమైతె కుస్తీపేచీలుగూడా ప్రదర్శిస్తానన్నాడు. ఈరోడ్లు యీలా ఉర్ఘూహుగా ఉన్నవే. నేను వచ్చి వీనినిండా పింగాణీపరిపిస్తానన్నాడు. గట్టర్లలోనుంచిమంచిగంధపు వాసనలువిసరిస్తానన్నాడు. వంతెనలువేయిస్తానన్నాడు. ఏమేమో చెప్పుతున్నాడు. ప్రజలుమాత్రము మూరుకోలేదు. "అయ్యా నీవేమి త్యాగంచేసినావు? ఎన్ని మార్లు జైలుకు వెళ్లినావు? సర్వదా ఖద్దరే కట్టుతున్నావా? నీవు యిప్పుడు తిట్టుతూ ఉన్న కాంగ్రెసునేయిదివర కెందుకు ఆశ్రయించినావు? ఇది నియమభంగము కాదా? నీతిలేని పనికాదా?" అని ప్రశ్నపరంపరలు గురిపించి నోరు మూయించినారు. "ఈకాలంలో త్యాగమే కొలత బాగయ్యా! మరేవీ పనికిరావు పోపోవయ్యా" అన్నారు. అంతటితో సభ చాలించి వెళ్లిపోయినాడు బాలరాజారావు. ఇదంతా దయ్యపుశక్తివల్లనే జరుగుతూ ఉన్నా 'ఆదయ్యము తన పేరుచెప్పితే ప్రజలు చెదురుతారేమో' నని తనపేరు చెప్పుకోలేదు. ఆదయ్యము తన స్నేహితులయొద్దకు రాజారావును తీసికొనిపోయి అక్కడమాత్రం తనపేరుచెప్పి రాజారావుద్వారా తనకు ఓట్ల పిండప్రదానం చేయమని దైన్యంగా చెప్పుకొన్నది. ఆపెద్దమనుష్యులకుకూడా భయంవేసినది. అప్పటికాపీడనెట్లాగైనా వదలించుకొనుటకు తలయెగురవేసినారు. వారీవిషయము తమతమ మిత్రులతో వింతగాచెప్పినారు. ఆనోటఆనోట యీవార్త ప్రజలలో ప్రాకినది. 'దయ్యము ఓటుకోసం తిరుగుతూ ఉన్నదట. అది రాజారావును పూని ప్రతివారిని వచ్చి ఓటిమ్మని అడుగుతుందట.' అని గుసగుసలు బయలుదేరినవి. రాజారావునుచూస్తే ప్రతివాడూ భయపడేవాడు. ఏదోవంకతో ముఖం తప్పించేవాడు. రాజారావునుపలకరిస్తే ఏమికొంపమునుగుతుందో అనిభయమే. స్నేహితులుగూడా రావడంమానినారు. పరివారమంతా పలుచబడినది. ఇద్దరువస్తూఉండేవారు. వారు యిదివరకు కొంతకాలం కాంగ్రెసులో పనిచేసినవారు లెండి. ఇట్టి భయాలన్నిటికీ గడితేరినారు.

ఎలెక్షన్ రోజు రానే వచ్చినది. ఉదయం 9 గంటలకు ఎన్నిక జరుగనున్నది. ఆ ఉదయాన్నే బాల రాజారావు లేచినాడు; క్షౌరము చేయించుకోవలెననుకొన్నాడు. మంగలిని పిలువమనుట కెవరూ లేదు. తానే బయలుదేరి వీథిలోకి వెళ్లి అటూ యిటూ చూచి

నాడు. ఇంటిప్రక్క అరుగుమీద అయ్యంగారు పని చేయించుకొనుచుండగా చూచినాడు. ఆ మంగలిని పని చేయుటకు రమ్మని పిలుచుటకు దగ్గరకు పోయినాడు. "మంగలీ! పనిచేయుటకు రా," అని పిలువబోయి "మంగలీ! ఓటేయవా?" అన్నాడు. ఆమాట చెవిన బడగానే మంగలి "చచ్చాను బాబో! ఓట్లదయ్యం" అని కెవ్వున కేక పెట్టి రోడ్డుమీదకు దుమికి పరుగెత్త సాగినాడు. ఆ అవరిపాటులో కత్తి తగిలి అయ్యంగారి ముక్కు మొరికిపడినది. "అడాఅడా. ఓట్లపిశాచి నంబ మూకు సాపడె" అని అరచుచు అయ్యంగారు వీథిలో వీరంగ మేయుచుండిరి. అయ్యంగారి అకాండ తాండవం చూచి పాలుయిస్తూఉన్న ఆవు బెదరి చిందులు త్రొక్కుచుండెను. దాని కాలికి కట్టిన గడ్డి దూడ గలగలలాడినకొలదీ ఆవు మరింత బెదరి పాలు తీయు వానిని పెటిల్లున తన్నినది. పాలొలికిపోయినవి. పాలవాడి మోకాలు తొలగినది "ఓట్లదయ్యం నా మోకాలు విరిచింది సామీ!"అని వాడు గొల్లున యేడ్వ సాగెను. మంగలి పరిగెత్తుకొని పోవుచుండగా మొగము నిండా పసుపు పూసుకొని స్నానానికి పోవుచున్న మళయాళస్త్రీ చేతిలోని బిందెకు వాడితల పెటిల్లున తగిలినది. "ఓ దేవుడా! ఓట్లదయ్యం నావెంటబడి నాతల పగలగొట్టిన" దని అరచి మరింత వేగముగా పరుగెత్తినాడు. ఆబిందె జారి మళయాళస్త్రీ కాలిమీద పడినది. ఆమె చిటికినవ్రేలు చితికినది. ఆ రిమ్మలో ఏమీ తెలియక బిందె విసరివేసి జుట్టుముడి వీడగా చిందులు వేయుచుండెను. బిందె ప్రక్కనున్న ముసలమ్మ మూపు మీద పడినది. "ఆమె ఓట్లదయ్యం నామూపు విరిచిన" దని మొత్తుకొనుచుండెను. మళయాళస్త్రీ చిందులు చూచి ఒక గొల్లవాడామెకు శివశక్తి పూనిన దనుకొని పంబలజోళ్లు వాయింపించుచు వారపోసి, ధూపమువేసి శివమెత్తి కేకలువేయుచూ "తల్లీ! శాంతించు, శాంతించు" అని అట్టహాసం చేసినాడు. ఆమె యేగణాచారియో నని జనము చుట్టూమూగినారు. ఇంతలో ఆమె తిమ్మిరి అణిగినది. "శాంతింపు చట్టుబండలుగానూ ఓట్లదయ్యం నా వ్రేలుకొరికి"నదని వెక్కి వెక్కి ఏడ్చుచుండెను. ఆమాట వినగానే "చస్తిమి బాబో! దయ్యము దయ్య" మని అరచుచూ ఎక్కడివారక్కడ పారిపోయిరి. రాజారావును ఓట్లదయ్యం పట్టినదని యీవిధంగా అందరకూ తెలిసిపోయినది. అతని పేరుచెప్పితే హడలిపోతున్నారు. బాలరాజారా "వీగందరగోళమంతా చూచి నా గ్రహచారమిట్లావచ్చినదే" అని విచారపడినాడు. తన స్నేహితులైనా తనకు సహాయం చేయరా అని ఒక్కమారు కారులో వారందరియిండ్లకు తిరిగినాడు. "దయ్యానికి నీకు ఓటిచ్చి తద్దినంతెచ్చుకొనేవా ళ్లుంటారా? నీ కీపిచ్చి యెందుకు పో పో" మ్మని నిర్మొగమోటంగా చీవాట్లు పెట్టినారుకొందరు. కొందరు "చూతాములె" మ్మన్నారు కాని బాలరాజారావుకు ఆశ తీరలేదు. పోలింగుస్టేషన్ దగ్గర నిల్వబడి తాను తన శక్తిసామర్థ్యలనిగరించి ఉపన్యసిస్తే ఓట్లన్నీ గల్లున తనకే రాలుతవని పిచ్చినమ్మకం.

మిత్రులతో పోలింగు స్టేషన్‌కు పోయినాడు. తాను, తనతో ఉన్న మిత్రులు తమ శక్తిసామర్థ్యములను గరించి దీర్ఘోపన్యాస మిచ్చినారు. ఓటర్లను దీనంగా యాచించినారు. కాంగ్రెసువాలా లవన్నీ ముక్కముక్కలుగా ఖండించినారు. వాటికివల్లీజవాబు చెప్పువారు లేక బుర్రలో సరుకు నట్టిపోయినది. "దయ్యానికి నీకు ఓటేమిటి? ఇందరిని ముక్కలుకొరికినావు, కాళ్లువిరిచినావు, మూపులు విరిచినావు, ఊరంతా అల్లల్లోలంచేసినావు. నిన్నే కార్పొరేషన్‌లోకి పంపితే మమ్మలను పిసుక్కొని తినవా?" అని ఓటర్లు తిరుగబడి కాంగ్రెసు అభ్యర్థికే ఓట్లిచ్చినారు. ఓటేయకపోతే పట్టి పీకుకొని తింటుందేమోనని భయపడి కొద్దిమంది మాత్రం బాలరాజారావుకు ఓటిచ్చినారు. తెల్లవారి బాలెట్ పెట్టె తెరచినారు. ఓట్లు లెక్కించినారు. రాజారావుకు 40 ఓట్లు; 400 ఓట్లు కాంగ్రెసు అభ్యర్థికి వచ్చినవి. కాంగ్రెసుఅభ్యర్థియే జయించినాడని ప్రకటింపబడినది.

రాజారావుగుండె బండబారినది. దేహముకంపించినది. అట్టె పావుగంట ఆలోచించినాడు. "నాకొక ఓటియ్యవా?" అని పెద్ద కేకవేసినాడు. అప్పటినుండి దొరటోపీ పుచ్చుకొని ప్రతివారి యొద్దకు పోయి "నాకొక ఓటియ్యవా" అని ఊపిరితిరుగకుండా అడుగుతాడు. ఇట్లా ఊరంతా తిరుగుచున్నాడు. వానిని జూచి ఓట్లదయ్యము వస్తూఉన్నదని ప్రజలంతా విరుగ త్రొక్కుకొంటూఉండేవారు. కొందరతనికి పిచ్చెక్కినదన్నారు. పిచ్చఆస్పత్రికి పంపినారు.

ఒకనాడు డాక్టరు ఆఫీసుగదిలో ప్రవేశించినాడు. డాక్టరు కుర్చీలో కూర్చొన్నాడు. బల్లమీద నున్న సిరాబుడ్డి తీసి 'యిదిగో నా కిరీటం' అని నెత్తిన బెట్టుకొన్నాడు. ఆ సిరా ఒళ్ళి నెత్తిన కారినది. "బలే నాకు పన్నీరుతో అభిషేకం చేస్తున్నారా దేవతలూ! నే నిప్పుడీ ప్రపంచానికంతా రాజుగా ఎన్నుకోబడ్డాను. మీరంతా నా నౌకర్లు. నేను చెప్పినట్టు మీరంతా వినుకోవాలి. నాకు ఓట్లీయని వాళ్లు అందరూ దేశద్రోహులే. వాండ్లని నరకండి, నంపివేయండి, నజ్జునజ్జు చేయండి. అందరూ నన్ను పిచ్చివాడంటారు. అయితే నా పిచ్చి నాకు కనపడదేం? కాదు; వాళ్లే పిచ్చివాళ్లు. కాంగ్రెసువాళ్లే అసలు పిచ్చివాళ్లు. వాళ్లకు స్వరాజ్యం యిచ్చినిస్తానూ? నేనేగా యిప్పుడు రాజుని. రాజేమిటి! మంత్రి, సేనాపతి, కోశాధిపతి, అంతా నేనే. నా యిష్టమే యిష్టం. అదే శాసనం. కాదనేవాడెవడు? కాంగ్రెసువాళ్లని నల్లనీళ్లమీద నెట్టిస్తా. జైళ్లలో వేయించి కూడు లేకుండా మాడుస్తూ కొరడాలతో కొట్టిస్తా. వాళ్ల నసలు నారాజ్యంలో—రాజ్యంలో ఏమిటి? యీలోకంలోనే ఉండనీయను. ఉప్పు పాతర్లలో ఊరవేయిస్తా. అసలు యిదంతా బ్రాహ్మల తంత్రం. వాళ్ల విభూతిపెండికట్లు చూస్తే నా ఒళ్లు మండుతుంది. వాటిమీద తారు పూయించాలి. బ్రాహ్మలకందరికీ తలపన్ను వేయండి; నా ఉత్తర్వు అయినది. వాళ్ల జంధ్యాలతో నా గడ్డాలను త్రాళ్లు పేనించండి. వాళ్లు నా దేశంలో ఎందుకు ఉండాలి? పొమ్మనండి; పొమ్మనండి; ఇది వాళ్ల తాత సొమ్మా? సంస్కృతం వాళ్లచదువు; అది ఎవరూ చదువకూడదు. ఆపుస్తకాలన్నీ తగలపెట్టాలి. అని నా ఆజ్ఞ. ఓ.యస్ నౌకర్లూ, వింటున్నారా? జాగ్రత్త, ఈగుళ్లుగోపురాలన్నీ వాళ్లవి. అవన్నీ పడగొట్టండి. ఈరోడ్లు, కాల్వలు, ఆనకట్టలు, ఆస్పత్రులు వాళ్లకోసమే కట్టుకొన్నారు. అన్నీ ధ్వంసంచేయండి. ధ్వంసంచేయరేం" అని కేకలువెయ్యటం సిరాబుడ్డు నగ్గిరా గాజుసామానులన్నీ పగలగొట్టుచుండెను. ఏమేమో వాగుచుండెను. ఎవరు అడ్డుపోయినా అడుగనట్టులేదు. డాక్టరుగూడ వచ్చినాడు. బయటికి రమ్మన్నాడు. "డాక్టర్! నేను రాజును; నాకు సలాంచెయ్యవేం? ఇదిగో ఆకులుపురుదెబ్బ తగిలింది. పాప మేడుస్తూ ఉన్నది. దానికి కట్టుకట్టు" అని అద్దాల బీరువాను గురిచూచి ఒక్క గ్రుద్దుగ్రుద్దినాడు. గాజుపెంకులు గ్రుచ్చుకొని చేతికి రక్తము కారుచుండినది. డాక్టరు మంచిమాటలతో మెల్లగా వానిదగ్గరకు చేరి గట్టిగా పట్టుకొని చేతికి కట్టుకట్టి వానిని ఒకగదిలో పడవేసినాడు.

ఆరోజురాత్రి అక్కడనుండి ఎట్లాగో తప్పించుకొన్నాడు రాజారావు. అందరూ నిద్రపోయేవేళ యగుటవల్ల యేమీ గోలజరుగలేదు. మెల్లగా పార్థసారథి గుడియొద్దకు చేరినాడు. కోనేటియొద్దున పండుకొని వాగివాగి సొక్కి నిద్రపోయినాడు. తెల తెలవారుచుండగా పార్థసారథిఆలయములో మంగళ వాద్యములు మ్రోయుచుండెను. అది తన విజయధ్వానములనుకొన్నాడు. రాజారావు చప్పున లేచి కూర్చొన్నాడు. ముందుకు పార జూచినాడు. కోనేటిలో కనుపడుచున్న తన పాపను చూచినాడు. "నేను గెల్చినాను కాదా? ఇక నేను కార్పోరేషన్ మెంబరునేగా?" అని ఆ పాప నడిగినాడు. "ఏం మాట్లాడవే" మన్నాడు. అది పలుకలేదని కోపము వచ్చినది. ఎగిరి దాని నొక్క తన్ను తన్నినాడు. ఆ తన్నుతో తానే త్రెళ్లక్రిందైనాడు.

ఇహాలోకం





# మిత్రహితోపదేశము

నుంగిపూండి వేంకటశర్మ గారు

చదువుల్ నేరిచినావు పండితులలో సత్కీర్తి గన్నావు సం
పదలన్ గూరిచినావు గొప్పపదవుల్ మాకెల్ల జేకూర్చినా
వదిరా వారఘూటిమందిరము బాయన్‌జాల వేమందురా
చదువుల్ నేర్చిన లాభమా యిదివయస్యా, పండితగ్రామణీ!

మ. చదువుల్ నేర్చిన బుద్ధిమంతు లిటు నీచాచారలోలాత్ములై
మదికిన్ దోఁచినలీల వర్తిలినచో మాఢ్యంబునన్ బామరుల్
సదసజ్జ్ఞాన వివేకశూన్యమతులై స్వచ్ఛందసంచారులై
తుదముట్టింపరె నీతిగౌరవము నెందున్ బండితగ్రామణీ!

మ. చదువుల్ సంధ్యలులేని పామరులె దుస్సాంగత్యము ల్లేక దు
ష్పథముల్ ద్రొక్కక తల్లిదండ్రులకు హర్షంబొప్ప వర్తింపగా
చదువుల్ సంధ్యలు నేర్చి పాడయిన నీచందం బెదన్ రోసి యీ
చదువుల్ నింద్యములంచు వీడరె వయస్యా, ధీమణిగ్రామణీ!

చ. చదివినవానికంటె మరి చాకలి మేలనుమాట నిక్కమై
నదిగదరన్న, నీయెడల నన్నియెరింగి యధోగతిన్ బడన్
మది యెటులొప్పె నీకుఁ గొరమాలిన వారవధూపిశాచి యే
విధమున దాపరించె నిటు వెంగలివైతి వయో సుధీమణీ!

మ. నిను మించన్‌గల బుద్ధిశాలిగలడా నీవిట్లు మోహంపువా
హినిలోనంబడి కొట్టుకొందు వికని న్నేమందురా మందు రా
చిన దేమోగద మాయలాడి ధనరాజీవాక్షి యీపంత యెం
తని సైరింతు హరింతు నేగతిని మిత్రా, ధీమణిగ్రామణీ!

చ. కులసతి నేడిపించు టిది కూడదు చిల్కలకొల్కికంటి నీ
రొలికిన యింటియందు సిరి యుండగనొల్లదటంచు సీదృశల్
పలుకుదు రట్టి నానుడిని పాటియొనర్పక మిండగీడవై
వెలయుచు నాలి నిట్లుసురుపెట్టుట మేలగునే సుధీనిధీ!



'గరివేదీ' యనుచు ముసీవాడు అటునిటు చూచెను......అందరూ నేలపై చదికిలబడిరి.

# అవి యుద్ధపురోజులు

చింతలపాటి వెంకట శ్రీరాములు, బి. ఎ., యల్. టి.

అవి యుద్ధపురోజులు. యెక్కడ లేనిజనము నశింపు. ఒక ప్రక్కను యుద్ధము; అది ఆగిందో లేదో కాటకం. యుద్ధముమనము ప్రత్యక్షంగా చూళ్లేదుగాని సీమసరుకులధరలు మండిపోయినాయి. ఆరురూపాయలు, యేడురూపాయీలు అమ్మిన 1702మల్లు, తాను యిరవై, యిరవై రెండు అమ్మింది. పెట్టెలనిండా గుడ్డలుంచుకుంటూ, అయిదేసిజోళ్లు, ఆరేసిజోళ్లు, మల్లులు, డజనుకు తక్కువ లేకుండా ట్వీల్లు పట్టులు వుండేవాళ్లకుకూడా యేజోటితోనో సరిపుచ్చుకోవలసి వచ్చినది. పూటకు మూడు చీరెలువిడిచే పువ్వుబోణులు యేమూడింటితోనో కాలక్షేపముచేసిన పాపిష్ఠి కాలమది. మగవాడు యెంత గుడ్డంతోనైనా మానుషము కాపాడుకుంటాడుగాని స్త్రీలు సిగ్గు దాచుకోవలెనంటే కనీసం ఆరుమూళ్లగుడ్డయినా కావాలె. ఆరోజుల్లో పాటకజనంలో ఆడవాళ్లను చూడలేక సిగ్గయ్యేది. జనము మానుషానికి మగ్గిపోయినారు. ఆకాటకంమాటలు తలుచుకుంటే గర్భనిర్భేద మవుతుంది. శ్రీమంతుల మనుకునేవాళ్లు డబ్బుకు కిటకిటలాడారు. బీదవాళ్లు అంభోఅని అడలిపోయినారు. మధ్యరకం పడ్డపాట్లేనా! అసలే మంచి రోజుల్లోనే ఒక్కపూటకైనా కడుపునిండా గంజితాగడానికి నోచుకోక, చావుకు మొగము వాచి, ఆరుకోట్లమంది అల్లాడే దేశము. ఇట్లాంటిపాడుకాలములో వాళ్ల మాట యేమిటి? ఏనుగులవంటివాళ్లు పీనుగులైపోయినారు. ఆలికి మొగుడు లేదు; తల్లికి పిల్ల లేదు; ఒక్కపూట కడుపునిండా భోజనంబెట్టి కట్టుకొనుట కొక

కోకయిచ్చిన, కడుపారగని చేతులార నైదేండ్లు ఆరేండ్లు పెంచిన ముద్దుబిడ్డలను కడుపుతీపు కడకుత్రోసి పరులపాల్జేసిన తల్లులను ప్రత్యక్షముగా యెరుగుదుము. ఇట్టిస్థితిలో కంట్రోలు పద్ధతి యేర్పాటుచేసి ప్రభుత్వము వారు కొంత సహాయపడ్డారు. దానివల్ల ప్రజలకు ధాన్యము దొరకడమునకు సౌకర్యము యేర్పడ్డది. ఉద్యోగస్థులకు సంపాదించుకోటానికి మార్గము కనపడ్డది. యెన్ని వసతులు చేసినా డబ్బు మెదులుతుంటే గాదూ! కలవాండ్లగాదెలు తీసేసరికి బీదవాళ్ల వూపిరి పోతుంది. 'ఎల్లకాలము యిలా వుండబోదు. కఱువుపోయి కాలము కాగానే, రెక్కల కష్టముమీద మీఋణము తీర్చుకుంటాము బాబయ్యా' అంటే నమ్మి యిచ్చువాడెవ్వడు? దోపిళ్లు జరిగినవని, జరుగనున్నవని పోలీసు ఠాణాలకు ఒకటే రిపోర్టు.

వడ్డెర వెంకడిది మంచి మర్యాదగల కుటుంబము. వాడితాత మూర్తిగాడి కాలములో వాండ్లకు రెండువందల యెకరం మెరక వుండేది. అయిదు గాండ్లయెద్దులు, ఒకవంద పశువు, ఒకవెయ్యి జీవం (మేకలు, గొర్లు); యింటిముందర పాతరలు, పాడిగొడ్లు, యింట్లో పసిపిల్లలు, పాడికుండలు. వెంకడితండ్రులు ఆరుగురు అన్నదమ్ములు. వెంకడి తండ్రికి నలుగురు. వెంకడి పెళ్లాము కంటూ పెంచుతూ వున్నది. దుర్యోధనసంపత్తి; కుటుంబము భారమైనది. భాగాలు యెక్కువైనాయి. అతివృష్టి అనావృష్టి పంటలు తిన్నగా పండటం లేదు. పశువులజాడ్యాలు ప్రబలినాయి. కాని కాలములు దాపరించాయి. సంసారము ఋణముల పాలయింది. అప్పు ఆస్తికి మించిపోయింది. బాకీదార్లు వూరుకుంటారా? అప్పులవాళ్లకు అంతా కట్టిపెట్టి ఆవూళ్లోనే కాపురం చేయడమా! పూలమ్మిన వీథినే పుల్లలమ్మడము! ఆహాహా! రోజులమహిమ వెంకడీక హనుమంతుపాలెంలో వుండలేకపోయినాడు. నలుగురిలో తలయెత్తుకొని తిరుగడం యెలాగా? యెన్నితరాలనుండి తమపూర్వులు అక్కడ కాపరం చేశారో, యేయింట్లో తాము, పిల్లలు యింతకాలము సుఖముగా నుండిరో, ఆయిండ్లు, స్థలాలు అప్పుల క్రింద వప్పగించి, ఒకనాటి తెల్లవారుజామున బయలుదేరి, వెంకడు పెళ్లాము పిల్లలతో బండిపాలెము ప్రవేశించాడు.

యుద్ధము జయప్రదముగా ముగిసిందన్నారు. విసనను—— చేశారు. సంధి షరతులు బంధించారు. ఉత్సవాలు సాగించారు. కాని మన కెక్కడి సంతోషము? ఒకపక్కని క్షామదేవత బలులుగోరుతున్నది. ఒకపక్క యిన్ఫ్లుమెంజా పీల్చి పిప్పిచేస్తున్నది.

కానవిక్రాంతులు తల దాచుకోవలె నని వెంకడు బండిపాలెము వచ్చాడేకాని వానికి జీవనోపాధి? యేమివూళ్లు? రేగికాయకొరకలు! అయిదు మానికల జొన్నబియ్యము వుడకపోస్తే అందరికి అంతంత మాత్రముగా సరిపోయ్యే యిల్లు. వెంకడు యేమి చేస్తాడు? కొడుకులు యెదిగి చేతికివచ్చారు. కూలినాలి చేసుకుందామంటే పిలిచేదిక్కు కనపడదు. మడతకుడుములు దిని, కడుపులోకి కాళ్లుముడు

చుకోని పడుకోవడం వెంకడు వాడిపిల్లలు యింతవరకు యెరగరు. వెంకడిపెళ్ళాము అచ్చికి కుచేలుని భార్య వామాక్షికి వచ్చిన పాట్లు వచ్చాయి. పిల్లలగోడు చూడలేకపోయినాడు వెంకడు. కొడుకులు తాను కష్టము చేసుకొని జీవనం చేతామంటే మార్గం కనబడలేదు. యెక్కడో మునగాలపరగణాలో కరువుపనులు ప్రభుత్వమువారు ప్రారంభించారు అన్నారు. యెక్కడి కెక్కడ? ఆలాంటి పనులు వూరి కొకటిసాగించినా తీరదు గోడు. యిక వెంకడు వాడి కొడుకులు దారిదోపుడుగాండ్రగా మారవలసినదే! బందిపోటుదొంగలుగా ప్రబలవలసినదే? కన్నపుకత్తి కరమునందు ధరించవలసినదే!

మనకు తలవంపులు, మనప్రభుత్వమునకు బుగ్గపోట్లు తప్పకుండా, దయామయులు మన దేశీయుల కొందరిని నేరములు జేయుజాతుల (Criminal Tribes) క్రిందబారవేసి, క్రైస్తవ మతసంఘాలకు వప్పగించారు. వెంకడు వడ్డెర కులములోనే పుట్టాడుగాని తరతరములనుండి వ్యవసాయము చేసుకొని మర్యాదగా కాలక్షేపము చేసినవాడు. ఆనేరములు చేయు నేర్పు, ఆ కన్నములవేయు కౌశల్యము, ఆమెడల లోవి తెంచుకునే మెలుకువ, గొంతులుగోయు క్రౌర్యాలు యీ యీడున యెట్లలవడుతాయి?

బండిపాలెము కురవలో (కొండకనుమ) బందిపోటుమూక వున్నదన్నారు. యెవరో పెండ్లివాండ్లకు తగిలా రనుకున్నారు. పోలీసు స్టేషనుకు రిపోర్టు రానేవచ్చాయి. ఒకబ్రాహ్మణుడు అవతలివూళ్లో సత్యనారాయణ వ్రతముచేయించి వస్తూ విఘ్నేశ్వరపూజ మంటపారాధన బియ్యము, దక్షిణలు, స్వామివారి ప్రసాదము మూటగట్టుకున్న గావంచా (కొల్లాయి) దార్లోబెట్టి, లఘుశంకానివర్తి చేసికొని తరువాత దిగుడుబావి రెండువందల మెట్లుదిగి, పాదప్రక్షాళనానంతరం, ఆచమనంచేసి, తిరిగి పైకివచ్చి చూచుకుంటే ప్రాణపదమైన గావంచా పొడగాన రాకుండాపోయింది. బ్రాహ్మడు కుప్పవలె కూలి పోయినాడు. సర్కిల్ యినస్పెక్టరుగారు బ్రాహ్మణప్రభువు. శాస్త్రుల్లు వారికి వార్షికంగూడా వున్నది. వెళ్లి చెవిని వేయనేవేశాడు.

వెంటనే సబుయినస్పెక్టరు నాయుడుగారు, పదిమంది పోలీసులు చుట్టుప్రక్కల గ్రామాదుల యెరుకలయానాదిజనము, అట్టహాసనుగావెళ్లి వూరిమీదబడ్డారు. ఎలాగో తప్పుకోవలె గ్రామస్థులు; అందుకని సక్రమముగా వేటపోతులు, కోళ్లు, సారాబుడ్లు మొక్కుబళ్లు (నైవేద్యం) చెల్లిన తరువాత, కొత్తవాండ్లు-వడ్డెరకులము-నిరాధారులు-యేనుగులవంటివాళ్లు! బాగున్నది- వెంకణ్ణీ వాడికొడుకుల నిద్దరిని వాడి అల్లుణ్ణి పెట్టమన్నారు. తహశీల్దారు-మేజస్ట్రేటు (ఒకటే వ్యక్తి) కేసు సెషన్సుకు కమిట్ చేశాడు.

విచారణలో హనుమంతుపాలెం, సోమేశ్వరపురం గ్రామోద్యోగస్థులు, మోతుబరి రైతులు, సర్కారుకు యిన్కంటాక్సు కట్టే షాహుకార్లు, వెల్లాళ్ళు, సాక్ష్యాలు చెప్పారు వెంకడి తరఫున; మర్యాదస్థుడన్నారు. మొన్న

టివరకు పెద్దరైతన్నారు. జడ్జీగారికి అవన్ని అక్కరలేదు. వాళ్లది వడ్డెరకులం. మనుష్యులు మాగధమహిషముల లాగున్నారు. వీళ్లను విడిచిపెటితే అందరికి అలుసు అవుతుంది. అల్లరి మూకలకు హడలువుండదు అన్నారు. ఆరేసి సంవత్సరములు వేశారు. వెంకడికి వెంకట్రాయుడుగారిని శామ్యూలుగారిని బెట్టుకోవడానికి శక్తి లేకపోయింది.

యీ కేసు వచ్చినప్పటినుండి వెంకడు ప్రజలలో లేడు. వయసులో వెంకడు షైవికి జంపు, మెల్లో వెండిబిళ్లల మొలతాడు, శేరుశేరు వెండిమురుగులు చేతులకు బెట్టుకోని, కట్టమీద వెళ్లుతుంటే కాలితగరపు కుచ్చులజోడు కిర్రు వూళ్లోకి వినవస్తుండేది. ఏమైన దాసామంతము? రోజులమహిమ! కొయ్యయిపోయినాడు. వానిదృష్టికి ఆవిచారణస్థలము, అందలి విచారణకర్త, ఆపక్షవాదులు, మరియితరులూ యెవ్వరూ కనిపించడం లేదు.

కోర్టును న్యాయస్థలము లనటం, జడ్జిలను న్యాయమూర్తులనటం. మీదు మిక్కిలి ప్లీడర్లను న్యాయవాదులనడం-ఆస్థలములకు ఆవ్యక్తులకు అపచారం చెయ్యడం-వ్యక్తిని మూలచ్ఛేదముచేయడం. నిజానికి యింగ్లీషుముక్కలే బాగున్నవి. వానిలో యీన్యాయం అన్యాయం గొడవ లేనేలేదు.

అందుకనే "జడ్జీగారు ధర్మ ప్రభువులు జాలిగుండె చెప్పకో" అని పక్కవాళ్లన్నప్పుడుగాని 'నిన్నెందుకు కఠినముగా శిక్షించగూడ'దని శ్రీవారు గద్దించినప్పుడుగాని వెంకడు దారువు వలె నిలవబడ్డాడు. వానిధ్యాసంతా యెక్కడనో పన్నెండామడ దూరాన చుట్టు గుడిసెలో వున్న వాడి ముసలిదానిమీద పిల్లలమీద వున్నది. కడగొట్టుపిల్ల గుడివి. మూడోయేడు ముండకు. తండ్రి మాలిమి. బుజము దిగేదిగాదు. వాండ్లకు దిక్కెవరు? ఆమాట తలపుకు వచ్చినప్పడు వెంకడు నీఱయి పోయినాడు. 'యేజన్మలో తండ్రికి పిల్లలను యెడబాపానో?'

భగవంతునికి దయాదాక్షిణ్యముల గొడవ వున్నదా? వాడిసృష్టిలో చిన్న జంతువును పెద్దజంతువు; వాటి నన్నింటినిగాకుండా మనుష్యులు ఒకరినొకరు పీక్కొతినడం గనపడుతుంది. అందుకనే మన వేదాంతులలో పై మెట్టెక్కినవారు యీశ్వరుణ్ణి నిర్గుణుడన్నారు. మరి యీచిత్రక్షోభంతా యెందుకు? యీ నాటకానికి చముకుఖర్చు యెవరిది? కాలచక్రము మట్టుకు విసుగు విరామము లేకుండా పూరక తిరిగిపోతున్నది. అదృష్టవంతులు ఆ చక్రనేమిపై నిలువబడి సర్కస్‌లో ఫీటు చేసినట్టుగా కేరింతలు గొట్టుచున్నారు. అదృష్టహీనులు అధోభాగమునబడి వ్యసనలపా లగుచున్నారు. ఆయానందమునకు యీవనటకు యోగ్యతాయోగ్యతలు కారణములుగా గనపడవు. యిక కర్మము-ప్రారబ్ధము- పూర్వజన్మ సంచితం-దీనికి మొదలూ తుదా యేమిటి? పరమావధి యేదో-సారూప్యమో, సాయుజ్యమో, యేమేమో-చెప్పేవాళ్లకు కొంత తెలికేగాని, పునాదిలోనే వున్నది బాధంతా. ప్రారంభం యెక్కడ? విత్తు ముందా చెట్టు

ముందా? సరియైన సమాధానం చెప్పాలంటే చావు దగ్గరికు వస్తుంది.

డెబ్బయిరెండు నెలలూ యెలాగో గడిచి పోయినాయి. దానికేమిటి? యుగములు గడిచి పోయినయి. కష్టములు కలకాల ముండవు. ఆపదలు కాపరాలు చెయ్యవు. అమావాస్య నాడు కటికి చీకటి; పౌర్ణమినాడు పండు వెన్నెల. వెంకడు, వాడి కొడుకులు, అల్లుడు విడుదల అయినారు-పాపము యీ ఆరుసంవత్సరములలో అంతా ఒకచోట వుండి ఒకరి కొకరు ధైర్యము చెప్పుకునేందుకైనా లేకుండా దేశానికొకడై పోయియుండిరి.

కాలుచేతులనుండి సంకెలలు పడిపోవడంతోటే వెంకడి హృదయములో నిక నిస్పృహా, నిరాశయనుపెనుభూతములకు చోటు లేదు. ఒక్కసారిగ జాలి, అనురాగము వాని శూన్య హృదయమును జొచ్చి నిండి వెల్లివిరియబారెను. వెంకడు అట్టె పెళ్లాముపిల్లల దలచుకొని అడుగు వేయలేకపోయినాడు. గురివి, తన ముద్దులగురివి. వరాలమూట, మూడేళ్లదాన్ని విధిలేక విడిచిపెట్టిపోయినాడు.

అచ్చి, పిల్లలు యిప్పుడు బండిపాలెములో లేరు. జగ్గయ్యపేటనుండి కృష్ణాతీరమున నున్న వేదాద్రిక్షేత్రమునకు రోడ్డువేయడం కరువుపనులలో ఒకటి. తాను, కూతురూ చెరి రెండణాలు తెచ్చుకొని కరువు గడుపుతూ, అమాసాలు పున్నాలు లెక్కపెట్టుకుంటూ, అమ్మవారికి వెర్రి మొక్కులు మొక్కుతూ వున్నారు. యింతలో కాటకం పోయింది. కాలమయింది. కోతవేత, కూలినాలి దొరుకుతున్నది. నవాబుపేటలో బతుకుతున్నారు.

కాముడిపున్నమి ముందు ఒకనాడు వుదయం ఝాముప్రొద్దెక్కింది. అచ్చి గంజి దాగి కాళ్లకు పసుపురాచుకొని, మొగాన డబ్బవెడల్పున కుంకుమబొట్టుపెట్టుకొని మెడకుముంజేతులకుగంధముబూసుకొని-అచ్చికాపరానికి వచ్చింది మొదలు దరిద్రములోనైనా యివి యెన్నడూ మానిమెరుగదు- గుడ్డ, కొడవలి దీసికొని గుమ్మములోకి వచ్చింది. కరణముగారికి దినం గడ్డిమూటవేస్తే నెలకు రెండురూపాయీలు యిస్తారు. ఒకముసలివాడు యేమో వెదుక్కుంటూ ముందు, వెనుక తలవంచుకొని ముగ్గురుపడుచు వాళ్లు మొత్తలోకివచ్చి నిలువబడ్డారు. అట్టేచూచి ముసలివాడు గద్గద స్వరముతో నేమోగొణిగికొన్నాడు. అచ్చి వచ్చిన వాళ్లనుచూస్తూ నిలువబడి పోయింది. గుడ్డ, కొడవలి తమంతటజారి పడిపోయినవి. కన్నుల వెంట నీరు కాల్వలు గట్టుచుండెను. యింతలో కొడుకులు తల్లిదగ్గరకు వచ్చిరి. 'గురి వేదీ'యనుచుముసలివాడు అటునిటుచూచెను. అచ్చిగుండె వ్రక్కలయిపోయెను. అందరూ నేలపై చదికిలబడిరి. తండ్రి బెంగతో, తిన్నగా కారం మెతుకులైనా, ఒక్కొక్కనాడుగంజిగుటకైనా, లేకపోవడంతో గుమ్మటమువలెనున్న గురివి చిక్కిశల్యమయి యెన్నడో దాటిపోయింది కష్టసుఖాలు యెరక్కుండా. ముసలివాడు తనలోతాను గొణుకు

ఆడిస్తా డప్పుడప్పుడ

కూర్చున్నది.

వచ్చాడు.

కళ్లచూసుకునే రోజులు వస్తున్నవిగదా యని బానలో దాచుకున్న కూలిగింజలు దీసి దంచి వుడకవేసి అమ్మవారికి పసుపుకుంకుమ నైవేద్యము బెట్టి, అందరు ఒక్కమారుగా సానికలలో బెట్టుకొని కష్టసుఖాలు చెప్పుకొంటూ అన్నాలుదిన్నారు. కమ్మవారి కాంతమ్మగారు ముంతెడు చిక్కనిమజ్జిగ, పట్టెడు వుల్లిపాయవేసినూరిన గోంగూర పచ్చడి పెట్టింది. వెంకడుమటుకు బిక్కమొగ మేసుకున్నాడు. గురివేది, వాడిపొత్తులో గూచునేది? కులపువాళ్లు వచ్చారు, యిరుగుపొరుగు వచ్చారు. వెంకిణ్ణిఓదార్చడానికి.

ఆరోజు మొదలు ప్రతిరాత్రి బీటు పోలీసు రావడం కేకవెయ్యడం. వెంకడు 'హాజరయ్యా' అనడం; గుడ్లనీళ్లు గుక్కుకోవడం. కొడుకులు రెక్కలమీద జీవనం చేస్తున్నారు. పెండిండ్లు అయినాయి. ఒకజత దున్నపోతులను సంపాదించుకున్నారు. బ్రాహ్మల యినాములు మక్తాలకు తీసికొని వ్యవసాయం చేస్తున్నారు. వెంకడికి, అచ్చికి కష్టాలు గడిచిపోయినవి. కాని వెంకడికి మాత్రము ఫ్రాచ బియ్యము దింటున్నా, దోసకాయ తరుక్కుంటున్నా, గురివిజ్ఞాపకము రాకమానదు. ఉత్తరియ్యము (పైబట్ట) చెంగుతో కండ్లు దుడుచుకోక మానడు.

సంప్రాప్తము

## ప్రతీక్ష

"విద్యార్థి"

శ్రవణములఁ జేరవచ్చు నీ శ్రావ్యలోక
మోహకర వేణునిక్వణముగ్ధగీతి
మానసము పుంఖరింప ననూనవాంఛ
శ్రవణమీయఁగ నిశ్శబ్ద సరణి దోఁచు.

ఘ్రాణమునఁ జేరినట్లౌ నవీనవికచ
దామనిర్యాత పరిమళోద్దామమనఘ
అల్లిబిల్లిగ భావము లల్లుకొనఁగఁ
గాలి యుచ్ఛ్వాసమొనరింపఁ బూల్పెలేదు.

నీకామనీయ
కులమూర్తి

కోర్కె లీరికలెత్తఁగాఁ గోరి కన్ను
దోయి తెఱచినతోడనే మాయ పోదు.

దేహమున సోకినటులైన దివ్యనూత్న
మృదుల నీ రేజసేవ్య సమ్మృష్టకరము
పల్లవింపఁగఁ దలఁపులు బాహుయుగము
సాచి వెదకి బయళ్లని సంభ్రమింతు.

నమ్మి నిర్మల ప్రేమపూరమ్ము దలఁచి
నవ్యభావోదయమ్ము లనంతములుగ
నెమ్మితో భవదాగమనమ్ము కొఱకు
గాంచితిని కృష్ణ, నీదయఁ గాంచనైతి.




# ప్రభావతి

ఆ. భాస్కరమ్మ గారు

సాయంకాలము నాలుగుగంటలయినది. అది చైత్ర మాసమగుటచే నెండ యింకను తీక్ష్ణముగానుండెను. కాకినాడ పురవీథులు విశాలములగుటచే నంగడివీథియైన జనసమ్మర్దమంత యెక్కువగా గాన్పించుటలేదు. అది సాయంకాలమగుటచేతను, వసంతఋతు వగుటచేతను, బాట కిరుప్రక్కలం దీర్చి కట్టబడియున్న యంగళ్లు చూచుట కెంతయో మనోహరముగానుండెను. సర్వసాధారణముగానుండు బట్టలదుకాణములు, మిఠాయిదుకాణములు మొదలగునవిమాత్రమే కాక నూతనముగావచ్చిన వసంతకుమారుఁ డా పురియంగళ్లు జూచువేడ్క బాటయందు సంచరింపుచుండెనాయని చూపరులకు భ్రాంతికలిగించునట్లుందందు మల్లె, గులాబి, సన్నజాజి మొదలగు పూలయంగళ్లుకూడ నొప్పారుచుండెను. ప్రతిదుకాణమునందును మల్లెపూసరులు వ్రేలాడుచుండెను. పుష్పలావికలు తమహస్తములందు మల్లె, విరజాజి, పొగడ మొదలగు పుష్పమాలలవేసికొని యటునిటు దిరుగుచు కేకలువేసి యమ్ముచుండిరి. అది పట్టణవాసమైనను, నందును నంగడివీథియయినను నీపుష్పసరులును, రాసులును, పూలయంగళ్లును వసంతఋతు సౌభాగ్యమును కొంతవరకు వెలిపుచ్చుచుండెను.

ఆసమయమున నొక యొంటెద్దుబండిలో తొమ్మిదివత్సరముల యీడుగల యొకబాలికయు, నేబది వత్సరముల వయస్సుగల యొకవృద్ధస్త్రీయు నెక్కడికో యేగుచుండిరి. ఆబాలిక బక్కపలుచగ నుండెను. ఆమె దేహచ్ఛాయ పసిమితోఁగూడిన తెలుపువర్ణము గలిగి తేజోవంతముగానుండెను. విశాలమగు ఫాలమును, చురుకు చూపులుగలిగి తేజోవంతములై సొగలు దేరియున్న నేత్రములును నామెముఖమున కొకవింతకాంతి నొసఁగుచుండెను. తగుమాత్రము ఒత్తును, ఒత్తునకుఁదగిన నిడుపును గలిగి నల్లత్రాచువలె మోకాళ్లవరకు వ్రేలుచున్న వాలుజడ యామె సొగసుందనమునకు మరింత వన్నె వెట్టుచుండెను. ఆమెను దేనితోఁ బోల్పవలయునో నాకుఁ దెలియదు గాని యామెను జూచువారందఱు బంగారు బొమ్మయనియు, మతాబుతీగయనియు వర్ణిం



చుచుండిరి. ఆమె ధరించిన వస్త్రములును, వస్తువులును నంత విలువగలవిగాక సామాన్యముగా నుండి యామె యొక సామాన్యకుటుంబికుల పిల్లయని చెప్పకయే చెప్పు చుండెను. ఆమె యెంత సామాన్యముగా నున్నను సౌందు ర్యవలననో చూపరనంచుకు యాకర్షించుచుండెను. బండి పూల యంగళ్లవద్దకు వచ్చువరకందున్న వారిరువురు నంగళ్లయొక్క శృంగారముంజూచుచు నొకరితో నొకరు మాట్లాడక మౌనవ్రతమును బూనియుండిరి.

బాలిక:—అమ్మమ్మా! అన్నట్లు మరచిపోయినాను. ఎక్కడికైనా వెళ్లవలయుననియు, బండి నెక్కవల యుననియు తొందరేకాని యెక్కడికి వెడతామో నిన్నడుగనేలేదు. ఎక్కడకు వెడతామో చెప్పవు?

వృద్ధస్త్రీ:—'తినబోతూరుచి', 'ఆడగబోతూలోతు' నను గనేల? వెళ్లినతరువాత నీకే తెలుస్తుంది.

బాలిక:—పోనీ, అక్కడ పెద్దవాళ్లు మీరు, మీరు మాట్లాడుచుంటే నాకేమి తోచదు. నాతోకూడా ఆడుకొనుట కెవరైనా చిన్నపిల్ల లున్నారా?

వృద్ధస్త్రీ:—ఆ, లేకేమి? వాళ్లకొక చిన్న అబ్బాయి యున్నాడు. మేము, మేముమాట్లాడుకుంటూం టే నీవు ఆ అబ్బాయి యాడు కొనవచ్చును.

బాలిక:—ఆ అబ్బాయి కెన్నేళ్లుం టాయి?

వృద్ధస్త్రీ:— నీతో నాడుకొనుట కీడుగనేయుంటాడు. పదిహే నేళ్లుంటాయి.

బాలిక:—అబ్బా! అంతబ్బాయితో ఆడుకోటానికి నాకు సిగ్గేస్తుంది బాబు!

వృద్ధస్త్రీ:—సిగ్గెందుకు? చనువయితే సరి. అన్ని సిగ్గులు వదులుతవి. ఇక ఆ అబ్బాయిని వదలి యువతులకు రానేరావు.

ఆమె భావగర్భితములగు మాటలు పాప మాబా లికకర్థము కాలేదు. వీరిట్లు మాట్లాడుకొనుచుండగా బండి రామారావు పేటలోనున్న యొక సంపన్నుల గృహమునొద్ద యాగెను. ఆ వృద్ధస్త్రీయు, బాలికయు బండిదిగి లోనికేగిరి. గృహము విశాలముగను, పెద్దది గను, నందముగను నుండెను. కాని గృహమునకుఁ దగిన జనులులేక చిన్నవోయి యుండెను. వీరు లోని కేగిరి గాని యెదుర్కొనువా రెవరును నందు వీరికి గాన్పించ లేదు.

౨

వృద్ధస్త్రీ:—లక్ష్మీదేవి వదినా, ఎక్కడున్నారు? ఎక్క డా యెవరు కనబడలేదు?

లక్ష్మీదేవమ్మ:—నూతియొద్ద నుండివచ్చి-బుచ్చెమ్మ వది నా, నూతివగ్గర అబ్బాయికి వంటిమీద నీళ్లు పోయుచున్నాను. అల్లారండి. ఆ అమ్మాయి యెవరు? మనుమరాలా యేమి?

వీరిట్లు మాట్లాడుకొనుచు నూతియొద్దకు వెళ్లిరి.



ఆ నూతికిచుట్టు గృహమునకు సంబంధించి యొక తోటయున్నది. ఆతోట తీయమామిళ్లు, బత్తా యి, జామి మొదలగు ఫలవృక్షములతోడను, వారి బాలు నిచే విలాసార్థము నాటఁబడి, పెంపఁబడుచున్న మల్లె, మొల్ల, గులాబి మొదలగు పూలమొక్కలతోడను నలరా రుచు నాగృహమున కొకవింత యందమును నొసగుచుఁ బూర్వపు రాచకన్నియల గృహోపవనములను జ్ఞప్తికిఁ దెచ్చుచుండెను. తోటలో నూతికి కొంచెము దూరమున

నొక లేడిపిల్ల గంతులు వైచుచుండెను. ఒక చూతవృక్ష ముపై నెమలియొకటి పురివిప్పి యాడుచుండెను. నూతి చుట్టూ దట్టా కట్టబడి నీరు ధారాళముగాఁ బోవుటకు తూములేర్పఱుప బడియుండెను. అక్కడ పైనచెప్ప బడిన విధముగా లక్ష్మీదేవి తనముద్దులపట్టికి నీళ్లు వోయుచుండెను. ఆ బాలునకు పదునైదువత్సరముల వయస్సుగలదు. కొంచెము పుష్టిగనుండి పుష్టికిదగిన పొడవును, చామనచాయయును గలిగియుండెను. అంగ సౌష్ఠవమంతయు సరిగా నుండుటచేతను, ముఖమునం దొకవిధమగు నైశ్వర్యకళ యొప్పుచుండుటచేతను, నాబా లుఁడు చాయలో కొంచెము నలుపైనను నందగాండ్ర లోనే యెన్నదగియుండెను. నల్లపట్టు కుచ్చులవలె నతి మృదులములై యుంగరములు తిరిగియున్న గిరజాలును, గిరజాలపైన మల్లెపూలదండచే నలంకరింపఁబడిన ముచ్చ టముడియుఁగలవు. చేతులకు మురుగులు, మురిడీగొలు సులు, దండకడియములును, చెవులకు తమ్మంట్లును; మొలకుబంగారు మొలత్రాడును, మెడలో చంద్రహార మును, కాళ్లకు కడియములు, గొలుసులును గలిగి, బాల కృష్ణునివలె నొప్పారుచుండెను. మనోహరమగుతోటయు, నాతోటలో స్నానముచేయుచున్న యాబాలుఁడును, బృందావనమును, నందు జలక్రీడను సలుపుయశోదానంద నుని తలపింపజేయుచుండెను.

బాలుడొక చిన్నవస్త్రమును గట్టుకొని నీళ్లుపో సికొనుచుండుటచే క్రొత్తవారిని జూచుటతోడనే సిగ్గు పడి తలవంచుకొని వెనుకకుదిరిగెను. అక్కడకు వెళ్లుట తోడనే ప్రకృతివీక్షణకుతూహలయగు నాబాలిక యొక్క దృక్కులు తొలుదొల్త నాతోటయందలి రం గురంగుపూలు, పూలపై రొదసేయుచుఁ దిరుగుచున్న తుమ్మెదలు, పురివిప్పి యాడుచున్న నెమలి, గంతులు వేయుచున్న లేడిపిల్ల మొదలగువానిమీదికే వెళ్లెను. కాని యెందువలననో యవి వెంటనే యక్కడనుండి మరలి యారామణీయమున కంతకు నాథుడగు నా బా లునిపై బ్రసరించెను. పాపము బాలిక యేమియు నెరు గని ముగ్ధయగుటచే తనపై పితరులు చూచుచున్నారను మాట యెఱుగక తనతో నాడుకొనబోవు బాలుఁడీ ఁడే కాబోలుననియో, యాబాలుఁడు తాను సాధారణ ముగాజూచు తక్కినబాలురవలె వస్త్రములేమియు లేక క్రాపింగుతలతో నుండక యాడుపిల్లవలె పూర్తియైన వస్త్ర ములతోడను, పూలుముడువబడిన జడతోడను వింతగ గనబట్టుచుండుటచేతనో తదేకదృష్టితో నాతనిపైనే చూచుచుండెను. బాలుడుమాత్ర మిప్పుడు తానున్న వేషముచే సిగ్గుపడిపోయి వంచినతల యెత్తనేలేదు. ఈ దృశ్యమును జూచుచున్న స్త్రీ లిరువురును చూచి, చూచి పక్కుననవ్విరి. బాలిక సిగ్గుపడి తలవంచుకొనెను.

బుచ్చెమ్మ:—వదినా, మంచిసమయమునకే వచ్చితిమి. అమ్మాయీ, ప్రభా, బాగా చూచుకొనువమ్మా! ఆనక మళ్లీ ఆవంకుంది యీవంకుం దంటావు.

లక్ష్మీదేవి:—'మీరు చెప్పనక్కరలేదు. మీమనుమరా లేమి వెర్రి బాగులదనుకొంటివా యేమి? వచ్చినదిమొ దలు మాపిల్లనే చూచుచున్నది.' ఈమాటలతో నా బాలబాలికల కిరువురకును సిగ్గు మిక్కుట మయ్యెను. ఇరువురును వంచినతల యెత్తలేదు. లక్ష్మీ దేవి బుచ్చెమ్మతో నేమేమో మాట్లాడుచునే కుమా రునకు ఒళ్లుతుడిచి, బొట్టుపెట్టి, పెట్టెనుండి దుస్తు లమడతలను దీసి తొడిగి యాడుకొనఁబంపెను.

ఇంతక్రితము చిన్నబట్టతోనుండి నీళ్లుపోసికొను చుండుటచే బాలుఁడా క్రొత్తవారిని జూచుటకు సిగ్గు పడెను. ఇప్పుడు పరిపూర్ణవేషములోనుండెను. వారిని, నందు ముఖ్యముగా నాబాలికను సరిగా చూడవలయు ననియు, తన పరిపూర్ణవేషమును వారికి జూపవలయు ననియు నాతనికి కుతూహలముగా నుండెను. అందువ లన నాటకు వెళ్ళక యేదోపనియున్నట్లు తిరుగుచక్కడనే మసలుచు వచ్చెను. లక్ష్మీదేవమ్మయు, బుచ్చెమ్మయు నేమేమో మాట్లాడుచుండిరి. బాలుడు కొంతతడ వక్క డనుండి పిమ్మట నాటకువెళ్లెను. ప్రభావతికి వారిమాట లలో నొకటియు నర్థమగుట లేదు. ఆమె వానిని విని పించుకొనుటకూడ లేదు. ఆమెదృష్టియంతయు నాగృ హమునందున్న బొమ్మల బీరువాలమీదను, వివిధములగు నాటవస్తువులమీదను, నాటలాడనేగిన యాబాలునిమీద నేయుండెను. ఆబాలునితో స్నేహముచేసిన నాబొమ్మ లతోడను, నాటవస్తువులతోడను నాడుకొనవచ్చును గదాయనియు, నయనములకు విందొనర్చుచు నతిమనో

ణ్ణముగానున్న యాయుద్యానవనవాటికయందలి పుష్పములగోయుచు, లేడిపిల్లతోపాటు గంతులువేయుచు, నెమలినృత్యములనుజూచియానందించుచు, నా బాలునితో కలసి విహరింపవచ్చును కదాయనియు నాలోచించుచుండెను. వీరువచ్చి చాలసేపైనది. బండివాడు తొందర పెట్టుచుండెను అందువలన బుచ్చెమ్మమాటలను జవాబించి మనుమరాలిని దీసికొని వెడలిపోయెను.

# 3

లక్ష్మీదేవమ్మతండ్రి చాల ప్రఖ్యాతపురుషుఁడు. వారి నియోగిశాఖలో ధనమునందైతేనేమి, యోగ్యతలోనైతేనేమి, పాండిత్యము, శాస్త్రపరిచయము, హోదా మొదలగు వానిలోనైతేనేమి యాయనతో సరిసమాను లెవరును లేరు. ఒకకాకినాడ పట్టణమేకాదు. ఆంధ్రమండలమంతటిలోను నాయన నెఱుగనివారు లేరు. ఆయన యోగ్యత, శాస్త్రజ్ఞానము, నన్నిటికంటె నెక్కుడగు ఆయనదాతృత్వము మొదలగు వానివలన ప్రజలకందఱకు నాయనయందు మిక్కుటమగు భక్తి తాత్పర్యములు గలవు. ఆయనకు సిరితోపాటు సంపదగూడ విస్తారముగనే యుండెను. ఆయన సంతానములో లక్ష్మీదేవమ్మ మొదటి పుత్రిక. ఆమెకు పదునారవయేట నొక పుత్రరత్నము జన్మించి యాబాలుఁ డారుమాసముల వయస్సులో నుండగా భర్త గతించెను. అందువలన నామె తన చిన్నిబిడ్డతో పుట్టినింటనే యుండెను. తక్కిన విద్యతోపాటామెయొద్ద చిత్రకళానైపుణిగూడ కొంత యుండుటచే భారత భాగవతాది యుద్గ్రంథములను జదివి వాటికి వ్యాఖ్యలు చెప్పుటతోపాటు, పూసలు, చెమికీ మొదలగు వానితో చిత్రవిచిత్రములగు పనులు చేయుచును, రకరకములగు బొమ్మలనుకొని వాని నాభరణములతోడను, వస్త్రములతోడను నలంకరించుట, దేవతా విగ్రహముల కలంకారములు చేయుట మొదలగు పనులను జేయుచు తనజీవితమును సంతోషదాయకముగా నొనర్చుకొనుచుండెను. ఆమె కలంకారములు సేయుటయం దత్యంతాసక్తి. తనకు మగపిల్లవాఁడైనను, నాడుపిల్లయినను నా యొక్కబాలుఁడే. ఆ బాలుని తల్లివైపువారును, తండ్రివైపు వారునుగూడ మిగుల భాగ్యవంతు లగుటచేతను, నంవఱు కొతఁడ ఱచేతి నిమ్మపండగుటచేతను వారు వీరుచేయించిన వస్తువులు విస్తారముగాగలవు. తన బొమ్మలతోపాటు తనబాలునికి గూడ గడియకొక వేషమువేసి యలంకరించుచు, నాతఁ డాశృంగారములతో దనయెదుట నాడుకొనుచుండ మాది యానందించుచు భర్తృవియోగజనిత దుఃఖమును కొంతవరకు బాపికొనుచుండెను. ఆబాలుఁడనిన నందఱకతిముద్దు. అయినను గారాబముచే బిల్లలను బాడుచేయు కొంతమంది సంపన్నులవలె గాక వీరందఱు విద్యావంతులు, జ్ఞానవంతులు నగుటచేతను, నందు ముఖ్యముగా తల్లి మిగుల యోగ్యురాలగుటచేతను వాని కుగ్గుపాలతోడనే సద్గుణములను నూరిపోయుచుండిరి. ధనమున్నదికదా యనియు, నొక్కఁడే పుత్రుడనియు విద్యావిషయములో నెంతమాత్ర మశ్రద్ధచేయ లేదు. ఇప్పుడా వాఁడయినవశారములో జదువుచుండెను. బుచ్చెమ్మ, ప్రభావతి వెళ్లినగృహము లక్ష్మీదేవమ్మ యత్తవారిల్లు. అప్పుడామె యక్కడ నుండెను. కొమారుఁడు పెద్దవాఁడయినను దనముచ్చట కొరకాతని నట్లలంకరించుచుండెను.

# ౪

మంత్రిప్రగడ చంద్రశేఖరముగారొక సామాన్య కుటుంబికుడు. ఆయనభార్య సుశీల నిజముగా సుశీలయే. ఆమెయడకువ, పతియందలిభక్తి, బిడ్డలను బెంచుటయందలి నేర్పు, బంధుప్రీతి, గృహనిర్వాహదక్షత, నిరుపమానసహనశీలము, యతిథ్యభ్యాగతులయందలి యాదరణ యామె పేరును సార్థకపరచుచుండెను. ఇంతయేల? సుగుణములన్నియు నొకప్రోవుగాజేసి బ్రహ్మ యామెను సృజించెనాయనున ట్లొప్పుచుండెను. చంద్రశేఖరముగారికి భార్యయం దమితప్రీతి. ఆమెనువిడిచి ఒకక్షణమయిన నాయన యుండజాలరు. చిన్నవయసువారగుటచే నాయనపేరింకను పైకిరాలేదు కాని యాయనకుగల యసాధారణాత్మగౌరవము, మనస్థయిర్యము, స్వాతంత్ర్యాపేక్ష, పరోపకారపారీణత, యాత్మవిశ్వాసము మున్నగునున్నతగుణములు ముందుముం దాయనఁడు ప్రఖ్యాతపురుషుడు కాగలడని సూచింపుచుండెను. స్వాతంత్ర్యాపేక్షలో నాతనితోసాటి వరియొకరు లేరనియే చెప్పవచ్చును. ఇతరులకు లోబడి ఉద్యోగము చేయుట

తనకిష్టములేక స్వతంత్రముగా ధనార్జనచేసి జీవింప సాధ్యమగు వైద్యవృత్తి నవలంబించి సాధారణ జీవయాత్ర గడపుచుండెను. ఆయన వైద్యవిద్యలో నేవిధమగు పెద్దపెద్ద పరీక్షలలో నుత్తీర్ణులు గాకున్నను, తనబుద్ధి కుశలతచేతను, నావృత్తియందు తనకుగలప్రీతిచేతను తనపనియం దసాధారణప్రజ్ఞ గనబఱచుచు నాపట్టణమునం దంతటి ఘనవైద్యులు లేరను పేరునొందుచుండెను. ఇంచుమించుగా పట్టణమునందలి ధనికులందఱు నాయన యొద్దకే వైద్యమునకు వచ్చుచుండుటజేసి ధనము బాగా సంపాదించుచుండెను. ఆయన కప్పటికి ముగ్గురుకొమార్తెలును, నిరువురు కొమారులునుగలరు. ప్రభావతియే మొదటిబాలిక. అందువలన తలిదండ్రుల కామెయం దమితప్రేమ. ఆమె దినదినప్రవర్ధమానయై యెదుగుచున్నకొలది దలిదండ్రుల కామె వివాహవిషయమై చింత యెక్కుడగుచుండెను. కట్నములు కానుకలిచ్చి తగినవరుని సంపాదించుటకు దగిన ధనికులుగారు. చూచి, చూచి సామాన్యులకు తమ ముద్దులపట్టి నీయ మనసొప్పదు. దూరపు సంబంధమయిన యెడల నామెను విడిచి చాల కాల ముండజాలరు. ఇదియే వారికి పట్టుకొన్న దీర్ఘ విచారము.

ప్రభావతి యచటి బాలికాపాఠశాలలో నాలవ తరగతిలో చదువుచుండెను. ఆమె కిప్పుడు తొమ్మిది వత్సరములప్రాయము. హిందూ బ్రాహ్మణాచారము ననుసరించి వివాహయోగ్యయై యున్నది. 'పెమ్మరాజు గోపాలరావుగారి మనుమ డున్నాడు. ఆసంబంధము చాల మంచిది. దానికొఱకై యెందుకు ప్రయత్నించ గూడ'దని యెవరో చంద్రశేఖరముగారితో జెప్పిరి. వారిఖ్యాతి చంద్రశేఖరముగారికి తెలియును. ఆవిషయమై యాలోచించుట "అందని మ్రానిపండ్లకాసించు" టనియు, "గగనకుసుమముల గోయ ప్రయత్నించు" టనియు, నంత గొప్పవారు సామాన్యులగు తమ బాలికను జేసికొందురాయనియు—నాబాలునకు వేలకొలదిరూప్యముల గట్నములిచ్చెదమని వచ్చుచున్నారు, అట్లు తామీయఁగలమా యనియు, వారితో దులతూగ గలమా యనియు, నింతవర కావిషయమై యాయన తల పెట్టలేదు. కాని పలువు రాయన కాసచూపుచు వచ్చుట చేత పోని యెట్లుండునో చూతమని యాయన యత్తగారితో నొకరోజున వారింటికివెళ్లి యీధోరణి కొంచెము తీసికొనివచ్చి 'చూడం'డని చెప్పిరి.

ఒక దినమున ప్రభావతి సాయంకాలము నాలుగు గంటలకు బడి విడిచినతోడనే యింటికివచ్చెను. తల్లి యప్పుడేకుట్టి సిద్ధముచేసిన పరికిణీకట్టి, చొక్కాతొడిగి తగుమాత్రముగా వస్తువులనుబెట్టి కొమార్తె నలంకరించి యమ్మమ్మతోగూడ బంపెను. ప్రథమదర్శనముననే బంగారు బొమ్మవలెనున్న యాబాలికరూపు, రూపమునుమించిన యామె కురులసొగసు లక్ష్మీదేవమ్మ నాకర్షించెను. దానిపైని బుచ్చమ్మ చమత్కారపు సంభాషణ కొంతవరకు పనిచేసెను. అదిమొద లామె మనస్సున నాబాలిక తన కొమారునకుఁ దగియున్నదనియు, చేసికొనిన బాగుండుననియు తలంపసాగెను. 'పిల్ల రూపరేఖావిలాసములు బాగున్నవి. గౌరముగలకుటుంబములో మంచిశిక్షలో బెరిగిన బాలిక. చదువుకొనుచున్నది. ఊళ్లోయారు. వారు నవనాగరికులగుటచే సరదాలు బాగా తీరును. ఆమె తనకొమారునకు భార్యయైనయెడల వారిరువురు విష్ణుమూర్తి లక్ష్మీదేవులవలె నొప్పుచుందురు. ఆకొమారుని, కోడలిని పెట్టుకొని తాను భూలోకస్వర్గము ననుభవింపవచ్చు'ననియే యామెతలంపు.

౫

సంబంధమయినయెడల నిక చంద్రశేఖరముగారి యానందమునకు మితియేయుండదు. సాధారణముగా పుత్రికలతండ్రులు వరులవిషయమై యాలోచించు లక్షణములలో నొకటైన లోటు లేకుండ నన్నియు నాబాలునొద్దనున్నవి. వయస్సా? పదునైదు సంవత్సరములు. రూపమా? కొంచెము చాయతక్కువన్నమాట తప్ప నికనేలోటును లేదు. ధనమునకా లోటు లేదు. ధనికులగుటచే విద్య లేదేమోయన్న వయస్సునకు దగినవిద్య, విద్యకుదగినయోగ్యత అన్నియు దగియున్నవి. అన్నియు బాగానేయున్నవి. దూరమేమోయనుకొన్న ఊళ్లోసంబంధము. తమపుత్రిక నెడబాసియుండ నక్కరలేదు. ఆసంబంధమైనయెడల కూతులగన్న తండ్రియగు తనతో సమానముగ ధన్యు లిక నీలోకమున నుండరనియు, ప్రభావతి యదృష్టమునకు మేరయుండునాయనియు

చంద్రశేఖరముగారు తలపసాగిరి. లక్ష్మీదేవమ్మకు నామె తండ్రిగారికి బాలికమీఁద మోజున్నట్లును, చేసికొనుట కొడంబడుచున్నట్లే యున్నారనియు చంద్రశేఖరము గారికి దెలియుచువచ్చెను. కాని తొందరపడి మరియొకసారి యడిగినయెడల వారు కట్నమెక్కుడ నెక్కువ తెమ్మందురోయని భయము.

ఇది యిట్లుండ శివరావునకును, ప్రభావతికిని పెండ్లిబేరములు జరుగుచున్నట్లూళ్లో అందఱకును తెలిసెను. వీరిరువురియొక్క పాఠశాలలందు గూడ తెలిసినది. ఇరువురు నొకబాటమీదుగనే వారివారిబడులకు బోవలసియుండుటచే తరుచు మార్గమధ్యమందు కలసికొనుట తటస్థించుచుండెను. నీభార్య అదిగోయని శివరావు స్నేహితులును, నీభర్త యడుగోనని ప్రభావతి స్నేహితురాండ్రును హాస్యములు సేయ మొదలిడిరి. అంతకుపూర్వము పెండ్లియననేమో, సిగ్గననేమో యెరుగని యతిముగ్ధయగు ప్రభావతి కొకవిధమగు సిగ్గుజనించి వారట్లు తన్ను హాస్యములు సేయునప్పుడెల్లను వారిమీద లేని కోపమునటించుచు నాబాలుని చూడవలయునని మనస్సునందు కోరికయున్నను సిగ్గుచే వానివైపుచూడకయే వెళ్లిపోవుచుండెను. శివరావుయొక్క యవస్థకూడ నిట్లే యుండెను.

వీరిగృహములయొద్ద పెండ్లిబేరములు జరుగుచుండెను. అన్నియు సరిపడినవిగాని కట్నమువద్ద తగాదాగా నుండెను. చంద్రశేఖరముగారికి కట్నమిచ్చి బాలికనిచ్చుట కెంతమాత్ర మిష్టము లేకుండెను. శివరావు తాతగారికిని, తల్లికిని తక్కినవారందఱు వేలకొలది రూప్యముల గట్నములిచ్చెదమని వచ్చుచుండ వీరు స్వల్పపుకట్నమయిన నీయకున్నచో నెట్లని పట్టుదలగా నుండెను. గోపాలరావుగారికి కొంచెము జ్యోతిషము కూడ తెలియును. తన మనుమని కింతచిన్నవయస్సులో వివాహముసేయుట కిష్టములేదు. పదునెనిమిది సంవత్సరములు దాటినతరువాత చేయవలయు ననియున్నది. ఆలోపు వయస్సులో వివాహము లొనర్చిన తనవంశములోని బాలు రిదివఱ కిద్దఱు మువ్వురు పరిణయమయిన కొలది దినములకే మృతినొందుటచే నీబాలునకు మరల నట్లుచేయుట కీయన యిష్టపడకుండెను. తమవంశమంత వృద్ధిలోనికివచ్చువంశము కాకపోవుటచేతనే, బాలికవైపువారందఱు దీర్ఘసుమంగలు లగుటవలనను, వెతకి చూచిన నొక వితంతువైన గానరాకపోవుటచేతను, వారివంశమున జన్మించిన యీబాలిక మాత్రము వేరువిధముగ నగునా యనియు, సర్వశుభలక్షణశోభితయగు బాలిక కవలక్షణమెట్లు ఘటిల్లుననియు, బాలికయొక్క యదృష్టమువలననైన సత్యవంతునివలె తమపిల్లవాఁడు చిరాయుష్కుఁడు కావచ్చుననియు నింటియందలి స్త్రీలు తలంచుచుండిరి. గోపాలరావుగారు కట్నముకొఱకే యిప్పుడప్పుడే తమ మనుమనికి వివాహము చేయమనుచున్నారనియే చంద్రశేఖరముగారు తలంచిరేకాని వారి మనోభావమును గనిపట్టజాలరైరి. ఆయనగూడ నీవిషయమై యెందుచేతనో గట్టిపెట్టు పట్టలేదు. ఒక సంవత్సర మీవిషయముగా నాలోచనలతోడను, బేరములతోడను గడచెను. తుదకు నాలుగువందల రూప్యములు కట్నమిచ్చునట్లొడంబడిక చేయబడెను.

## ౬

జ్యేష్ఠమాసములో నొక శుభముహూర్తమున మనప్రభావతీ శివరావులకు పాణిగ్రహణము నర్చిరి. పెండ్లికొడుకువారి కొక్కఁడే పిల్లవాఁడు; ధనికులు: పెండ్లికొమార్తెవైపువారు ధనములో వారితో దులతూగజాలకున్నను నిదియే ప్రథమకార్యము. జ్యేష్ఠపుత్రిక, తగుపాటిధనమున్నది. ఇరువైపులవారు సరదా మనుష్యులు. అందువలన వివాహ మతివైభవముగా జరిగెను. ఆదినములలో నేవిఘ్నమైన యశుభము జరుగలేదు. వీరి యన్యోన్యబాంధవ్య మూరివారి కందఱకు ముచ్చటగలిగించెను. ప్రభావతి, దేహమంతయు నాభరణములతో నింపివేసిరి. ఇక నాబాలికనుచూచుకొని యామె తల్లిదండ్రులు, మేనత్తలు, తక్కిన బంధువర్గము ననుభవించిన యానంద మింతంతకాదు. 'మాప్రభావతితో సమానముగ నదృష్టవంతులు లోకమునందెచ్చటనైన గలరా' యని వారు మురిసిపోవుచుండిరి. దానికేమికొదువ? కుఱ్ఱవాఁడు, బుద్ధిమంతుఁడు, రూపవంతుఁడు, విద్యావంతుఁడు, ధనికుఁడునగు భర్త; అత్యంత యోగ్యురాలగు నత్తగారు; ఒంటినిండ నిండునగలు; పుట్టినింట, అత్తింట కూడ నల్లారుముద్దు; ఏనాఁడో బంగారుపూలు పూజచే

యుటచే నీజన్మమున నిట్టిపురుషరత్నము లభించెను' అని పలువిధముల ననుకొనుచు నానందించుచుండిరి.

శ్రావణమాసములో మంగళవారపు నోములకు ప్రభావతిచే నూరంతయు పిలిపించిరి. ప్రభావతి యొక రింటికి వెళ్లినను నామెవస్తువులను, నామెనుచూచి ప్రతివారును "అమ్మా, లక్ష్మిదేవమ్మకోడలివా? ఎంత యదృష్టనంతురాలవేతల్లీ?" అని బాలికను ముద్దు పెట్టుకొనఁజొచ్చిరి. శుక్రవారమునాటికి శ్రావణపట్టె పట్టుకొని లక్ష్మిదేవమ్మకొడుకు చంద్రశేఖరముగారింటికి వచ్చిరి. శ్రావణపట్టెతో వారి చావడియంతయు నిండిపోయెను. ప్రభావతి కింకను వస్తువులేమి, రకరకముల దుస్తులేమి, ఆటవస్తువులేమి— ఒకటా? ఇరుగుపొరుగమ్మలక్కలందరువచ్చి శ్రావణపట్టెచూచి యాశ్చర్యపడ జొచ్చిరి. ప్రభావతియదృష్టమును గొనియాడసాగిరి. మహావైభవముతో శుక్రవారపు నోములుగడచెను. కొడుకును, కోడలినిజూచుకొని లక్ష్మిదేవమ్మ యానందమును పట్టజాలకుండెను. మంగళ సూత్రధారణ మయినదిమొదలు శివరావునకు ప్రభావతిమీదను ప్రభావతికి శివరావుమీదను నెక్కుడలేని ప్రేమజనించెను. ప్రభావతితో నెవరైన 'నీమొగుడు నల్లగానుంటాడులే' అంటే ఎక్కుడలేని కోపమువచ్చి వారితో దెబ్బలాడుచుండేది. అల్లాగే శివరావునకుగూడ తన భార్య నెవరేమనుటకు వల్లకాదు. వివాహమయిన కొద్దిదినములకే శివరావు తనబావమర్దులనుజూచి సిగ్గుచెంది తనవస్తువులన్నియు దీసివేసెను. మామగారనిన నెక్కుడలేనిభక్తి; చిన్నతనమైనను మామగారినిమాచీ, చూచినవెంటనే లేచి నిలువబడి నమస్కారము చేయుచుండెడివాడు. వివాహమగువరకు నెక్కుడలేనిమోజు, ఎక్కుడలేనిమర్యాదలు. వివాహమయిన మరుచటి దినమునుండి దెబ్బలాటలుగానుండు కొన్ని కుటుంబములవలెగాక వీరియన్యోన్య మైత్రి, యొకరియెడల నొకరికి గౌరవప్రేమలు దినదినము నభివృద్ధి చెందుచుండెను. శ్రావణమాసము గడచినవెంటనే దసరాపండుగ; ఆపండుగునకుగూడ చంద్రశేఖరముగారు వియ్యాలవారిని బిలచిరి. ఊళ్లో యూరగుటచే ఇట్టే యట్టే వచ్చుచు పోవుచుండిరి. కాని పాపము ప్రభావతికిని, శివరావునకుగూడ చిన్నతనమగుటచే వెర్రిసిగ్గొకటి దాపురించి

యొకరినొకరు మనసార చూచుకొనుటకుగాని, ముచ్చట దీర నాడుకొనుటకుగాని యవకాశము నొసగలేదు. వారిప్పుడే చూచుకొనవలయునా? ఇప్పుడే మాట్లాడుకొనవలయునా? వారి యన్యోన్యముఖావలోకనములలోను నెడతెగని దీర్ఘసంభాషణములలోను గడపవలసిన కాల మింకా యెంతయున్నదికాదు?



తరువాతవచ్చిన దీపావళ్యమావాస్యకుకూడ నల్లుని దీసికొని రావలయునని చంద్రశేఖరముగారు వెళ్లిరి. కాని యాతనికి వారముదినములనుండి వంట్లో కొంచెము సుస్తీగానుండుటచే తీసికొనిరాలేదు. చంద్రశేఖరముగారింటికివచ్చిభార్యతో నల్లుని వినయవిధేయతాది సద్గుణములను, తనయందాతనికిఁగల భక్తి గౌరవములను చెప్పుచు 'సాధారణముగా ధనికులబిడ్డలు, అందులోను గారాబముతో బెరిగినవారు పెంకివారుగను, చెడుఅలవాట్లు కలవారుగను, గర్వము, నిర్లక్ష్యము మొదలగు దుర్గుణములు గలవారుగను నుందురు. అట్టియెడ విద్యాధనములతోపాటు ఇట్టియోగ్యతలుకూడ కలిగియుండుట మనయదృష్టముకాక వేరేమనుకొనవచ్చును? కాని ప్రస్తుత మారోగ్యమేమియు బాగులేదు. ఎట్లుండునో' యని చెప్పదొడంగిరి. ప్రభావతిధనము, అందముకన్న విద్య, సద్గుణములనే యెక్కుడుగా ప్రేమించు స్వభావముగల బాలిక. తన భర్తనుగురించి తండ్రి యిట్లు చెప్పుచుండ తా నాటలసందడిలో నున్నను వినుచున్న ప్రభావతి

మనంబున తన కట్టియోగ్యుడగు భర్త లభించినందులకు మిగుల నుప్పొంగుచుండెను.

## ౨

ప్రభావతి ప్రతిదినము విడువక పాఠశాల కేగుచుండెను. కాని యెందువలననో పూర్వమువలె మార్గమధ్యమున శివరావామెకు గాన్పించుటలేదు. అతడెప్పుడైన గనుపడునేమో యని యామె ప్రతిపూట మార్గమున నలువైపుల పరికించుచుండెను. కాని జాడయేమియు లేదు. ఆమె హృదయకమలము ముకుళించుకొనిపోవుచుండెను. వదనమున విన్నదనము తోచుచుండెను. తాను సాయంకాలమింటికివచ్చుసరికి తరుచు తల్లి యింటియొద్దలేక తన యత్తవారింటి కేగుచున్నట్లు తెలిసికొనుచుండెను. అచటినుండి రాగానే ఆమె ముఖమాతురతతో నున్నట్లు కనిపట్టుచుండెను. కాని కారణమేమియు నామెకు దెలియదు. తల్లినడుగలేదు. ఆమె పసిబాలిక, తనచదువేమో, చెలికత్తెలేమో, ఆటలేమో, అంతేకాని పెద్దవాళ్ల యాతురతలతోడను, మనోవ్యాకులములతోడను నామె కేమిపని?

ఒకదినమున ప్రభావతి యెప్పటియట్లు బడినుండి యింటికివచ్చెను. తల్లి కనబడలేదు. వెంటనే యామె తనస్నేహితురాండ్ర బిలుచుకొనివచ్చి యాడుకొనవలయునని వారి గృహములకేగెను. ఏలనో వారితల్లులు మొదలగు వారందరామెనుజూచి నిట్టూర్పులు విడువసాగిరి. ఏమేమో వారిలోవారు గుసగుస లాడుకొనసాగిరి. కన్నీరు గార్చజొచ్చిరి. వారెందు కట్లుండిరో ప్రభావతి కేమియు నర్థము కాలేదు. "వారికేదేని యాపద వచ్చియుండునా? వచ్చినచో నొకరిద్దరకు వచ్చును కాని యందఱకొకేసారి వచ్చునా? ఎందువలన వీరందఱు నన్నుజూడగానే యీవిధముగా విచారించుచున్నారు?" అని ప్రభావతి తనలో దాననునోనెను. కాని కారణమడుగలేదు. వారి విచారములజోలి తనకేంటుకు? ఆమె యెల్లప్పుడుత్సాహముగను, సంతోషముగను, నాటలయందత్యంత కుతూహలము గలదిగను నుండుబాలిక. ఈ చిన్నబోయిన వదనములనుజూచి సహింపగలదా?



తోడిబాలికలగూడి యామెకుసుమిత వదనపద్మముల మధ్యనుండి శీఘ్రముగా నవతలకు బోవలయునని ప్రయత్నించుచుండెను. ఆమె దురదృష్టమేమోకాని నాటిదినమున నామె చెలికత్తెలుగూడ నంతయుత్సాహకరముగా గన్పట్టలేదు. ప్రభావతి వారిని ప్రోత్సాహపఱచి యాటలాడ రండని బలవంతపెట్ట సాగెను. వారినందఱఁ గూర్చుకొని తనగృహమునకు వచ్చెను. ఆహా! ఏమిచెప్పను ఆబాలికయొక్క దురవస్థ! వారినుండి యెట్లో తప్పించుకొని బయలఁబడితిమిగదా యనుసరి కింటియొద్ద నొక గదిలో నొక మంచముమీద తల్లి పడుకొని యారాటపడుచు నేడ్చుచుండెను. ప్రభావతిమీఁద పిడుగుపడినట్లయ్యెను. తల్లి దుఃఖమునకుఁ గారణము తెలియదు కాని తల్లి యేడ్చుచున్నదని తానుగూడ నామంచముమీఁద పడుకొని యేడ్వ మొదలుపెట్టెను. ప్రభావతికాసమయమున ప్రపంచమంతయు దుఃఖసాగరమున మునిగిపోయినట్లు తోచెను. ఆదిన మెంతదుర్దినమో కాని ప్రభావతి యొక్కడకు వెళ్లినను దుఃఖాక్రాంత వదనములేగాని వికాసముతో గూడిన ముఖములెచ్చటను గన్పట్టలేదు. మనస్సున నేమో యాందోళనము బయలుదేరెను. ఇంతవరకామె దుఃఖమన నెట్టిదో యెరుగదు. సంతోషసాగరమున నోలలాడుచుండెను. తనభావిసౌఖ్యములను దలచుకొని యుప్పొంగుచుండెను. ఎల్లప్పుడు విలాసములలో దగుల్కొనియుండెను. ఉత్సాహమునకు నిధి. అట్టిబాలిక నేడీదుఃఖభారము నెట్లు భరింపఁగలదు? తనతో సంతోషముగా మాట్లాడువారెవరు? ఇదియే తనసంతోషములకు, సౌఖ్యములకు కోరి

కలకు, ఉత్సాహములకు అంత్యదినమేమో? పాపమామె కేమి తెలియును? నెచ్చెలులు పలుకరించిరి. పలుకుట కిష్టపడలేదు. వారుకూడ కొంతసేపక్కడ నిశ్చేష్టులై దుఃఖించుచు నిలువబడి పోయిరి. పిల్లలెప్పుడు నానందము నపేక్షింతురుగాని దుఃఖమును ప్రేమింతురా? వారెవరియిండ్లకు వారు వెళ్లిరి.

రాత్రి అయినది. దీపములు పెట్టిరి. ఇంట్లో వంటలేదు. చంద్రశేఖరముగారు గోపాలరావుగారియింటి యొద్దనుండి యాదినము తమగృహమునకు రానేలేదు. సుశీలకేమియు దోచుటలేదు. ప్రభావతిని వెంటబెట్టుకొని వియ్యాలవారింటికి బయలుదేరెను. రాత్రి యేడుగంటలయినది. ప్రభావతికి రానున్న కష్టమును దలచుకొని బంధువర్గము, స్నేహితబందము, ఇరుగుపొరుగువారుమాత్రమేకాక, ప్రకృతికూడ దుఃఖించుచున్నదేమోయనునట్లాకసమంతయు కారుక్రమ్మి వర్షించుచుండెను. ప్రభావతీ సుశీలల మానసవీథులవలెనే యాకాకినాడ పట్టణవీథు లంధకారబంధురమై యుండెను. వారిహృదయములందింకను బూర్తిగా నడుగంటక యించుక మొలకలెత్తుచున్న యాశాలతికలవలె నందందు లాంతరుస్తంభములయందలి దీపములు మినుకుమినుకుమని ప్రకాశించుచుండెను. చినుకుగా నుండుటచే మార్గమునందు జనసంచారములేదు. బండితీసికొని వచ్చువారెవరు ఇంటియందు లేనందున వీరిర్వురు నడచియే వెళ్లవలసి వచ్చినది. ఎట్లెటో వీరిర్వురు తమశరీరముల వారింట చేరవైచిరి. వీరు లోపలికివెళ్లిన కొంచెముసేపటికే లోనివారు గొల్లుమనిరి. అయిపోయినది. ప్రభావతి యదృష్టమంతయు నెనిమిదినెలలో పరిపూర్ణత నొందినది.

## ౮

నాటితో చంద్రశేఖరముగారి సౌఖ్యదినము లంతరించినవి. మహోన్నతపర్వతమునుండి యొక్కమా రమాంతముగా క్రిందపడినట్లయినది. కొమార్తెను దీసికొని యింటికివచ్చిరి. ప్రభావతి యిక పలువురిలోకి వచ్చుటకుగాని, నెచ్చెలులతో స్వేచ్ఛగా నాడుకొనుటకుగాని శుభకార్యములయందు నలువురిలో గూర్చుండుటకుఁగాని నోచిపుట్టలేదు. ఆమె పాఠశాలకేగిన నక్కడి యుపాధ్యాయులు, బాలికలును నామెనుజూచి దుఃఖపడసాగిరి. అందువలన నామెపాఠశాలకేగుట కిచ్చగింపలేదు. ఎక్కడకువెళ్లినను నింతవరకే నోటితో నామెయదృష్టమును గొనియాడిరో వారందఱిప్పుడా నోటితోనే యామెదురదృష్టమునకు నిందింప మొదలుపెట్టిరి. అందువలన పరులయిండ్లకేగుట మానెను. శుభకార్యములలో పేరటాండ్రమధ్య గూర్చుండ వారితో పాటామెకు పసుపుకుంకుమ నిచ్చుటకు వెనుదీయజొచ్చిరి. అది యామెకెంతయో చిన్నతనముగా దోచుటచే తానట్టి స్థలములయందుండుట కిష్టపడకుండెను. తననెచ్చెలులందఱు భర్తలుగలవారగుటచే వారి యూహలన్నియు వేరుగానుండెను. ఇంతవరకు ప్రభావతిగూడ వారితోనేకీభవించి ముచ్చటలుచెప్పుకొనుచుండెడిది. కానియిక వారితో నేకీభవింపజాలదు. తనజీవితాదర్శములు వారినుండి భిన్నములయినవి. ఇక వారితో గలసిముచ్చటించుభాగ్యము గతించినది. అందువలన వారితో గలసిమెలసియుండుట కట్టిపెట్టెను. అజ్ఞానముచే తన జీవితములోవచ్చిన ఘోరమగు మార్పుయొక్కసంగతి తెలియక పూర్వమువలెనే తలిదండ్రులయొద్ద తనకోరికలను దెల్ప వారు కంటతడివెట్టుచు వచ్చిరి. కాన కోరికల గోరుట నికచాలించెను. తలిదండ్రులు, బంధువర్గము ఈమెను జూచినప్పుడెల్ల నిట్టూర్పులు నిగిడించుచు విచారమును బొందుచుండుటచే వారిని సమీపించుటకు గూడ బెదరుచుండెను.

అయ్యో! పాపము పసిబాలిక పదేండ్లయిన నింకను బూర్తికాలేదు. అభము శుభము నెరుగదు. ఎంత సంతోషముతో, నెంత యుత్సాహముతో, నెంత హెచ్చరికతో నెంత కులాసాగా నుండవలసినదినములు? జీవితమంతలోను బాల్యమేకదా సౌఖ్యదాయకమగు, సంతోషపూరితమగు, కోరికల కాలవాలమగు, నిర్విచారకరమగుభాగము? అట్టిసౌఖ్యముల కిరవగు బాల్యావస్థనైన సుఖముగా ననుభవించుటకు ప్రభావతి పెట్టిపుట్టలేదా? ఇంత పసితనమునుండియే యామె కృశింపవలసినదేనా? ఎంతవృద్ధిలోనికి రాదగినబాలిక? ఎంతకాలము గడపవలయును? విచారమన నేమో యెరుగనియవస్థలో నింత యపారదుఃఖమా? ఆమెకేమి తెలియును? భర్తగతించిన

దుఃఖ మామెయెరుగ నేయెరుగదు. సంఘములో నామెకు గలుగు నిరాదరణ కామె విచారించుచుండెను. అవమానముల సహింపలేకుండెను. "అమ్మా! ఏనాఁడే భార్యాభర్తల నడబాపితినో ఈనాఁ డిట్టిగతిపట్టెను. ఎంత పాపిష్ఠురాలవో బాల్యముననే వైధవ్యపుఁవ్రాత లభించినది" మొదలగు నిందావాక్యముల భరింపలేకుండెను. ఆమెవయస్సున బాలికయైనను పౌరుషము మెండు. ఆత్మగౌరవములో నసామాన్య. రూపరేఖావిలాసములలోనే కాదు, స్వభావములోనే కాదు, గుణములలోనేకాదు తండ్రిని పుణికిపుచ్చుకొనినది. పుట్టువులో స్త్రీయైనను బాలిక తండ్రి దగుటచే పౌరుషలక్షణము లనేకము లామెయందు గలవు. ఇతరులచే నింత మాటయైన పడుటకు సహింపదు. అందువలననే బాల్యమునుండియు నేవిధమైన తప్పుపనులు చేయక యతి జాగరూకతతో మెలగుచుండెను. ఎప్పుడయిన నేదయిన నొకానొక పొరపాటుపని తెలియక చేసినయెడల తన తప్పు వెంటనే యొప్పుకొని యికనెన్నఁడు చేయకుండునట్లు నిశ్చయించుకొనుచుండును. అట్టి బాలిక యిప్పుడకారణముగా నిట్టి నిందావాక్యముల సహింపగలదా? ఇందు తానొనర్చిన తప్పేమిగలదు? ఎట్లు దిద్దుకొనగలదు? ఇదియే యామె విచారమునకు గారణము.

౯

ఇకనామె బ్రతుకెట్లు? ఈవిచారముతో కృశించి చనిపోవలసినదేనా? లేదు. ఇంకను కొంతకాలము జీవించుటకామె కవకాశమున్నది. ఎంత నిరాశలోనున్నవారికైన నేదో యొక యాశను జూపించి బ్రతుకునందిచ్చ జనింపజేయు భగవంతుఁ డామెపక్షమున నున్నాఁడు. తోడిబాలికలందఱివలె గృహిణిగా నుండి సామాన్యప్రాపంచిక భోగము లనుభవించునాశ యామెకు పూర్తిగా పోయినది. ఆసౌఖ్యములన్నియు మొదలంట నశించినవి కాని ప్రపంచములో మానవులు సేయు జీవయాత్రకు వైవాహికబంధన మొకటియేనా యాశయము? వేఱొకమార్గ మేదియు లేదా? లేకేమి? ఇంతకన్న ననేకమడుంగులు సౌఖ్యదాయకమగునట్టియు, నిర్విచారకరమగునట్టియు, పారమార్థికమైనట్టియు, ప్రతిబంధకము లేవియు లేనట్టియు నుత్కృష్టమార్గము వేఱొండు కలదు. ప్రభావతికి తక్కిన సుగుణములతో పాటు భగవంతుఁడు విద్యయందత్యంతాభిలాషనుగూడ నొసంగెను. ఆమె కిప్పుడదియే దిక్కు. ఇక నెవరితోను గలసియుండుట కామె కిష్టము లేదు. కనుక నెల్లప్పుడేకాంతముగా గూర్చుండి గ్రంథపఠన మొనర్చుట కారంభించెను. పుస్తకములే యామెకు నెచ్చెలులు. పత్రికలే యామె కిరుగుపొరుగువారు. శాస్త్రములే యామె బంధువులు. వానిని జదువుచు, వానియందలి విషయములను దెలిసికొని యానందించుచు కాలము గడుపుచుండెను. నీతిమతసాంఘిక రాజకీయ విషయములలో బ్రఖ్యాతిగాంచిన స్త్రీ పురుషరత్నముల యొక్క చారిత్రముల జదువునప్పు డామెకు మితిలేని యుత్సాహము కలుగుచుండెను. వారివలె తాను గూడ నొక ప్రఖ్యాతస్త్రీ కావలయునని కోరుచుండెను. ఈదేశమునందు స్త్రీలకు జరుగుచున్న దురన్యాయములను దొలగింప మార్గములను వెదుక మొదలిడెను. స్వానుభవము కలదగుటచే సంఘమును నెమ్మదినెమ్మదిగా కొఱికి ముక్కలుచేసి తినివేయుచున్న యతిబాల్యవివాహఘోరపిశాచమును, వైధవ్యనామక బ్రహ్మరాక్షసిని మూలముట్టుగా నశింపజేయ యత్నించుచుండెను. తనవలెనే మూలమూలల నొదిగి దుఃఖించుచున్న బాలవితంతువుల నున్నతస్థితికి దేవలయునని యహర్నిశము లాలోచించుచుండెను. స్త్రీల స్వాతంత్ర్యముకొఱకు ఘోరయుద్ధ మొనరింప నుంకించుచుండెను. ఈకార్యముల నన్నిటిని సాధించుటకు తాను ముందు గొప్ప విద్యావతి కావలయునని పాటుపడుచుండెను. ఆమెకు వయస్సభివృద్ధి నొందుకొలది మనంబునందలి కోరిక లీరికలెత్తుచుండెను. ప్రభావతి హృదయకాసారమున నుత్పన్నమగుచున్న యీ యున్నతాశయము లనుతామరలు క్రమక్రమముగావికసించి పరిపూర్ణతనొందునో లేక మొగ్గలుగా నుండగనే యడుగంటిపోవునో యెవరికెరుక?

౧౦

రాత్రి పండ్రెండు గంటలయినది. ప్రకృతియంతయు గాఢసుషుప్తియందు నిమగ్నమై యుండెను. ఆనాడు పూర్ణిమయగుటచే చంద్రుడు షోడశకళా పరిపూర్ణుఁడై ప్రకాశించుచుండెను. ఆగృహమునందలి

భార్యాభర్తలందఱును వారివారి గదులలో సుఖముగా నిద్రించుచుండిరి. షోడశవర్షప్రాయముగలిగి యాకసమున వెలుగు చంద్రునితో నుద్దీపితమగు వదనకాంతులు వెదచల్లు నవయౌవనవతియగు నొకబాలిక యేకతంబు



ననో యొకగదియందు నేకతంబ కూర్చుండియుండెను. ఆమె శరీరమంతయు తెల్లవారి శుష్కించియుండెను. నేత్రములనుండి యశ్రుకణములు ముత్యములకోవలె జలజల రాలుచుండెను. ఆమె కూరుండుటకు మంచము గానీ, పరుపుగాని యుండేదియు లేదు. ఒక చాప మాత్రము క్రిందపఱచియుండెను. ఆమె దానిమీదనే గూర్చుండి యేదియో దీర్ఘవిచారములో మునిగియున్నట్లు కన్పట్టుచుండెను. మట్టు కొన్నిగ్రంథములును, నొకవైపున నేదియో యౌషధముతో నిండియున్న సీసాయొకటియు నందుండెను. ఆమె తనలో దానిట్లు విచారించుచుండెను.

"అహా! ప్రభావతీ! ఎంతప్రబతు కింతవరకువచ్చినది? ఎట్టివిలాసములతో నొప్పుచుండవలసినదానవు! కోరినవస్తువులెల్ల బెట్టుకొనుచు, మంచినబట్టలెల్ల గట్టికొనుచు, దినమున కొకయలంకారము చేసికొనుచు ...షలతో గులతూగవలసినదానవేనా నీవు! ఇట్టివెన్నెల రాత్రులందసామాన్య ప్రేమాస్పదుడగు నీ ప్రియభర్తనుగూడి మీ గృహోపాంగణము నందలి యుపవనమున విహరించు చుండవలసినదానవే నా నీవు! చిత్రకళానైపుణిగలిగి యెల్లప్పుడు నందమును ప్రేమించునీవు కురులు తీసివేయబడి, రవికలేకుండ నొకయంచు లేని నైనుపంచి కట్టుకొని యలంకారవిహీనవై యొక విధమగు వికారరూపముతో జీవింపగలవా? అత్యంతోన్నతాదర్శములు కలిగి యాత్మగౌరవమునకు బ్రసిద్ధ వడసిన నీవు నీతలంపులలో నొకదానినైన నెరవేర్ప వీలులేక యితరులపంచల నొదిగియుండగలవా? వితంతువుల నుద్ధరింప దీక్షవహించియున్న నీవు అందఱు వితంతువులవలెనే ముసుగువేసికొని మూలC గూర్చుండగలవా? గార్హస్థ్యాశ్రమము వదలిపోవుటచే పరోపకారార్థము దేశము నిమిత్తము దేహము నర్పింపవలయునని యుత్సహించుచున్న నీవు సామాన్యగృహకృత్యము లొనర్చుకొనుచు కాలము గడుపC గలవా?

తలిదండ్రులారా! మీముద్దుల పుత్రియందు మీ కిసుమంతైన ప్రేమ లేదా? సంఘమున కంత వెరువవలయునా? సంఘములో నీవిషయమైనసంస్కారము చేయలేరా? మీ గారాబు పట్టియందు మీకిదివరకున్న ప్రేమ యేమయిపోయినది? కేవలము లక్ష్మివలెమీకనులముందఱ మెలగవలసిన బాలిక యింతటినుండి వికారరూపముతో సంచరించుచుండ జూచి భరింపగలరా? తండ్రీ! నీగర్భవాసమందు జనించినపుత్రిక, నిన్ను బోలిన పుత్రిక, నీకున్న యాత్మగౌరవపౌరుషాది మహోన్నతగుణములుగల బాలిక—యిట్టి యవమానముల సహింపC గలదా! ఆమె యేమినేరము చేసినదని యిట్టి ఘోరదండన విధించెదరు? ఇంతకాలమునుండి మీయభిమాన పుత్రికయొక్క స్వభావము నెరుగలేకపోయితిరా! ఈ ఘోరావమానముల సహించుచు నామె యీతుచ్ఛప్రపంచమున జీవించుననుకొంటిరా? సంబంధము దూరమైనచో తరుచ మాచుట పడదేమో యని విచారించు మీ రెల్లకాలము నిక నామె నెట్లెడబాసియుండ గలరు! ఎట్టి నీచపురుషులనైనను, ఎటువంటి ఘోరకార్యములనైన, నంతటి ఘోరకృత్యములనైన, నెట్టి యవినీతికార్యములనైన సహించునుగాని సంఘము పసిబాలికలు

తానేమియు నెరుగని యవస్థలో, భర్తయన నెట్టివాఁడో యాతనికిఁ దనకుగల సంబంధమెట్టిదో తెలియనిదశలో, పెండ్లి యింకను బూర్తికాకుండగనే భర్తలుగతింప నస్ఖలితబ్రహ్మచర్యము నడపుచు, నున్నతవిద్యావంతురాండ్రై ప్రజాసేవయు, దేశసేవయు నొనర్చుచు కన్యలవలెనుండి యతిపవిత్రమగు జీవయాత్ర సేయుటకు సహింపజాలదా? ఓ సంఘమా! వితంతుస్త్రీల విరూపిణులను జేయుటలో నీయుద్దేశమేమి? భర్తపోయిన దుఃఖము చాలదా వారిహృదయములను దహించివేయుటకు? ఇట్టి యసహ్యమగు నవమానములఁగూడ నొనర్చి వారిని బాధింపవలయునా? తలగొరిగించుట యెట్టి ఘోరకార్యములను చేసినవారికి విధింపవలసినదండన? ఎంతో గొప్పతప్పొనర్చిన వారికిఁగాని యట్టి నీచమగు శిక్షవిధింపరే! రుక్మిణి నెత్తుకొనిపోవుచున్న కృష్ణునెదుర్కొని యతనిని దూషించినందుకుగాను కృష్ణు రుక్మితల గొరిగి యవమానపఱచెను. పౌరుషశాలియగు రుక్మి యట్టియవమానిత జీవితము జీవించుటకంటె మృతినొందుట యుత్తమకార్యమని తలంచెను. తలగొరుగుటంత హైన్యముగ నవమానముగ నెంచబడుచుండ, నమాయకులు, ననథలు, నత్యంత పవిత్ర జీవితమును నడపువారునగు నబలలశిరోజములను మంగలిపాలు సేయుట ధర్మమా? స్త్రీలకు పౌరుషము, ఆత్మగౌరవము మొదలగు శూరగుణములు లేవనియా నీతలంపు? వారెట్టి యవమానములనైన సహించి పడియుండ గలరనియా నీనమ్మిక? భార్యపోయిన పురుషునకేమిశిక్ష? పండ్రెండవదినమునఁ పెండ్లికుమారుని జేయుట! వారి కక్కఱలేని మార్పువీరికేల? భర్తపోయిన పదియవనాటి స్త్రీయవస్థ దలచుకొనిన నెంతటికఠినహృదయునకయినను గుండెకరిగి నీరై పారునుగాని యో హిందూసంఘమా! నీహృదయము వజ్రకర్కశమైయుండ నోపు. లేనిచో పూజనీయులగు నీమాతలు, గౌరవనీయులగు తోబుట్టువులు, ప్రేమాస్పదలగు పుత్రికలు భర్తపోయినదినముకంటె పదియవదినమున జరుగు నవమానముల భరించుటెట్లాయని గోలపెట్టి యేడ్చుచుండఁజూచి భరింపగలవా? వెంటనే మార్పు తీసికొనిరావా? అది యట్లుండనిమ్ము. అత్యంత పవిత్రవంతురాండ్రగు స్త్రీలు, పరపురుషుల కన్నెత్తియైన మాడఁజూడని హైందవవనితలు, పరపురుషులతో సంభాషింపరాని ముగ్ధలు, అత్యంత పవిత్రవంతమగు, తమ వివాహసమయములో తమ ప్రియభర్తల చేతులతో నలంకరింపబడి పావనములైన శిరస్సుల నొక కానివాని చేతిలో బెట్టవచ్చునా? ఇదియా నీ హైందవధర్మము? ఈ యాచారమే వేదములనుండి, యే శాస్త్రములనుండి గ్రహించితివి? స్త్రీలు పౌరుషహీనలని భావింపకుము. ఎట్టియవమానములనైన భరింపఁగలరని యెంచకుము. అవయవ నిర్మాణములో స్త్రీపురుషులకు భేదమున్నను మానసిక విషయములలో నిరువురు సమానలే. చిరకాలము పరులకులోబడియున్న యొక దేశపుప్రజలు పౌరుషస్వాతంత్ర్య దేశాభిమానాద్యున్నతగుణముల మరచి బానిసవృత్తి నవలంబించి తమకదియే బాగున్నదని యెట్లు సంతృప్తి చెందియుందురో యట్లే యాస్త్రీలును చిరకాలమునుండి యీఘోరదురాచార పిశాచమునకు లోబడియుండుటచే దానికలవాటుపడి సహింప గలుగుచుండిరి. రామమోహనరాయలు సహగమనమును మాన్పించెనుగాని నాకుజూడ చావకుండ బ్రతుకకుండ జీవితకాలమంతయు నీయవమానముల నెల్ల భరించుచు జీవించియుండుటకంటె యొకక్షణములో ప్రాణముదీయు నాసహగమనమే బాగున్నది.

ఓ సంఘమా! అసమాన ప్రజ్ఞాధురీణలైయుండి పరోపకారపారీణలు, దేశసేవాపరాయణలు కావలయునని యెక్కుడాసతో నున్న మానవతుల నెందఱి నింతవరకు నీపొట్ట బెట్టుకొంటివో? ఇక నెందఱి బట్టుకొననున్నావో? ఇదిగో యా మానవతులగు స్త్రీలలోనే నొకతెను. నామరణమైన నీహృదయమును కరగించునేమో? లెక్కకు మిక్కుటమగు వారిని మ్రింగిన నీకు నేనొక లెక్కయా? కాకపోవుగాక! ఈదురాచారభూయిష్ఠమగు నిట్టి సంఘములో జీవించియుండుటకన్న మరణమే మేలు. ఇంతవఱకు నిన్నెంతో ప్రేమతో బెంచి నాసౌఖ్యముల కొఱకెంతియో పాటుపడుచు, నామీఁదనే ప్రాణములను బెట్టుకొనియుండు నోతలిదండ్రులారా! మీకిదే కడసారి నమస్కారము. ఓ గ్రంథములారా! సంఘమునందలి దురాచారముల దలచుకొని విచారమున మునిగియున్నప్పుడెల్ల ననేకనీతులను, జ్ఞానమును, బోధించుచు నూతనోత్సాహముల నొసంగుచు వచ్చిన మిమ్ముల వదలలేకున్నదానను. ఓ విష

ఇక నీవే నాకు శరణ్యము. అందఱు సుఖముగా నిద్రించుచున్నారు. చింతావ్యాకుల చలితమానసనగు నాకించుకయు నిద్రరాకున్నది. ఇక శాశ్వతనిద్రచెందెద.

పైవిధమున ప్రభావతి కొంతసేపు దుఃఖించి, భగవంతుని కడసారి ప్రార్థించి సీసాయందలి విషమును నమృతమువలె పానముచేసి పరుండెను. చంద్రశేఖరముగా రెంత నవనాగరికులైనను సంఘమునకు వెరచుచుండిరి. సంఘమునకు వ్యతిరిక్తముగా నడచుటకుగాని, సంఘము నుండి విడిపడుటకుగాని యాయన కెంతమాత్ర మిష్టము లేదు. సంఘమునందు తమకు వచ్చుమాటలను సహింపలేక న్యాయముగా వితంతువని చెప్పదగని బాలికను వైధవ్యదివ్యముల నొసంగదలంచి మానవతియు, తార్కికజ్ఞానప్రవీణయునగు తమ ముద్దులపుత్రిం గోల్పోయిరి.



# జీవితాదర్శము

సంగనామాల రామచంద్రరావు గారు

(మూడవసంపుటము ౮-వ సంచిక తరువాయి)

క. కవితాకన్య జనించుట, యె విశేషము, చిన్ననాఁడె హృదయోద్భోధా,
వివృతాంకుర మార్గాన్వేష విలాసముఁ గఱపవలయు శ్రద్ధాయుక్తిన్.

ఉ. అంతియకాని ప్రాప్తమయినట్టి కవిత్వమహత్త్వ సంపదన్
బంతమువట్టి భావభవబాణమనోహరపాటవంబు దు
ర్దాంతవిలాసినీప్రసవరమ్యశరీరవిలాసవిభ్రమో,
దంతముఁగూర్చి వ్రాయుటకె నైన మొసంగఁగలేదు చూడఁగన్.

శా. కైతల్ శిల్పకళాప్రదర్శన మనోజ్ఞత్వంబు సుశ్రావ్యసం,
గీతాత్క్షీణత లాగమాధ్యయనముల్ గీతాదికబ్రహ్మవి
ద్యాతత్త్వంబులు తర్కశాస్త్రము సమస్తప్రజ్ఞ లెన్నన్ స్వయం
జ్యోతిర్మూర్తిని గాంచుమార్గము లటంచుంబల్కరే పూర్వికుల్.

ఉ. కాకమొ, కోడిపుంజొ, గిజిగాఁడొ, సరీసృపమో, పటోలియో
కాకరయో, కురంటకయొ, కానుగొ, తుమ్మయొ, కాకియోకయో
కాక మతేమొ చూచి గిలుకన్ ఫల మింతయు లేదు ముక్తియో
పాకరుణానుభావ్యపరిచారిక లీ కవితాకుమారికల్.

క. పనిపాటలులేక దుష్టాహ్య నికృష్టపదార్థవర్ణనాలోలత కూ
డనిపని సత్కవులకు; మోక్షనిధానముకైత గమనచతురత యుడినన్.

గీ. జనకవంశంబునకు నీతిసంపదమెయి, నతులసత్కీర్తి గడియించు నాఁడుఁబడుచు
బాల్యమునఁ ద్రిప్పకున్న సద్వంశ మేర్చు, దుహితృ సముపాత్త దుర్యశోదహనశిఖలు.

మ. కవితా కౌశల మబ్బియుండినను లోకఖ్యాతులో పూర్వస
త్కవులం గేరడ మాడరాదు మదిలో గర్వింపరా దాత్మశ
త్రువులం ద్రుంచి నిరీహుఁడై వినయపూర్ణుండై మహాత్యాగ శాం
తవసుండై మితభాషియై కవి లసద్గ్రంథంబు వ్రాయన్ వలెన్.

గీ. కవితనేర్చిన యంతనెకాదు నిఖిల, విషయసంకుల భారత పృథ్వికిపుడు
వాంఛనీయ మెయ్యదో గ్రహింపంగవలయు, నేదో రచియించి లాభంబు లేదులేదు.

శా. లోకం బీశ్వర దివ్యరూపమయి చెల్లున్ దాని కశ్రాంతసే
వాకాంక్షన్ బయిలోడకుండ తనువున్ బ్రహ్మార్పణంబంచు న
స్తోక త్యాగమొనర్చి పండితుఁడు కాంచుం బూర్వదుర్వాసనా
నీకధ్వంసకమైనజ్ఞాన మవలన్ నిత్యైక్య నిర్వాణమున్.

మ. జగమున్ మిథ్యగనెంచుచున్ బృథగుపాస్య బ్రహ్మనిష్ఠా గరి
ష్ఠగతిం గొందఱు, కొంద ఱీ భరతదేశ వ్యాప్తసంతానమే
భగవన్మూర్తిగఁ జూచి కొల్చెదరు విశ్వాసంబుతో నెవ్వరె
ట్టిగతింగొల్చిన మోక్షమిచ్చి ఫలతుష్టింగూర్చు దైవం బిలన్.

గీ. కవితవ్రాసిన నీశ్వరకథలుగాని, భరత మాతృపదాబ్జసేవన విశేష
సూచకచరిత్రములుగాని చొప్పడవలె, నిరుపయోగంబె యితరంబు నిశ్చయంబు.

క. ఈరెండిటిలో సత్కవి, భీరుఁడుకాకున్నయెడల విరచింపఁదగున్
భారతమాతృచరిత్రము, భీరుని కీశ్వరచరిత్రవిరచనమె తగున్.

శా. దేశక్షామ, దరిద్ర, తామయ, మనోద్వేగ, క్షుధాబాధలున్
రాశీభూతని, తాంతకష్టములు నారంజూచుచున్ భీరుతా,
పాశాబద్ధుఁడుగాని యేకవి రచింపంబూనఁజేయాఁడు మా,
త్రాశాగ్రంథము*గాక యన్యవిషయవ్యాలోలదుష్కావ్యముల్.

చ. ఎనిమిదికోట్లు భారతమహీజనయిత్రి గులాముబిడ్డ లే,
దినమును నొక్కపూటకును దిండికిలేక తపించుచుండఁ ద
జ్జనిత విషాదవహ్ని పరితాపమునన్ గవియైనవాఁడు దా
ని నపనయించు మార్గ మెటో నేర్చి రచింపఁడె సచ్చరిత్రముల్.

* మాత్రాశాగ్రంథము తల్లి బాగుపడగల యాశఁబుట్టించుగ్రంథము.

గీ. శాస్త్రచారిత్ర సాహిత్య సంఘవిషయ,ములను మూలకుఁ బోఁద్రోయవలయు నేఁడు
కూటికిం గుడ్డకును నోఁచుకొన్న పిదపఁ, జూచుకొందము దీక్షావిశుద్ధబుద్ధి.

వ. శ్రీపరమేశ్వరా! వినుము. అట్లు నేను శృంగారరసాధిదేవతోపాసనంబుఁ గావించుచు నించుకేనియు నాంగ్లవిద్యాభ్యాసంబునకు లోపంబు వాటిల్లనీక కామినీజనచిత్త సమాకర్షణోద్యోగంబునం దగిలి యెవ్వారేనియుంజూచిన గర్హ్యంబగుంగాని సమాదరణీయంబు కాదనుభీతి మనంబునుండి యామంత్రణంబు సెప్పి యథేచ్ఛగా నారాయణాంశవిరాజమాన లోకబాంధవుని పండుటెండల కడానిపూఁతలచే నభిరామంబులగు దినాంతంబులందును, వలితెమ్మెరలు వీచుటచే ఘనీభూతంబయినచంద్రికారసంబుచే దట్టంబుగ నవలిప్తంబగుటకు విషయీభూతంబులయిన నిగారంపు వెండిమలాముచికిలిమేడల యందంబుఁజిలుకు రాత్రులందును, బలుమా ఱుపచిత విదేశవస్త్రాద్యలంకరణుండనై యాయా శృంగాటకంబులందును, నాశాలతకుఁ జివురుఁగూర్చువెరవు సూపించు నిఱుకు సందులందును నట్టాఁడుచుండ నిట్లు కొంతకాలం బతిక్రమించునప్పటికి.

మ. పరభామాముఖమండలీ భరిత సౌభాగ్యావలోక క్రియల్
దఱచై నాఁటికినాఁడు కొట్టకొన కంతంబొందె గుంటూర్పురిన్
నిరవద్యప్రియభక్తియుక్తయగు తన్వీరత్నముల్ బ్రక్కఁగా
పురముం జేసెడి ముద్దరాలి నొకతెన్ మోహించు యత్నంబునన్.

వ. ఆముగుద పట్టపరీక్షయం దుత్తీర్ణుఁడై మండలకరగ్రాహి కార్యస్థానంబున ముప్పదిరూప్యంబుల మాసవేతనంబున నుండి యయ్యది మహాగౌరవాపాదకోద్యోగం బనుకొనుచు శరీర మమ్ముకొని జీవించుచున్న భర్తయొక్క గృహంబునకుఁ గొలఁది మాసంబుల క్రిందటనే కాపురంబు నెఱపవచ్చె. అంతియకాక బాల్యంబాదిగ విదేశ నాగరకతా విముఖంబై నిరాడంబర జీవితవిధానంబునకు నెలవగు పల్నాటివిషయంబు నందలి యొక్క పల్లెటూరియందుఁ దల్లిదండ్రులతోఁ గాలంబుపుచ్చియుండుటచేఁ బత్తనవాసంబునంగల యాకర్షకవస్తు విచిత్రంబులకును, ననురూపప్రవర్తనంబులకును బాహిరంబులు గలచెయ్వులుగల యా ముద్దరాలికందుఁ గ్రొత్తగాను బెఱుకుగాను నుండె. మఱియును బుట్టినింటియందు,

సీ. తోడిసెచ్చెలిపిండుఁగూడి బీటికిఁబోయి, పచ్చిలేఁబచ్చికఁ దెచ్చియుండెఁ
బ్రొయ్యిక్రిందికి శుష్కములనేఱి తెచ్చెను, నాడాడఁ బడుచులతోడఁ గూడి
పొలముమెట్టకుఁగాపుఁ బూఁబోండ్లతోడుత, పేడబుట్టలఁ దేర వెడలియుండె
నవసరంబునుబట్టి యవసథంబునగాయ,గూరలఁ గొనితెచ్చి దూరమేగి

ప్రకృతికాంత విలాససౌభాగ్యములను, దగనెఱింగి యమాయకత్వంబుతోడఁ
బెఱిగిన నెలంత వలఁబడవేసికొంటిఁ, బాపవారిధి కుత్తుకబంటి గాఁగ.

ఉ. ఆకమనీయమోహన ముఖాంబుజ సీధువు నిచ్చగించి య
స్తోకజవంబునన్ వలపుజొబ్బిలు నాగుఱిచూఁపు దుమ్మొదల్
పైకొని మూఁగి యెంత తొలిపట్టున మోమెడనేసి నిల్చినన్
రాక వహించి ధైర్యము సరాసరి యెప్పటియట్ల క్రుమ్మరెన్.

చ. తొలుత దృఢాంగసుందరవధూమణి నాతగులంపు బాకుఁజూ
పులకుఁ జిరాకుఁ జూపఁగ నపూర్వరుచిం బదునెక్కియవ్వి యు
జ్జ్వలముఖముం ద్యజించి యనవద్యకళామధురేతరాంగముల్
చలమున దాడిసల్ప విలసద్వళి చిర్నగవూనె నంతటన్.

గీ. కెంపువాతెఱపయిని మవ్వంపు నగవు, పొటమరింపఁగఁ దెలితెప్ప మూఁతవడియె,
నోలముంగొన్న మదనుండు కేలఁబూనె, జెఱకుసింగాణితోడుతఁ గఱకు ములికి.

క. ఆముగ్ధామణి యంతట, వ్యామోహము చిమ్మిరేఁగ వలలోఁబడుచుం
గామించి నన్ను నాథుని, మోముఁగనక కాపురంబు ప్రోఁద్రోచికొనెన్.

వ. ఇట్లు నిరవధికానందంబునఁ దగుల్కొని జతవీడక కొన్ని సంవత్సరంబులు గడపితిని.

ఉ. ఆమగనాలు నిట్టులు సుఖాంబుధిలోన మునింగి పైకిరా
నేమెయిఁ జేతఁగాక యొడలింకిన రోగము లుద్గమింప ని
స్సీ! మరణించె—నేనును విశేషముగా విలపించినాఁడ నా
కామిని విస్మరింప బహుకాలము కష్టమువట్టె శ్రీహరీ!

వ. అంతట,

గీ. కతిపయదినంబులకుఁ గులకాంత వచ్చెఁ, 'బట్టభద్ర' పదంబుఁ జేపట్టె యవల
వర్షభోగ్యశిశుడను న్యాయవాది నైతి, నుచ్చదశ యెత్తె లచ్చికే లూఁత యొసఁగ.

గీ. తాలిగట్టిన నాకులతరుణి రాఁగఁ, బూర్వదుర్బుద్ధి పోయిన పోకవోయెఁ
బాలితాత్మోద్ధరణవాంఛ బయలువడఁగఁ, బాలకనిరంకుశక్రియాపతన మట్లు.



చిత్రము ౮



చైత్యాలయము 2. తూర్పు నుండి కనుబడురీతి.



చైత్యాలయములు 4,5.కు ఉత్తరమునందలి గదులవరుస. ఆగ్నేయమునుండి కనుబడురీతి



చైత్యాలయము 2.లోని 'సింహాసనము' నైఋతినుండి కనుబడురీతి



చైత్యాలయములు 2,3,కు ఉత్తరమునందలి గదులవరుస. ఆగ్నేయమునుండి కనుబడురీతి

చిత్రము ౫



రామతీర్థమునందలి బౌద్ధాలయములలో దొరకిన కొన్ని గృహోపకరణములు, ఆయుధములు




[వెనుకటి సంచిక తరువాయి]

(క్రీ. పూ. 3-వ శతాబ్దిమొదలు క్రీ. త. 3-వ శతాబ్దివఱకు)

ఆంధ్ర శేషగిరిరావు గారు (సారస్వత సమాజము)

## 3

### తొలుతటి ఆంధ్ర రాజులు

### శ్రీముఖుడు

శాతవాహన వంశరాజులలో మొదటివాడు సింధుక, శ్రీసుక, శిప్రక నామములతో కూడ వ్యవహరింపబడుచున్న శ్రీముఖు డనువాడు. ఈతడు క్రీ. పూ. ౨౨౦ మొదలు క్రీ. పూ. ౧౯౭ వఱకు ఇరువ-మూడువత్సరములు రాజ్యము చేసినట్లు కనిపించు చున్నది. ఈతడు కాణ్వరాజగు సుశర్మను చంపి మగధ రాజ్య మాక్రమించెనని పురాణములు వాకొనుచున్నవి. సుశర్మ క్రీ. పూ. ౨౭ వ సంవత్సరమున చంపబడెనని చరిత్రలు తెల్పుచున్నవి. వీరి ఉభయులకాలము సరిపోకుండుట శ్రీముఖుడు మగధరాజ్యమాక్రమించెననుట పొసగదు. కాణ్వరాజగు సుశర్మను చంపినవాడు, ఆంధ్ర రాజులలో పండ్రెండవవాడగు కుంతలశాతకర్ణి, పదుమూడవవాడగు శాతకర్ణి, పదునాల్గవవాడగు ప్రథమ పులమాయి అను నీ ముగ్గురలో ఎవ్వడో ఒక్కడై యుండునని స్మిత్తు[1] నిర్ణయించుచున్నాడు. ఇది సత్య సమీపముగ నున్నది. ఆంధ్రచరిత్రకారు డిందు కియ్యకొనక శుంగవంశముతో కాణ్వవంశము సమకాలీనమని చెప్పెడి భండార్కరు వాదమునుగ్రహించి క్రీ. పూ. ౭౩-వ సంవత్సరమున శ్రీముఖుడు మగధ రాజ్యమును ఆక్రమించుకొనెనని వ్రాసి, శ్రీముఖుని రెండు శతాబ్దములు తరువాతికిలాగికొనివచ్చెను ఇరువదిమూడవరాజగు గోతమిపుత్రుని కాలము క్రీ. త. ౧౧౩-౧౩౮ అని శాసనాధారములవలన నిర్ణయింపబడినది. స్మిత్తువాదము ననుసరించి క్రీ. పూ. ౨౨౦ లో నున్న శ్రీముఖుని నుండి తరువాతిరాజుల కాలపరిమితి లెక్కవేసిచూడగా గోతమిపుత్రునికాలమునకు సరిపోవుచున్నది. ఆంధ్రచరిత్రకారుని వాదము ననుసరించి ఇట్లు సరిపోవదు. ఎట్లైనను సరిపెట్టవలయునను నూహతో ఆచరిత్రకారుడు శ్రీముఖుని తరువాత ఎందఱిరాజులనో విస్మరించి ౧, ౨, ౩, ౪, ౧౫, ౧౬, ౧౭, నెంబరుగలరాజులు ఒకరితరువాత నొకరు రాజ్యమునకు వచ్చిరని వ్రాసి తికమక చేసిరి. కావున వీరివాదము గ్రాహ్యము కాదు.

శ్రీముఖుని పేరుగల శాసనములు రెండు కానుపించుచున్నవి. 'అందొకటి రాజధానీనగరమగు ధాన్యకటకములోని స్థూపములోను (అమరావతీస్తూపము); రెండవది పశ్చిమాంధ్రదేశమండలి(మహారాష్ట్రము) నానాఘట్టములోని యొకగుహలోను గలవు.'[2]

1. Early History of India. P. 194.
2. ఆంధ్రులచరిత్ర. ప్రథమభాగము, పుట. ౧౦౬.

## కృష్ణుడు

శ్రీముఖుని యనంతరము రాజ్యాధిపత్యమువహించినవాడు ఆతని సోదరుడగు కృష్ణుడని విష్ణుపురాణము వాకొనుచున్నది.[3]

ఈతడు క్రీ.పూ. ౧౬౪ మొదలు ౧౪౬ వఱకు పదునెనిమిది సంవత్సరములు రాజ్యముచేసెను. వీని పేరుదహరించిన శాసనమొకటి నాసికపట్టణసమీపమున ఒక చిన్నగుహలో చూపట్టుచున్నది. శాతవాహన వంశజుడైనకృష్ణుడను రాజుసైన్యాధికారులలో నొకనిచే ఆ గుహ త్రవ్వింపబడినట్లు అందు వ్రాయబడియుండుటచే కృష్ణుడు మహాశూరుడనియు, ఆతడనేకరాజులను జయించి ఆంధ్రరాజ్యపు పొలిమేరను గోదావరిమూలస్థానమగు నాసికాత్ర్యంబకేశ్వరమువఱకు జరిపెననియు[4] మన మూహింపవచ్చును. ఈతనిరాజ్యపు పడమటి సరిహద్దు అరేబియాసముద్రము నంటియుండవచ్చుననియు[5] విదర్భదేశము, మధ్యరాష్ట్రములు, హైదరాబాదుదేశము[6] కూడ ఈతనిరాజ్యములోనివే అనియు తెలియుచున్నది.

## శ్రీమల్లశాతకర్ణి

ఈతడు కృష్ణునితరువాత రాజ్యభారమువహించి క్రీ. పూ. ౧౪౬ మొదలు ౧౩౬ వరకు పదిసంవత్సరములు రాజ్యపాలనముచేసెను. క్రీ. పూ ౧౮౪ మొదలు ౧౪౮ వఱకు మగధ రాజ్యపాలనముచేసిన పుష్యమిత్రునకును, ఆకాలముననే వైదిశానగరమున మగధరాజప్రతినిధిగానుండిన పుష్యమిత్రుని కొమారుడగు అగ్నిమిత్రునకును ఈమల్లశాతకర్ణి సమకాలికుడుగా గన్పట్టుచున్నాడు.[7] ఆకాలమున విదర్భదేశమునకు యాజ్ఞసేని[8] అనువాడు పాలకుడు. ఆతడు ఆంధ్రరాజులకు సామంతుడై యుండెను.[9] క్రీ. పూ. ౧౪౦ ప్రాంతమున యాజ్ఞసేనికిని అగ్నిమిత్రునకును పోరుజరిగినది. అందు అగ్నిమిత్రునిచేయి మీదైనను కొలదికాలములోనే ఆంధ్రరాజులు విదర్భదేశమును తిరిగి జయించిరని ఊహింపనైయున్నది.[10]

ఈమల్లశాతకర్ణియే కళింగరాజగు ఖారవేలునకు కూడ సమకాలీనుడని చెప్పవచ్చును. ఖారవేలుడు ఆంధ్రరాజగు శాతకర్ణిని లెక్కచేయక కాశ్యపక్షత్రియులకు సాయముచేయుటకై పశ్చిమమునకు ఒక చతురంగబలమును తన పరిపాలనకాలమున రెండవసంవత్సరములో పంపెననియు, మఱియు నాతడు ఆంధ్రులకు సామంతులై యున్న రాష్ట్రికులను, భోజకులను తన పరిపాలనకాలమున నాల్గవసంవత్సరములో పాదాక్రాంతులుగ చేసెననియు ఖారవేలుని హాతిగుంఫా శాసనమువలన తెలియుచున్నది.[11] ఇందువలన ఖారవేలుడును శాతకర్ణియు ప్రత్యర్థులై యుండవలయును గాని స్మిత్తుమొదలగు చరిత్రకారులు వ్రాసినట్లు వారిరువురును స్నేహితులైయుండి యుండరని తెలిసికొననగును. ఖారవేలుడు తనరాజ్యకాలమున పండ్రెండవ సంవత్సరములో మగధరాజగు బృహస్పతిమిత్రుని ఓడించెనని హాతిగుంఫా శాసనము చెప్పుచున్నది. అందాతడు స్మిత్తుమొదలగు చరిత్రకారులు వ్రాసినట్లు శాతకర్ణి సాహాయ్యము పొందియుండలేదని శాసనపాఠకులు గ్రహింపగలుగుదురు. ఖారవేలు

---

3. Civilisation in Ancient India. R. C. Duth. Part II. P. 39.
4. హిందూమహాయుగము. పుట, ౧౩౯.
5. This is indicated by the inscriptions at Nasik (No. 1144) and at Nanaghat, 50 Miles Northwest of Poona (No. 1114).
6. Cambridge History of India, Edited by E. J. Rapson.
7. Ibid.
8. కాళిదాసు, మాళవికాగ్నిమిత్రము.
9. Cambridge History of India.
10. Ibid.
11. Journal of the Bihar and Orissa Research Society (Jayaswal's tra nslation of Kharavela's Hathigumpha Inscription).

నకు సమకాలీనుడైన శాతకర్ణి ఈశాతకర్ణి గాక శ్రీముఖు నకు పూర్వమే ఎప్పుడో ఒకప్పుడు ఉండెనని తాము భావించు మఱియొక శాతకర్ణియై యుండునని ఆంధ్ర చరిత్రకారుడనుచున్నాడు.12 ఇది ఆధారము లేనిమాట.

నానాఘట్టము గుహలోని ఆకాలమునాటి శాస నములవలన నాయనికాదేవి లేక నాగనికాదేవి ఈ శాతకర్ణి పట్టపురాణి అనియు, కుమార భాయా, కుమారహకుశ్రీ, కుమారసాతవాహను లీతని పుత్రు లనియు తెలియుచున్నది.13 వీరందఱి విగ్రహములు ఆగుహలోనున్నవి.14 ఈ రాకుమారులముువ్వురిలో నొక రును పెద్దవారై సింహాసన మెక్కినట్లు కనుపించదు.15 ఈ శాతకర్ణి తరువాత రాజ్యభారమును వహించినది

## పూర్ణోత్సంగుడు

ఈతడు క్రీ. పూ. ౧౬౮ మొదలు ౧౫౦ వఱకు పదునెనిమిది సంవత్సరములు రాజ్యమేలెను. ఈకాల మున అనగా క్రీస్తు పూర్వము రెండవశతాబ్దిమధ్యభాగ మున ఉజ్జయిని ఆంధ్రరాజులపాలనములో నుండెనని నాణెములవలన తెలియుచున్నది.16

ఇప్పటినుండి 17-వ రాజగు హాలుడు క్రీ. త. ౬౮ లో గద్దె యెక్కువఱకును ఆంధ్రరాజలచరిత్ర విస్మృతిగహనము పాలైయున్నది. పురాణములందు చెప్పబడిన ఆయారాజల పేళ్లుమాత్రము వినబడుచున్నవి గాని వారి రాజ్యకాలవిశేషము లేసుమంతయు తెలియ వచ్చుటలేదు. భరుకచ్ఛమునకు దక్షిణముననున్న దేశము నకు ఏలికయని పెరిప్లసుగ్రంథకర్తచే పేర్కొనబడిన నాంబానస్ (మాంబారస్)అనువాడు ఆంధ్రరాజలలో ౭-వ వాడైన లంబోదరుడై యుండునని కృష్ణస్వామి అయ్యంగారు ఊహించుచున్నారు.17 క్రీ. పూ. ౫౦-వ సంవత్సర ప్రాంతమున విదిశారాజ్యము (తూర్పుమాళవ దేశము) ఆంధ్రరాజుల పాలనలోనికి వచ్చెనని శాసన ములు చెప్పుచున్నవి.18 క్రీ. పూ. ౨౭-వ సంవత్సర మున, ఆంధ్రరాజలలో పండ్రెండవవాడగు కుంతల శాతకర్ణియో, లేక పదమూడవవాడగు శాతకర్ణియో, లేక పదునాల్గవవాడగు ప్రథమ పులమాయియో కాణ్వ వంశజుడగు సుశర్మయను. మగధరాజునుచంపి మగధ రాజ్యము ఆక్రమించుకొనియెను.19

ఇట్లు ఆంధ్రరాజులు మగధసామ్రాజ్యమును చేకొని పాలించిరని పురాణములు పేర్కొనియుండు టయు, చీనాచక్రవర్తులు చీనాదేశపు చరిత్రకారులు బాద్వీపవాసులు యవద్వీపవాసులు వీరిని ఇండియా చక్రవర్తులని పేర్కొనియుండుటయు, పాండ్య చోళ కేరళములను పాలించినరాజులు వీరిని మగధరాజు లని పేర్కొనియుండుటయు వీరు మగధరాజ్యపాలకులనుట కు నిదర్శనములు.20 'భిల్సా' నగరమందలి కట్టడములు (Topes at Bhilsa)కూడ ఇందులకు నిదర్శనములు.21 ఇంతకుమించి ఈనిదర్శనములను బలపఱచుటకుతగినశాస నములుకాని, నాణెములుకాని చూపట్టుటలేదు.22 ఈ విషయము భావిపరిశీలనమున కాని నిర్ణయించుటకు వీలు చాలదు.

క్రీస్తుశకము ప్రథమశతాబ్దిని ఆంధ్రసామ్రాజ్యపరి పాలకులలో ప్రసిద్ధికెక్కినవాడు

---

12. ఆంధ్రులచరిత్ర. భా. ౧; పు. ౧౧౫.
13. Cambridge History of India.
14. ఆంధ్రులచరిత్ర. భా. ౧. పు. ౧౧౩.
15. Cambridge History of India.
16. Rapson's Indian Coins, P. 23-24.
17 Beginnings of South Indian History. (Krishna Swamy Iyengar).
18. Cambridge History of India.
19. V. A. Smith's Early History of India.
20. ఆంధ్రులచరిత్ర.
21. Dubreuil's Deccan.
22. Early History of India- V. A. Smith P. 193.

## హా లు డు

ఈతడు క్రీ.శ. ౬౮ మొదలు ౭౪ వఱకు అయిదేండ్లు రాజ్యపాలన చేసెను. ఈతడు సింహళరాజు కొమార్తెను పరిణయమాడెను.[23] ఈరాజన్యుడు విద్యాభిమాని, విద్యారసికుడు. ఇతడు విక్రమార్క, భోజ, కృష్ణరాయసదృశుడై విద్వాంసులను కవులనుఆదరించుచు తానును విద్వాంసుడును కవియునై యుండెను.[24] ఇట్లే హాలునికాలమున రాజపోషణము లభించుటచే దేశభాషలు బాగుగా నభివృద్ధిపొందెను.

ప్రాచీన మహారాష్ట్ర ప్రాకృతములో హాలుడు 'సప్తశతి' యను నీతి శృంగారపద్యకావ్యమును రచించెను. అందు మనోహరమైన అలంకారములు కలవు.[25] మచ్చునకొకటి.........'చంద్రుడను కలహంస ఈ రాత్రి భాగమున ఆకాశమను నిర్మల కాసారమునందు విడివడియున్న నక్షత్రపద్మముల నడుమ సుఖప్రయాణము కావించుచున్నది.' ............ఈ కావ్యమును శ్రీనాథుడు 'నూనూగుమీసాల నూత్నయౌవనమున' తెనిగించియుండెను. హాలుని సప్తశతిని బాణకవి తన హర్షచరిత్రమునందు పొగడియున్నాడు. 'కావ్య ప్రకాశిక' లోను, 'సరస్వతీ కంఠాభరణము'లోను, ధనికకృత'దశరూపకవ్యాఖ్యానము'లోను సప్తశతినుండి పద్యములుదహరింపబడినవి.[26]

హాలుని మంత్రి గుణాఢ్యపండితుడు పైశాచీ భాషలో (ఇది ప్రాకృత భాషలో నొక భేదము) 'బృహత్కథ'ను, 'కాతంత్రవ్యాకరణము'ను రచించెను. హాలుని ఆస్థానమున సకలవిద్యలు నెలకొని యుండెనని తెలియుచున్నది.[27] గుణాఢ్యుడు హాలుని మంత్రికాడని ఆంధ్రచరిత్రకారుని అభిప్రాయము. అందుకు వారాధారములు చూపలేదు. హాలుడు, సాలనుడు, కుంతలుడు, శాలివాహనుడు—ఈనాలుగును ఒక్కనిపేరులే యని హేమచంద్రుడు తన దేశకోశమునందు చెప్పియున్నాడు. క్రీ.శ. ౭౮–వ సంవత్సరమునుండి లెక్కింపబడుచున్న శాలివాహన శకమునకు ఈహాలశాతవాహనుడే కర్తయని కొందఱనుచున్నారు.

హాలుని అనంతరము మండలకుడు (క్రీ.శ. ౭౪—౭౯), పురీంద్రసేనుడు (క్రీ.శ. ౭౯–౮౪), సుందర స్వాతికర్ణుడు (క్రీ.శ. ౮౪–౮౫), చకోరస్వాతికర్ణుడు (౬ మాసములు)ను క్రమముగా ఒకరి తరువాత ఒకరు రాజ్యమేలిరి. ఇందు చకోరస్వాతికర్ణి వాసిష్ఠీపుత్రుడు: అనగా ఇతనితల్లి వసిష్ఠగోత్రమువారి ఇంటి ఆడుబడుచు. ఈ రాజునొద్దనుండి తరువాతి రాజులందరును తమ తల్లులపేళ్లు శాసనాదులలో చెప్పుచు వచ్చినందున వీరితల్లులు విఖ్యాతవంశజలనియు, లేక విద్యాదిగుణములచే విఖ్యాతలనియు మన మూహింపవలసియున్నది.[28] ఈతనిని మొదటి విలివాయకురుడని స్మిత్తు పిలుచుచున్నాడు.

ఈయాంధ్రరాజులకాలమున యవన శక పహ్లవులను విదేశీయులువచ్చి దేశముపైబడి కల్లోలము గావించిరి. ఇట్టి శకరాజులలోనివాడైన క్షహరాటనహపానుడను ఘూర్జర దేశపాలకుడు ఈకాలమున విజృంభించి మహాక్షత్రపబిరుదమును దాల్చి ఆంధ్రరాజ్యములోనిదగు మహారాష్ట్రమును జయించి, ఆభాగమునకు ఋషభదత్తుని రాజప్రతినిధిగచేసి పరిపాలింప దొడగెను. నహపానుడు ఋషభదత్తునకు తనకుమార్తె యగు దక్షమిత్ర నిచ్చి పెండ్లిచేసెను.[29] శ్రీముఖ శ్రీకృష్ణ శాతవాహనులచే జయింపబడిన ఈమహారాష్ట్ర భూభాగమిట్లు ఆంధ్రరాజుల చేజాఱిపోయినది.

### చకోరస్వాతి కర్ణునితరువాత శివస్వాతి

గద్దెనెక్కి క్రీ. శ. ౮౫ మొదలు ౧౧౩ వఱకు ఇరువదియెనిమిది వత్సరములు రాజ్యముచేసెను. పశ్చిమాంధ్రదేశమును (మహారాష్ట్రమును), నహపానుడు జయించి ఈదినములలో రాజ్యముచేయుచుండుటచే శివస్వాతి

23. సప్తశతి.
24. హిందూమహాయుగము, ౧౩౯ పుట.
25. History of Sanscrit Literature.
26. ఆంధ్రులచరిత్ర, భా. ౧ పు ౧౧౯
27. ప్రాచీన విద్యాపీఠములు.
28. హిందూమహాయుగము.
29. ఆంధ్రులచరిత్ర.

పూర్వాంధ్ర దేశమునుమాత్రమే పరిపాలించెనని చెప్ప వలసియున్నది. ఈతడు మాఢారీపుత్రుడు. ఇతనికి శక సేనుడని బిరుద ముండుటవలన30 ఈతడు శకవంశపు రాజులను ఓడించినట్లును, పశ్చిమాంధ్ర దేశమును క్షాత్ర పులకు కోల్పోవుటచే శాతవాహన వంశమునకు కలిగిన అపకీర్తిని పోగొట్టుకొనుటకు ప్రయత్నించినట్టులును కానవచ్చుచున్నది. ఈతనిని శివాలకురుడని స్మిత్తు పిలుచుచున్నాడు.

## ౪
## గౌతమీపుత్ర శాతకర్ణి

శివస్వాతిపిమ్మట ఆతనికుమారుడు గౌతమీపుత్ర శాతకర్ణి రాజ్యభారమువహించి క్రీ.శ. ౧౧౩ మొదలు ౧౩౮ వఱకు ఇరువదిఅయిదు సంవత్సరములు పరిపాలించెను. ఈతడు వీరచూడామణి; రాజనీతిధురంధరుడు. ఆంధ్రరాజులందఱిలో రాజ్యవిస్తృతినిబట్టి చూచినను, సైనికవిజయములబట్టి చూచినను గౌతమీపుత్రశాతకర్ణి మిద్దెమీది దివ్వెవలె వెలుగొందుచున్నాడు. ఈతని తండ్రి శివస్వాతి, తల్లి గౌతమీబాలశ్రీ, భార్యవాసిష్ఠి, కుమారుడు (వాసిష్ఠీపుత్ర) శ్రీపులమాయి.

### నహపానుని జయించుట

గౌతమీపుత్రుడు పరాక్రమశాలి: మొక్కవోని స్వదేశాభిమాని. ఇతడు కృష్ణరాయలవలె దిగ్విజయ యాత్రసల్పి తనపూర్వు లిదివఱలో గోల్పోయిన పశ్చిమాంధ్రరాష్ట్రమును జయించి ప్రతిష్ఠాననగరమున తన కుమారుడును యువరాజును అయిన శ్రీపులమాయిని తనకు ప్రతినిధిగా నియమించెను. ఈతనివిజయధాటికి వెఱచి యవనశకపహ్లావు లితనితో సంధికావించుకొని ఇతనికి దోసిలొగ్గియుండిరి. పశ్చిమాంధ్రరాష్ట్రమును జయించుటతో ఈతని దోఃకండూతి తీరినదికాదు. శాతవాహనవంశమునకు ప్రత్యర్థిగానుండిన ఖగరాటనహపానుని సంపూర్ణముగ పరాజయము నొందింపవలయునని ఆతడు సంకల్పించుకొనెను. మహాత్ములు సిద్ధసంకల్పులు గదా! తోడనే ఆతడు తనదుర్జయసైన్యముతో ధాన్యకటకనగరమునుండి బయలుదేరి ప్రతిష్ఠానమునుండి సేనాబలముతో సాహాయ్యార్థమువచ్చుచున్న పులమాయినికలసికొని సౌరాష్ట్రదేశముపైదండెత్తిపోయి క్రీ.శ.౧౨౬-లో సౌరాష్ట్రసేనలనుచీల్చిచెండాడి నహపానునిచంపి ఖగరాట వంశమును దుంపశుద్ధగ నిర్మూలించెను. ఆనాడు

శా. సౌరాష్ట్రేశ్వరు శేషదుర్గశిఖరాంచన్మౌళిభాగంబుపై
త రామార్గమలంకరింపబడియెన్ త్రైలింగరాజ్యధ్వజ
స్ఫారోదంచితలోహితచ్ఛటలనాసాయంసమారంభవే
ళారోచిస్సులమందవాయుమృదులీలావీచికాశ్రేణులన్.
—విశ్వనాథము సత్యనారాయణ

ఇట్లు నహపాన వంశమును నిర్మూలించి, నహపానుని నాణెములమీద తన నామమునుకూడ ముద్రించి, గౌతమీ పుత్రుడు తనకాప్రాంతమునందు చష్టనుని రాజప్రతినిధిగా నియమించెను.

### చష్టనుడు

చష్టనుడు శకవంశజుడగు క్షాత్రపుడు. ఈతడు మాళవదేశములోని ఉజ్జయిని రాజధానిగా రాజ్యమేలెను. ఈతడు గౌతమీపుత్రునకు ప్రతినిధిగాక ఈఉజ్జయిని నేలు స్వతంత్రుడైన క్షాత్రపరాజను వీరభద్రరావువ్రాత నిరాధారమైనది. ఏమందురా? మాళవదేశమునకు మఱియొక నామమైన అకరావంతిదేశము 31గౌతమీపుత్రుని రాజ్యములోనిదేయని గౌతమీబాలశ్రీ శాసనము చెప్పుచున్నది32. అట్లగుటచే గౌతమీపుత్రునకు లోబడియుండిన మాళవదేశమును పాలించుచుండిన చష్టనుడు స్వతంత్ర రాజగు టెట్లు! కావున చష్టనుడు గౌతమీపుత్రునకు సామంతుడే యని గ్రహింపవలసి యున్నది. ఖగరాట నహపానుని వంశమునంత నిర్మూలముచేసిన గౌతమీపుత్ర శాతకర్ణి మరల నాసమూహములోని విదేశస్థునే పాలకునిగా చేసెననుట నమ్మదగినది కాదని వీరభద్రరావు వాదన. ప్రత్యర్థియగు పురుషోత్తమునే తాను జయించిన హైందవరాజ్యమునకు ప్రతినిధిగా నియమించి రాజ్యాంగకోవిదత్వము వెల్లడించిన అలగ్జాండరునకు

30. హిందూమహాయుగము.
31 Rapson: Indian Coins.
32. Karli Inscription (No. 47).

వలెనే గౌతమీపుత్రుడును తాను జయించిన మాళవదేశమునకు (ప్రత్యర్థిజాతికిచెందిన) చస్తనుని రాజప్రతినిధిగా నియమించుటలో నమ్మరాని దేమున్నది?

## ఇతరరాజులతో మైత్రి

ఈకాలమున వంజీపురము రాజధానిగా చేరదేశమును పాలించుచుండిన 'చెంకుడువాను'నకును, సింహళద్వీపరాజగు గజబాహునకును, గౌతమీపుత్రశాతకర్ణికిని మిక్కిలి మైత్రియుండెను. ద్రమిళరాజైన చెంకుడువానునకును- ఆర్యరాజులైన విజయసేన, కనకసేనులకునుజరిగిన జాతియుద్ధములో గౌతమీపుత్రుడు పూర్వపుమైత్రినుపలక్షించి చేరరాజుపక్షమునచేరి జయమందెనని తెలియవచ్చుచున్నది. ఇల్లంకో అడికాల్ అను ద్రమిళకవి విరచితమైన శిలప్పదికారమీ విషయమును తెలుపుచున్నది. శాసనాదులీవిషయమును బలపఱచకుండుటచే ఇది ఇంకను విమర్శింపవలసియున్నది.

## సర్వమతసమత్వము

గౌతమీపుత్రుడు బౌద్ధమతావలంబకుడు. అట్లయ్యు ఆతడు సర్వమతములను సమదృష్టితో చూచిన ప్రాజ్ఞుడు. ఆనాడు జైన, బౌద్ధ, శైవమతములు ప్రజాహృదయవశీకరణమునకై పెనగులాడుచుండెను. ఇట్టి సంక్షోభసమయమున పరమతసహనమును పాటించి ఆతడు మత విప్లవము కలుగకుండ దేశక్షేమంకరముగ పాలనముచేసెను. ఆతడు బౌద్ధభిక్షువుల కనేకాగ్రహారములను దానముచేసెను. ఆతడు వర్ణసంకరముకాకుండ తగు కట్టుదిట్టములనుచేసి వర్ణాశ్రమధర్మములను పాటించిన సదాచారసంపన్నుడు.

## రాజనీతి

గౌతమీపుత్రుడు రాజనీతికోవిదుడు. ఈతనిరాజనీతికోవిదత్వమును వెల్లడించుటకు ఒక తార్కాణము చూపట్టుచున్నది. విదేశీయులైన శక యవన రాజులు దండెత్తివచ్చినప్పుడు అదివఱకేవచ్చి స్వదేశస్థులలోకలిసిపోయిన విదేశీయులు రాజద్రోహముతలచి స్వాతంత్ర్యము ప్రకటించి రాజ్యవిచ్ఛిత్తికిని రాజ్యవిప్లవమునకును గడంగకుండుటకై ఆతడు వారిపై శాస్త్రీయముగ విధించిన పన్నులనుకూడ తీసివేసెను. రాజ్యాంగ వేత్తృత్వమన నిట్టిదికదా!

## సామ్రాజ్యవిస్తీర్ణము

గౌతమీపుత్రుని కాలమున ఆంధ్రసామ్రాజ్యము మిక్కిలి విస్తృతమయ్యెను. అసిక, అస్మక, మూలక, సురాష్ట్రి, కుకుర, అపరాంత, అనూప, విదర్భ, అకరావంతిదేశము లీతనిరాజ్యములోనివని నాసికశాసనము తెల్పుచున్నది. ఈదేశము లెక్కడెక్కడివో తెలిసికొని ఆనాటి ఆంధ్రసామ్రాజ్యపు సరిహద్దులను ఏర్పఱచుకొందము. ప్రస్తుతము రాజపుత్రస్థానము లోని బీకనీరు సంస్థానప్రాంతదేశమే పూర్వము అసికదేశమని తెలియవచ్చుచున్నది.[33] అస్మక మూలకదేశములు దక్షిణాపథదేశములోనివని పురాణములు చెప్పుచున్నవి.[34] కత్తివాడిదేశమును గుజరాతులో నొకభాగమును కలిసిన సురాష్ట్రము.[35] కుకురదేశము రాజపుత్రస్థానములోనొక భాగము.[36] పశ్చిమకనుమలకును అరేబియాసముద్రమునకును మధ్యనున్న ఉత్తర కొంకణదేశమే అపరాంతమన బరగెను.[37] వింధ్యకుసమీపమున నర్మదకు ఎగువున

---

33. Marsden: Hindu Period.

34. ఆంధ్రులచరిత్ర. భాగము. ౧. పు. ౧౭౨.

35. Rapson's Ancient India (Geographical Notes).

36. ఆంధ్రులచరిత్ర. భా. ౧. పు. ౧౭౩.

37. History of Deccan (Bhandarkar) P. 17 Note 4; Rapson's Indian coins; Cunningham, however, contends (coins of Ancient India P. 102) that Aparanta is western Rajaputana.

మహిష్మతీనగరము రాజధానిగాగలదేశమే అనూప దేశము.[38] మధ్యరాష్ట్రములకు చెందియున్న నేటి బీరారు దేశమే విదర్భదేశము.[39] విదిశానగరము రాజధానిగాగల తూర్పు మాళవదేశమే అకరదేశమనియు, ఉజ్జయినీనగరము రాజధానిగాగల పశ్చిమ మాళవదేశమే అవంతిదేశమనియు తెలియుచున్నది.[40] ఈతడు మగధ రాజ్యపాలకుడై యుండినట్లు 'శిలప్పదికారము' చెప్పుచున్నది.[41] కోల్హాపురప్రాంతదేశముకూడ ఈతని రాజ్యములోనిదేయని తెలియవచ్చుచున్నది. ఇందువలన గౌతమీపుత్రశాతకర్ణికాలమున ఆంధ్రసామ్రాజ్యము ఉత్తరమున ఆరావళీపర్వతములును గంగాతీరమును మొదలుకొని దక్షిణమున కోల్హాపురము కాంచీపురములవఱకు వ్యాపించియుండెనని విశ్వసింపవచ్చును. వింధ్యావతము, పారియాత్రము, సహ్యము, కృష్ణగిరి, మలయము, మహేంద్రము, శ్రేష్ఠగిరి, చకోరము మొదలగుపర్వతము లీతని రాజ్యములోనివి.

## రాజప్రతినిధులు

ఇంతటి వైశాల్యముగల మహాసామ్రాజ్యమును ధాన్యకటకమునుండి తానొక్కడే పరిపాలించుటకష్టముగానుండునని రాజ్యాంగవేత్త యగు గౌతమీపుత్ర శాతకర్ణి తనసామ్రాజ్యములో ముఖ్యమైనస్థలములందు రాజప్రతినిధుల నియమించిన ట్లూహింపవచ్చును. ఇట్టి రాజప్రతినిధులలో శ్రీపులమాయి, చస్తనుడు, విలివాయకురుడుఅను వారి పేళ్లు వినబడుచున్నవి. ఇందు శ్రీపులమాయి(గౌతమీపుత్రునికొమారుడు, యువరాజు) ప్రతిష్ఠానపురము రాజధానిగా మహారాష్ట్రమును తండ్రిపేరపాలించెను. చస్తనుడనుప్రతినిధి ఉజ్జయిని రాజధానిగా మాళవసౌరాష్ట్రదేశములను పాలించెను. కోల్హాపురము రాజధానిగా దక్షిణదేశమును బోలియోకురోసు అని 'టోలిమీ' పేర్కొనిన విలివాయకురుడను ప్రతినిధి రాజ్యమేలెను. ఈతనిని గోతమిపుత్ర విలివాయకురుడని కోల్హాపురనాణెములు కొన్ని పేర్కొనుటచే ఇతడును గౌతమీపుత్రశాతకర్ణియును ఒక్కరే యని స్మిత్తు భ్రాంతిపడి యున్నాడు. ఈముగ్గురిప్రతినిధుల పేళ్లుగాక గౌతమీపుత్ర శాతకర్ణికి గోవర్ధనములో సైన్యాధికారిగానున్న విష్ణుపాలితుడనువాని పేరుకూడ నొకశాసనములో వినుపించుచున్నది.[42]

## ప్రతిభా ప్రాగల్భ్యములు

ఎవడు తనగర్భశుక్తి ముక్తాఫలమై జనించుటచే తాను వీరమాతనైతినని గౌతమీబాలశ్రీదేవి[43] మనసార సంతోషించెనో, ఎవడు ఖగరాడ్వంశనిర్ధూమధాముడో, ఎవడు దిగ్విజయయాత్రసల్పి సురాష్ట్ర, అనూప, అపరాంత, అకరావంతి, విదర్భదేశములను జయించి సార్వభౌమపదవిని పొందెనో, ఎవని ఆజ్ఞలను రాజన్యవరులనేకులు తులసీదళములవలె శిరసావహించిరో, ఎవడు శాతవాహనవంశగౌరవమును పునస్థాపితము గావించెనో, ఎవడు తనతరువాతి ఆంధ్రులకు కీర్తిభిక్షపెట్టి చిరస్మరణీయుడయ్యెనో ఆగౌతమీపుత్ర శాతకర్ణి శాతవాహనుని యశోగీతమును ఆంధ్రులమగు మనము దినదినము పారాయణచేయవలసియున్నది. ఈతని కీర్తిగీతమును ఆలపించు ఒకశాసనములోని[44] అంశముల నుదహరించుచు ఈతని చారిత్ర మింతతో విరమించుచున్నాను.

'గౌతమిపుత్ర శాతకర్ణి శాతవాహనుడు రాజాధిరాజు. అస్మిక, అసిక, మూలక, సురాష్ట్ర, కుకుర,

---

38. రఘువంశము.

39. Rapson's Ancient India (Geographical Notes).

40 Ibid. 'Malwa was sometimes divided into two kingdoms: Avanti or western Malwa with its capital Ujjine or Ujjain, and Akara or eastern Malwa with its capital Vidisa (Bhilsa.)

41. Tamils Eighteen Hundred years ago.

42. ఆంధ్రులచరిత్ర భా. ౧, పు. ౧౩౦.

43. See Karli Inscription (No. 47).

44. Epigraphia Indica; Page 90; No. 2 (Buhler's Translation). ఆంధ్రులచరిత్ర.

అపరాంత, అనూప, విదర్భ, అకరావంతి దేశములకు పాలకుడు. ఆతడు వింధ్యావతము, పారియాత్రము, సహ్యము, కృష్ణగిరి, మలయము, మహేంద్రము, శ్రేష్ఠగిరి, చకోరము మొదలగు పర్వతముల కధినాథుడు. ఆతని ఆజ్ఞలను రాజన్యవరు లనేకులు విధేయులై శిరసా వహించి పాదపూజ లర్పించుచుండిరి. ఆతని సామగ్రి మోచుజంతువులు మూడు సముద్రములనుండి జలమును త్రాగుచుండినవి. శరణుజొచ్చినవారిని సంరక్షించెను. తనప్రజల సుఖదుఃఖములను తనవిగా భావించుకొనియెను. మానవప్రకృతికి ననుగుణములగు ధర్మార్థకామముల నెట్టికాలముల నెట్టిప్రదేశముల నేరీతి ననుభవింపవలయునో దానింగూర్చి చక్కగ నాలోచించెను; ఆతడు విద్యానిధి, సజ్జనులకాశ్రయుడు, కీర్తికిరవైనవాడు;సదాచారసంపన్నుడు, సద్వర్తనకు బెట్టినపేరు, అతడొక్కడే ప్రజ్ఞావంతుడు, అతడొక్కడే ధనుర్విద్యావిశారదుడు;అతడొక్కడే వీరుడు;అతడొక్కడే బ్రాహ్మణసంరక్షకుడు. అతడు బ్రాహ్మణజాతి వర్ధిల్లుటకు మార్గము కలుగచేసెను; వర్ణసంకరాభివృద్ధి నడ్డగించెను. అతనిశూరకృత్యములు రామకేశవార్జున భీమసేనాదుల శూరకృత్యములను మించియుండెను. అతని పరాక్రమము నాభాగ, నహుష, జనమేజయ, సగర, యయాతి, రామాంబరీషాదులను మించియుండెను;అసంఖ్యేయములయిన యుద్ధములలో శాత్రవసమూహంబులను నిర్మూలము చేసెను! క్షత్రియుల గర్వభంగము గావించెను; యవనశక పహ్లవుల నాశముగావించెను; ఖగరాటవంశమును కూకటివ్రేళ్లతో పెఱికివేసి యూరుపేరులేకుండ ధ్వంసముచేసెను. శాతవాహన వంశముయొక్క కీర్తి పునస్థాపితము గావించెను.'

(సశేషము)



# కాలపురుషున కిదె నమస్కార శతము

ప్రతివాది భయంకరం రంగాచార్యులు గారు

పవలు రాత్రియును బదయుగంబై యొన
గూర్చు నెవ్వానికి నకుంఠితగతి
జగముచుట్టంబును జందురుఁ డెవని య
క్షిద్వంద్వమౌచు శాసింత్రు జగము
లెక్కవెట్టగరాని చుక్కలన్నియు నేని
వీరభటాళియై వెలయుచుండు
మువ్వేలుపులుఁగూడ నెవ్వాని యానతిఁ
దలఁదాల్చి పాలింపఁ దప్పకుండు

రట్టి లోకైకనాథున కఖిలకర్త
కఖిలభర్తకు హర్త కనంతునకును
నాదిరహితున కచలున కవ్యయునకుఁ
గాలపురుషున కిదె నమస్కార శతము.

అన్యులకు నేరికిని దెలియంగ రాక
సలుపఁబడు కార్యములనైన సర్వసాక్షి
యౌచుఁ బరికించు పరమాత్మ కాచరింతుఁ
గాలపురుషున కిదె నమస్కార శతము.

సస్యసుశ్యామలం బగు జగతి నొక్క-
క్షణములోన నెడారిఁగా సలుపు నద్భు
త ప్రభావముఁ గలయట్టి దాడిదొరకుఁ
గాలపురుషున కిదె నమస్కార శతము.

పగులఁ గొట్టంగరానట్టి బండరాళ్ళ
నిండుచోటుల మరునాఁడె దండిపైరు
పంటలను నింపఁ గల ప్రభావాధికునకుఁ
గాలపురుషున కిదె నమస్కారశతము.

గణన సేయంగరాని భోగములలోనఁ
దేలియాడుచుండెడి గొప్ప యేలికలను
జగము వెఱగంద నిరుపేదలుగ నొనర్చు
కాలపురుషున కిదె నమస్కార శతము.

ఒడల ధరియించుటకుఁ బుట్టమొకటి లేక
యెండవానలకడుఁ గూర్చు భృత్యుఁడైన
భాగ్యహీను మహారాజపదవి నుంచు
కాలపురుషున కిదె నమస్కారశతము.

పరమ సద్గుణములకు నావాస మగుచు
బాల్యమున నుండి పరగినభవ్యు ఘోర
హేయదుర్వ్యసనంబులఁ ద్రోయఁజాలు
కాలపురుషున కిదె నమస్కార శతము.

వనితల నిరపరాధుల బాలకులను
నిర్దయత వధియించెడి నీచజనులఁ
బరమభాగవతోత్తమత్వమునఁ దేల్చు
కాలపురుషున కిదె నమస్కార శతము.

కనులమూసి తెఱచునంత కాలముననె
జగమునంతయును దలక్రిందుగ నొనర్పఁ
జాలు స్వేచ్ఛావిహార సంచార మతికిఁ
గాలపురుషున కిదె నమస్కార శతము.

ప్రజలెల్ల ధర్మమార్గాను వర్తనులయి
దుర్మార్గములనుండి తొలఁగునట్లు
భగవంతుఁ డరసెడుఁ బాపపుణ్యములన్న
యాస్తికసద్భావ మలరునట్లు
రాజునకును శరీరము ప్రజ యంట నే
లికలు పాటించి పాలించునట్లు
వర్షాతపాదులో ప్రకృతి ధర్మంబుల
యానుకూల్యము ప్రజ కబ్బునట్లు
దౌష్ట్యము సమూల నష్టమై ధరణిలోన
నెల్లయెడ సౌష్ఠవము విలసిల్లునట్టు
లుగ్రతను వీడి కరుణ ననుగ్రహింపఁ
గాలపురుషున కిదె నమస్కారశతము.






# మూలము[1]

## మొదటిరేకు - రెండవప్రక్క

శ్రీ గణాధిపతయే నమః|[|*][2] నమస్తుంగ శిరశ్చుంబి[3] చంద్రచామరచారవే| త్రైలో

2. క్యనగరారంభ మూలస్తంభాయ శంభవే |[|౧*||][4] హారేర్లీలావరాహస్య దంష్ట్రాదండ[ః*] సపాతు వః [|*]
3. హేమాద్రికలశా యత్ర ధాత్రీ చ్ఛత్రశ్రియం దధౌ |[|౨*||] కల్యాణాయాస్తు తద్ధామప్రత్యూహతిమిరా
4. పహం|యద్గజోప్యగజోద్భూతం హరిణాపి చ పూజ్యతే|[|౩*||] అస్తి క్షీరమయా ద్దేవై ర్మథ్యమానా
5. న్మహాంబుధేః| నవనీత మివోద్భూత మపనీత తమోపహః[5]|[|౪*||] తస్యాసీ త్తనయ స్తపోభిర
6. తులై రన్వర్థనామా బుధః|పౌత్రో రస్య పురూరవా భుజబలై రాయు ద్విషాం నిఘ్నతః| తస్యా
7. యు ర్నహుషోస్య తస్య పురుషో యుద్ధే యయాతి[ః*] క్షితౌ| ఖ్యాత స్తస్య తు తుర్వసు ర్వసునిభః
8. ప్రయానీప తేః |[|౫*||][6] తద్వంశే దేవకీజాని ర్దీదీపే తింమభూపతిః| యశస్వీ తులువేంద్రేషు య [శ్రీ]దే
9. దోః కృష్ణ ఇవాన్వయే [|౬*||][7] తతోభూ ద్బుక్కభూజాని రీశ్వరక్షితిపాలకః| అత్రాసమగుణ
10. భంశం[8] మాళిరత్న[ం*] మహీభుజాం|[|౭*||] సరసా దుదభూ త్తస్మా న్నరసావనిపాలకః| దేవ
11. కీనందనా త్కామో దేవకీనందనా దివ|[|౮*||] వివిధసుకృతోద్దామే రామేశ్వరప్రము
12. ఖే ముహు ర్ముదితహృదయః స్థనే[9] స్థానే వ్యధత్త యథావిధి [|*] బుధపరివృతో నానా
13. [దానా*]ని యోభుని షోడశ త్రిభువనజనోద్గీతం[10] స్ఫీతం యశః పునరు క్తయన్|[|౯*||][11] కావే
14. రీ మాశువధ్వా[12] బహలజలరయాం తాం[ం*] విలంఘ్యైవ శత్రుం [|*] జీవగ్రాహ[ం*] గృహీత్వో[13] సమి
15. తి భుజవలా[14] త్తంచ రాజ్యం తదీయం| కృత్వా శ్రీరంగపూర్వం తదపి నిజవశే పట్టణం
16. యో బభాసే| కీర్తి స్తంభం నిశాయ[15] త్రిభువనభవన స్తూయమానాపదానః|[|౧౦*||][16] చేరం చో
17. ళం చ పాండ్యం తమపి చ మధురావల్లభం మానభూషం [|*] వీర్యోదగ్రం తురుష్కం గజపతి

---

1. నాదగ్గ అనున్న రేకులననుసరించి. 2. [*] ఈ గుర్తుగలవి మూలములో లేనివి. [ ] ఈ గుర్తుగలవి మూలములో స్పష్టముగా కనిపించనివి. ( ) ఈ గుర్తుగలవి మూలములో ఎక్కువై అనవసరమగుటచే తీసివేయవలసినవి. 3. 'శిరశ్చుంబి' అని చదువవలెను. 4. ౧ మొదలు ౪ వఱకు అనుష్టుభ్శ్లోకములు. 5. 'తమోపహః' అని. 6. శార్దూలవిక్రీడితము. 7. ౬ మొదలు ౮ వఱకు అనుష్టుభులు. 8. 'గుణభ్రంశం' అని. 9. 'స్థానే' అని 10. 'త్రిభువనజనోద్గీతం' అని. 11. హరిణీవృత్తము. 12. 'మాశుబధ్వా' అని. 13. 'గృహీత్వా' అని. 14. 'భుజబలాం' అని. 15. నిఖాయ' అని. 16. ౧౦, ౧౧ లు స్రగ్ధరా వృత్తములు.

18 నృపతిం చాపి జిత్వా తదన్యాన్। ఆగంగాతీరలంకా ప్రథమచరమభూభృత్తటాంతం
19. నితాంతం [।*] ఖ్యాతం క్షోణీపతీనాం స్రజమివ శిరసాం శాసనం యోవ్యతానీత్। [।౧౧*॥] తిప్పాజీ
20. నాగలాదేవ్యోః కౌసల్యా17 శ్రీసుమిత్రయోః। దేవ్యోరివ నృసింహేంద్రా త్తస్మాత్ పుత్రౌరథా
21. దివ।[।౧౨*॥]18 వీరౌ వినయినౌ రామలక్ష్మణా వివ నందనౌ। జాతౌ వీరనృసింహేంద్ర కృష్ణరా
22. యమహీపతీ।[।౧౩*॥] రంగక్షితీంద్రాచ్యుతదేవరాయౌ రక్షాధురీణా వివ రామకృష్ణౌ। ఓ
23. బాంబికాయాం నరసక్షితీంద్రా దుభౌ వభూతా నురగేంద్రసారౌ19।[।౧౪*॥]20 వీరశ్రీనారసింహః
24. స విజయనగరే రత్నసింహాసనస్థః [।*] కీర్త్యా నీత్యా నిరస్య న్నృగ నల నహుషా న
25. ప్యవన్యాం మఘాన్యాన్। ఆసేతో రాసుమేరో రవనిసురనుతః స్వైరమాచోదయాద్రే [।*]
26. రాపాశ్చాత్యాచలాంతా దఖిలహృదయ మావర్జ్య రాజ్యం శశాస।[।౧౫*॥]21 నానాదానా న్యకా
27. ర్షీ త్కనకసదసి యః శ్రీవిరూపాక్షదేవ [।*] స్థానే శ్రీకాలహస్తీ శితురపి
28. నగరే వేంకటాద్రౌచ కాంచ్యాం। శ్రీశైలే శోణశైలే మహతిహరిహరే హోబలే
29. సంగమేచ। శ్రీరంగే కుంభఘోణే హతతమసిమహానందితీర్థే నివృత్తౌ।[।౧౬*॥] గో
30. కర్ణే రామసేతౌ జగతి [తి*]దితరే ష్వప్యశేషేషు పుణ్య [।*] స్థానే ష్వార[బ్ధ*]నానావి

రెండవ రేకు - మొదటి ప్రక్క

31. ధబహు[ల*]మహాదానవారిప్రవాహైః। యస్యోదంచ త్తురంగప్రకరఖురర
32. జః పుమ్కదంబోధిమగ్న [।*] క్ష్మాభృత్పక్ష చ్ఛిదోద్యత్తురకులిశధరోత్కంఠి
33. తాత్కంఠితాభూత్22।[।౧౭*॥] ప్రాజ్యం ప్రశాస్య నిర్విఘ్నం రాజ్యం ద్యామివ శాసితుం। తస్మి
34. న్ గుణేన విఖ్యాతే క్షితేంద్రే దివం గతే।[।౧౮*॥]23 తతో ప్యవార్యవీర్యః శ్రీకృష్ణరా
35. యమహీపతిః। బిభర్తి మణికేయూరనిర్విశేషం మహీం భుజే।[।౧౯*॥] కీర్త్యా య
36. స్య సమంతతః ప్రసృతయా విశ్వం రుచైక్యం వ్రజే। దిత్యాశంక్య పురా పురా
37. రి రభవ ద్భాలేక్షణః ప్రాయశః। పద్మాక్షోపి చతుర్భుజోజని చతుర్వ
38. క్త్రో ద్విప24 త్పద్మభూః। కాళీ25ఖడ్గమథాద్రమా చ కమలం వీణాంచ వాణీ
39. కరే।[।౨౦*॥]26 శత్రూణాం వాసమేతే దదత ఇతి రుషా కింను సప్తాంబురాసీ [।*] న్స్నానాసే
40. నాత్తురంగ27 త్రుటితవసుమతీ ధూళికాపాలికాభిః। సంశోష్య స్వైరమే
41. త త్ప్రతినిధి జలధి శ్రేణికా28 యోవిధత్తే। బ్రహ్మాండ స్వర్ణమేరు ప్రము
42. ఖనిజమహాదానతోయై రమేయైః।[।౨౧*॥]29 స్తుత్యోదార్యః సుధీభిః సవిజయన
43. గరే రత్నసి[ం*]హాసనస్థః [।*] క్ష్మాపాలా న్కృష్ణరాయక్షితిపతి రధరీకృత్య
44. నీత్యా న్నృగాదీన్30। ఆపూర్వాద్రే రథా స్తక్షితిధరకటకా దా చ హేమాచ
45. లాంతా [।*] దానేతో రర్థిసార్థ శ్రియమిహ బహులీకృత్య కీర్త్యా బభాసే।[।౨౨*॥] కృత

17. 'కౌసల్యా' అని. 18. ౧౨, ౧౩ లు అనుష్టుభులు. 19. ౦భూతా మురగేంద్ర' అని. 20. ఇంద్రవజ్ర వృత్తము. 21. ౧౫, ౧౬, ౧౭ లు స్రగ్ధరా వృత్తములు. 22. ౦చ్ఛిదోద్యత్తురకులిశధరోత్కంఠితాకుంఠితాభూత్' అని. 23. ౧౮, ౧౯ లు అనుష్టుభులు. 24. 'చతుర్వక్త్రోద్భవం అని. 25. ద్రావిడ 'ళ' కారము. దీనికిని లకారమునకును గల భేదము స్వల్పము. 'ల' వర్ణమునకు దిగువనిచ్చిన వంపుగీటు కొంచెము కుడివైపునకు త్రిప్పిన 'ళ' వర్ణమగును. 26. శార్దూలవిక్రీడితము. 27. ౦సేనాతురంగం అని. 28. ౦శ్రేణికాం అని. 29. ఇదియు, దీనితరువాతిదియు స్రగ్ధరావృత్తములు. 30. 'నీత్యా నృగాదీన్' అని.

46. వతి సురలోకం కృష్ణరాయే నిజాం[o*]శం తదను తదనుజన్మా పుణ్యక మాచ్యు
47. తేంద్రః। అఖిలమవనిలోకం స్వాంశ మే త్యారిజేతా విలసతి హరిచేతా
48. విద్వ దిష్టప్రదాతా॥[|౨౩*||][31] అంభోదేన నిపీయమానసలి లోగ స్త్యేన పీతోజ్ఝి
49. త(ః) [|*] స్తప్తో రాఘవసాయకాగ్నిశిఖయా సంతప్యమానః సదా [|*] అంతస్థై వబ
50. డబాముఖానల[32]శిఖాజాలై విశుష్యం ధ్రువం [|*] య ద్దానాంబుఘనాంబురంబు
51. ధి రయం పూర్ణః సముద్యోత తే॥[|౨౪*||][33] సమజని నరపాలః సత్యధర్మప్రతిష్ఠో వి
52. డయనగర[34]రాజద్ర[త్న*]సింహాసనస్థః [|*] నృగ నళ నహుషాదీ న్నిజయ[35] న్రాజనీ
53. త్యా నిరుపమభుజవీర్యా దార్యభూ రచ్యుతేంద్రః॥[|౨౫*||][36] క్షితిం ప్రతిష్ఠాపితకీర్త్యదేహే[37]
54. ప్రాప్తే పదం వైష్ణవ మచ్యుతేంద్రే। అధ్యాస్య భద్రాసన మస్య సూను ర్వీరో బభౌ వేంక
55. టదేవరాయః॥[|౨౬*||][38] ప్రశాస్య రాజ్యం ప్రసవాస్త్రరూపే విద్వన్నిధౌ వేంకటరాయభూపే।
56. అభాగధేయా దచిరా త్ప్రజానా[39] మాఖండలావాస మథాధిరూఢే॥[|౨౭*||] రంగక్ష్మా
57. పసుత స్తతః సభగినీభర్తా పవిత్రాన్వయ[40] [|*] శ్శుద్ధాలంకరణేన పాలితమహా
58. కనాటరాజ్యశ్రియా।[41] శౌర్యాదార్య సుశీలతోంనతిదయాగాంభీర్య విద్యోతినా [|*]
59. రామక్ష్మాపతినా వ్యమాత్యతిలకైః క్లుప్తాభిషేకోత్సవః[42]॥[|౨౮||*][43] సంహృత్యారినికాయ[44]

రెండవ రేకు: రెండవ ప్రక్క

60. మర్థిజనతాసంత్రాణచింతామణిః [|*] సంతానద్రు రివ స్ఫుర న్సురగిరౌ 5 సాంమ్రా
61. జ్య[46] సింహాసనే। ఆసేతో రపి చాహిమాద్రిరచయ న్నాజ్ఞో నిజాజ్ఞాకరా [|*] న్సర్వాం
62. పాలయతే సదాశివమహారాయ శ్చిరాయ[47] క్షమాం॥[|౨౯||*] విఖ్యాతవిక్రాంతిన యస్య
63. యస్య పట్టభిషేకే[48] నియతం ప్రజానాం। ఆనందబాష్పై రభిషిచ్యమానా దేవీ
64. పదం దర్శయ తే ధరిత్రీ॥[|౩౦||*][49] గోత్రోద్ధార[50] విశారదం కువలయాపీడాపహారో
65. ద్ధురం [|*]సత్యాయ త్తమతిం సమ స్త(ం)సుమనస్తోమావనైకాయనం [|*] సంజాతస్మృ
66. తిభూరుచిం సవిజయం సంనందక శ్రీధరం [|*]య[o*] శంసంతి యశోదయాంచిత
67. గుణం కృష్ణావతారం బుధాః॥[|౩౧||*][51] విఖ్యాతం బహుభోగశృంగవిభవై రుద్దామ
68. దానోద్ధురం [|*] ధర్మేణ స్మృతిమాత్రతోపి భువనే దక్షం ప్రజారక్షణే। ప్రా
69. ప్తాం యస్య భుజం భుజంగ మహిభృ ద్దిగ్యంతి[52] కూర్మోపమం [|*] పాతివ్రత్య పతాకికే
70. తి ధరణీం జానంతు సర్వే జనాః॥[|౩౨||*] య త్సేనాధూళిపాళీ శకమశకసముచ్ఛా

---

31. మాలిని. 32. 'అంతస్థై బడబాముఖానలం' అని. 33. శార్దూలవిక్రీడితము. 34. 'విజయనగరం అని. 35. 'న్నిచయం అని. 36. మాలిని. 37. 'ప్రతిష్ఠాపిత కీర్తిదేహే' అని. 38. ౨౬, ౨౭ లు ఉపేంద్ర వజ్ర వృత్తములు 39. 'దచిరాత్ప్రజానాం అని. లేఖకుడు 'త్ప' వ్రాయుట మఱచి, ముందు 'త' వ్రాసి, దానికి పొల్లు ఇచ్చుట మఱచి దాని నంటియుండునట్లు 'ప్ర' వ్రాసినాడు. 40. 'భగినీ భర్తా పవిత్రాన్వయం అని. 41. 'కర్ణాటరాజ్యశ్రియా' అని. 42. క్లప్తాభిషేకోత్సవః' అని. 43. ౨౮, ౨౯ లు శార్దూలవిక్రీడిత వృత్తములు. 44. 'సంహృత్యారినికాయం అని. 45. 'స్ఫుర న్సురగిరౌ' అని. 46. 'సామ్రాజ్యం అని. 47. 'రాయశ్చిరాయక్ష్మాం' అని. 48. 'పట్టాభిషేకే' అని. 49. ఉపేంద్రవజ్రవృత్తము. 50. గోత్రోద్ధార అను దానిలోని 'గో' వర్ణమునకు లేఖకుడు ఊత్వముకూడ నిచ్చినాడు. 51. ౩౦, ౩౧ లు శార్దూలవిక్రీడితములు. 52. 'ద్దిగ్గ అని. ౧ తి

71. టనే ధూమరేఖా। రోమాలీకీ ర్తి వధ్వా53 ఇవ భువన మిదం సర్వ మంతర్వహ[ం*]త్యాః।
72. వణీ54 నాణీయసీవ ప్రకటితవిహృతే ర్వీర(ర)లక్ష్మ్యా రణాగ్ర55 [।*]శాంత్యో56 జీమూత
73. పంక్తిః57 కిల సక[ల*]ఖలస్తోమదావానలానాం।[।౩౩॥*]58 తుంగామేవ దయాం [పదాం*]బుజయుగ[ం*]శోణిం చ
74. కృష్ణం తనుం [।*] రక్తానీలసితాం త్రివేణి మనఘాం వింధ్యాంగిరం నర్మదాం। తీర్థానీ
75. తి59 సమావహాత్యవయవైః శేషాద్రివాసీవిభుః [।*] ప్రాయో యస్య విశేషభక్తిముది
76. తః పట్టభిషేకక్రియే60 ।[।౩౪॥*]61 ఓమధిప త్యుపమాయితగండ స్తోమణి రూప జితాసన62
77. కాండః। భాషగె 63 తప్పువ రాయరగండః షోమణి నిర్భర భూనవఖ[ం*]డః। [।౩౫॥*]64 రాజాధిరా
78. జబిరుదో65 రాజరాజసమాం హృతిః।66 స్వారాజరాజమానశ్రీ[ః*] సీరాజ 67 పరమేశ్వరః ।[।౩౬॥*68
మూ
79. ఋరాయరగండాంకో మేరులంఘియశోధరః। శరణాగత మందారః పరరాజభయం
80. కరః ।[।౩౭॥*] కరదాఖిలభూపాలః పరదార(సహోదర)సహోదరః। హిందురాయసురత్రా
81. ణ సింధురాజభగీరథః69 ।[।౩౮॥*] విష్టపత్రయవిఖ్యాతో దుష్టశార్దూలమర్దనః। అరిభ
82. గండభేరుండో హరిభక్తిసుధానిధిః ।[।౩౯॥*] వర్ధమానాపదానః శ్రీరర్ధనారీనటే
83. శ్వరః। ఇత్యాదివిరుదై70 ర్వందితత్యా నిత్య మభిష్టుతః।[।౪౦॥*] కాంభోజ71 భోజ కాలింగ కరహా
84. టాదిపార్థివైః। సావిల్లపదం ప్రాప్తైః సందర్శితనృపోపదః72 ।[।౪౧॥*] సోయం నీతిపిశా
85. రదః సురతరు స్పర్ధాలు విశ్రాణనః [।*] సర్వోర్వీశనతః సదాశివమహారాయ క్షు
86. మానాయకః। బాహో వంగదనిర్విశేష మఖిలాం సర్వాం సహో ముద్వహ [।*] న్విదత్త్రాణ73 ప
87. రాయణో విజేయతే74 వీరప్రతాపోన్నతః ।[।౪౨॥*]75 బాణాం గార్ణవ శీతా[ం*]శు గణితే
88. శకవత్సరే(ం)76 [।*] వత్సరే శోభకృన్నామ్ని77 మాసి భాద్రపదాహ్వయే(ం)।76 [।౪౩॥*]78 వ్యతీ

మూడవ రేకు: మొదటి ప్రక్క-

89. పాతమహాయోగే రోహిణీతారకాన్వితే। కృష్ణపక్షే చ కపిల
90. షష్ఠ్యాం మంగలవాసరే (ం)79[॥౪౪॥*] తుంగభద్రానదీతీరే తులసీవనపావనే। సం
91. నిధౌ విట్ఠలేశస్య సర్వసంపద్విధాయిని ।[।౪౫*॥] నానాశాఖాభిధాగోత్రే80
92. సూత్రేభ్య శ్శాస్త్రవిత్తయా (ం)81 [।*] విఖ్యాతేభ్యో ద్విజాతిభ్యో వేదవిద్భ్యో విశేష
93. తః ।[।౪౬॥*] శ్రీకొండవీడుసీమాంత ర్వాసినం సస్యభాసినం। వెల్నాడుకే వ

---

53. ‘కీర్తిర్వధ్వా’ అని. 54. ‘వేణీం అని. 55. ‘విహృతే వీరలక్ష్మ్యా రణాగ్రే’ అని. 56. ‘శాంత్యై’ అని. 57. ‘పఙ్క్తిః’ అని. 58. స్రగ్ధర. 59. ‘తీర్థానీతిం అని. 60. ‘పట్టాభిషేకక్రియే’ అని. 61. శార్దూలవిక్రీడితము. 62. ‘జితాసనం అని. 63. ‘భాషెగెం అని. 64. దోధకవృత్తము. 65. ‘జబిరుదో’ అని. 66. ‘హృతిః’ అని. 67. ‘శ్రీరాజం అని. 68. ౩౬ మొదలు ౪౧ వఱకు అనుష్టుభులు. 69. ‘సింధురాజగభీరధీః’ అని, 70. ‘బిరుదైం అని. 71. కాంబోజం అని. 72. ‘సందర్శిత నృపోపదః’ అని. 73. ‘న్విద్వత్త్రాణం అని. 74. ‘విజయతే’ అని. 75. శార్దూలవిక్రీడితము. 76. ఇది పాదాంతమున నీయబడు నిలువుగీటు కావచ్చును; అనుస్వారపు చుక్కవలె వ్రాయబడినది. 77. ‘శోభకృన్నామ్ని’ అని. ఫకారమునకీయబడు కుడివైపు నిలువుగీటు ఈకారపుగుర్తు నిచ్చు స్థానమున నంత యెగువగ వ్రాయబడినది. 78. ఈ ౪౩-వ శ్లోకము మొదలు ౪౫-వ శ్లోకము వఱకు అనుష్టుభులు. 79. చూడుము ౭౬-వ నోటు. 80. ‘నానాశాఖాభిధాగోత్రం అని. 81. చూడుము ౭౬-వ నోటు.

94. విఖ్యాతి మధికాం సముపాశ్రితం |[౪౭॥*] శ్రీచివ్వలూరు సీమాంత స్తంభా
95. త్ప్రాచీం దిశం శ్రితం| చిన్నాకూ పేటిపల్యాఖ్య గ్రామయో రుభయో రపి|[౪౮॥*]
96. సీమాంతకృష్ణవల్మీకా82 దాగ్నేయీం దిశమాశ్రితం| హ్రదా చ్చ గంగవల్యాఖ్యా
97. ద్దక్షిణస్యాం దిశి స్థితం |[౪౯॥*] కృష్ణవేణీనదీతీరా త్సంప్రాప్తం నైరృతీం దిశం [।]
98. పల్లదుబ్బ83 స్థానస్యాపి గత్సదుబ్బ స్థలస్యచ|[౫౦॥*] ప్రాచ్యా దంభః ప్రవాహో
99. త్తు పశ్చిమాయాం దిశిస్థితం| మేడిలంకా స్థలాగ్నేయ ప్రవాహో ద్వేగవ
100. త్తరాత్ |[౫౧॥*] ముత్తబోయతటాకా చ్చ వాయవీందిశ మాశ్రితం| సంప్రాప్త
101. ముత్తరామాశాం కుటే రాశ్వత్థ సంచయాత్ |[౫౨॥*] ప్రఖ్యాతా సలవర్తిన శ్రీ
102. పాడో రీశాన్యతాం గతం| అపి వేంనవరప్పాడు84 గ్రామకేణ త[నీ*]
103. యసా|[౫౩॥*] వరబుద్దనరప్పాడు85 గ్రామకేణ చ సంయుతం| సదాశివమ
104. హారాయ పుర మిత్యపరాభిధం |[౫౪॥*] గ్రామం కొల్లిపటాభిఖ్యం గృహా
105. రామోపశోభితం| సర్వమాన్యం చతుస్సీమా సంయుతం చ సమంతతః |[౫౫॥*]
106. నిధి నిక్షేప పాషాణ సిద్ద86 సాధ్య87 జలాన్వితం| అక్షి ణ్యాగామి
107. సంపుక్తం88 గంభోగ్యం సభూరుహం|[౫౬॥*] వాపీ కూప తటాకై శ్చ కచ్ఛేనాపి స
108. మన్వితం| పుత్ర పౌత్రాదిభి ర్భోగ్యం క్రమా దాచంద్రతారకం |[౫౭॥*]దాన స్యాధమన
109. స్యాపి విక్రయస్యాపి చోచితం| ఆత్రేయగోత్రదీపస్య గాత్రేరితమనోభు
110. వః|[౫౮॥*] వరాపస్తంబసూత్రస్య వసుధామరశాఖినః| సోమవంశావతంసస్య సు
111. కృతస్య మనీషిణాం |[౫౯॥*] స్వామికార్యధురీణస్య స్వాధీన నయసంపదః| ధ
112. ర్మమర్మవృదస్త్రాణ89 కర్మఠస్య విపశ్చిదాం90 |[౬౦॥*] నిర్మలాశయపద్మస్య91 సర్వ ధా
113. మ్నో జయశ్రియః| చక్రపాణిపదధ్యాన చరితార్థీ[ర్*]కృతాత్మనే |[౬౧॥*]శరణాగ
114. తభూపాల భరణాధీనచేతసః| మందేతరాహితధ్వాంత మందేహ పరిబంధినః92 |[౬౨॥*]
115. శ్రీకొండరాజభూపాలసింధుబంధుసుధానిధేః| కోనేరి తింమరాజస్య
116. గుణరత్నపయోనిధేః |[౬౩॥*] వినయాదార్యగా[ం*]భీర్య విశ్వాసావాసవేస్మనః।93
117. విహితాంజలిబంధుస్య విజ్ఞప్తి మనుపాలయన్ |[౬౪॥*] పరీతః ప్రయతైః స్నిగ్ధః94
118. పురోహితపురోగమైః| వివిధై ర్విబుధైః శ్రౌతపథికై రధికై గిరాం |[౬౫॥*]

మూడవరేకు : రెండవప్రక్క

119. సదాశివమహారాయో మాననీయో మనస్వినాం| సహిరణ్యపయోధీరా95పూ
120. ర్వకం దత్తవాన్ముదా|[౬౬*॥]గ్రామేస్మి న్విశ్రుతే వృత్తి శతద్వయ96సమన్వితే|వృత్తిమంతో [వేదవిదో*]

---

82. 'కృష్ణవల్మీకాం' అని. 83. 'పల్లదుబ్బం' అనునది 'రల్లదుబ్బం' అనికూడ చదువవగును. 'రల్లదుబ్బ', పాఠ మేసరియైనపాఠము కానగను. 'రెల్లుదుబ్బ' అనునదియే, 'రల్లదుబ్బం' అని వ్రాయబడి యుండవచ్చును. 84. ౦వరప పాడు' అని వ్రాయబడినది. 'ప' ద్విత్వము వ్రాయవలసివచ్చినప్పుడు కొన్నికొన్నిచోట్ల లేఖకుడు ఈశాసనమున ఈ పద్ధతినే అవలంబించెను. 85. ౦బుద్దవరపపాడు' అని వ్రాయబడినది. 'ద' ద్విత్వము అనగా 'ద్ద' వ్రాయవలసి వచ్చినను లేఖకుడు రెండుమాఱులు ద వ్రాయుచువచ్చెను. 'ద్ద' శాసనమున గిట్లే చాలచోట్ల వ్రాయబడినది. 86. ౦సిద్ధం అని. 'ధ' వ్రాయవలసినచోట శాసనమున చాలచోట్ల 'ద్ల'. కలదు. 87. ౦సాధ్యం అని. 88. ౦సంయుక్తం' అని. 89. 'ధర్మమర్మవిదస్త్రాణం అని. 90. 'విపశ్చితాం' అని. 91. ౦పద్మస్య' అని. 92. ౦పరిపంథినః' అని. 93. ౦వేశ్మనః' అని. 94. 'స్నిగ్ధః' అని. 95. 'సహిరణ్యపయోధారాం అని. 96. చూడుము: కడచిన సంచిక, ౮౫-వ పుట, ౧-వ (ఫుట్‌నోటు) విశేషసూచిక.

121. విప్రా వేదాంతపారగాః॥[౬౭*॥] వేదాద్రివాసినే ద్యత విష్ణవ97ప్రభవిష్ణవే। విష్ణవే నర
122. సింహాయ వృత్తి రేకాత్ర కల్పితా।[౬౮*॥] భారద్వాజాన్వయ స్సూను యల్లంభట్టస్య యాజుషః। చ
123. తశ్రోత్రాశ్నుతే98వృత్తీ[ః*] కృష్ణభట్ట స్సతాం వరః॥[౬౯*॥] వల్లంభట్టస్య సూనుః శ్రీలోహితాన్వయసం
124. భవః। శ్రీరామలింగభట్టాఖ్యో యాజుషోత్ర త్రివృత్తికః॥[౭౦*॥] సూను[ః*] పర్వతభట్టస్య కుత్సగో
125. త్రసముద్భవః। వృత్తిత్రయ మవాప్నోతి లింగంభట్టోత్ర యాజుషః॥[౭౧*॥] గార్గ్యగోత్రసముద్భూతః
126. పింనాభట్టస్య నందనః సుధీ గోవిందభట్టాఖ్యో యాజుషోత్ర త్రివృత్తికః॥[౭౨*॥] గంగాధర
127. సుధీసూను భారద్వాజాన్వయోద్భవః। లింగాజ్యోతిషికో వృత్తిద్వయ మత్రైతి యాజుషః॥[౭౩*॥]
128. భారద్వాజాన్వయ స్సూరి నారసింహసుధీసుతః। వృత్తిద్వయ మవాప్నోతి నారసిం[*]హోత్ర
129. యాజుషః॥[౭౪*॥] అప్పా[వ*]ధానిన స్సూను భారద్వాజాన్వయోద్భవః। ఆపస్తంబసూత్ర
శ్శ్రీకాంతు
130. స్యోత్ర ద్వివృ[*త్తి]కః॥[౭౫[*॥] సూను లక్ష్మణభట్టస్య యాజుషో గౌతమాన్వయః। కోవిదః కొండుభ
131. ట్టాఖ్యో వృత్తిత్రయ మిహాశ్నుతే॥[౭౬*॥] పురుషోత్తమభట్టాఖ్యసుధీ లోహితగోత్రజః। కామా
132. భట్టాత్మజో త్రైతికాం వృత్తి మాప్నోతి యాజుషః॥[౭౭*॥] శాలావతాన్వయోద్భూతో లింగాభట్టతనూభ
133. వః। రామావధానీ విప్రేంద్రో యాజుషో త్రైతికవృత్తికః॥[౭౮*॥] సూను గోవిందభట్టస్య గార్గ్యగో
134. త్రసముద్భవః। అత్రైతికా మశ్నుతే వృత్తిం యాజుష శ్శంకరః సుధీః॥[౭౯*॥] సూరే (స్తిరే) స్తిరుమ
135. లాఖ్యస్య సూను లోహితగోత్రజః। యాజుషోనంతభట్టాఖ్యో వృత్తిమేకా మిహాశ్నుతే॥[౮౦*॥]
136. సూను శ్శింగరిభట్టస్య శాండిల్యాన్వయసంభవః। తిప్పాభట్టో భవ త్త్యేకవృత్తిమా న
137. త్ర యాజుషః॥[౮౧*॥] భారద్వాజాన్వయ స్సూను వల్లంభట్టస్య యాజుషః। ధీమాం స్తిప్పావధీ
138. న్యత్ర వృత్తిమేకాం సమశ్నుతే॥[౮౨*॥] గార్గ్యగోత్రసముద్భూతో గంగాధరసుధీ సుతః। ధీమాం
139. స్తైలుంజ100యాభిఖ్యో యాజుషో త్రైతికవృత్తికః॥[౮౩*॥] భారద్వాజాన్వయోద్భూతో రామాభట్టస్య నం
140. దనః। తింమాభట్టో భవ త్త్యేకవృత్తిమా నత్ర యాజుషః॥[౮౪*॥] సుత(ః) శ్శింగరిభట్టస్య శాండి
941. ల్యాన్వయసంభవః। వృత్తి మేకా మిహాప్నోతి నారయో యాజుష స్సుధీః॥[౮౫*॥] కామాభట్టాత్మ
142. జో ధీమా న్కౌశికాన్వయసంభవః। నవాభ ట్టాహ్వ యో త్రైతికాం వృత్తి మాప్నోతి యాజు
143. షః॥[౮౬*॥] సూనుః శ్రీసూరుభట్టస్య యాజుషో గౌతమాన్వయః సూరుభట్ట స్సతాం శ్రేష్ఠో వృత్తి మేకా(ం)
144. మిహాశ్నుతే॥[౮౭*॥] సూను వైకుంఠభట్టస్య శ్రీనివాసో మహామతిః। అత్రైతికాం వృత్తి మభ్యేతి
145. యాజుషో గౌతమాన్వయః॥[౮౮*॥] సుధీ శ్శంకరభట్టస్య సూనుః కాశ్యపగోత్రజః। సూరావధా
146. నీ విప్రేంద్రా101యాజు షో త్రైతికవృత్తికః॥[౮౯*॥] సూరే స్తిరుమలాఖ్యస్య సూను మల్లయకోవిదః। వృ
147. త్తి మేకా మిహాభ్యేతి యాజుషో గార్గ్యగోత్రజ॥[౯౦*॥] కుత్సగోత్రసముద్భూతః పర్వతాఖ్యసు
148. ధీసుతః। అత్రైతికా మశ్నుతే వృత్తి మంనయో యాజుష స్సుధీః॥[౯౧*॥] గార్గ్యగోత్రభవో102ధీ
149. మా నబ్బాభ ట్టాత్మసంభవః। వృత్తి మేకా మిహాప్నోతి యల్లయో యాజుషో ద్వి
150. జః॥[౯౨*॥] లోహితాన్వయజ స్సూను వల్లంభట్టస్య యాజుషః। యఋభట్టో103భవ త్త్యే
151. కవృత్తిమా నత్రభూసురః॥[౯౩*॥] ధీమా(ం) నల్లాళభట్టస్య నందనః కుత్సగోత్రజః।

---

97. 'దైత్యజిష్ణవే' అని. 98. ॰తస్రోత్రాశ్నుతే' అని. 99. ॰స్తిప్పావధాం అని. 100. ॰స్తైలుబ్జం అని. 101. 'విప్రేంద్రో' అని. 102. ॰భవో' అన్నచోట లేఖకుడు ముందుపవో వ్రాసి, పిదప పవర్ణమును భవర్ణముగా దిద్దెను. 103. 'యజ్ఞుభట్టో' అని.

నాలుగవ రేకు: మొదటి ప్రక్క-

152. వృత్తిమేకా మవాప్నోతి పెద్దిభట్టో(త్ర యాజుషః॥[౯౪॥*] లింగంభట్టస్య సూ
153. నుః శ్రీ లింగంభట్ట స్సబహ్వృచ[ః।*] భారద్వాజాన్వయోద్భూతో భవ త్యత్రైక
154. వృత్తిమా న్॥[౯౫॥*] సర్వాభట్టస్య సూనుః శ్రీవత్సగోత్రసముద్భవః। తింమాభట్టో భ
155. వ త్యేకవృత్తిమా నత్ర యాజుషః॥[౯౬॥*]ఆత్రేయగోత్రజ స్సూనుః పోతాభట్టస్య బహ్వృ
156. చః। అత్రైకా మశ్నుతే వృత్తి మంనంభట్టో మహామతిః॥[౯౭॥*] తింమాభట్టాత్మజో ధీ
157. మా న్కౌశికాన్వయసంభవః। వృత్తి మేకా [మి*]హాప్నోతి రామయో యాజుష స్సుధీ[ః*॥౯౮॥]
158. హారితాన్వయజో ధీమా నంనంభట్టాత్మసంభవః। యాజుషో రామ యోత్రైకవృ
159. త్తికో భూసురోత్తమః॥[౯౯॥*]అప్పాభట్టతనూజ శ్రీ భారద్వాజాన్వయోద్భవః। రా
160. మాభట్టో భవత్యేకవృత్తిమా నత్ర యాజుషః॥[౧౦౦॥*] నందనో యఙ్ఞుభట్ట(ట్ట)స్య యా
161. జుషః కాశ్యపాన్వయః। వృత్తి మేకా మిహాభ్యేతి సర్వాభట్ట స్సతాం వరః। [౧౦౧॥*] న[ంద*]
162. నోనంతభట్టస్య భారద్వాజాన్వయోద్భవః। శ్రీగోపీనాథభట్టాఖ్యో యాజు
163. షో త్రైకవృత్తికః॥[౧౦౨॥*] యాజుషో మిత్రయవసగోత్రీ104యల్లావధానిజః। భవ
164. త్యత్రైకవృత్తిః శ్రీహరిభట్ట స్సతాం వరః॥[౧౦౩॥*] ధర్మాభట్టాత్మసంభూతం105కాశ్య
165. పాన్వయసంభవః। శ్రీనారసింహభట్టాఖ్యో యాజు షోత్రైకవృత్తిమాన్॥[౧౦౪॥*] నం
166. దనః కొండుభట్టస్య యాజుషః కాశ్యపాన్వయః। కృతీ కేశవభట్టాఖ్యో భవ
167. త్యత్రైకవృత్తికః॥[౧౦౫॥*] యఙ్ఞంభట్టస్య సూనుః శ్రీరామాభట్టో మహామతిః। భారద్వా
168. జాన్వ యోత్రైకాం వృత్తి మాప్నోతి యాజుషః॥[౧౦౬॥*] శ్రీవత్సగోత్రసంభూతో యాజుషో
169. వేదయాత్మజః। శ్రీనారసింహభట్టాఖ్యో వృత్తి మేకా మిహాశ్నుతే॥[౧౦౭॥*] గంగయా
170. ఖ్యసుధీసూను యాజుషో హారితాన్వయః। వేదయో వృత్తి మత్రైకాం విప్రవ
171. య స్సమశ్నుతే (ం)76[॥౧౦౮*॥] వాధూలగోత్రసంభూతో యల్లుదీక్షిత నందనః। యాజుష[ః*]సూ
172. రయో ధీమా న్వృత్తిమేకా మిహాశ్నుతే॥[౧౦౯॥*] అంనంభట్ట స్సతాం శ్రేష్ఠః హరిదీక్షి
173. త నందనః। వాధూలగోత్రజో త్రైకాం వృత్తి మాప్నోతి యాజుషః॥[౧౧౦॥*] హరిదీక్షి
174. తసూనుః శ్రీవాధూలాన్వయసంభవః। యాజుషః కాండయాభిఖ్య106స్సుధీ రత్రై
175. కవృత్తికః॥[౧౧౧॥*] వాధూలాన్వయజ స్సూను గోపాభట్టస్య యాజుషః। వృత్తి మేకా
176. మవాప్నోతి107శిష్టాచా రోత్ర శింగయః॥[౧౧౨॥*] కౌండిన్యగోత్రసంభూతో వల్లంభట్ట
177. తనూద్భవః। యాజుష స్తింమయాభిఖ్యో భవ త్యత్రైకవృత్తిమాన్॥[౧౧౩॥*] భారద్వాజా
178. న్వయోద్భూత స్తిప్పాభట్ట తనూద్భవః। అత్రైకా మశ్నుతే వృత్తిం గంగయో యా
179. జుష స్సుధీః॥[౧౧౪॥*] మాధవయ్యతనూజ శ్రీభారద్వాజాన్వయోద్భవః। యాజు షోత్రా
180. శ్నుత108వృత్తిం సూరుభట్టాహ్వయ స్సుధీః॥[౧౧౫॥*] తింమాభట్ట తనూజన్మా యాజుషః కాశి
181. కాన్వయః। కృతీకామావధా న్యత్ర వృత్తి మేకాం సమశ్నుతే॥[౧౧౬॥*] శ్రీనారసింహభ
182. ట్టస్య సూను శ్శాండిల్యగోత్రజః వృత్తి మేకా మిహాప్నోతి యాజుషో లక్ష్మయః
183. సుధీః॥[౧౧౭॥*] యాజుషో లక్ష్మణార్యస్య సుతో శాండిల్యగోత్రజో। గణేశ శింగయా వే

---

104. గోత్రో' అని. 105. ॰సంభూతః' అని. 106. 'కొండయాభిఖ్య'? 107. ॰మవాప్నోతి' అని
108. ॰శ్నుతే' అని.

## నాలుగవ రేకు: రెండవప్రక్క

184. తా వుభా వత్రైకవృత్తికా|[|౧౧౮||*] భారద్వాజాన్వయ శ్రీమదనంభట్టాత్మ సంభవః|
185. యల్లంభట్టో భవ త్యేకవృత్తిమా నత్ర యాజుషః|[|౧౧౯||*] హరితాన్వయ సంభూత శ్రీంగణా
186. ధ్వరి నందనః| యాజుషః సూరుభట్టాఖ్యో వృత్తి మేకా మిహాశ్నుతే|[|౧౨౦||*] అప్పతే109దీక్షి
187. తసుతో యాజుషో హరితాన్వయః| తింమాభట్టాహ్వయోధీమాం న్భవ త్యత్రైకవృత్తి మా
188. న్|[|౧౨౧||*] హరితాన్వయజః సూనుః పురుషోత్తమయజ్వనః| పేరుభట్టో భవ త్యేకవృత్తిమా న
189. త్రయాజుషః|[|౧౨౨||*]యజ్ఞేశ్వరాధ్వరీం110ద్రస్యనందనో హరితాన్వయః| యాజుషో వాజపేయ్యత్ర(ా)111
190. వృత్తి మేకాం సమశ్నుతే|[|౧౨౩||*]తింమావధానినః సూను గౌతమాన్వయ సంభవః| ఏకాం ము
191. త్తావధా న్యత్ర వృత్తిమాప్నోతి యాజుషః|112[|౧౨౪||*] శ్రీ[మా*]త్పవ౯తభట్టస్య113నందనః కుత్స గోత్రజః|
192. యాజుషోత్రైక వృత్తిశ్రీవేదయో విదుషాం వరః|[|౧౨౫||*] అబ్బాభట్టతనూజః శ్రీగాగ్య౯114గో
193. త్రసముద్భవః| యాజుషో యజ్ఞుభట్టాఖ్యో వృత్తిమేకాం సమశ్నుతే|[|౧౨౬||*]నందనో రామకృష్ణస్య
194. రామకృష్ణోత్రయాజుషః| వృత్తి మేకా మిహాప్నోతి లోహితాన్వయసంభవః|[|౧౨౭||*] సూను శ్రీ
195. రంగభట్టస్య యాజుషో గౌతమాన్వయః| అ[ం*]నంభట్టాహ్వ యోత్రైకాం వృత్తి మాప్నోతి భూసు
196. రః|[|౧౨౮||*] హరితాన్వయ సంభూతో లింగంభట్టతనూద్భవః| శ్రీనియాపాత్తుభట్టోత్రవృత్తిమేకా[ం*]
197. స మశ్నుతే|[|౧౨౯||*] నందనో వెంనుభట్టస్య భారద్వాజాన్వయోద్భవః| వరాపస్తంబసూత్ర శ్రీలిం
198. గయో త్రైకవృత్తికః |[|౧౩౦||*]సూను నృసింహభట్టస్య బహ్వృచ115స్సోమయస్సుధీః| అత్రైకా మ
199. శ్నుతే వృత్తిం భారద్వాజాన్వయోద్భవః|[|౧౩౧||*] ఇల్లంభట్టసుధీసూను యాజుషః కౌశికాన్వయః[|*]
200. యజ్ఞుభట్ట స్సతాం శ్రేష్టో వృత్తి మేకా(ం)మిహాశ్నుతే|[|౧౩౨||*] కౌశికాన్వయసంభూత స్తంమాభట్ట
201. తనూద్భవః| యాజుషోత్రైకవృత్తి శ్రీకొండయో గుణినాం వరః|[|౧౩౩||*] కుత్సగోత్రోద్భవ స్సూను116
202. ల్లిఁ[ం*]గంభట్టస్య యాజుషః| ఖ్యాతః పవ౯తభట్టాఖ్యో భవ త్యత్రైకవృత్తికః|[|౧౩౪||*] శ్రీనా
203. రాయణభట్టస్య సూనుః కాశ్యపగోత్రజః| ఏకాం నీలావధా న్యత్ర యాజుషో వృ
204. త్తి మశ్నుతే|[| ౩౫*||] భారద్వాజాన్వయోద్భూతో వేదయ స్యాత్మసంభవః| యాజుషః పోచయాభిఖ్యో
205. వృత్తి మేకా మిహాశ్నుతే|[|౧౩౬*||] కౌండిన్యగోత్రసంభూతో సుధి ద్రోణతయనందనః| యజ్ఞు
206. భట్టో భవ త్యేకవృత్తిమా నత్ర యాజుషః|[|౧౩౭*||] నందన శ్చెంనుభట్టస్య కౌశికా
207. న్వయసంభవః| మనీషీ నారయాభిఖ్యో యాజు షోత్రైకవృత్తికః|[|౧౩౮*||] కౌశికా
208. న్వయజా రామచంద్ర117పండితనందనః| అబ్బాపండితవయ౯శ్చ యాజుషోత్రైక
209. వృత్తికః|[|౧౩౯*||] గంగాధరసుధీ సూను బ[౯*]హ్వృచః కాశ్యపాన్వయః| వీరయో విప్ర
210. వయ౯స్సో వృత్తిన్వయ మిహాశ్నుతే|[|౧౪౦*||] నందనః పోచిభట్టస్య కాశ్యపాన్వయసం
211. భవః| బహ్వృచో త్రాశ్నుతే వృత్తి మేకాం సవ౯యకోవిదః|[|౧౪౧*||] సూనుః పవ౯తభట్ట
212. స్య యాజుషః కాశ్యపాన్వయః| వృత్తి మేకా మిహాప్నోతి కృష్ణః సుకృ

---

109. ఇచ్చట ఇతరస్థలములందువలె గాక 'ప' కు ద్విత్వమీయబడినది. 110. ఇచ్చట లేఖకుడుంరీంద్ర' అనుదానిలో మొదట 'ప' కాబోలు వ్రాసి పిదప దానిని 'ర'గ దిద్దెను. 111. 'వాజపేయోత్ర' అని. 112. 'యాజుషః' అని. 113. 'పవ౯తభట్టస్య' అని. 114. లేఖకుడు మొదట 'మాగ్య౯'వ్రాసి పిదప దానిని 'గాగ్య౯' గా దిద్దెను. 115. 'బహ్వృచం' అని. 116. ంస్సూనుం అని. 117. ంన్వయజో రామచంద్రం అని. 'రామచంద్ర' అన్నచోట నేవియో దిద్దుబాటులు కలవు.

213. తినాం వరః॥[౧౪౨*॥] కాశ్యపాన్వయసంభూతో యాజుషో రామయాత్మజః। అత్రై
214. కా(०) మశ్నుతే వృత్తిం యల్లయో భూసురోత్తమః॥[౧౪౩*॥] కౌశికాన్వయసంభూతో
215. మనీషీ మల్లనాత్మజః। అత్రైకాం యాజుషో ధీమా నందయో వృత్తి మశ్నుతే॥[౧౪౪*॥]

అయినవరేకు : మొదటిప్రక్క

216. నందనోనంత భట్టస్య యాజుషః కాశ్యపాన్వయః। వృత్తిమేకామి
217. హాప్నోతి మూర్తినామా మహీసురః॥[౧౪౫*॥] వరాపస్తంబసూత్రశ్శ్రీ రామయస్యాత్మ
218. సంభవః। కొండయోత్రాశ్నుతే వృత్తి మేకాం లోహిత గోత్రజః॥[౧౪౬॥*] సూనుశ్శ్రీరం
219. గభట్టస్య ఆత్రేయాన్వయసంభవః। క్రిష్ణంభట్టో భవ త్యేకవృత్తిమానత్ర
220 యాజుషః॥[౧౪౭॥*] శ్రీవత్సాన్వయసంభూత శ్శింగయస్యాత్మసంభవః। వీరయో త్రై
221. కవృత్తి శ్శ్రీవలాశ్లాయన సూత్రజః॥[౧౪౮॥*] నందనో వీరుభట్టస్య గౌతమాన్వ
222. యసంభవః। సవాణావధానీ చా త్రైకాం వృత్తిమాప్నోతి యాజుషః॥[౧౪౯॥*]గంగాధ
223. రసుధీసూను భారద్వాజాన్వయోద్భవః। యాజుషో త్రైకవృత్తి శ్శ్రీమల్లా
224. జ్యోతిషికస్సుధీః॥[౧౫౦॥*] శింగయస్య118తనూజశ్శ్రీ కౌశికాన్వయ సంభవః। న
225. రాపస్తంబసూత్రశ్శ్రీ కృష్ణయో త్రైకవృత్తికః॥[౧౫౧॥*] ఉపేంద్రయసుధీసూను యాజు
226. షో హరితాన్వయః। శింగయోవృత్తిమత్రైకాం శిష్టా[చా*]ర స్సమశ్నుతే॥[౧౫౨॥*] హరితాన్వయ
227. సంభూతో యాజుష స్సర్వణయాత్మజః। మనీషీ నారయాభిఖ్యో వృత్తి మేకా మిహాశ్ను
228. తే॥[౧౫౩॥*] నందనశ్శ్రీనివాసస్య గౌతమాన్వయసంభవః। వృత్తిమేకామ[వా*]ప్నోతి హరిభట్టో
229. త్రియాజుషః॥[౧౫౪॥*] శ్రీవత్సాన్వయసంద్భూతో119మల్లయస్యాత్మసంభవః। యాజుషో వేదయో త్రై
230. కాం వృత్తిమభ్యేతిభూసురః॥[౧౫౫॥*] తింమయస్య తనూజశ్శ్రీ కాశ్యపాన్వయసంభవః।
231. యాజుషో నారయోధీమా న్నవత్యత్రౌ[క?*] వృత్తిమాన్120॥[౧౫౬॥*] నందనోనంతయ(०)స్య శ్రీపె
232. ద్దయో బహ్వృచ స్సుధీః। కౌండిన్యాన్వయ సంభూతో సార్ధవృత్తి మిహాశ్నుతే। [౧౫౭*] హరితా
233. న్వయసంభూతో శ్రీనాగయ విరుప్పయో121। యాజుషౌ లక్ష్మయసుతో122ఉభావత్రైకవృ
234. త్తికా॥[౧౫౮*॥] మనీషీమల్లయసుతః కాశ్యపాన్వయ సంభవః। శ్రీమానమరయాభి
235. ఖ్యోయాజుషో త్రైక వృత్తికః॥[౧౫౯*॥]భారద్వాజాన్వయ స్సూను శ్శి[ఙ*]ంగయస్యాత్ర123యాజుషః।
236. వృత్తి మేకా మవాప్నోతి తింమయో ధీమతాం నరః॥[౧౬౦*॥] యల్లయస్యతనూజశ్శ్రీయల్లయో
237. యాజుషస్సుధీః। భారద్వాజాన్వయోద్భూతో భవ త్యత్ర ద్వివృత్తికః॥[౧౬౧*॥] నందనః కా[మ]య
238. స్య శ్రీలోహితాన్వయసంభవః124। వృత్తిమేకా మిహాప్నోతి మల్లయో యాజుషస్సుధీః॥[౧౬౨*॥]
239. యాజుషౌ సోమయోద్భూతౌ శ్రీమత్కొండయ యల్లయౌ। కాశ్యపాన్వయజావత్ర ప్రత్యే
240. కం చార్ధ125వృత్తికౌ॥[౧౬౩*॥] శ్రీవత్సాన్వయసంభూత శ్శిట్టాపండితనందనః। అర్ధవృత్తి126

118. 'శింగయస్య' అన్న దానిలో 'య' ఇరికించి వ్రాయబడినది. 119. ఇచ్చట చాలదిద్దుబాటులు కలవు. మొదట 'శ్రీ' రేఫ లేక శ్రీయో వ్రాయబడినది. మొత్తముమీద 'శ్రీవత్సాన్వయసంభూతో' అని దిద్ది చదువ దగియున్నది. 120. 'త్రౌ' స్పష్టముగ కనిపించుచున్నది. 'త్రౌ' తరువాతి యక్షరము 'క' గా కనిపించదు. 'ర్ధ' వలె కనిపించును. అది 'ర్ధ' అయినట్లయితే దానిని 'న్నవత్యత్రార్ధవృత్తిమాన్' అని చదువవగును. 121. ఇచ్చట 'ప'కు ద్విత్వమీయబడినది. 'న్వయ సంభూతౌ శ్రీనాగయవిరుప్పయౌ' అని. 122. 'లక్ష్మయసుతౌ' అని. 123. 'శింగయస్యాత్ర' అని. 124 ఇచ్చట నేవియో దిద్దుబాటులు కలవు. 125. 'చార్ధకం' అని. శాసనము నందు చాల చోట్ల 'అర్ధ' అని వ్రాయుటకు ఇక్కడ 'అర్ల్ధ' అని వ్రాయబడినది.

241. మిహాప్నోతి యాజుషః కృష్ణయస్సుధీః|[|౧౬౪*||] ఆత్రేయగోత్రజో ధీమా న్నిట్టయస్య త
242. నూద్భవః| వరాప స్తంబసూత్ర శ్శ్రీవేదయో ర్త్రార్ధ-127వృత్తికః|[౧౬౫*] కాశ్యపాన్వయ[జ]
243. స్సూను స్సర్వభట్టస్యయాజుషః| గంగయో ర్త్రాశ్ను తే చార్ధ-125వృత్తిం విప్రవర[స్సు]
244. ధీః|[|౧౬౬*||] తింమాభట్టాత్మా128సంభూతో గౌతమాన్వయ సంభవః| కొండయో గుణినాం
245. శ్రేష్ఠో యాజుషస్త్రార్ధ-127వృత్తికః|[|౧౬౭*||] తి[ం*]మావధానిన స్సూను హారితాన్వయసంభ
246. వః| కోవిదః కొండయో ర్త్రార్ధ-127వృత్తి మాప్నోతి యాజుషః|[|౧౬౮*||] కుత్సగోత్రసముద్భూ
247. తో129 శ్రీ గోవిందావధానిజా| ఆత్రైకవృత్తికావేతౌ శ్రీమత్కొండయ130పె
248. ద్దయా| [|౧౬౯*||] కామయాఖ్య సుధీసూను ల్లోహితాన్వయసంభవః| ధీమా నవల

అయిదవరేకు: రెండవప్రక్క

249. యాభిఖ్యో యాజుష స్త్రార్ధ 127 వృత్తికః |[|౧౭౦||*] నందనః పెద్దిభట్టస్య యా
250. జుషః కాశ్యపాన్వయః| పెద్దిభట్టో భవ త్యర్ధ 131 వృత్తిమా నత్ర భూసురః |[|౧౭౧||*] భా
251. రద్వాజాన్వయోద్భూత స్సుధీరప్పయ నందనః| వరాప స్తంబసూత్ర శ్శ్రీచక్ర
252. యో ర్త్రార్ధ-127వృత్తికః|[|౧౭౨||*] కాశ్యపాన్వయజో ధీమా నంనంభట్ట తనూద్భవః| నాగ
253. యో ర్త్రార్ధ-127వృత్తి శ్శ్రీవరాప స్తంబసూత్రజః|[|౧౭౩||*] భారద్వాజాన్వయో ధీమా నంనం
254. భట్టాత్మసంభవః| శ్రీమత్తెలుంగయాభిఖ్యో యాజుష స్త్రార్ధ-127వృత్తికః|[|౧౭౪||*] సోమ[యా]
255. ఖ్య సుధీసూను హారితాన్వయసంభవః| యాజుష స్త్రార్ధ 127 వృత్తిః శ్రీ తిప్పయో
256. ధీమతాంవరః|[|౧౭౫||*] సర్వభట్టస్యసూను శ్శ్రీ కౌశికాన్వయసంభవః| ఆబ్బాభట్టో
257. భవ త్యేకవృత్తిమా నత్ర యాజుషః|[|౧౭౬||*] భారద్వాజాన్వయోద్భూతో వేదయస్యాత్మ సంభవః| యా
258. జుషః శింగయాభిఖ్యో వృత్తిమేకా మిహాశ్ను తే|[|౧౭౭||*] భారద్వాజాన్వయోద్భూతో యాజుషః
259. కామయాత్మజః| శ్రీమా న్తింమయ నామాఖ్యో వృత్తిమేకా మిహాశ్ను తే|[|౧౭౮||*] వ
260. ల్లంభట్టతనూజ[ః*] శ్రీ కౌశికాన్వయసంభవః| వృత్తిమేకా మిహాప్నోతి గుండయో
261. యాజుషఃసుధీః|[|౧౭౯||*] సూనుః శ్రీసూరుభట్టస్య భారద్వాజాన్వయోద్భవః| ఏకా మల్లాల
262. భట్టాఖ్యో వృత్తి మేత్రైతి యాజుషః 132|[|౧౮౦||*] సూనూ రాఘవభట్టస్యయాజుషః కాశ్యపాన్వయః|
263. ఆత్రైకాంవృత్తి మభ్యేతి శింగాభట్టో ద్విజోత్తమః|[|౧౮౧||*] లక్ష్మయాఖ్యసుధీసూను స్తింమయో
264. ధీమతాంవరః| అర్ధవృత్తి మిహాప్నోతి యాజుషః కుత్సగోత్రజః|[|౧౮౨||*] లోహితాన్వయసంభూ
265. తో యాజుషోప్పయ 109నందనః| అర్ధవృత్తి మివాప్నోతి గంగయో ర్త్ర ద్విజోత్తమః |[|౧౮౩||*] నం
దనః పె
266. ద్దిభట్టస్య కౌశికాన్వయసంభవః| యాజుషోవరయాభిఖ్యస్సుధీ ర్త్రార్ధవృత్తికః |[|౧౮౪||*] హా
267. రితాన్వయసంభూతో యాజుషోమరయాత్మజః| అర్ధవృత్తిమిహాప్నోతి కొండయోభూసురా 133
268. గ్రణీః |[||౧౮౫||*] హారితాన్వయసంభూతఃకామాభట్టాత్మసంభవః| వరాప స్తంబసూత్ర [ః*] శ్రీయర్ర
యో ర్త్రా
269. ర్ధవృత్తికః |[|౧౮౬||*] కాశ్యపాన్వయజస్సూను రప్పయాఖ్య 109 స్సుధీమతః| పురుషోత్తమ భట్టాఖ్యో
యాజు

---

126. 'అర్ధవృత్తిం' అని. 127. ౦ర్త్రార్ధం అని. 128. 'తింమాభట్టాత్మం' అని. 129. ౦సముద్భూతౌ' అని. 130. 'శ్రీమత్కొండయ౦'? 131. ౦త్యర్ధం అని. 132. ౦వృత్తిమత్రైతియాజుషః' అని. ఇచ్చట ఏవియో అక్షరముల దిద్దుబాటులు కలవు. 133. ఇచ్చట ఏవియో దిద్దుబాటులు కలవు.

270. షోఽత్రార్ధవృత్తికః ।[।౧౮౭॥*] తింమాభట్టతనూజ[ః*] శ్రీకౌశికాన్వయసంభవః। యజ్ఞావధానీ విప్రేంద్రో
271. యాజుషోఽత్రార్ధవృత్తిమాన్ ।[।౧౮౮॥*] కుత్సగోత్రసముద్భూతో మాదయ్యాస్యమనీషిజః। వరాపస్తంబసూ
272. త్రశ్రీలింగయోఽత్రార్ధవృత్తికః।[।౧౮౯॥*] తిప్పాభట్ట109-తనూజ[ః*] శ్రీకౌండిన్యాన్వయసంభవః। సత్స
యో యా
273. జుషోఽత్రార్ధవృత్తి మాప్నోతి కోవిదః।[।౧౯౦॥*] శాలాంకతాన్వయోద్భూతో యాజుషః కృష్ణయాత్మ
274. జో। అశ్నువాతే త్రిపాదవృత్తి ముఖ్యాం రామయ వేదయా।[।౧౯౧॥*] పోచయాత్మసముద్భూతః కౌ
275. శికాన్వయసంభవః। అర్ధవృత్తిమిహాప్నోతి యాజుషో గోపయస్సుధీః।[।౧౯౨॥*] కౌండి
276. న్యగోత్రసంభూతో మల్లయాఖ్యమనీషిజః। యాజుషో నాగయోధీమా నర్ధవృ
277. త్తిమిహాశ్నుతే ।[।౧౯౩॥*] కౌండిన్యగోత్రసంభూత స్తిప్పాభట్ట 109 తనూద్భవః। నాగాభ
278. ట్టోభవ త్యర్ధవృత్తిమా నత్ర యాజుషః। [।౧౯౪॥*] నందనో యజ్ఞుభట్టస్య యాజుషో లోహి
279. తాన్వయః। భవత్యత్రార్ధ వృత్తి శ్రీగంగయాఖ్యో ద్విజోత్తమః। [।౧౯౫॥*] శ్రీగంగాధ
280. రభట్టస్య సూనుః సర్వయకోవిదః। భారద్వాజాన్వయోద్భూతో యాజుషోఽత్రార్ధవృత్తికః ।[।౧౯౬॥*]

ఆరవ రేకు : మొదటి ప్రక్క

281. వరాపస్తంబసూత్ర శ్రీవాసయస్యాత్మసంభవః। సర్ధవృత్తి 134 మిహాప్నోతి
282. పింనయో హరితాన్వయః।[।౧౯౭॥*] నందనః కృష్ణభట్టస్య గౌతమాన్వయసంభవః। స
283. వర్జ్ఞస్సర్వయాభిఖ్యో యాజుషోఽత్రార్ధ 127 వృత్తిః ।[।౧౯౮॥*] సోమయాఖ్యసుధీసూను శ్రీ
284. పరాశరగోత్రజః। అత్రార్ధ 127 వృత్తి మశ్నోతి 135 యాజుషః శ్రీంగయస్సుధీః।[।౧౯౯॥*] గా
285. గ్యగోత్రసముద్భూతో గంగయాఖ్యసుధీసుతః। అత్రలింగప నామార్ధ 136
286. వృత్తిమశ్నుతి యాజుషః।[।౨౦౦॥*] భారద్వాజాన్వయోద్భూతో [సు*]ధీ రామయ 137 నందనః।
287. కృష్ణభట్టో భవత్యర్ధ 131 వృత్తిమా నత్ర యాజుషః। [।౨౦౧॥*] శాలాంకతాన్వయోద్భూత శ్చక్ర
288. యో యాజుషస్సుధీః। వరాపస్తంబసూత్రోఽర్ధ 138 వృత్తికో రామయాత్మజః। [।౨౦౨॥*] హరితాన్వ
289. యసంభూతో వరాపస్తంబసూత్రజః। అర్ధవృత్తి మిహాప్నోతి నాగయః కామయా
290. త్మజః।[।౨౦౩*] అ[ం*]న(ం)యస్య తనూజశ్శ్రీ కౌశికాన్వయ సంభవః। యాజుషః కృష్ణయోఽత్రార్ధ 127
291. వృత్తికో భూసురోత్తమః। [।౨౦౪॥*] రామయాఖ్యసుధీసూను యాజుషః కౌశికాన్వయః। అ
292. త్రార్ధవృత్తిమాప్నోతి లక్ష్మయో విదుషాం వరః [।౨౦౫॥*] సూనుశ్శంకరభట్టస్య కాశ్యపాన్వ
293. యసంభవః। అక్కయో యాజుషో ధీమా నర్ధవృత్తి139 మిహాశ్నుతే। [।౨౦౬॥*] నందనో మల్లుభ
294. ట్టస్య గార్గ్యగోత్ర సముద్భవః। అబ్బాభట్టో భవ త్యర్ధ 131 వృత్తిమా నత్ర యాజుషః।[।౨౦౭॥*]
295. గౌతమాన్వయసంభూతో మల్లయో మాదయాత్మజః। అర్ధవృత్తి 126 మిహాప్నోతి వరా
296. పస్తంబసూత్రజః।[।౨౦౮॥*] మనీషీ రామయాభిఖ్యో లోహితాన్వయసంభవః। యాజుషో
297. ఽత్రార్ధ 127 వృత్తి శ్రీ నారయస్య తనూద్భవః।[।౨౦౯॥*] కౌండిన్యగోత్రజో ధీమా నంనంభట్ట
298. స్య నందనః। యాజుషోఽత్రార్ధ127 వృత్తి శ్రీకొండయో గుణినాం వరః।[।౨౧౦॥*] హరితాన్వయ
299 సంభూతో యాజుషో ప్పయ 109 నందనః। అత్రార్ధ 127 వృత్తి మాప్నోతి తింమయో ధీమతాం
300. వరః।[।౨౧౧॥*] నందనః కృష్ణభట్టస్య యాజుషః కాశ్యపాన్వయః। యల్లం భట్టో భవత్యర్ధ 131

134. 'సార్ధవృత్తి' అని. 135. °మశ్నోతి' అని. 136. °నామార్ధం° అని. 137. 'సుధీనా౯మయ°' అని. 138. °సూత్రార్ధం° అని. 139. °నర్ధవృత్తిం° అని.

301. వృత్తిమా నత్ర భూసురః।[।౨౧౨॥*] లోహితాన్వయసంభూతో యల్లయో యాజుషః సుధీః। తిం
302. మాభట్టతనూజార్ధ[140] వృత్తిమత్రసమశ్నుతే।[।౨౧౩॥*] తింమాభట్టతనూజశ్శ్రీకౌశికాన్వయసం
303. భవః। యాజుషో భైరవాభిఖ్యో భవత్యత్రార్ధ[127] వృత్తిమాన్।[।౨౧౪॥*] రామయాఖ్యసుధీ
304 సూనురాత్రేయాన్వయ సంభవః అర్ధవృత్తి[126] మిహాప్నోతి యాజుషో లక్ష్మయ స్సుధీః ।[।౨౧౫॥*]
305. యాజుషః కసవాభట్టసూను శ్శాలావతాన్వయః। రామావధానీ విప్రేంద్రో భ
306. వత్యత్రార్ధ[127] వృత్తిమాన్। [।౨౧౬॥*] హారితాన్వయసంభూతో వరాశ్లాయనసూత్రజః। నా
307. గయో త్రార్ధ[127] వృత్తి శ్రీయజ్ఞప స్యాత్మసంభవః ।[।౨౧౭॥*]న[ం*]దనః పెద్దిభట్టస్య కాశ్య
308. పాన్వయసంభవః। గోపాభట్టో భవ త్యర్ధ[131] వృత్తిమానత్రయాజుషః।[।౨౧౮॥*] వరాప
309 స్తంబసూత్ర శ్రీనల్లంభట్టతనూద్భవః। భారద్వాజాన్వయోత్రార్ధ[127] వృత్తిరక్కయ
310 నామకః ।[।౨౧౯॥*] నం నోనారయాభిఖ్య సూరేః కౌండిన్యగోత్రజః। కోవిదః
311. కొండయాభిఖ్యోయాజుషోత్రార్ధ[127]వృత్తికః ।[।౨౨౦॥*] నందనో మల్లుభట్టస్య భారద్వా
312. జాన్వయోద్భవః। సవాత(భ?)ట్టో భవత్యర్ధ[131]వృత్తిమానత్ర[యాజుషః॥౨౨౧॥*]యాజుషో తిప్పయసు
313. తో కాశ్యపాన్వయసంభవః। అత్రార్ధ[127]వృత్తికా వేతా వుభౌ రామయ గంగ

ఆఱవ రేకు : రెండవ ప్రక్క

314. యౌ।[।౨౨౨॥*] కాశ్యపాన్వయసంభూతో యల్లుభట్టస్యనందనః। అంనంభట్టో
315. హ్వయోధీమా[న్*] యాజుషోత్రార్ధ[127]వృత్తికః।[।౨౨౩॥*] కాశ్యపాన్వయజస్సూను స్తి
316. [109]ప్పభట్టస్యయాజుషః। బుధేంద్రః పోతయాభిఖ్యో భవ త్యత్రార్ధ[127]వృత్తి
317 మాన్।[।౨౨౪॥*] కాశ్యపాన్వయసంభూతో నాగాభట్టస్య నందనః। వివేకీ వేదయోత్రా
318. ర్ధవృత్తి[127] మాప్నోతి యాజుషః।[।౨౨౫॥*] నాగాభట్టస్యసూనుః శ్రీకాశ్యపాన్వయ సంభవః।
319. యాజుషః కృష్ణభట్టాఖ్యో భవ త్యత్రార్ధ[127]వృత్తికః।[।౨౨౬॥*] కౌండి(ం)న్య గోత్రసంభూతః కో౦
320. మయస్యాత్మసంభవః। వరాప స్తంబసూత్ర[ః*] శ్రీతింమ య[141]త్రార్ధ[127]వృత్తికః।[।౨౨౭॥*] శ్రీ
321. నారసింహభట్టస్య సూనుశ్శాండిల్యగోత్రజః। అర్ధవృత్తి[126] మిహాప్నోతి వేద
322. యో యాజుష స్సుధీః।[।౨౨౮॥*] అబ్బాభట్టాత్మసంభూతో వేదయో విదుషాం వరః। కా
323. శ్యపాన్వయజోత్రార్ధ[127]వృత్తి మాప్నోతి యాజుషః।[।౨౨౯॥*] నందనో మల్లుభట్టస్య యాజుషః
324. కుత్సగోత్రజః। అర్ధవృత్తి మిహాప్నోతి లింగాభట్టో ద్విజోత్తమః।[।౨౩౦॥*] సూరి స్తిరుమలా
325. భిఖ్యో రాఘవః ప్రవ్వయస్సుధీః। సూరావధానీ విప్రేంద్ర స్తింమయో వేదయః
326. కృతీ।[।౨౩౧॥*] శింగయ స్సూరయోనంతభట్టో హనుమయో ద్విజః। లక్ష్మయ స్తింమయో ధీ
327. మా న్నవాభట్ట శ్చ తింమయః।[।౨౩౨॥*] అబ్బయ శ్శింగయో ధీమా నబ్బాభట్టశ్చ యజ్ఞయః। కొం
328. డయో నాగయసుధీ రామాభట్టో మహామతిః।[।౨౩౩॥*] నాగయ స్సూరయశ్చైవ నా నాగో
329. త్రసముద్భవాః। ఏతే సర్వత్ర విప్రేంద్రా ప్రత్యేకం పాదవృత్తికాః।[।౨౩౪॥*] కౌండిన్యా
330. న్వయసంభూతో వల్లంభట్టస్యనందనః। వరాప స్తంబసూత్రశ్శ్రీ మల్లయోత్రార్ధవృత్తికః।[।౨౩౫॥*]
331. యాజుషోచ్యుతవిప్రేంద్ర స్తిప్ప[109]భట్టస్యనందనః। భారద్వాజాన్వయోధీమా నర్ధవృత్తి
332. మిహాశ్నుతే।[।౨౩౬॥*] లఖమో బసవభట్టస్య[142] సూను[ః*]శ్రీనరసింహజః। తల్లయస్తావుభా
333. వత్రప్రత్యేకం పాదవృత్తికః।[।౨౩౭॥*] పత్మనాభోపల్లభాయశ్ఛ స్తింమయో గోపయ స్త్వమీ। ఏ
334. కైకవృత్తికాశ్చాత్రే[143] యాజుషాః కాశ్యపాన్వయాః।[।౨౩౮॥*] పెద్దయో రంగయ శ్రీమత్కృష్ణయః కో

---

140. ౦తనూజార్ధ’ అని. 141. ౦తింమయో౦ అని, 142, ౦బసవభట్టస్య’ అని. 143. ౦వృత్తికాశ్చైతే అని.

335. నయస్సుధీః। శ్రీవత్సగోత్రజాశ్చైతే పృథగేకైకవృత్తికాః॥[౨౩౯॥*] భార్గవాన్వయసంభూ
336. తో144 పురుషోత్తమ తిమ్మయౌ। ఏకైకవృత్తికౌ అత్ర ప్రత్యేకం యాజుషౌద్విజౌ145॥[౨౪౦॥*] శ్రీ
337. సోమనాథభట్టస్య నందనో హరితాన్వయః। శ్రీనారసింహభట్టాఖ్యో యాజుషో
338. త్రైకవృత్తికః॥[౨౪౧॥*] శ్రీవత్సగోత్రసంభూతః సుధీ శ్శింగయనందనః। వీరయో బహ్వృ
339. చోత్రార్ధవృత్తి మాప్నోతి భూసురః॥[౨౪౨॥*] గంగాయస్య146 తనూజ[ః*] శ్రీవత్సగోత్రసముద్భ
340. వః। సవర్ణయో యాజుషో ధీమా నర్ధవృత్తి మిహాశ్నుతే॥[౨౪౩॥*] అబ్బయోదీక్షితో ధీమా
341. న్వేన యోనంతయో మహాన్। నానాగోత్రైతశ్చైతే147 ప్రత్యేకం పాదవృత్తికాః॥[౨౪౪॥*] శా
342. లావతాన్వయోద్భూతో యాజుష స్తాతయాత్మజః। త[ం*]మయో భూసురశ్రేష్ఠో ఏకవృత్తి మి
343. హాశ్నుతే॥[౨౪౫॥*] లోహితాన్వయసంభూతో రామాభట్టస్య నందనః। యాజుషో యల్లయో ధీమా
344. న్షవత్యైత్రైకవృత్తికః॥[౨౪౬॥*] సుధీ రీశ్వరభట్టాఖ్యో కసవభట్టస్య148 నందనః। భారద్వా
345. జో యాజుషశ్చ వృత్తిద్వయమిహాశ్నుతే॥[౨౪౭॥*] రామయో దేవయో ధీమా న్మల్లయశ్చ వర స్స
346. తాం। నానాగోత్రోద్భవాశ్చైతే పృథగత్రార్ధవృత్తికాః॥[౨౪౮॥*] మనీషీ పైండిపాడు శ్రీతిమ
347. యో త్రార్ధ149వృత్తికః। అర్ధవృత్తిమిహాప్నోతి కొండుభట్టో గుణోన్నతః॥[౨౪౯॥*] వత్సాయః కస

ఏడవ రేకు: మొదటి ప్రక్క

348. వాభట్టః కొండయః కృష్ణయస్సుధీః। శింగయ శ్శింగయ[ః*] శ్రీమతో స్సమయో గంగయాహ్వయః॥[౨౫౦॥*]
349. నాగయ[ః*] కొండయశ్చైతే150 కొండయో గోపయాహ్వయః। పేరయ[ః*] సకలాశ్చైతే151 ప్రత్యేకం పాదవృ
350. త్తికః॥152[౨౫౧॥*] భాగవతలు153 రామయకు వృత్తి ౧।
351. సరససదాశివరాయ క్షితిపతినయనస్య కీర్తిధుర్యస్య। శాసనమిదం సరాసన154
352. దశరథే రమితహేమదానరతే॥[౨౫౨॥*]155 మృదుపద మితి తామ్రశాసనార్థం మహితసదాశివరాయ
353. శాసనేన। అభణదనుగుణం నచో మహిమ్నా శరసతిరే156 సభాపతి[ః*] స్వయంభూః॥[౨౫౩॥*]157 సదాశివ
354. మహారాయ శాసనా ద్వీరణాత్మజః। త్వష్టా శ్రీవీరణాచార్యో వ్యలిఖ త్తామ్రశాసనం॥[౨౫౪॥*]158
155. దానపాలనయో ర్మధ్యే దానాచ్ఛ్రేయోనుపాలనం। దానా త్స్వర్గ మవాప్నోతి పాలనా దచ్యు
356. తం పదం॥[౨౫౫*] స్వదత్తా[త్*] ద్విగుణం పుణ్యం (పుణ్యం) పరదత్తానుపాలనం। పరదత్తాపహా(పహా)రే
357. ణ స్వదత్తం నిష్ఫలంభవేత్॥[౨౫౬॥*] స్వదత్తాం పరదత్తాం వా యో హరేత వసుంధరాం। షష్టిర్వ
358. ర్షసహస్రాణి159 విష్టాయాం160 జాయతే క్రిమిః॥[౨౫౭॥*] ఏకైవ భగినీలోకే సర్వేషామేవ భూభుజాం। న
359. భోజ్యా నకరగ్రాహ్యా విప్రదత్తా వసుంధరా॥[౨౫౮॥*] సామాన్యోయంధర్మసేతున్నృ[ణా*]పాణాం[।*] కాలే
కాలేపా
360. లనీయో భవద్భిః [।*] సర్వానేతా న్భావినః పార్థివేంద్రా [।*] న్భూయో భూయో యాచతే రామ
చంద్రః॥[౨౫౯॥*] 161

(శ్రీ) విరూపాక్ష.

—[మల్లంపల్లి సోమశేఖరశర్మ]

144. ౦సంభూతౌ' అని. 145. 'యాజుషౌ ద్విజౌ' అని. 146. 'గంగయస్య' అని. 147. 'నానాగోత్రోద్భవాశ్చైతే' అని. 148. ౦భట్టస్య' అన్నచోట 'భ'కు బదులుగా 'వ' వ్రాయబడినది. దానినే లేఖకుడు 'భ' వర్ణముగ దిద్దుటకు ప్రయత్నించెను. 149. ౦త్రార్ధం౦ అని. 150. 'కొండయాశ్చైతే' అని. 151. 'సకలాశ్చైతే' అని. 152. ౦వృత్తికాః' అని. 153. 'భాగవతుల' అని. 154. ౦శరాసనం౦ అని. 155. ఆర్యాగీతి. 156. ౦సరసతరే౦ం అని. 157. పుష్పితాగ్రవృత్తము. 158. ౨౫౪ మొదలు ౨౫౯ వఱకు అనుష్టుభులు. 159. 'షష్టింవర్ష సహస్రాణి౦ అని. 160. 'విష్ఠాయాం' అని. 161. శాలినీ 'వృత్తము.

# కర్ణుఁడు–గాంధారీనిర్వేదనము

సోమంచి వాసుదేవరావు గారు

దానము సత్యపాలన ముదంచితధర్మపథప్రవృత్తియున్,
మానితరాజభక్తియు నమానుషశౌర్యము శత్రుసూదనం,
బానతవైరిరక్షణము నార్తజనావనముం గలట్టి క
ర్ణా! నరబాణఖండితశిరస్కుఁడ వైతివె దైవయుక్తిచేన్?

చ. హరిహరధాతృసన్నిభుఁ డహస్కరుఁ డాగమమూర్తి తండ్రి, వి
స్ఫురదురుసద్గుణస్థిరవిభూషణ యప్పృథ తల్లి, క్షీరసా
గరజుఁడు వంశకర్త, పరఖండనభాసికరాసి, దానబం
ధురము చరిత్ర మీదృశు నినుం గననేరద దైవ మర్కజా!

ఉ. ద్రోణుఁడు సాక్షికుండగు గురుండఁట, శ్రీహరి భక్తలోకసం
త్రాణుఁడు సూతుఁడంట, వరదాత శివుండట, యగ్నిదేవుఁడున్
బాణము నిచ్చెనంట, బలభంజనుఁడుం దనతండ్రియంట, క
ర్ణా! నరుఁ డిట్టిఁడయ్యు నిను నాజి నడంచెనె ధర్మమార్గుఁడై.

సీ. హరిఁ బోరింబోరి నాజి నడఁచిన యలజరా,సంధు నోర్చితిగదా శౌర్యనిలయ!
కడు భరంబయ్యు నాఖండలునకుఁ గవ,చాదు లిచ్చితివి యశోధనుండ!
హరి యున్న నేమి యన్నరుని జంపెదను రా, రాజ! నమ్ముమటంటి ప్రకటధైర్య!
బ్రహ్మాదిదేవతావరులు మెచ్చెడునట్లు, పోరొనర్చితిగదా పురుషరత్న!
యర్జునునిగర్వ మడఁచితే యతులతేజ! శౌర్యము కొలందిఁ జాటితే సూర్యపుత్ర!
సమరభూమిని గూలితే దమితరిపుఁడ! విమలకీర్తుల నించితే యమితపుణ్య!

సీ. ఇసుమంత తీపు నీ యసువులయందున్నఁ, గవచ మిచ్చెదవె యాఖండలునకు?
సార్వభౌమపదంబు నిర్వహించెడు నాస,గలిగియున్నను బాండవులఁ గలియవె?
కులముతక్కువఁ బాపికో నాసయున్న జ,న్మరహస్యము జగంబునకుఁ దెలుపవె?
సౌందర్యనిలయ! పాంచాలీసమాభోగ, భోగాశగలిగినఁ బాగులుదె యిటు?
కీర్తి నెంచితి రాజభక్తిని నలరితి, శౌర్యమున్ జూపఁగోరి తనహ్యాకాల
కూటమున్ బోలి యపకీర్తిఁ గుందనైతి, చూడలేదుర నినువంటి శూరుఁ గర్ణ!

సీ. విమలకీర్తికి శరీరము నప్పనముచేసి, తనరిన నీతత్తదాన గరిమ
విమలకీర్తికి శరీరము నప్పనముచేసి, పరఁగిన నీరాజభక్తిపెంపు
విమలకీర్తికి శరీరము నప్పనముచేసి, వెలసిన నీబాహువిక్రమంబు
విమలకీర్తికి శరీరము నప్పనముచేసి, వఱలిన నీధర్మపాలనంబు
నాసుధాకరతారార్క మతిశయించు, విమలకీర్తిచంద్రికలచే వెలయుఁగాత
కాయమునఁ గీర్తికాయంబుఁ గలుగఁజేయు, టేకద తలంప మట్టిఁ బుట్టిన ఫలంబు.

---

# గురుభక్తకొండ, దుర్గకొండలు: బౌద్ధాలయములు

కె. నరసింహాచార్యులు గారు

రామతీర్థము విశాఖపట్టణముజిల్లాలో విజయనగరమునకు 8 మైళ్లదూరమున ఈశాన్యమున నుండు ఒకగ్రామము. ఈగ్రామమునకు ఉత్తరమున పెద్దగండశిలలు నిండిన కొండలవరుస కలదు. ఈ కొండలలో గురుభక్తకొండ, దుర్గకొండ లనునవి బౌద్ధస్తూపములకును ఆలయములకును ప్రసిద్ధి చెందియున్నవి.

పూర్వము శ్రీరాముడు వనవాసము చేయుకాలమున రామతీర్థగ్రామమునకు వచ్చియుండెనట. గురుభక్తకొండపై శ్రీరాముడు త్రవ్వించినట్లు భావించుకొనబడు తటాకము ఒకటి కలదు. దీనిసమీపమున శ్రీరామాలయముకూడ కలదు.

## గురుభక్తకొండ (చిత్రము ౧)

గురుభక్తకొండయందు భూమట్టమునకు అయిదువందల యడుగులఎత్తున బౌద్ధుల మతములయొక్క శిథిలములు అనేకము లున్నవి. కొండయడుగుననుండి ఆలయములకు పోవుట కుండినమార్గముయొక్క చిహ్నము లచ్చటచ్చట కానవచ్చుచున్నవి. ఆలయము లన్నియు తూర్పుపడమరలుగా వ్యాపించియున్నవి. స్థలవసతిని బట్టి కొన్ని ఉన్నతప్రదేశములందును కొన్ని పల్లములందును కట్టబడి సోపానమార్గములచే ఒకదానికొకటి సంబంధము కలిగియున్నవి. ఇందు కొండయొక్క పడమటికొనయం దుండునది యొక గొప్పస్తూపము.

## పశ్చిమస్తూపము (చిత్రము ౧)

స్తూపమునుచుట్టి యొకప్రాకార మున్నది. ప్రాకారమునకు లోపల ఉత్సవాదులయందు ప్రదక్షిణముగా వచ్చుటకు మార్గము కలదు. మార్గమునకు లోవైపున స్తూపమును చుట్టి వేరియొక గోడ కలదు. దీనిమందము $3\frac{1}{2}$ అడుగులు. ఉత్సవమార్గమున కిరుప్రక్కలను గోడలకు లోవైపున పెద్దపెద్దగండ్రాళ్లు అమర్చబడియున్నవి. స్తూపముమాత్రము 42 అడుగులవ్యాసముకలది. ఈ స్తూపముతో నంతమగు కొండయొక్క పడమటికొనకు చుట్టును పర్వతభాగ మికనేదియు లేక, అగాధమగు పల్ల మున్నందున, శిథిలావస్థకుపూర్వ మీ స్తూపము చుట్టుప్రక్కల నెన్నియో యోజనముల వరకును బౌద్ధసామ్రాజ్యపతాకమువలె భాసిల్లుచుండియుండును. ఈప్రదేశమున కొండయొక్క వెడల్పు ఉత్తరదక్షిణములుగా 146 అడుగులు. దక్షిణపార్శ్వమున 120 అడుగులఎత్తుగల బ్రహ్మాండమగు ఏకశిలా శిఖర మున్నది. శిఖరమునకును, స్తూపమునకు మధ్య స్తూపము నానుకొని యొకతటాక మున్నది. దీనివెడల్పు 65 అ. కొండపైబడు వర్షజలము తటాకమునకు వచ్చునట్లు కాలువలు కట్టబడియున్నవి. ఇచ్చట కొన్నియూటలుగూడ కలవు.

## చైత్యాలయము ౧. (చిత్రము ౧)

స్తూపము నానుకొని తూర్పున నొక తిప్ప యున్నది. దీనిపరిమితి తూర్పుపడమరలుగా 240 అ. ఉన్నతి 20 అ. తిప్పయందు పూర్వార్థము చదరము కావింపబడి అందొక చైత్యాలయము కట్టబడియున్నది. (పటము ౧, చూడుడు.) ఆలయముయొక్క లోపలి వైశాల్యము 40 అ. × 11అ ద్వారము తూర్పున కలదు. కుడ్యములమందము $4\frac{1}{2}$ అడుగులు. ఆలయమున పశ్చిమభాగమున గర్భగృహము కలదు. ఇచ్చట అడ్డగోడ మందము 2 అ. 8 అం. గర్భగృహమునకు ముందు శాల (Hall) యొక్కనిడివి 26 అ. 4 అం. గర్భగృహమున

# పశ్చాత్తాపము

కోలాహలము సీతారామరాజు గారు

ధర్మరాజు

జ్ఞాతి వధంబునన్ జయము గైకొనినట్టి కతంబుచేత నా
చేతమునందునన్ మిగులఁ జింత జనించుచునుండె, నయ్యయో!
తాత, గురుండు నాదిగలదాయలుఁ జచ్చిరి లోకమెల్ల దు
ర్నీతులు పాండవేయులని నింద యొనర్చు నికేమి చేయుదున్.

ఉ. అన్నిటికేమిగాని భువనైకవదాన్యుఁడు కర్ణుఁ డెన్న మా
యన్నయటంచు విన్నది తదాదిగ నాదుమనంబు దుఃఖసం
ఛన్నత నొంది రాజ్యసుఖసంపద లొల్లక యుండె జ్ఞాతిర
క్తాన్నము భోజ్యమే యెవరికైనను తాపసవంశచంద్రమా?

గీ. తల్లి కర్ణునిజననంబు దాచఁబట్టి, అలజడి జనించెఁ గానరహస్యరక్ష
ప్రాకటంబుగ నిఁక సతీలోకమునకు, లేకయుండెడుఁగాక యేలోకమునను.

భీముఁడు

చ. అని యొనరించునట్టి సమయంబున నే నొకమారు చేయిచి
క్కినను వధింపకుంటఁ బరికింపఁగ సోదరుఁ డంచెఱింగి యే
కనికరముంచి యుండు నటుగాని యెడన్ చెయిచిక్కినట్టి వా
నిని సమయింపకుండఁ గరుణించెద రే! పెరవారలైనచోన్.

అర్జునుఁడు

మ. సమరక్ష్మాతలమందు ద్రౌణికృపభీష్మ ద్రోణశల్యాది దు
ర్దమయోధాగ్రణులందు నెవ్వని బలోద్ధత్యంబు విద్వాట్సమూ
హములన్ జెందెనో? యట్టిబాహుబలు మా యన్నయ్య నన్యాయయు
ద్ధమునన్ జంపితి నాదుదుష్కృతి చిరస్థాయిత్వముం జెందఁగన్.

నకులుఁడు

గీ. రాజ్యసర్వస్వమును గురురాజు కిడుట, యీప్సిత మటన్న శిరసావహించి యొసఁగి
యగ్రజాజ్ఞానువర్తులమై తదీయ, సేవఁ జేయమె? ధన్యత చేకుఱంగ.

సహదేవుఁడు

గీ. కనుబొమలు, మోము, నేత్రయుగ్మంబుఁజూడ, నచ్చముగఁ గుంతిపోలిక లగపడఁగనె
కర్ణునం దిదియేమని కలఁతఁజెంది, కొన కిది యసంభవం బనుకొనుచు నుందు.

క. కనియుఁ దటాలున మ్రొక్కఁగ, మనసయ్యెడు చిత్త మంతమార్చుకొనెడు వాఁ
డను దెలియం దత్కారణమును దెలియుట మిగుల వగలఁ బొగలఁగ వలసెన్.

నొకరాతిగోడ కలదు (Dagoba). దీనివ్యాసము 5 అ. ప్రస్తుతపుటెత్తు 7 అ. దీనియందు అస్థినిధానము (Relic Casket) ఒకటిదొరకెను; గాని దానియం దస్థులేవియు లేవు. డగోబాపై నొకశిలామయఛత్ర ముండెను. ప్రస్తుత మీఛత్రము శకలితమయి క్రిందబడి యున్నది. ఆలయమున నేల కంకరవేసినది. మందరికూటమునందు, ఉత్తరపుగోడ నానుకొని 8 అ. 6 అం. పొడవును, 3 అ. 6 అం వెడల్పును, 4అ. 9అం. ఎత్తును గల సింహాసనమున్నది. (చిత్రము ౨, 3, చూడుడు). దానికి రెండుమూలలందును స్తంభములున్నవి. ఒక్కొక్క స్తంభపాదమునను మూడు సింహవిగ్రహములు పాలగారతో చేసినవి కలవు. ఇవికాక సింహాసనముయొక్క ఎదుటిభాగమునగూడ రెండు సింహవిగ్రహములు ఎదురెదురుగా నున్నవి. ఆలయద్వారపువెడల్పు 4 అ. ద్వారమువద్ద కొన్ని సోపానములున్నవి. ఇందు కడపటిసోపానము అర్ధచంద్రాకృతి కలది.

ఆలయపురోభాగమున విశాలమగు సమప్రదేశము కలదు. దక్షిణభాగమునందలి సమప్రదేశముయొక్క వెడల్పు 15 అ. ఇచ్చట నొకస్తూపము 12 అ. వ్యాసము కలది యుండినట్లు చిహ్నములు కలవు.

### విహారము (చిత్రము ౧)

ప్రథమచైత్యమునకు తూర్పున 20 అడుగుల క్రిందిమట్టమున నొకవిశాలమగు సమప్రదేశమున్నది. ఇం దనేక స్తంభములు పడియున్నవి. ఇచ్చట నొకవిహారముండెను.

### (చిత్రము ౨, ౪.)

విహారమునకు ఉత్తరమున 120 అ. ఎత్తుగు నిట్రపురాయియు, దక్షిణమున నొక ఆధారకుడ్యమును కలవు. ఈకుడ్యమునకు దక్షిణమున నుండునది 170 అ. లోతుగల యగాధమగు చరియ. విహారముండు సమప్రదేశము మాత్రము ఉత్తరదక్షిణములుగా 81 అ. తూర్పు పడమరలుగా 66 అడుగులు. ఇచ్చటి స్తంభములు 11అ. 3అం. పొడవై పాదమునందు 3 అ. 5 అం. పర్యంతము నాలుగు ప్రక్కలును, అటుపైని ఎనిమిదిప్రక్కలును కలిగి యున్నవి.

ప్రతి స్తంభమునకును, శిరమున 10 అంగుళము వెడల్పును మూడంగుళములలోతునుగల కోతలు దూలము లుంచుటకు చెక్కబడియున్నవి.

### చైత్యాలయము 2.

విహారము నానుకొని తూర్పున 4 అ. 8 అం. ఎత్తుగుసమప్రదేశమున మరియొక చైత్యమున్నది. దీని వైశాల్యము 26 అ. 9 అం. × 11 అ.4 అం.కుడ్యముల మందము 2 అ. 4 అం.

### (చిత్రము ౧, ౪ [౧])

ద్వారపు వెడల్పు 4 అ. 5 అం. ఆలయ మూలస్థానమున నొక డగోబా 9 అ. వ్యాసముకలది ఉన్నది. ప్రథమచైత్యాలయమునందువలె ఇందు మధ్య అడ్డగోడ లేనందున ఆలయమంతయు నొకే కూటముగా నున్నది. నేలయందు స్ఫటికశిలలు పఱుపబడియున్నవి. మొదటి చైత్యమునందువలె దీనియందును ఉత్తరపుగోడకు ఆనుకొని సింహాసన మున్నది. దీనిపొడవు 6 అ. 2 అం. వెడల్పు 2 అ. 3 అం. (చిత్రము ౪, 3 చూడుడు). ఈ చైత్యాలయ పురోభాగమున తలయు, కుడిచేయియు లేని బుద్ధవిగ్రహము దొరకెను. (చిత్రము 3, ౧ చూడుడు). ఆలయముచుట్టును 10 అడుగుల మార్గ మున్నది. ఆగ్నేయమున క్రిందికి పోవుటకు యెనిమిది సోపానము లున్నవి. వీటిప్రక్క బొడ్డుగోడయున్నది.

### చైత్యాలయము 3 (చిత్రము ౧)

రెండవచైత్యమునకు ఆగ్నేయమున మఱియొక చైత్య మున్నది. ఇది మొదటి రెండు ఆలయములకన్న కొంచెము పెద్దది. ఆలయమును జుట్టి యొక మార్గమును దానిచుట్టి మరియొకగోడయును కలవు. మార్గమువెడల్పు 3 అ. 6 అం. ఈ ఆలయపురోభాగము ఉన్నతమయి క్రమముగా ప్రథమచైత్యాలయమట్టమును చెందుచున్నది. ఈయున్నత ప్రదేశమున కొన్నిగదుల చిహ్నము లున్నవి.

### చైత్యాలయము ౪ (చిత్రము ౧)

నాలుగవచైత్యాలయము మూడవదానికన్న యున్నతప్రదేశమున నున్నది. దీనివైశాల్యము 33 అ. 5 అం. × 11 అ. 6 అం. కుడ్యములమందము 4 అ. 9 అం.

బహిర్ద్వారమునకు సమీపమున లోనైపున నొక శల్యనిధానము (Relic Casket) దొరకెను (చిత్రము 3, ౮ చూడుడు). ఉత్తరమున నుండు పర్వతభాగము విరిగి పడినందున ఆలయపు ఉత్తరగోడ యంతయు ముందునకు కూలియున్నది. మూడవచైత్యమునుండి ఇచ్చటికి వచ్చుటకు నైరృతి, వాయవ్యభాగములందు రెండుసోపానమార్గములున్నవి. ఇందు వాయవ్యమార్గము 20 మెట్లు కలిగి 24 అ. 8 అం. పొడవై యున్నది.

## చైత్యాలయము ౫ (చిత్రము ౧)

అయిదవచైత్యము పై ఆలయమునకు తూర్పున కొండయొక్క తూర్పుచివరయం దున్నది. కొండయందంతయు ఈయాలయ ముండు సమప్రదేశమే ఉన్నతతమమైనది. ఆలయవైశాల్యము 30అ. $\times$ $13\frac{1}{2}$ అం. గోడలమందము $3\frac{1}{2}$ అడుగులు. అంతర్భాగమంతయు గండశిలలచే నిండియున్నది. ఈశిలలు పరిసరపర్వతభాగము నుండి పడి ఆలయనాశమునకు కారణమయినవి. ఇందు గూడ నొకశల్యసంపుటము (Relic Casket) దొరకెను (చిత్రము 3, ౯ చూ). చైత్యమునకు తూర్పున నుండునేల సడలి వదులుగానున్నందున 31అడుగులగోడయొక్కటి ఆలయరక్షణార్థము కట్టబడియున్నది.

పై చైత్యమునకు దూర్పున నొకగుహ కలదు. దానియందు శిలావిగ్రహమొకటి యున్నది. (చిత్రము 3, ౨ చూడుడు.) విగ్రహము రెండుగా పగిలియున్నను ఏభాగమును లోపించక పూర్తిగానున్నది. పీఠమున నొక మకరము చెక్కబడియున్నది. మకరచిహ్నము శ్వేతాంబరజైనులసిద్ధాంతరీతిగా తొమ్మిదవ తీర్థంకరుడగు సువిధినాథునిది కాన నీ విగ్రహము జైనమనియు సువిధినాథునిదనియు పోల్చుకొనబడినది.

## ఇతర కట్టడములు

పైని వర్ణించబడిన అయిదు చైత్యాలయములు కాక బౌద్ధసన్న్యాసులకు నివేశనములుకూడ కొండపై గలవు. ఇందు ఇరువదినాలుగు గదులు వరుసగా అయిదవచైత్యమునకు ఉత్తరమున ప్రారంభించి పశ్చిమముగా నాలుగవచైత్యము వెనుకభాగమువఱకును వ్యాపించి యున్నవి. ఈవరుసకు మఱికొనయందు క్రిందిమట్టమునసుండు మూడవఆలయమునకు పోవుట కనుకూలముగ సోపానమార్గము కలదు. నాలుగవచైత్యముయొక్క వాయవ్యమున నుండినట్లు వర్ణించబడిన 20 సోపానముల మార్గము ఇదియే. గదులవరుసకుముందు 6 అ. 11 అం. వెడల్పుగు అరు గున్నది. ఒక్కొక్కగదియు 8 అ. $\times$ 6 అ. పరిమాణము కలది. గదులమధ్య గోడలమందము ఒక అడుగు.

పైనిచెప్పిన సోపానములను దిగినయెడల మరియొకగదులవరుస ప్రారంభమయి రెండవచైత్యాలయపు వెనుకవఱకును వ్యాపించియున్నది. ఇందు గదులసంఖ్య 18. గది పరిమాణము $9\frac{1}{2}$ అ. $\times$ $8\frac{1}{2}$ అ. గదులకు ముందు వసారా కలదు. దానివెడల్పు 3 అ.—3 అం. ఈగదులవరుసకు పడమటికొనయందు మఱిరెండు పెద్ద గదులును వాటిమధ్య నొకడగోబాయు నున్నవి.

ప్రథమమున వర్ణించబడిన పెద్ద స్తూపమునకు ముందు అనగా తూర్పున, ఉత్తర దక్షిణపార్శ్వములందు కూడ కొన్ని గదులవరుసలు కలవు. ఇందు దక్షిణపార్శ్వమునందలి వరుసయందు ఏడుగదు లున్నవి. గది పరిమాణము 8 అ. $\times$ $6\frac{1}{2}$ అ. ఈవరుస నానుకొని తూర్పుకొనయం దొకస్తూప మున్నది. దీనివ్యాసము 14 అ. దీనిగర్భమున నొకగది 7 అ. $\times$ 7 అ. వైశాల్యముకలది యున్నది.

ఉత్తరపార్శ్వమున రెండువరుసలు సమాంతరముగా నొకదాని నొకటి ఆనుకొనియున్నవి. లోవరుస (దక్షిణపంక్తి)యందు యెనిమిదిగదులును వెలుపలివరుస (ఉత్తరపంక్తి)యందు పదిగదులును ఉన్నవి. ఒక్కొకగదిపరిమాణము $7\frac{3}{4}$ అం. $\times$ 7 అ. ఇచ్చటగూడ లోవరుస నానుకొని తూర్పుకొనయందు $16\frac{3}{4}$ అ. వ్యాసము కల స్తూప మున్నది. ఈస్తూపమునుండి పల్లముననుండు కట్టడములకు పోవుటకు నూటతొంబదియడుగుల పొడవైన సోపానమార్గము సర్పాకారముగా క్రిందికి పోయి యున్నది.

## పల్లముననుండు కట్టడములు

పశ్చిమ స్తూపమునకును, ప్రథమ చైత్యమునకును మధ్యనుండు ప్రదేశమునకు ఉత్తరమున నూరడుగుల

లోతగు లోయ యున్నది. లోయ కుత్తరమున నొక పీఠభూమి యున్నది. ఈసమప్రదేశము తూర్పు పడమరలుగా 175 అడుగులును, ఉత్తర దక్షిణములుగా 94 అడుగులును వ్యాపించియున్నది. ఇచ్చట నొక గొప్పవిహార మున్నది. విహారపు వైశాల్యము 91 అ. $\times$ 39$\frac{1}{2}$ అ. గోడలమందము 3$\frac{1}{2}$ అ. దీనికి ద్వారము తూర్పుననున్నది. దానివెడల్పు యేడడుగులు.

విహారమునకు దూర్పున నొక చిన్న ఆలయము న్నది. ఆలయమునకు తూర్పున క్రిందికి పోవుటకు సోపానము లున్నవి. ఉత్తరమున రెండు గండశిలలు ఒకదాని నొకటి యొరసికొనుచు నిలచియున్నందున వాటిమధ్య సింహద్వారము ననుకరించు స్వాభావికమార్గ మేర్పడి యున్నది.

పీఠభూమికి ఉత్తరమున నేబదియడుగల క్రింది మట్టమున ఏభవనముల జాడయు లేకున్నను వివిధములగు మృత్పాత్రలశకలములును, కత్తులు, బల్లెములు, గొడ్డండ్లు మొదలగునవిమాత్రము విశేషముగా దొరకినవి. (చిత్రము 5 చూడుడు). పాత్రలపై పుష్పములయొక్కయు పత్రముయొక్కయు చిత్రములు కలవు. ఇట్టి గృహోపకరణము లుండుటవల్ల పూర్వ మీప్రదేశము జనావాసమై యుండినట్లు తోచుచున్నది.

జనావాసమునకు కొంతదూరమున నొకచరియ తటాకముగా నేర్పడియున్నది. దానిపొడవు 208 అ. వెడల్పు 10 అ. లోతు 9 అ. జనావాసమున కొన్నిముద్రలుకూడ దొరకినవి. అందొకదానియందు "శిరిశివమక విజయరాజ—శైలసఘస"యని కలదు. శిరిశివమకవిజయరాజుఅమరావతిలోని యొకశాసనమునగూడ పేర్కొనబడియున్నాడు. దీనినిబట్టి ఈపర్వతముపైన నుండినది శిరిశివమకవిజయరాజపోషితమగు శైలసంఘ (బౌద్ధ సంఘము) మని యూహింపవచ్చును.

## దుర్గకొండ (చిత్రము 6)

గురుభక్త కొండకు వాయవ్యమున నున్నది. అది యున్నతమై ఒక గనిమమూలమున గురుభక్త కొండతో జేరియున్నది. దానియందొకగుహలోనిదుర్గా విగ్రహమువల్ల నది దుర్గయన బరగుచున్నది. గురుభక్త కొండయు, దుర్గకొండయు తొలుత బౌద్ధక్షేత్రములై యుండి పిదప జైనలయొక్కయు హిందువులయొక్కయు ఆధిపత్యమునకు వచ్చినవి.

కొండయొక్క దక్షిణసానువుననే శిథిలము లన్నియు కలవు. నాలుగు గొప్పగుహలు 340 అడుగులవఱకు వ్యాపించియున్నవి. వాటి పురోభాగమున 565 అడుగుల పొడవగు అరుగున్నది. ఒక గుహ కెదురుగా గోడయందు శాసనమున్నది. ఇచ్చట ననేకజైనవిగ్రహములు దొరకినవి. కొండశిఖరమున పడమటిగుహలకుపైన నొక స్తూపము 30 అడుగులవ్యాసము కలదియు, ఒకచైత్యము 60 అ. $\times$ 13 అ. వైశాల్యముకలదియు నున్నవి. ఆలయము దక్షిణముఖమైనది. గురుభక్తకొండయందలి శిథిలములకు పాతికమైలుదూరమున నీకొండయందలిశిథిలము లున్నందున నిచ్చట ప్రత్యేకసంఘారామ ముండియుండవలెను.




# రాధప్రార్థన

కోణతాలపల్లి సత్యనారాయణ గారు.

శారద రాత్రి యియ్యది; నిసర్గమనోహరచంద్రికా సుధా
ధారలచే సుధాకరుఁడు దన్పుచునుండె జగంబు; నెల్లచోఁ
గైరవగంధబంధురనికాయముగా వలిగాడ్పు వీచెఁ గృ
ష్ణా, రసికాగ్రణీ! మురళినాదము మాకు ననుగ్రహింపుమీ.




గండికోట సత్యనారాయణమూర్తి గారు, యం. ఏ.

(వెనుకటిసంచిక తరువాయి)

## వినిమయకాండము

## 10-వ ప్రకరణము

### వినిమయము

ఉత్పత్తికాండమందు అర్థోత్పాదక సాధనములం గూర్చిగదా వివరించితిమి. ఉత్పాదితంబగు అర్థము ఏవిధముగా ప్రజలవద్దకు చేరుచున్నది? ఏసాధనములంజేసి ఒకవస్తువున కింకొకవస్తువు మార్పుచేయబడుచున్నది? వస్తువులవెలలు ఎట్టిన్యాయములను ధర్మములను అనుసరించి ఏర్పడుచున్నవి? అనే విషయముల గురించి ఈకాండములో విచారించవలసి యున్నది.

### 1. ఒకవస్తువున కింకొకవస్తువు మార్పుచేయుట అనగానేమి?

పసిపిల్లలు, ఏమియు నెరుగనివెర్రివారు, ఇతరుల వద్ద సేవకులుగ దాస్యముచేయ నొల్లక ఇతరులతో నెట్టి వ్యాపారములు కలుగజేసుకొనక తమయొద్దనున్న భాగ్యమును వినియోగించుకొనియే ఆయుఃపర్యంతము తమపొట్టలను పోషించుకొను సుఖవాసులు, అనే ఈశముందుజాతుల వారుతప్ప ప్రపంచమందుండు ఇతరులందరు కొంచెముగనో హెచ్చుగనో భాగ్యవృద్ధికి తోడ్పడుచున్నారని చెప్పవచ్చును. కొందరు తమప్రాణములను సంరక్షించుకొనుటకు వలయు వస్తువులనుమాత్రము తయారు చేసుకొనుచున్నారు. అరణ్యవాసులు దుంపలను కాయలనుతిని బ్రతుకుచూ తమ చేతులతోనే చిన్నచిన్న గుడిసెలను కట్టుకొని వాటిలో నివసించుచూ కాలక్షేపము చేయుచున్నారు. ఒకానొక కాలమందట్టిస్థితిలోనే ప్రతిదేశపు వారిలో కొందరుండియుండిరని దేశచరిత్రలు చెప్పుచున్నవి. అనేకులు తమకు కావలసినదానికన్న ఎక్కువ భాగ్యమును కలుగజేసుకొని స్వానుభవమున కవశ్యమగు అర్థమునుంచుకొని శేషించిన వస్తుసముదయమును అమ్మకముచేసి అనుభవయోగ్యములగు ఇతరవస్తువులను సంపాదించుకొనుచున్నారు. భూస్వాములు తమకు కావలసిన ధాన్యమును వేరుగానుంచుకొని మిగిలిన ధాన్యమునమ్మి ఆరాబడిసాహాయ్యమున తమకువలయువస్త్రములు ఆభరణములు మొదలగు అనుభవయోగ్యపదార్థములను సేకరించుకొనుచున్నారు. కొందరు వస్తునిర్మాతలు తమ ఉపయోగమున కనావశ్యకములగు వస్తువులనే విస్తారముగా తయారుచేయుచున్నను వాటినన్నిటిని ఇతరులకు అమ్మకముచేసి తమకవసరమగు వస్తువులను పొందుచున్నారు. హిందూదేశపుస్త్రీలు ధరించుటకు వస్త్రములున్ను చీరెలున్ను ఆంగ్లేయులు తమదేశములో తయారుచేసి మనకు పంపుటలేదా? అన్యదేశీయులు మనదేశపువారివద్ద కొనదగు తేయాకు, కాఫివిత్తులు, గోధుమలు, ప్రత్తి, వేరుసెనగలు మొదలగువస్తువులను మనవారన్యదేశీయులకు పంపుచుండలేదా! ప్రపంచమందలి జనులు పలువిధముల శ్రమపడి వస్తువులను తయారుచేసి వారిలోవారు మారుదల చేసుకొని తమకోరికలను నెరవేర్చుకొనుచున్నారు. ఈ విధముగా వస్తువులను మార్పుచేసుకొనుటయే వ్యాపారమనబడును. దీనినే 'వినిమయము' అనెదరు.

### 2. వినిమయమేల చేయవలెను?

వ్యాపారమనునది వస్తువు నమ్మినవానికి కొనినవానికి లాభకరముగా నుండుననుసంగతి అందరకును

తెలిసినదే. మనము అమ్మకముచేసే సరకుకన్న అందుకు ప్రతిఫలముగా పుచ్చుకొనుధనమో లేక ఇంకొక వస్తువో అధిక లాభదాయక మని యోచించుకొనుచుండుటవలననే వస్తువులు వినిమయమొందుచున్నవి. ఆసరకు అధికోపయోగముగా నుండుటవలననే లోకమం దంతటను వ్యాపార మేర్పడినది. వినిమయము లాభకరముగా నుండుట కనేక కారణము లున్నవి; వాటిలో ముఖ్యమగునవీదిగువ సూచింపబడినవి:—

(1) వేర్వేరు తెగలలోను జాతులలోను చేరిన మనుష్యుల ప్రవర్తనములు, వేషములు, భావనలు, అభ్యాసములు, అభిరుచులు వేరువేరుగా నుండుటకారణమున వస్తువులకు అవి యుండుస్థలములకు తగిన విధమున మదింపు ఏర్పడుచున్నది మన కధికముగా నుపయోగించని వేరుసెనగలు, మేకతోలు, ఎద్దుతోలు పాశ్చాత్యదేశములలో బహువిధములగు పరిశ్రమల కుపయోగపడి మంచిమంచి సామానులుగా తయారుచేయబడుచున్నవి. ఒకని కక్కరలేనివస్తువు లింకొకనికి అనుభవయోగ్యము లగుచున్నవి.

(2) పలువిధములగు నైసర్గికపదార్థములు అనేక దేశములలో దొరకుచున్నవి. అవి అన్నియును ఒకేదేశమందు దొరకనందుననే మనము నేలబొగ్గు, ఇనుము, సీసము మొదలగు వస్తువులను ఇతరదేశములనుండి తెప్పించుకొనుచున్నాము. ప్రత్తి, జనుపనార, గోధుమలు, బియ్యము మొదలగు సామానులు మన మన్యదేశములకు పంపుచున్నాము. ఒక దేశమందు కొన్ని భాగములలో దొరకువస్తువులు మరికొన్ని భాగములలో దొరకుట దుర్లభము. మన హిందూదేశములో ఏయేభాగములం దేయే వస్తువులు విశేషముగా దొరకుచున్నవో వాటిని సూచించెడు హిందూదేశపుపటము నొకసారి చూచినచో ఈ సంగతి విశదమగును. వ్యాపారమనునది లేనియెడల ఎవరెవరికి కావలయువస్తువులు వారివారికి సమకూడవు.

(3) స్వభావమునంజేసియు ఆచారవ్యవహారములంజేసియు కొందరుమనుజులు కొన్ని పరిశ్రమలకున్ను మరికొందరు మఱికొన్ని పరిశ్రమలకున్ను తగిన వారుగా నున్నారు. కొందరు కుమ్మరపనికిన్ని కొందరు చెప్పులుకుట్టు పనికిన్ని, కొందరు నగిషీ పనికిన్ని, కొందరు చిత్తరువులు వ్రాసేపనికిన్ని, మరి కొందరు వ్యవసాయపుపనికిన్ని తగినవారుగా నున్నారు. కావున ఆయా పరిశ్రమలను తెలివితేటలతో జేసి వారు ఉత్పాదించువెలగల పదార్థములనుఅమ్మి తమకువలయు ఇతరపదార్థములను సంపాదించుకొనుచున్నారు. ఈ ప్రకారము కొందరుదేశస్థులు వ్యవసాయవృత్తియందును మరికొందరు యంత్రోపకరణ సహాయ్యమున కర్మాగారములలో వస్తు నిర్మాణముచేయుటయందును నేర్పుకల వారగుచున్నారు. ఇందువలననే ప్రత్తి, గోధుమలు, జనపనార మొదలగు సరకులను మనము పాశ్చాత్యదేశములకుపంపి ఆదేశములందు యంత్రసహాయమున ఫ్యాక్టరీలలో నుత్పాదింపబడిన వస్తువులను బదులీగాపుచ్చుకొనుచున్నాము.

### 3. మదింపు (విలువ) అనగానేమి?

ఒక వస్తువునిచ్చి ఇంకొకవస్తువును తీసికొనుటయే వినిమయమని చెప్పియుంటిమి. సుమారొకపలము బరువుగల వస్తువునిచ్చి నాల్గుమణుగుల బరువుగల ఇంకొక వస్తువును మన మేకారణమున పుచ్చుకొనుచున్నాము? ఒకచిన్న మాణిక్యమునిచ్చి విస్తారముగా ధాన్యము పుచ్చుకొనుట కేమికారణము? అనగా అర్థరాశిలో చేరినవస్తువుల మదింపులను లేక విలువలను ఏవిధముగా నిర్ణయించునది? ఏవస్తువైన అరుదుగా నుండినచో (అనగా దాని సరఫరా తక్కువగా నున్నచో) దానిమదింపు లేక విలువ హెచ్చుగా నుండుననే న్యాయము ఎల్లరకు విశదమే. మరకతమణి మదింపు హెచ్చుగా నుండుటకును మసిబొగ్గుమదింపు అతిస్వల్పముగా నుండుటకును కారణమే మన మొదట పేర్కొనబడిన మరకతమణి కష్టసాధ్యముగాను అరుదుగాను ఉండుటయే. అరుదుగానున్న వస్తువు యొక్క సరఫరా జాస్తీ అయినకొలది దానిమదింపు తరుచుగా తగ్గుచునే యుండును. మేకలకన్న ఎద్దులు అరుదుగా నుండుటంజేసి ఎద్దులమదింపు జాస్తీగా నుండును. వస్తువుల ఉపయోగములను బట్టికూడ వాటిమదింపు ఏర్పడుచుండు ననెడుసంగతి మనము మరువకూడదు. ఒక ఎద్దునిచ్చి నాలుగు మేకలను కొనగల్గినచో ఒకఎద్దు మదింపు నాలుగు మేకలని చెప్పుచున్నాము. మేకలవలన ఉపయోగమే లేనిచో ఎద్దునిచ్చి పదిమేకలైనను

కొనుటకెవడు యత్నించును? మదింపును ధనమూలమున గణించుటయే వెల యనబడును. వస్తువుల సరఫరాను బట్టియు వాటిఉపయోగమునంజేసియు మదింపు ఏర్పడుచున్నది.

వస్తువులవిలువ వాటిసరఫరానుబట్టియా లేక వాటి ఉపయోగమునుబట్టియా నిర్ణయింపబడుచున్నదనెడు సమస్య విచారణీయము. అర్థతత్త్వజ్ఞు లేతద్విషయమునుగూర్చి విపులముగా చర్చించెదరుగాని వాస్తవముగా ఆ రెండింటియొక్క సంయోగమునుబట్టియే వస్తువునకు మదింపులేక విలువ ఏర్పడుచున్నదని మనము సులభముగా తెలిసికొనవచ్చును. సరఫరా కాబడు వస్తురాసుల మూలమునను వాటి ఉపయోగమునను వస్తువుల విలువ ఏర్పడుచున్నది నిరుపయోగముగా నున్న వస్తువుల మొత్తమెంత పోతరించినను, తగ్గినను వాటికి విలువయే ఉండదు; ఉన్నను అతిస్వల్పము. వస్తురాసుల హెచ్చుతక్కువలనుబట్టియే విలువ ఏర్పడునని చెప్పకూడదు; ఏమన వాటి ఉపయోగమునుకూడ గమనింపవలసియుండును. మనుజుడు నడుచుటకు కుడికాలుముఖ్యమా? యెడమకాలు ముఖ్యమా? కంచుగంటవలన శబ్దము కలుగుచున్నదా? లేక దానినికర్రతో కొట్టుటవలన శబ్దముకలుగుచున్నదా? కత్తిరించుటకుకత్తిరికోలుమీదిభాగమవశ్యమా లేక క్రిందిభాగ మవశ్యమా? ఈ ప్రశ్నలవలెనే విలువను గూర్చి మీద పేర్కొనబడిన సమస్య ఉన్నది. నడుచుటకు రెండుకాళ్ళును, శబ్దము కలుగుటకు కంచుగంటయు కర్రయును, కత్తిరించుటకు కత్తిరికోలునకుండు మీది భాగమును క్రిందిభాగమును ఎట్లు ముఖ్యమో అదే విధమున మదింపులేక విలువ ఏర్పడుటకు వస్తువుల సరఫరాయును ఉపయోగమును ముఖ్యములని చదువరులు జ్ఞప్తియందుంచుకొనవలెను.

## 4. వెలల హెచ్చుతక్కువలు

వెలలు ఒకప్పుడు హెచ్చుగాను ఇంకొకప్పుడు తక్కువగాను ఉండుట అందరకు తెలిసినవిషయమే. ఇందులకు కారణమేమి? అమ్మబడికివచ్చినసరుకు జాస్తిగా నుండుటయును, ఆసరకు గిరాకిగానుండుటయును బజారులో బియ్యము నమ్ముట కనేకవర్తకులును కొనుట కనేకులు జనులును వచ్చుచుందురు. ఏవస్తువునైన అమ్మదలచిన వ్యాపారి ఒకానొకవెలకు వస్తువు నమ్ముటకు తయారుగా నుండును; కొనదలచినవాడావస్తువు నింకొకవెలకు కొనుటకు తయారుగానుండును. ఉభయులకు వ్యవహారము లాభకరముగా నున్నట్లు తోచినప్పుడే ఆవస్తువు అమ్మబడుటయు కొనబడుటయు తటస్థించుచున్నది. ఈసాధారణపుసంగతులు మనసునందుంచుకొని ఒకబియ్యపుబస్తావెల ఈదిగువ సూచింపబడిన విధమున ఏర్పరుపవచ్చును.

కొనదలచినవారు ఇచ్చుటకు తయారుగా నున్న వెలలు (రూపాయలలో) **10, 9, 8, 7, 6, 5.**

అమ్మదలచినవారు యెదురు చూచు చుండెడు వెలలు (రూపాయలలో) **11, 10, 8, 7, 5.**

| (వెలరూపాయలలో) | ఆవెలకు వస్తువును కొనుటకు తయారుగానున్న వారి సంఖ్య | ఆవెలకు వస్తువును అమ్ముటకు తయారుగా నున్న వారి సంఖ్య |
|---|---|---|
| 11 | 0 | 6 |
| 10 | 1 | 5 |
| 9 | 2 | 4 |
| 8 | 3 | 4 |
| 7 | 4 | 3 |
| 6 | 5 | 2 |
| 5 | 6 | 0 |

బియ్యపుబస్తా బేరపుసారాంశము లీమీదిపట్టీలో వివరించిన విధముగ ఉండుననుకొందము. మీదిపట్టీలో నున్న విషయములను పరిశీలించినచో అమ్మిన వారికి కొనినవారికి పోటీగానున్నపుడు తుదకు సుమారు 8 లేక 7 రూపాయలకు బియ్యపుబస్తావెల నిర్ణయింపబడవలసియుండునని తోచకమానదు. $7\frac{1}{2}$ రూపాయలకు వెల సిస్తైనప్పుడు కొనుటకు నల్గురును అమ్ముటకు నల్గురును తయారుగా నుందురు. ఇట్టిస్థితిలో ఇంక 5 గురు వర్తకులు జాస్తీబియ్యపు బస్తాలనుపోటీగా అమ్ముటకు బజారునకు తీసుకవచ్చినచో బియ్యం బస్తా వెల తగ్గిపోవచ్చును. కాబట్టియే సరుకు జాస్తీగా నున్నప్పుడు వెలతగ్గుననియు సరకు గిరాకిగా నున్నప్పుడు వెల హెచ్చుననియు మన మొకసామాన్యసూత్రము నేర్పరుపవచ్చును.

### 5. కొన్ని వస్తువులు అరుదుగానుండుటకు కారణములు:

(1) వస్తువు లరుదుగానుండుటకుకారణము లనేకములు. కొన్ని వస్తువులసంఖ్య జాస్తీగానుండుటకు వీలులేదు. ఇట్టివస్తువు లరుదుగానుండుట నిస్సందేహము. రవివర్మగారిచే వ్రాయబడిన చిత్తరువులు బహుఅరుదు. అట్టిదుర్లభ పదార్థము లెచ్చటనైన ఒకప్పుడు అమ్మకమునకు వచ్చినచో అమ్మువాడు కోరినవెలను కొనువాడిచ్చినగాని అవి లభించవు. అట్టివి సాధారణపు వ్యాపారమునకురావు.

(2) కొన్నివస్తువులను తయారుచేయుటకు కొందరువ్యాపారులుమాత్రమే అధికారమును పొందుటచే ఆ వస్తువులమదింపు జాస్తీ కావచ్చును. స్వతంత్రవ్యాపారమునంజేసికూడ వస్తువులుదొరకుట అరుదుకావచ్చును. ఒకవర్తకుడే బజారులోనెయ్యి అమ్ముటకు అధికారము పొందినప్పుడు వాడుకోరినవెలను నెయ్యికొనదలచువారు ఇవ్వవలసియుండును. స్వాభావికముగా కొన్నివస్తువులు కొన్నిస్థలములందుమాత్రము దొరకుచున్నవి. ఆ స్థలములకు స్వంతదార్లు స్వతంత్రవ్యాపారులను బోలియేయుందురు. బంగారము లభించెడు గనిభూమియందగపడినయెడల అందువలనగలుగులాభము వానికే యేర్పడుచున్నది. కొన్నివస్తువులంగూర్చి ఇట్టి స్వతంత్రవర్తకమున కనుమతింప కొన్ని దేశములలో ఆదేశముల నేలెడు దొరతనమువారే సర్వహక్కులను ఉంచుకొనుచున్నారు. మనదేశమందు నల్లమందువ్యాపారము, ఉప్పువ్యాపారము పన్నులనువేయుటకొరకై గవర్నమెంటువారే తమవశమునందుంచుకొన్నారు. ఇట్టి ఏకస్వతంత్ర వ్యాపారవిషయములలో వర్తకులు తమకుతోచిన జాస్తీవెలలనే నిర్ణయింతురని చెప్పలేము. ఏమనగా వెలలుజాస్తీచేసినచో అమ్మకముతగ్గిపోయి లాభము నానాటికి క్షీణించును. వెలలు తగ్గినకొలది మొత్తముమీద అమ్మబడి జాస్తీయయి లాభము అధికరించును. వెలలెంతవరకు తగ్గించినచో ఎంతమట్టుకు లాభము హెచ్చునో అట్టి వ్యాపారస్థులు తమస్వానుభవమున తెలిసికొనగలవారు కావున తమలాభమున కిబ్బందిరాకుండ వెలలనువీలైనంత తగ్గుదలలోనే ఉంచెదరు.

(3) ఏవస్తువునైన ఉత్పాదించుటకు కొద్దిగనో హెచ్చుగనో కర్చగును. ఉత్పత్తికివలయు మూలధనములేక పెట్టుబడిసామానులు, పనులు నడిపించుటకువలయు కార్మికుల కివ్వవలసినకూలి మొదలగు విషయముల ననుసరించియే ఉత్పాదింపబడు వస్తువుయొక్కవెల ఏర్పడును. ఏవ్యాపారికూడ సరకు తయారుచేయుటకయ్యేకర్చునకు మించినవెలకు ఆ సరకును తుదకు అమ్ముట జరుగదు. ఉత్పాదకులకు అయ్యేకర్చులే వెలలగునని సిద్ధాంతము చేయుట మా అభిప్రాయముకాదు. జాస్తీవెల కావస్తువును అమ్మినచో ఇతర వ్యాపారులుకూడ లాభమునకాశించి అదేమార్గముత్రొక్కి పోటీవర్తక మారంభించి వెలను తగ్గించి తగ్గించి తుదకాసరకు తయారుచేయుటకయేకర్చు మొత్తమునకు సమీపముగా వెల యున్నటుల చేసెదరు. పెట్టుబడి కర్చుకూడ కిట్టనియెడల ఆవస్తువును తయారుచేయుటయే ఉత్పాదకులు వదలెదరు. అట్టి వస్తువులు అరుదుగానుండునుగదా! ఏవస్తువునకైన వెల వ్యాపారుల ఇష్టానుసారము నిర్ణయింపబడుచున్నదని తలచుటతప్పు. వస్తువు లరుదగుచున్న కొలది వెల హెచ్చుచుండును. కాబట్టియే. కరువుకాలములో ధాన్యము వెల హెచ్చగుచున్నది.

### 6. పోటీకి విరోధమగుఅంశములు:

1. మీదచెప్పినవిధమున వ్యాపారస్థులు,వర్తకులు ఒకరితోనొకరు పోటీచేయుటవలననే సరియైనవెల ఏర్పడునని తోచుచున్నది. ఎవడైనను ధనలాభమునకాశించి తనచేతనైనంతమట్టుకు లాభకరముగానుండే వ్యాపారమును లాభకరముగానుండే మార్కెట్టునుగాని సంతనుగాని వెదుకుచూ పనిచేసినయెడల మీదిపేరాలో వివరించిన విధముననే తటస్థించును. అయినను అనేక కారణములంజేసి ఈపోటీ సూత్రముయొక్క బలము తగ్గుచున్నది. వాటిలో కొన్నిటిని దిగువ వివరించెదము:

వర్తకవ్యాపార మార్గములందును భాగ్యవృద్ధియందును బహుఉత్సాహముకల ఆంగ్లేయులును వారినిబోలెడు ఇతరదేశీయులును ఆచారముయొక్కయు లేక మామూలుయొక్కయు కట్టుబాట్లకు లొంగేవారుకారు. లాభకరములగు మార్గములనే సులభముగా నన్వేషించి పనిచేసెదరు. మనహిందూదేశీయులలో మామూళ్ళనే

కట్టుబొట్లకులొంగి వ్యవహరించు గుణముగలవారు. కావు
ననే నూతన పారిశ్రామిక మార్గములను వాణిజ్య పద్ధతు
లను సుళువుగా నవలంబింపరు. కావుననే పాశ్చాత్య
దేశీయులవలె స్పర్థతో పనిచేసెడు సామర్థ్యము మనదేశ
పువారి కంతగాలేదనియే చెప్పవచ్చును. సరకులను
తయారుచేయు మార్గములున్ను వాటివెలలున్ను సులభ
ముగా మారుదల నొందకయున్నవి. అయినను తుట్టతు
దకు స్పర్థాసూత్రము ననుసరించియే వెలల హెచ్చుతగ్గు
లేర్పడుచుండును.

(2) సరకులు సరియైనవెలలకు లభించవలెనన
కార్మికులు శ్రమపడి స్పర్థతో పనిచేయవలెను. ఇట్లు
పోటీవేయుటకై లాభమునకాశించి ఒకస్థలమునుండి ఇం
కొకస్థలమునకు వెళ్లుటకు కర్మకరులు సంసిద్ధులై యుండ
వలెను. ఆంగ్లేయు లిట్టి స్పర్థావివేకము కలవారనుట
కనేక నిదర్శనములున్నవి, తమ స్వదేశమునుండి ఎంత
యోదూరముగా నుండు దేశములకు సైతము వలసలుపోయి
అచ్చటి వారిధనమునే కర్చుచేసి పరిశ్రమలను వ్యాపార
ములను ఐరోపాదేశస్థులు నడిపించుచుండుటయే గొప్ప
నిదర్శనము. మనదేశపువారుస్వదేశమును వదలి పైదేశము
పోయి వ్యాపారముచేయుటమాట యటుండగా తాము
నివసించెడుగ్రామమునుండి గ్రామాంతరమునకు వెళ్లినచో
ఎక్కువ కూలిసంపాదించుటకు వీలుఉన్నను అట్లుచేయు
టకే వెనుకంజవేసెదరు. ఇట్టి స్వస్థలాభిమానము, వ్యవ
హార జ్ఞానములేకుండుట ఇంకొక క్రొత్తదేశమునకుగాని
స్థలమునకుగాని వెళ్లినచో నష్టమనియే దుర్భ్రమ పెద్ద
అభ్యంతరములుగానున్నవి. అయితేయిప్పటినాగరికతా
ధర్మమునంజేసి తంతి, తపాలు, రైలుబండ్లుప్రబలి చిన్న
చిన్నగ్రామములందు పూర్వపుపరిశ్రమలు వృత్తులుక్షీణిం
చుటవలన అనేకులు ఏదైన ఉద్యోగము నపేక్షించిదూర
స్థమగు ప్రదేశములకుపోయి లాభకరములగు మార్గములలో
ప్రవేశించుచున్నారు. కావుననే స్పర్థాబుద్ధికూడ నానా
టికిఅధికరించుచున్నది. అయినను ఈదేశమందనేకభాగ
ములలో అనేకభాషలు ప్రబలియుండుటవలన ఒక పర
గణానుండి ఇంకొకపరగణాకు ప్రజలు ఉద్యోగము
కొరకుగాని కూలులకైగాని తరుచుగా వెళ్లుచుండుట
లేదు.

(3) కొన్నిసరకులపై దొరతనమువారు పన్నులు
విధించుచున్నారని అందరకు తెలిసినవిషయమే. పన్నులు
విధింపబడిన వస్తువులు పన్నులు విధింపబడని సరకుల
కన్న ఎక్కువవెలకు విక్రయింపబడునుగదా! అంతేకాక
ఒకేవిధమగుపన్ను అన్నివస్తువులమీదను గవర్నమెంటు
వారు విధించుచుండుటలేదు. కాబట్టి సరకుల మదింపు
లున్ను వెలలున్ను ఆయావస్తువులపై విధింపబడు హెచ్చు
తక్కువపన్నుల ననుసరించియుండును. మనగవర్నమెంటు
వారు ఉప్పుపన్ను మణుగు 1-కి ఒకరూపాయిచొప్పున
విధించుటంజేసి ఉప్పును తయారుచేయుట కగు కర్చున
కున్ను ఉప్పుబజారులో అమ్మబడిఅయ్యే వెలమొత్తమున
కున్ను భేదమేర్పడి తుదకు పేర్కొనబడిన మొత్తమే
జాస్తీగానుండుట తటస్థించుచున్నది. కావున వస్తువును
తయారుచేయుటకయే కర్చునకున్ను ఆవస్తువు అమ్మబడి
అయ్యే మొత్తమునకున్ను విశేషభేద ముండకూడదనే
న్యాయమునకు విరోధమేర్పడుచున్నది.

(4) ఇప్పటి నాగరికయుగమందు ఒకదేశమున
కున్ను దానికిచాలదూరముగ నుండు అన్యదేశములతోడ
ను వర్తకవ్యాపారములు జరుగుచున్నవి. ఆంగ్లేయులు
మనదేశస్థుల కనేకసరకులను పంపుచున్నారు. మనము
కూడ వారికి అనేకసరకులను పంపుచున్నాము. కాబట్టి
ఒకానొకప్పుడు హిందువులు ఆంగ్లేయుల యొక్కయు,
ఆంగ్లేయులు హిందువుల యొక్కయు ఆవశ్యకములను
గమనించియే వస్తునిర్మాణముచేయుట తటస్థించవచ్చును.
ఇంతేకాదు; యంత్రసహాయము లేర్పడినపిదప సుమా
రుగా యింతవెలలేక ఇంత బరువుగల సామానులనే
తయారుచేయవలెనని భీష్మించుట ఒకప్పుడు నష్టమునకు
హేతువగును. కొన్నిసమయములందు యంత్రోపకరణ
సాహాయ్యమున అర్థోత్పత్తిచేయుటవలన నష్టమువచ్చినను
రావచ్చును; ఏమన ఉత్పాదితంబగు సామగ్రి అంతయు
చెల్లుబడి కాకపోవచ్చును; డిమాండు తగ్గగానే వెలలు
దిగబడును. ఉత్పాదకుని కయ్యే కర్చులుకూడ కిట్టక
పోవచ్చును.

(5) నూనెనుగూర్చి గానుగాడుటవలన తెలకపిండి
యున్ను, ధాన్యముదంపుటవలన ఊకయున్నుతవుడున్ను,
భూములను సాగుబడిచేయుటవలన గడ్డియున్ను, ప్రత్తి



౧౨. యదునాథ సర్కారుగారు

ప్రఖ్యాత చారిత్రకపరిశోధకులు, కలకత్తా విశ్వవిద్యాలయ మాజీ ప్రొఫెసరు.



౧౩. యస్. ఆర్. దాసుగారు

ఇండియా ప్రభుత్వపు లా మెంబరు.

తయారుచేయుటవలన ప్రత్తిగింజలున్ను అముఖ్యపదార్థ ములుగ లభించుచున్నవి. ముఖ్యపదార్థములగు నూనె, బియ్యము, ధాన్యము, దూది వీటికి గిరాకి యేర్పడినచో ఆయాసరకులను జాస్తీగా తయారుచేయుచున్నారు. అవి తయారైనప్పుడు మీదచెప్పిన అముఖ్యపదార్థములు కూడ తయారుకావలసినదేకద! తెలకపిండి మొదలగు అముఖ్యపదార్థముల సర్వరా జాస్తీ అగును; అప్పుడు ఎంతైన కొంతవెలకవి అమ్మబడి అయిన చాలునని తోచుటంజేసి వాటివెలలు తగ్గవచ్చును. ఇదేవిధమున ఇంగ్లాండులో నేల బొగ్గుపనులలో చాలా అముఖ్యపదా ర్థము లేర్పడుచున్నవి. ఆవస్తువులనుండి నానావిధము లైన నూనెలు, రంగులు అధికశ్రమలేకుండ ముఖ్య పదార్థములతోపాటు ఉత్పన్నమగుచున్నవి. ఈకార ణమువలననే ఉపయుక్తమగు అముఖ్యపదార్థములు చాల చౌకగా మనదేశమున కెగుమతి చేయబడు చున్నవి.

## 7. వస్తువుల వెలలెట్లు ఏర్పడుచున్నవి?

కాలవ్యత్యాసమునంజేసి వస్తువులవెలల హెచ్చు తక్కువలు ఏర్పడుచుండును. చేపలబజారులో సాధారణ ముగా చేపలవెలలు దినదినము మారుచునే యుండును. అమ్మువారును కొనువారును పోటీవేసుకొని లాభ మొందుటకు యత్నించుచుందురు; పైపేరాలలో వివరిం చిన విధమున బేరమతితీవ్రముగా జరిగినపిదపయే వెల నిర్ణీతమగును. చిన్నమార్కెట్టులలో వస్తువుయొక్క గిరా కినిబట్టియు కొనువాని భాగ్యమునుబట్టియు వెల యేర్ప డును. వస్తువునమ్మువర్తకుడొక్కడువద్దకు పలువురు కొన దలచినవారు వచ్చినప్పుడు వారిలో ద్రవ్యవంతుడైనవాడే ఎక్కువవెల నివ్వగలడు; వాడే వెలను నిర్ణయించువా డగును. బీదవానికన్న భాగ్యవంతునికి రూపాయియొక్క అంత్యోపయుక్తి మిక్కిలి తక్కువగా నుండునుగద! వస్తు వుల సరఫరా తక్కువగా నున్నపుడు ముఖ్యముగా ప్రజల డిమాండునకు తగినవిధమున సరకు సరఫరా అగుటకు తగినంత వ్యవధి లేనప్పుడు, కొనువానికి ధనమందు ఉండు అంత్యోపయుక్తియే వెలను నిర్ణయించును. యానసౌక ర్యములు ప్రబలినకొలది అంగడి లేక మార్కెట్టుయొక్క పరిమితి విస్తరించుచున్నది. తామపేక్షించు వస్తువులు కొంతకాలవిలంబమైనపిదప తయారైనను మనదేశమం దలి వినియోజకులు వేచియుండగల్గినచో అన్యదేశవాడు లగు ఉత్పాదకులు తమవద్ద సిద్ధముగానున్న సరకుతో సంతృప్తినొందక నూతనోత్పాదకవిధానముల నవలం బించి సరకుల సరఫరా జాస్తీచేయుటకవకాశముండును. వస్తువుల ఉత్పత్తి అధికవృద్ధిన్యాయము ననుసరించి నచో మొత్తముమీద తక్కువపెట్టుబడికే వస్తువులు ఉ త్పన్నమగును. కావున అవి మునుపటికన్న చౌకధరలకు విక్రయింపబడుట కవకాశముకల్గును; పోటీయున్నను వస్తునిర్మాణమునకు వాస్తవముగా ఎంతసొమ్ము వెచ్చింప బడునో ఇంచుమించుగా ఆ మొత్తము ననుసరించియే వస్తువుయొక్కవెల యేర్పడుట తటస్థించును. కాని ఆర్థి కాభివృద్ధి సూచకంబగు పరిస్థితులు ప్రబలియున్నపుడు ఉత్పాదకుని కగుకర్చుమొత్తము ఆవస్తువు విక్రయింప బడువెలకన్న కొంచెమైన తగ్గియుండును. ఏది ఎటు లైనను కాలవ్యవధి అధికముగా నున్నపుడు వస్తువుల బజారువెలలు ఉత్పాదకుని కర్చులమొత్తపు దిక్కునకే జారుచుండుననుట నిశ్చయము. వస్తువుయొక్క బజారు ధర, దానిని తయారుచేయుటకు ఉత్పాదకుని కగుకర్చు, ఈ రెండుమొత్తములు సమానముగా నుండకపోవుటకు కారణమేమన లాభముండకపోవుటయే. ఒకానొకప్పుడు పదార్థోత్పత్తికగుకర్చు బజారుధరకన్న అధికరించి యుండుటకు కారణములుకలవు. వినియోజకుల అభిరు చులు మారిపోయి ఒకానొకవస్తువునకు పూర్వమందుం డెడు 'డిమాండు' సన్నగిల్లినందున పూర్వపుధరల కా వస్తువును కొనుటకు వినియోజకు లిష్టపడకపోవచ్చును; వినియోజకుల నడవడికలు, అభ్యాసములు, అభిరుచులు ఒకేతీరున ఉండుననియు, పూర్వపుమాదిరి వస్తువులనే కొందురనియు ఉద్దేశించి విస్తారోత్పత్తిచేయు ఉత్పా దకులకు నష్టమునకైన లోబడి తక్కువధరల కావస్తువు లను విక్రయించుటకన్న వేరేగతిలేకపోవచ్చును. ఇంతే కాదు. కారుచౌకధరలకే మొదట వస్తువిక్రయము జరి గినగాని వినియోజకుల 'డిమాండు' నాకర్షించుట (అవ గా వారికి వస్తువులయందభిలాష పొడమునట్లుచేయుట) పోటీవేసి ఇతర ఉత్పాదకుల నొకానొక మార్కెట్టు నుండి పారదోలి తామే ఆ మార్కెట్టును అందలి విని యోజకులను లోబరచుకొనుట తటస్థించవని కొందరు

ఉత్పాదకులు మొదటనష్టమునకైన ఒప్పుకొని అతి తక్కువధరలకు సరకును విక్రయించవచ్చును. ఒకానొక వస్తువిక్రయమందు మీదచెప్పినవిధమున ఉత్పాదకులు తక్కువధరల కొడంబడినను ఇంకొకవస్తు విక్రయమున ఆ నష్టమును భర్తీచేయగలలాభము తీయవచ్చును; లేదా, పోటీవేయగల్గిన ఇతర ఉత్పాదకులు ఆమార్కెట్టును వదలి వేయుటయేకాక ఆ వస్తువులను తయారుచేయుటయే మానివేసుకొనినపిదప, మొదట చౌకధరలకు విక్రయించి నష్టపడియున్న ఉత్పాదకులు సమయోచితముగా వెలలను పెంచి విశేషముగులాభమునుపొందవచ్చును. ఇంతేకాదు; కొన్ని దేశములసేలెడుదొరతనములు తమ దేశపరిశ్రమల నభివృద్ధి చేయుటకై దేశీయవర్తకు లన్యదేశముల కెగుమతిచేయు కొన్నిసరకుల విషయమున "బౌంటీస్" అనబడు బహుమానముల నిత్తురు; అప్పుడు ఆయుత్పాదకులు తమకు వాస్తవముగా వస్తునిర్మాణమునకగు కర్చుకన్న వెలలను తగ్గించినను వారికి నిజముగా నష్టముండదు; బౌంటీస్‌వలన లభించెడు ద్రవ్యము ఆ నష్టమును భర్తీచేయును.

8. మన హిందూదేశపు బట్టల మార్కెట్టు విషయములు

వీటి నింపుక జాగ్రతగా గమనించినచో మీద పేర్కొనబడిన ఆర్థికతత్త్వము చాలవరకు విస్పష్టమగును. పూర్వము మనదేశపు కృషికుడు తనకు బట్టలు కావలసినప్పుడు తనగ్రామమందున్న సాలెవానికి ప్రతి పంటకాలమందు కొంచెము ధాన్యాదులనిచ్చి నలయు బట్టలను కొనుచుండెను; సాలెవాడు తనచేతులతో నేయ కల్గినట్టియు వానివద్ద హాజరుగా నుండదగు బట్టలకన్న వేరుబట్టలు మనకృషికుడు కట్టి ఎరుగడు. వాటి వెలలు హాజరుగానున్న మోటుబట్టల సరఫరానుబట్టియు కృషికున కుండు ఆవశ్యకతనుబట్టియు నిర్ణయింపబడుచూ వచ్చినవి. ఇప్పుడో వ్యవహారచక్రమంతయు మారినది. మనకృషికుడు సాలెమగ్గములసహాయ్యమున స్వదేశములో నేయబడిన మోటుబట్టలనుగాని సన్ననిపాట్నూలు బట్టలనుగాని కొంచె మెక్కువవెలలను చెల్లించి కొనవచ్చును; లేదా ఇంగ్లాండు లేక జపాను దేశములో యాంత్రిక సాహాయ్యమున ఫ్యాక్టరీలలో విస్తారోత్పత్తి సూత్రానుసారము తయారుకాబడు సన్నని నాజూకు బట్టలను తక్కువవెలలకు కొనవచ్చును. అధికవృద్ధి న్యాయానుసారము 'మాంచెస్టరు' లేక 'జపాను' మిల్లులలో ఉత్పాదితంబగు విదేశవస్త్రములు స్వదేశవస్త్రములకన్న సన్ననినూలుతో నేయబడి నాజూకుగా నుండుటయేకాక చాలచౌకధరలకు కూడా లభించుచున్నవి. గడచిన ముప్పదిసంవత్సరముల నుండియు మన దేశపుమిల్లులలో యంత్రసహాయమున నేయబడు బట్టలుకూడా సాలెవారి నేతబట్టలతో పోటీ వేయుచున్నవి. యంత్రకళలం దారితేరిన విదేశవర్తకుల ప్రాబల్యమునంజేసియే మన దేశపు సాలెవారి హస్తకళలు విదేశపు పోటీయొక్క ధాటీ కోర్వజాలక గత 19-వ శతాబ్దమందే క్షీణించినవి. అయితే 1914-వ సం॥న నారంభమైన ఐరోపామహాసంగ్రామమునంజేసియు దాని ఆర్థికఫలితములం జేసియు విదేశవస్త్ర ప్రాబల్యమున కకస్మాత్తుగా అభ్యంతరము లేర్పడినవి. మహాసంగ్రామ కాలమందు అమెరికా దేశపుప్రత్తి వెల లధికరించుటవలనను, కార్మికులకు వేతనములు విశేషముగా నివ్వవలసినకారణమునను, ఉత్పాదకులకగు ఇతరఖర్చులు ఎక్కువగుటవలనను, ఓడలమీద సరకునెక్కించి ఎగుమతిదిగుమతులొనర్చుట కివ్వబడు కేవు కూలు లధికరించుటం జేసియు, ఇన్‌ష్యూరెన్సుచార్జీలు జాస్తిఅగుటచేతను(అనగా నూటి కింతయని యిచ్చి, సరకులు మొదలగువాటికి అపాయమువచ్చినయెడల వాటివెల అంతయుకంపెనీవారు అచ్చుకొనునట్లు ఒడంబడిక చేసుకొనుటకగు కర్చు జాస్తిఅగుటచేతను—సంగ్రామకాలమందు సముద్రయానము ఎగుమతి దిగుమతులు తరుచుగా అపాయములపాలగుటవలన ఇన్‌ష్యూరెన్సుకంపెనీలు అభయపుచీట్లనిచ్చుటకుజాస్తి రుసుములు పుచ్చుకొనుచుండిరి) మన దేశమునకు దిగుమతి చేయబడు విదేశవస్త్రములవెలలు మిగుల పెంచబడినవి. అదేకాలమందు యుద్ధపువ్యవహారములకై అకస్మాత్తుగా నమితమగు బంగారము వెండి కావలసినందున ప్రశస్తలోహముల పూర్వపువెలలు తారుమారై చాల దూరము హెచ్చింపబడినవి; అధికఫలాపేక్షచేత వర్తకులు సాహసవ్యాపారము చేయదొడంగిరి. మన దేశములో సీమబట్టల వెలలు హెచ్చినవి; విదేశవస్త్రములను దిగుమతి చేయుటయే గుత్తవ్యాపారముగ స్వీకరించిన కొందరు,

మార్వారీవర్తకులు అమితమగు లాభములను పొందుచుండిరి. హిందూదేశములో చాలభాగములందు బట్టలకు కరువు కలిగెను. మాంచెస్టరు మొదలగు విదేశస్థలములందు యంత్రకళలు క్రిందుపడినందున సీమబట్టలవెలలు మిక్కిలి జాస్తి అయినవి. 1703 వ నంబరు తాను ఒకానొకప్పుడు 8 రూపాయలకు దొరకుచుండినను మహాసంగ్రామ కాలమందు రూ 24 వరకు పొడిగించబడెను. 1702 వ నంబరు తాను, ఇతర నోటుసీమబట్టలు వీటి వెలలుకూడ సామాన్యపు టంతస్థులుగల కుటుంబీకు లివ్వలేనంత ప్రియము లయినవి. బట్టలడిమాండునకు తగినవిధమున మనదేశపు సాలెమగ్గములు పనిచేయలేకపోయినవి. సమయ సంజీవివలె మనదేశమం దవతరించిన సహాయనిరాకరణోద్యమమును స్వీకరించిన కాంగ్రెసుమహాసభవారు విదేశవస్త్రములను బహిష్కరించి ఖద్దరుబట్టలనుకట్టుకొనుడని ఎంత యుక్తియుక్తముగా ప్రజలకుబోధించినను దేశాభిమాన వర్గమువారిలో కొంతమంది మాత్రమే ఖద్దరు ధారణమున కొడంబడిరిగాని మొత్తముమీద దేశమునకాయాందోళనము రుచించినట్లు తగినన్నిలక్షల ప్రత్యక్షనిదర్శనము లేర్పడవయ్యె.

ఖద్దరు బట్టలనుధరించెడువారిసంఖ్య అతిస్వల్పముగా నుండెను. సన్ననిజాన్నాలను నాజూకుగా కట్టుకొనుట కలవాటుపడినవారనేకు లట్టిదేశపు బట్టలకు కరువుకల్గినను ఎక్కువవెలల నిచ్చి వాటినే కొనుచుండిరి. దేశాభిమానపుమాట లొకవంకనుంచి వాస్తవముగు ఆర్థికవిమర్శన మొనర్చినచో తేలెడుఘోషితమేమన:మామూలు వెలలకన్న సీమబట్టలవెల లధికరించియుండినను ఖద్దరుబట్టలవెలలకన్న తక్కువగా నుండుటవలన చాలమందిజనులు ఖద్దరు నామోదింపలేదు; ఖద్దరుబట్టలు గట్టిగా నుండుటయేకాక కట్టుపిడుపుల కోర్చ గ్గినంతవిగా నున్నను పాశ్చాత్యవ్యామోహము ప్రజలను విడనాడనందునచాల మంది ఖద్దరుకట్టుటలేదు. అంతేకాదు దేశపుప్రజలకంతరకు చాలునంతఖద్దరుబట్టలను నేయగల్గినసాధన సామగ్రి ఆయత్తపరచుటకష్టముగానుండెను! ఇంకొకరహస్య మేమన రాజకీయ కారణములంజేసి అనేకులు ఖద్దరుబట్టలను కట్టుటకు భయపడి సీమబట్టలను అమ్మెడువారికే ఎక్కువవెలలు సమర్పించుచు వచ్చిరి. బొంబాయి మిల్లులలో తయారుకాబడు బట్టలుకూడ డిమాండునకు తగినన్ని మార్కెట్లకు వచ్చుటలేదు; కారణమేమన బొంబాయిమిల్లు ప్రొప్రైటర్లు విస్తారోత్పత్తిమాత్ర మవలంబించి దేశమందలి బట్టలడిమాండును సంతృప్తి పరచగల్గినంత బట్టలసరఫరా చేయుట కెంత ప్రయాసపడినను కావలసిన యంత్రోపకరణములు మహా సంగ్రామాంబుధిలో మునిగియున్న పాశ్చాత్యదేశములనుండి తెప్పించుకొనలేక పోయిరి. అదేకాలమందు నూలుఅమ్మెడువర్తకులు ఖరీదులను పెంచుటయేకాక తమవద్దనున్న సరకులను అమ్మనొల్లక అధికలాభముల నపేక్షించినవారై నూలుబస్తాలను కొట్లలో దాచబెట్టుకొనిరి. మీద పేర్కొనబడిన కారణములంజేసి బట్టలమార్కెట్టు పరిమితి తగ్గిపోవుటయే కాక, బట్టలకుండు గిరాకినిబట్టియు, కొనువారి అభిరుచులు, శక్తి వీటినిబట్టియు బట్టలవెలలు నిర్ణయింపబడజొచ్చినవి. అదేకాలమందు హిందూదేశపు అపక్వపదార్థములను విశేషముగా పాశ్చాత్యుల కమ్ముటవలన లభించెడు ద్రవ్యముతో బట్టలు మొదలగువాటిని కొనుచుండెడు కృషికులపాలిటి పెనుభూతముంబోలిన ఐరోపా మహా సంగ్రామమునంజేసి పాశ్చాత్యులీదేశపు అపక్వపదార్థములను పూర్వమువలె ఎక్కువగా కొనలేకపోయిరి. కొంత కాలమునకు పిదప ఈ దేశపు అపక్వపదార్థములను పాశ్చాత్యులు కొనుట కారంభించినను బట్టలవెలలకుతగిన ఎక్కువధరలు అపక్వపదార్థములకురాలేదనియే చెప్పవచ్చును. వ్యవహారచక్రమికమీదట ఎట్లుప్రక్రమించునో నిర్ణయించుట విషయాంతరము.

మీదచెప్పబడినసంగతులు సాధారణసంభవములు. వస్తువులవెలలను నిర్ణయించుటకు సరఫరా డిమాండుల సామాన్యసూత్రము నేకాక కాలభేదములను కాలప్రభావములను జనుల అభిరుచులనుకూడ గమనించవలసియుండునని చదువరులు తెలుసుకొనవలెను.

## 9. మనదేశపుటాహారపదార్థములధరలు

18-వ శతాబ్దారంభమందు మనదేశములో ధాన్యాదు లతి చౌకగానుండెనట. 1813-1816 సంవత్సరములలో ఇంగ్లాండునందు ధాన్యాదు లతిప్రియముగానున్నపుడు ఈ దేశమందెంతయో చౌకగా నున్నట్లు తెలియవచ్చుచున్నది. ఆకాలమందు యానసౌకర్యము లంతగా

లేనందున గోధుమలు మొదలగు ధాన్యాదులు ఐరోపా దేశముల కెగుమతి అగుచుండలేదు. 1850-వ సంవత్సరమునకు పూర్వముధరలకు నిలుకడలేక హెచ్చుచూతగ్గుచూవచ్చినవని విమర్శకుల అభిప్రాయము. 1850-వ సంవత్సరమునకుపిదప చాంచల్యమును విడనాడి వెలలొక విధమైన స్థిరగుణమును పొందినవి. 1860 సంవత్సరాంతము మొదలుకొని కాటకములం జేసియు, క్షామములం జేసియు, పరదేశయాత్రలవలనను ఆహారాదులవెలలు హెచ్చుగానే యున్నవి. గత పదిసంవత్సరములలో (1915-1925) వెలలుజాస్తీగానున్నసంగతి అందరకు తెలిసినవిషయమే. ధరలుజాస్తీఅగుటకొక కారణము ధాన్యాదుల మార్కెటు పరిమితివృద్ధినొందుట. పూర్వమువలె కాక మన హిందూదేశపు ధాన్యాదుల నిప్పుడు పశ్చిమఖండవాసులుకూడా కొనుచున్నారు. ఇప్పుడు మన దేశపుపల్లెటూళ్లలో పంటలుసమృద్ధిగా పండినప్పుడు పంటలకాలపుధరలు సాధారణపు వెలలకన్న చాలతక్కువగా నుండుట తటస్థించుచున్నది; ఒక ముఖ్యకారణమేమన ఉత్పత్తిస్థానములందుండి ధాన్యాదులంతటను సరిగాసరఫరాచేయబడుటకు వలయు యానసౌకర్యములు మనదేశములో సరిగాలేవు. లోకమందలిజనసంఖ్యవృద్ధిఅయినందునఅనేక దేశములవారు హిందూదేశపు ధాన్యాదుల నాశించుచున్నారు. ఆంగ్లేయులు మొదలగు విదేశీయులు ఫ్యాక్టరీలలో నుపయోగించు అపక్వపదార్థములను ఎక్కువగా పండించి వారికి ఎగుమతిచేసిననో లాభములు పొందవచ్చునని ఎంచి మనవారనేకులు కొన్ని కొన్ని ప్రాంతములలో ధాన్యాదులకు బదులు ప్రత్తి మొదలగు వాటిని పండించుచున్నారు. ఉత్పత్తి కాండములో వివరించినట్లు ఈదేశములో జనసంఖ్యాభివృద్ధికి తగినంత ఆహారపదార్థాభివృద్ధిలేదు. సాగుబడిభూముల వైశాల్యము తగినంత అభివృద్ధి నొందుచుండలేదు. అందువలననే ఆహారపదార్థముల వెలలు అధికరించి యున్నవి. మన వ్యవసాయపరిశ్రమను సంస్కరించు మార్గముల నన్వేషించుటకొరకు నూతనముగా (1926) ఒక "రాయల్కమీషన్" ఏర్పడినది. వారి పంచాయితీ తీర్మానములు ఆర్థికస్థితిగతుల నెట్లు సంస్కరించునో, ఆహారపదార్థముల వెలల పోతరమున కేమైన విమోచనము రానున్నదో లేదో చదువరులు జాగ్రతగా గమనించెదరుగాక.

(సశేషము)



# పొలములో పచ్చగా వలపె తలలెత్తె

అధికార్ల సూర్యనారాయణరావుగారు, బి. ఏ., బి.యల్.

పొలములో పచ్చగా వలపె తలలెత్తె
జలధిలో నీలమై వలపె పొరలాడె
తెలుపుగా చంద్రులో వలపె వెల్గొందె
భానులో నరుణమై వలపె దీపించె
లలితమై పూవులో వలపె వాసించె

పవనులో పాటయై వలపెచలియించె
బహుళమై నింగిపై వలపె వ్యాపించె
వసుధలో దైన్యమై వలపె నమ్మించె
జానకీ! నీలేతమేనెల్ల నిండి
ప్రాణమై హాయిగా వలపె ప్రవహించె.



# మృత్యుస్వరూపము-అమృతత్వప్రాప్తి యోగసిద్ధి

ముక్తినూతులపాటి గోపాలకృష్ణయ్య గారు

అఖండభూమండలాధిపతులగు చక్రవర్తులును, విపులైశ్వర్యభోగసంపన్ను లగు రాజన్యులును, నిర్వక్రపరాక్రమశోభితులగు శూరాగ్రేసరులును, బుద్ధిజితబృహస్పతు లగు మంత్రిపుంగవులును, మహారాజసంస్థానాస్థానపండితమండలిని జయించిన పండితేంద్రులును, గ్రంథకర్తలును, శాస్త్రజ్ఞులును, సకలజనుల నానందాబ్ధి నోలలాడింపఁగలిగిన వాక్చమత్కృతి గల మహోపన్యాసకులును, శిల్పకళాధురీణులును, దేహబలాఢ్యులును, ధనబలంబునఁ గుబేరునైన తిరస్కరింపఁ గల కోటీశ్వరులును, లోనగు శక్తిసంపన్నులగువా రెంత కాలము జీవించిన, నెప్పుడే నొకకాలంబున, మృత్యువక్త్రంబుఁ బ్రవేశింపవలసినవారలై యున్నవారు. ఇహలోకంబున నెంతసమర్థు లయ్యు, మృత్యువును జయింపఁ గలిగిన సామర్థ్యము లేమింజేసి మృత్యువువచ్చునన్న మాత్రమున భీతులై చేయునది లేక మృత్యువుకు వశవర్తు లగుచున్నవారలు. మృత్యుస్వరూపమును దెలిసికొని, జయించిన ధీరుఁడే జ్ఞానియు, శాస్త్రజ్ఞుఁడును, మానవజన్మసాఫల్యముఁ జెందినవాఁడును నగు మృత్యువును జయింపలేక, యెన్నిశాస్త్రములు జదివినను, నెంత భోగైశ్వర్య మనుభవించినను, ఎంతకీర్తిఁ జెందినను నుపయోగ మేమని యాధ్యాత్మికశాస్త్రజ్ఞులు నుడువుచున్నారు. ప్రాచీనులగు చక్రవర్తులు, రాజులు, ధనసంపన్నులు లోనగువారలు మృత్యుస్వరూపమును దెలిసికొని కడతేరవలెనని తమకుఁ గలిగినవాని నన్నింటిని విడిచి యరణ్యములలోని యాశ్రమములకుఁజని, యచ్చట జ్ఞానసంపన్ను లగు మహర్షుల నాశ్రయించి వారి యనుగ్రహమ్మున యోగాభ్యాసముఁ గావించి లబ్ధసమ్యగ్జ్ఞాన నిష్ఠులై యవిద్యాస్వరూప మగు మృత్యువును జయించి జీవన్ముక్తు లగుచుండిరి. జీవన్ముక్తిదశ నొసంగు బ్రహ్మవిద్యాప్రాప్తికై యెంతటి యైశ్వర్యమును, సుఖమును, భోగమును త్యజించువా రగుచుండినట్లు కన్పట్టుచున్నది.

"శ్లో. మృత్యుర్జన్మవతాం వీర!
దేహేన సహ జాయతే,
అద్యవాఽబ్ద శతాంతేవా
మృత్యు ర్వై ప్రాణినాం ధ్రువః."

శ్రీభాగ. ౧౦, స్కం. ౧ అ.

జన్మించినవారలకు, మృత్యువు దేహముతోడనే కలుగుచున్నది. ఇప్పుడుగాని, నూఱుసంవత్సరములకుఁ బిమ్మటఁగాని, శరీరధారులకు మృత్యువు తప్పక ప్రాప్తించునని, శ్రీశుకులు వారి శ్రీభాగవతమునఁ జెప్పిరి.

ఈయర్థమునే శ్రీకృష్ణ భగవానులు భగవద్గీతాశాస్త్రమున వాక్రుచ్చిరి.

"శ్లో. జాతస్య హి ధ్రువో మృత్యు
ర్ధ్రువం జన్మ మృతస్య చ,
తస్మాదపరిహార్యేఽర్థే
నత్వం శోచితు మర్హసి."

జన్మించినవానికి మృత్యువును, మృతిఁజెందిన వానికి జన్మయును తప్పక కలుగును. ఆకారణమువలన, నియతమైన విషయమందు దుఃఖింపఁ దగదనియు, అయ్యది స్వభావధర్మమనియు నుపదేశించిరి.

కాఁబట్టి జననమరణములు ప్రాణులకుఁ దప్పక కలుగుచుండునుగనుక, ఈ జననమరణ ప్రవాహమునుండి తప్పించుకొనుటయే బుద్ధిమంతుని లక్షణము. మృత్యువు, అనగా, వినాశము, క్షయము, అంతము. ఉత్పత్తియైన పదార్థమునకు వినాశముకలుగుట స్వభావధర్మము. వినాశముఁ జెందినపదార్థము, బీజరూపముగనుండి యుత్పత్తి యగుచుండును. షడ్భావవికారములు కలుగుచుండు మృత్యువు వ్యాధిమూలముగను, క్రూరజంతుమూలముగను, ఇంక ననేకవిధములుగ, కర్మానుగుణ్యముగ కాలము

సమీపించినపుడు ప్రాప్తించుననియు, నెల్లప్పుడు ఛాయారూపముగ శరీరి నాశ్రయించి యుండుననియు బుధులు చెప్పుదురు. ఛాయాపురుషలక్షణముల ననుసరించియు, స్వప్న నిదర్శనములఁబట్టియు, ప్రాప్తించు స్థితిగతులఁబట్టియు, నింతకాలమునకు మృత్యువుగలుగు నని, యనుభవజ్ఞులగు శాకునికులు నుడువుదురు. దీనిం బట్టిమృత్యువు తనపరివారములగు, దుష్టరోగములద్వారా ప్రాప్తించునని తెలియుచున్నది. కొందఱు ఆధ్యాత్మిక శాస్త్రజ్ఞులు, మృత్యువు లేదనియు, నదియొక వ్యాస్తము వలెఁ బైకిరాదనియు, అజ్ఞానము (మోహము) వలనఁ గలుగుననియుఁ జెప్పుదురు. మృత్యువు కలదా, లేదా, యనువిషయము ఈక్రింది విమర్శమువలనఁ దేటపడును:

"శ్రు. ప్రమాదో బ్రహ్మనిష్ఠాయాం
న కర్తవ్యః కదాచన,
ప్రమాదో మృత్యురిత్యాహు
ర్విద్యాయాం బ్రహ్మవేదినః."
"అధ్యాత్మోపనిషత్"

బ్రహ్మనిష్ఠయందు అజాగ్రత గలిగియుండఁగూడదు. అట్టి అజాగ్రత మృత్యువువలె, వినాశకరమని బ్రహ్మవేత్తలు నుడివెదరు. మహాభారతసనత్సుజాతపర్వమునందు, సనత్సుజాతుఁడు ధృతరాష్ట్రున కుపదేశించునపుడు, 'మృత్యువు కలదని కొందఱును, మృత్యువే లేదని మఱికొందఱును జెప్పుదురు. అజ్ఞానులును, విషయాసక్తులును, మృత్యువుకలదనియు, అట్టి మృత్యువును కర్మాచరణముచేఁ దప్పించుకొనవచ్చు ననియు, జ్ఞాననిష్ఠులు మృత్యువే లేదనియు, అజ్ఞానముచే నుండునట్లు కన్పించుననియు నుడివెద'రని చెప్పిరి. ఇట్టిసందర్భములోఁ దమయభిప్రాయమును ఈక్రిందిశ్లోకముచే విశదీకరించిరి:

"ఉభే సత్యే క్షత్రియాద్య ప్రవృత్తే
మోహో మృత్యు స్సమ్మతో౽యం కవీనామ్;
ప్రమాదం వై మృత్యుమహం బ్రవీమి
తథా౽ప్రమాద మమృతత్వం బ్రవీమి."
మహాభారత—సనత్సుజాతపర్వము.

ఓ ధృతరాష్ట్రమహారాజా! సృష్ట్యాదినుండి జరుగుచున్న యీరెండుపక్షములును సత్యములు. మోహమే (మిథ్యాజ్ఞానము) మృత్యువని బుద్ధిమంతుల యభిప్రాయము. బ్రహ్మనిష్ఠనుండి ప్రమాదముఁ జెందుట యనఁగా, అజాగ్రతగనుండుటయే మృత్యువనియు, బ్రహ్మనిష్ఠనుండి తొలఁగక జాగ్రతగనుండుటయే అమృతత్వమనియు (మోక్షము) నాయభిప్రాయమని సనత్సుజాతులు నుడివిరి. వికారముఁ జెందు శరీరాదులకు, మృత్యువు కలుగుఁగాని, నిర్వికారియగు నాత్మకు మృత్యువుగాని, జననముగాని కలుగదని శ్రీకృష్ణభగవాను లీక్రిందిశ్లోకములచే శ్రీభగవద్గీతా శాస్త్రమున వాక్రుచ్చిరి.

"శ్లో. నజాయతే మ్రియతే వా కదాచిత్
నాయం భూత్వా భవితా వా నభూయః,
అజో నిత్య శ్శాశ్వతో౽యం పురాణో
నహన్యతే హన్యమానే శరీరే."
భగవద్గీత ౨ అ., ౨౦ శ్లోకః.

ఈయాత్మ పుట్టువాఁడును, మృతిఁ జెందువాఁడును గాఁడు; ఒకప్పుడుండియు, ఒకప్పుడు లేకుండఁ బోవువాఁడునుగాఁడు. పుట్టుక లేనివాఁడును, నాశరహితుఁడును, ఎల్లపుడు నుండువాఁడును, పురాతనుఁడునగు నీయాత్మ శరీరము చెడఁగొట్టఁ బడుచున్నను చెడఁగొట్టఁ బడకయున్నాఁడు.

"శ్లో. వేదా౽వినాశినం నిత్యం
యఏన మజ మవ్యయమ్."

ఈయాత్మను, నాశము, పుట్టుక, క్షయము లేనివానిగఁ దెలిసికొనుము.

"శ్లో. దేహినో౽స్మిన్ యథాదేహే
కౌమారం యౌవనం జరా,
తథా దేహాన్తరప్రాప్తి
ర్ధీర స్తత్ర నముహ్యతి."
భగవద్గీతా ౨. అ. ౧౩. శ్లో

ఈదేహమునందు, ఆత్మకు, బాల్యము, యౌవనము, ముసలితనము ఎట్లుకలుగుచున్నవో, అట్లు దేహాంతరప్రాప్తి కలుగుచున్నను, బుద్ధిమంతుఁడు మోహమును జెందఁడు. ఒకయవస్థపోయి, మఱియొకయవస్థ కలుగునపుడు, ఆత్మ స్థిరుఁడను జ్ఞానముండుటచేత, ఆత్మ నశించెనని కొని శోకముఁ జెందడో, అటులే ఒకదేహమునుండి, మఱియొకదేహమును జెందుచున్నపుడును, జ్ఞాని దుఃఖముఁ జెందఁడని భావము. ఇట్టులు ద్వితీయాధ్యాయము ౧౧-వ శ్లోకముమొదలు ౩౦-వ శ్లోకము పర్యంతము

ఆత్మకు మృతిలేదనియు, శరీరమునకు షడ్భావవికారములు మృతియుఁ గలవనియు ఆత్మానాత్మ విచారము చేసి, జ్ఞాని చింతింపఁడనియు నుపదేశించిరి.

నశించెడు దేహాదులయందు, తానను దృఢాభిమానమునే, నజ్ఞానులు, దేహమునకు వినాశము (మృత్యువు) కలుగనపుడు, తనకుఁ గలుగుచున్నదని మోహముచే దుఃఖింతురు. జ్ఞానులన్నను, 'దేహాదులు నశించు స్వభావము గలవి; ఆత్మ అవ్యయుఁడు, అజుఁడు, పురాతనుఁ' డని స్వానుభవముచేఁ దెలిసికొని దుఃఖింపరు. జడములగు దేహాదులతోడి తాదాత్మ్యజ్ఞానమే మోహము. ఈ అవిద్య సర్వానర్థములకు మూలకారణము ఇది నాదేహము, ఇది నాక్షేత్రము, ఇది నాగృహము అని వ్యవహరించునప్పు డెల్లరకు, తాను వేఱనియు, దేహము వేఱనియు, నేత్రము వేఱనియుఁ దెలియకపోవుదు దృఢాభిమానముచేతను అనేకజన్మాంతరములనుండి కలిగినసంస్కారముచేతను, దేహము నశించుచుండఁగఁ దాను నశించుచున్నానని యజ్ఞాని దుఃఖించును. ఈ దేహాత్మాభిమాన తాదాత్మ్యజ్ఞానము క్లేశమునకుఁగారణము వివేకవంతులు, నిత్యానిత్యవస్తువివేకముచేతను, ఆత్మానాత్మపరిజ్ఞానముచేతను, ఆత్మస్వరూపముఁ దెలిసికొని, జడపదార్థములగు దేహాదులు వికారముఁ జెందుచున్నను (నశించుచున్నను) నిర్వికారులుగ నుందురు. అవిద్యచే మృత్యువును, విద్యచే నమృతత్వము గలుగునని యుపనిషత్తులయందుఁ జెప్పఁబడెను. అవిద్యాస్వరూపము నీ క్రింది సూత్రములచే, పాతంజలయోగశాస్త్రమునఁ జెప్పఁబడియె.

"సూ. అనిత్యాఽశుచిదుఃఖానాత్మసు,
నిత్యశుచిసుఖాత్మఖ్యాతి రవిద్యా"

౨ పాదము, ౫ సూత్రము.

అనిత్యములయిన వస్తువులయందు నిత్యత్వమును, అపరిశుద్ధములైన దేహాదులయందు శుచిత్వమును దుఃఖాదులైన ప్రపంచవిషయములందు సుఖత్వమును, ఆత్మకానిశరీరమునందు ఆత్మతత్వమును భావించుట అవిద్యయనబడు.

మఱియు అవిద్యయనఁగా లేనియంశమును ఉన్నట్లు కనఁబడుచునట్టి యొకవిధమైన బుద్ధి ఇది అనాదిగా ఆత్మనుపట్టియుండు మత్తత. దీనిని బరాకుగానుండుమదగశ (ప్రమాదము) అనవచ్చును.

"సూ. దృగ్దర్శనశక్త్యో రేకాత్మతైవాఽస్మితా."

౨ పా. ౬ సూ.

చిన్మాత్రుఁడైన సాక్షిపురుషుఁడు, రజస్తమోగుణములు లేని శుద్ధసాత్త్వికపరిణామరూపమైన అంతఃకరణము, ఈరెంటియొక్క ఐక్యము అస్మిత యనెడు క్లేశ మనఁబడును.

పురుషుఁడు అజడము, అంతఃకరణము జడము; పురుషుఁడు భోక్త, అంతఃకరణము భోగ్యము, ఇట్లు పరస్పరము భిన్నరూపములైనను, వీనిభేదము తెలియక యుగళు జ్ఞానముచేఁ గలుగు నేననెడు అభిమానము అస్మిత యనంబడును. జడమగు అంతఃకరణమునకును, అజడమగు పురుషునకును పరస్పరభేదము కలిగియుండగా, అభేదాధ్యాసమువలన, నేననెడి దృఢాభిమానము, అస్మితయనఁబడు. ఈ యస్మితక్లేశమునకు అవిద్యయే కారణము. ఈ యనాద్యవిద్యారూపమగు మోహము (మిథ్యాజ్ఞానము) వలన మృత్యువు ప్రాప్తించుచున్నది. అవిద్యానాశమువలన మోక్షము కలుగుచుండును.

ఒక పురుషుఁడు, బాల్యదశమొదలు, వార్ధకదశ వఱకు నేఁడుసంవత్సరముల కొకపర్యాయము (Photo) ప్రతి బింబరూపపటములఁ దీయించి, గోడకుఁ దగిలించి చూచునెడ, నెల్లదశలయందుఁ దానొకఁడే, దేహావస్థ మాఱుచున్నను, ఉన్నాననెడి జ్ఞానముకలిగినట్లు; అనేక జన్మములు కలుగుచున్నను (దేహములు) మాఱుచున్నను తాను యాత్రచేయునట్లు తలఁచునుగాని, తానుమృతిఁ జెందునట్లు (నశించునట్లు) తలంపఁడు.

"శ్లో. వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి,
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ."

౨. అ. ౨౨. శ్లోక.

నరుఁడు, శిథిలమయిన వస్త్రములను, యేప్రకారముగ విడిచి, క్రొత్తవస్త్రములను ధరించుచున్నాఁడో, అట్టులు ఆత్మ శిథిలములయిన శరీరములనువిడిచి, నూతన శరీరములను బొందుచున్నాఁడనియు, ఆత్మ మాఱుట లేదనియు శ్రీకృష్ణభగవానులు చెప్పియున్నారు.

మనము బాల్యమందొక చొక్కాయినిధరించిన సిమ్మట, పెఱుఁగగా నా చొక్కాయి పిగిలిపోవును,

పిమ్మట మఱియొక చొక్కాయిని ధరింతుము. వృద్ధి పొందుచుండగ నా చొక్కాయియును చినిగిపోవును. మఱియొకటి ధరింతుము. అటుల జీవుఁడు కర్మానుష్ఠానముచే, జ్ఞాన మభివృద్ధిఁ జేసికొను కొలఁదిని, శరీరములు మాఱిపోయి శిథిలము లగుచుండును. జ్ఞానశక్తి, యోగశక్తి అభివృద్ధియగుకొలదిని ఈదేహములు సరిపడక యోగశక్తి ధరింపఁదగినట్టి దృఢకాయములు కలుగుచుండు కొందఱికి యోగబలముచే జలాగ్ని వాయువులచే బాధఁ జెందని శరీరములు లభించును. కొందఱికి వైహాయసతత్త్వ మధికము గల సూక్ష్మశరీరములును, కొందఱికి తేజస్తత్త్వ మధికముగల దివ్యశరీరములును లభించుచుండును. ఇట్లెన్ని శరీరములు మాఱుచున్నను, ఆత్మవికారము జెందువాఁడుకాఁడు తపశ్శక్తి యోగశక్తి, అభివృద్ధియగు కొలఁదిని, జీవులాయాశక్తులకనుగుణమగు పాంచభౌతిక దృఢశరీరములను, దివ్యశరీరములును బొందుచుందురు. కొందరు కల్పములచేతను దివ్యౌషధీరసాయనములచేతను దివ్యశరీరముల బొంది తపస్సుఁ గావించుచుందురు. తపోయోగజ్ఞాన సంపన్నులు వారుకోరినట్టి శరీరములఁ బొందుచుందురు. అనవసరమైనచో శరీరముల విడుచుచుందురు. జ్ఞానసంపన్నులగుటంబట్టి, దేహాత్మాభిమానము లేక, జడమగు శరీరమును తమకన్న భిన్నముగఁ జూచుకొనుచు శరీరేంద్రియవర్గమునకు లోఁబడక, దానిని వశ్యముఁ గావించుకొని, సాధనముగ నుంచుకొందురు. వీరలలోఁ గొందఱు విదేహముక్తులుగను, కొందఱు జీవన్ముక్తులుగను నుందురు. అజ్ఞానులును విషయాసక్తులును, పచ్చిచింతకాయవలె నపక్వచిత్తులగుచు, ఈనెలచేఁ జింతకాయ బంధింపఁబడినట్లు ఆశాపాశబద్ధులై విషయముల విడువఁజాలక దేహమునకు నాశము గలిగినపుడు, తమకుఁ గలుగుచున్నదని మోహమును, శోకమును జెందుదురు. పండిన చింతకాయలో ఈనెలు వీడి బెరడువేఱుగను, పండు వేఱుగను, విత్తనము వేఱుగను గన్పట్టుచుండు. పచ్చిచింతకాయ యీనెలచే దృఢముగ బంధింపఁబడినందున, బెరడు, పండు, ఈనెలు, విత్తనము, వేఱుపఱుప వీలుచాలక యభేదముగ నుండునటులు దేహాత్మాధ్యాసయు, విషయాసక్తులగు నజ్ఞానులకు దృఢముగ నుండును. పరిపక్వ చిత్తులగు జ్ఞానులు, స్థూల సూక్ష్మకారణ శరీరములువీడి, వీనితో నభేదజెందక సాక్షిభూతులుగ నుందురు. పండిన చింతకాయపై బెరడు స్థూలశరీరము; లోపలిపండు, ఈనెలు సూక్ష్మము. విత్తనమును, గారణశరీరముగఁ బోల్చుకొనవచ్చును. సమ్యగ్ జ్ఞాననిష్ఠులకు మృత్యువు లేకున్నను, అజ్ఞానులకు మృత్యువు ఉండునుగదా? అట్టిమృత్యువునెట్లు తప్పించుకొనవలయుననిన: మృత్యుంజయారాధనమువలనను, అపమృత్యు స్తోత్రమువలనను, జపమువలనను, నారాయణ కవచపఠనము వలనను, భగవదాశ్రయమువలనను, అందువలనఁ గలుగు భీతి తొలఁగును. మృత్యువునకన్న మృత్యువిక కొలఁదికాలములోఁ బ్రాప్తించునన్న భీతిని శేషముగ బాధించుచుండును. విరాట్ పురుషునియొక్కగుదము మృత్యుస్థానము, ఆగుదస్థానమునకు మృత్యు నధిదేవతయని భావము. గుదస్థానమునుండి మలము స్వాభావికముగా వెడలునపుడు దేహమునకు నైర్మల్యము, ఆరోగ్యము గలుగను మలము వెడలక నిరోధింపఁబడినపుడు, సకలవ్యాధులు జనించి మృత్యువుఁబ్రాప్తించునని ఆయుర్వేద రహస్యజ్ఞులు కనిపెట్టియున్నారు. మృత్యువు ప్రాప్తించుటకుమున్నే, ముఖ్యమగు మలస్థానము నాశ్రయించి, నిరోధించి, యెల్లవ్యాధులు జనింపఁజేయు ఈ మృత్యువెట్లు జనించినదనగా:

"శ్లో. హింసా భార్యా త్వ ధర్మస్య
తయో ర్జజ్ఞే తథానృతమ్,
కన్యాచ నికృతి స్తాభ్యాం
భయం నరక మేవచ
మాయాచ వేదనాచైవ
మిథునం త్విద మేతయోః,
భయా జ్జజ్ఞేఽథ వై మాయా
మృత్యుం భూతాపహారిణమ్.
వేదనాచ సుతం చాపి
దుఃఖం జజ్ఞేఽథ రౌరవాత్."

శ్రీవిష్ణుపురాణమ్, ప్రథమాంశః.

అధర్మునికి, హింస యను భార్యకలదు. వారలకు, అనృతపుత్రుఁడును, నికృతి కన్యయు గలిగెను. వారలకు భయము, నరకము, అను పుత్రులుజనించిరి. భయము అనువానికి మాయవలన సకలభూతముల నాశముచేయు మృత్యువు కలిగెను. నరకము అనువానికి వేదనవలన దుఃఖమును పుత్రుఁడు జనించెను. కాఁబట్టి,

భయమువలన మాయ మృత్యువును జనింపఁజేసినట్లు తెలియుచున్నది. ఈ మాయవలనఁ గలిగిన మృత్యువును జయించుటకై బ్రహ్మవేత్తలు బ్రహ్మవిద్యోపాసనఁ గావించి, మోహమును నాశముఁజేసి, అమృతత్వమును జెందిరి. అవిద్యవలన మృత్యువును, విద్యవలన అమృతత్వమును గలుగును గావున, అమృతత్వప్రాప్తికి సాధనమగు యోగమును, జ్ఞానమును సాధింపవలసి యున్నది. యోగాభ్యాస విషయము పాతంజల యోగశాస్త్రమునందును, యోగోపనిషత్తులయందును యోగవాసిష్ఠ ఘేరండ సంహితాదులయందునుఁ జక్కఁగాఁ బ్రతిపాదింపఁబడియున్నది. యోగమనఁగాఁ జిత్తవృత్తులు నిరోధించుట.

ప్రమాణవృత్తి, విపర్యయవృత్తి, వికల్పవృత్తి, నిద్రావృత్తి, స్మృతివృత్తియని, వృత్తు లయిదువిధములు. వృత్తినిరోధమువలన, స్వస్వరూప స్థితికలుగును. ఇదియ సమాధియనఁబడు. బంధమోక్షములకుఁ గారణమగు, మనస్సును నిగ్రహించుట దుస్సాధమనియు, వాయువును మూటఁగట్టుటపోలె నుండుననియు, అర్జునుఁడు శ్రీకృష్ణభగవానులను బ్రశ్నించినపుడు

"శ్లో. అసంశయం మహాబాహో!
మనో దుర్నిగ్రహం చలమ్;
అభ్యాసేన చ కౌంతేయ
వైరాగ్యేణ చ గృహ్యతే"

ఓ యర్జునా! మనస్సు చంచలమయినదియు, నిగ్రహింపుటకు సాధ్యముకానిదియు ననుటకు సందియము లేదు. అయితే, అభ్యాసముచేతను, వైరాగ్యముచేతను నిగ్రహింపఁ బడుచున్నదని యానతిచ్చిరి. ఇవ్విషయంబునే పాతంజల యోగశాస్త్రమునందుఁ జెప్పిరి.

సూ. అభ్యాస వైరాగ్యాభ్యాం తన్నిరోధః.

అభ్యాసవైరాగ్యములచేత నతిచంచలమగు మనస్సు నిగ్రహింపఁ బడుచుండెడిని. వైరాగ్యము లేక,కేవలాభ్యాసమున్నచో నభ్యసించుకాలమున శాంతముగ నుండి పిమ్మట విషయాసక్తమగును. వైరాగ్యముండి అభ్యాసములేనిచో, భావనామాత్రము గలిగి, స్వాభావిక ప్రవృత్తిచే విషయాసక్తమగును. కాఁబట్టి పక్షికి రెండురెక్కలవలె మనోనిగ్రహమునకు అభ్యాస వైరాగ్యము లత్యంతావశ్యకములు. చిరకాలము విషయారణ్యమందు సంచరించు మనోమత్తేభమును, నిగ్రహించుట కడుదుర్లభమనియు, ఉపాయముచే వశ్యముచేసికొనవలెననియు, శ్రీభాగవతాది గ్రంథములయందుఁ జెప్పఁబడెను

"శ్లో. ధార్యమాణం మనో యర్హి
భ్రామ్యదాశ్వనవస్థితం,
అతంద్రితో ఽనురోధేన
మార్గే ణాత్మవశం నయేత్."

అభ్యాసమునకు మొదట మనస్సు నిశ్చలముగ నిలువదుకాఁబట్టి, అతివేగముగ,పరిభ్రమించుచున్న మనస్సును, నిర్బంధింపక దాని యిష్టప్రకారము కొంతదూరము పోనిచ్చి, త్వరపడక మెల్లగమఱలించి స్వాధీనముఁ జేసికొనవలయును. దుష్టపశువును దానియిచ్ఛగఁ గొంత దూరము పోనిచ్చి, పచ్చికఁజూపి మెల్లగ స్వాధీనపఱచుకొని కట్టివేయవలెను. అటు లేనిచో, కొమ్ములతోఁ జొడిచి, చీల్చి బాధించునుగదా!

"శ్లో. మనోగతిం నవిసృజే
జ్జితప్రాణో జితేంద్రియః,
సత్వసంపన్నయా బుద్ధ్యా
మన ఆత్మవశం నయేత్.
ఏష వై పరమో యోగో
మనస స్సంగ్రహ స్స్మృతః,
హృదయజ్ఞత్వ మన్విచ్ఛ
న్దదాంత స్యార్వతో యథా."

ఇంద్రియములను, ప్రాణమును జయించినవాఁడై మనోగతిని స్వేచ్ఛగా విడువక, ధైర్యయుక్తమయినబుద్ధిచే మనస్సును స్వాధీనపఱచుకొనవలయును. అలవార్చని, గుఱ్ఱమును దానియిష్టమును గనిపెట్టి కొంతదూరము పోనిచ్చి మెల్లగ మఱలించుకొనినట్లు మనస్సును మఱలించుకొనవలయు. ఇది యోగోపాయ సంగ్రహము.

ఇట్లు, కొలఁది కొలఁదిగ వశపఱచుకొనిన మనస్సున కత్యంత నిశ్చలభావముఁ గలుగుట కుపాయమచ్చటనే చెప్పఁబడెను.

"శ్లో. సాంఖ్యేన సర్వభావానాం
ప్రతిలోమానులోమతః,
భవాప్యయా వను ధ్యాయే
న్మనో యావత్ప్రసీదతి."

తత్త్వ వివేచనచే మహదాది దేహపర్యంతము ప్రతిలోమ, అనులోమములచే ననుధ్యానము చేయవలయును. అనఁగా, మనస్సు నిర్మలమై ప్రసన్నతఁ జెందువఱకు ప్రకృతిమొదలు క్రమముగ ఉత్పత్తిని, పృథివిమొదలు క్రమముగ లయమును ధ్యానించుచుండవలయును.

ఉపాయసహస్రముచేతనయినను, మనస్సు విషయాకారతను విడువకున్న నేమి సేయవలయునని ప్రశ్నింపగా:

"శ్లో. నిర్విణ్ణస్య విరక్తస్య పురుష స్యోక్త వేదినః,
మన స్త్యజతి దౌరాత్మ్యం చింతిత స్యానుచింతయా."

గురూపదిష్ట విషయము నే, మాటిమాటికి నాలోచించి యనుసంధానము చేయువానికిని, విషయములందు విసుఁగుఁజెంది విరక్తి నొందినవానికిని, మనస్సు దుష్టస్వభావమును వదలి వశవర్తియగుచున్నది. దేహాది విషయాభిమానమువదలినవానికి శీఘ్రముగా మనస్సుస్వాధీనమగును. యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధులను, నీ యెనిమిది యోగాంగములనఁబడును. మొదటి యైదును యోగమునకు బాహ్యాంగములు; కడపటి మూఁడును అంతరంగములు. ఈవిషయము సంపూర్ణముగా పాతంజలాది యోగశాస్త్రముల వలనను, గురూపదిష్టమార్గమువలనను దెలియఁదగినవి గనుక విస్తరించివ్రాయ ననువుపడదు రేచక, పూరక, కుంభకములను ప్రాణాయామముచేఁ జిత్తముయొక్క సాత్త్వికభాగమును జుట్టుకొనియుండు మలినము (పాపము) నశించుటచే శుద్ధియే వశ్యమగును. అంతఃకరణశుద్ధికి, నాహారనియమమావశ్యకము. రాజస, తామసములగు, కట్వామ్లలవణాదుల విసర్జించి, సాత్త్వికాహారమును సేవించుటచే, నాడీవికాసము కలిగి యోగము నభ్యసించుటకు సులభముగా నుండును.

"శ్లో. నాఽత్యశ్నతస్తు యోగోఽస్తి
నచైకాంత మనశ్నతః;
నచాఽతి స్వప్నశీలస్య
జాగ్రతో నైవచార్జున.
యుక్తాహార విహారస్య
యుక్తచేష్టస్య కర్మసు;
యుక్త స్వప్నావబోధస్య
యోగో భవతి దుఃఖహా"
—భగవద్గీతా, ౬ అ., ౧౬-౧౭ శ్లో.

మితిమీఱి తినువానికిని, బొత్తిగాఁ దినకుండువానికిని, మిక్కిలి నిద్రించు స్వభావము గలవానికిని, బొత్తిగా మేలుకొనువానికిని యోగము లభింపదు. తగిన ఆహారంబును, సంచారంబును గలవాఁడును, కర్మలయందు, తగిన వ్యాపారముకలవాఁడును, తగిననిద్రయు మెలఁకువ గలవాఁడును, దుఃఖమును బోఁగొట్టునట్టి యోగమును బొందుచున్నాఁడు. అన్నింటియందు మితి గలిగియుండవలయునుగాని, అతి కూడదని భావము.

రాజస, తామసాహారములనువిడిచి, సాత్త్వికాహారములను సేవించుకొలఁదిని, లాఘవంబును, మేధాప్రజ్ఞాదిశక్తులకుజ్జ్వలనంబును, అంతఃకరణ వికసనంబును, నాడీసముద యవశ్యంబును గలుగును ఇప్పటి ప్రకృతిశాస్త్రజ్ఞులు, ఔషధరసాయనాదులు లేకయే ప్రకృతి సిద్ధాహారాదులచే, కందమూలాదులచే వ్యాధుల రానీయక సంపూర్ణారోగ్యము గలవారగుచుండిరి. ఆరోగ్యము మహాభాగ్యము. వ్యాధివలన, యోగవిక్షేపము కలుగునని, పాతంజలయోగశాస్త్రమందుఁ గలదు. వ్యాధి లేకుండ నారోగ్యవంతమగు శరీరముఁగావించుటకు ఆహారాదినియమ ముండవలయు. ప్రతివానికిని, గృహమం దేకాంతముగ ధ్యానమందిర ముండవలయు. ఆ మందిరము, నిర్మలముగను, వాయువు, వెలుతురు ప్రసరించునదిగను, భక్తిజ్ఞాన వైరాగ్యసంపన్నుల చిత్రపటము లందుండుటంజేసి, వానింజూచినంతమాత్రమున, మనోనైర్మల్యము, విషయవైముఖ్యత, మనశ్శాంతికలిగించునదిగను, మానసోత్సాహకరముగను నుండవలయు అచ్చట సుఖాసనాసీనుఁడై యేకాంతముగనుండి ధ్యానముఁ గావింపవలయు. ధ్యానమునకుఁ బ్రారంభించినపుడు మనసు పలుపలువిధములుగఁ బరుగెత్తును. స్వాధీనములో నుండదు. చిక్కువెట్టుచున్నను విసుఁగుఁజెందక, గురూపదిష్టమార్గ

మున మెల్లమెల్లగ స్వాధీనపఱచుకొనవలయును. విక్షేపములుగలచిత్తము, స్థైర్యముఁ జెందుటకు, పాతంజలయోగశాస్త్రమునందుఁ గొన్నియుపాయములు చెప్పఁబడినవి.

"సూ. వీతరాగవిషయంచిత్తంవా ౧ పా. ౩౭.
స్వప్ననిద్రాజ్ఞానాలంబనంవా. ౧ పా. ౩౮.
యథాభిమత ధ్యానాద్వా. ౧ పా. ౩౯.

లోకవ్యాపారమందాశయును, ఆవ్యాపారముల (భావనయును) జ్ఞాపకమును, లేనిచిత్తము స్థైర్యమును జెందును. లౌకికవిషయకజ్ఞాపకము చిత్తమునకు రానీయక మఱలించుచుండవలయును. చిత్తైకాగ్రత కలుగును. స్వప్నజ్ఞానమునుగాని, సుషుప్తి జ్ఞానమునుగాని, భావనచేసెడి చిత్త మేకాగ్రతఁజెందును. రమ్యమయిన స్వప్నము గలిగినపుడు దానిని జ్ఞప్తిచేసికొనుచు దానియందు భావము నుంచుకొలదిని ఏకాగ్రతగనుండును. తనకిష్టమగు రామకృష్ణాది రూపములఁగాని, బాహ్యపదార్థములగు చంద్రాదులఁగాని, ఆంతరములగు షట్చక్రనాడీ విశేషములఁగాని భావనసేయుటవలన చిత్తైకాగ్రత కలుగును

ఏకాగ్రతఁజెందిన చిత్తముచే ధారణాధ్యానసమాధులు పొందఁబడును. ధారణయనఁగా, నాభిచక్రాది ప్రదేశములయందు చిత్తమునుఁజలింపకనిలుపుట ధారణయనఁబడును. ప్రథమమున అభ్యాసము నిమిత్తమై ఏవస్తువునందుఁగాని ఏస్థలమునందుఁగాని చిత్తమును నిలిపినచో చిత్తమునకు చలనము కలుగదు. అట్టిస్థితి ధారణయనఁబడును. ధ్యానమనఁగా: ధారణాస్థలమునఁ దానుధ్యానించు వస్తువునకంటె, వ్యతిరిక్తమయినదానిని రానీయక, ధ్యానించువస్తువునుమాత్రమే భావించుట ధ్యానమనఁబడును. అనఁగా, ధారణయందు బుద్ధినునిచి, మఱవకుండుటయని భావము.

సమాధియనఁగా, ముందుఁజెప్పిన ధ్యానము. ధ్యానించువస్తువుయొక్క స్వరూపముగఁ బరిణమించి ధ్యానించుచున్నాననుటను, మఱచిపోవుటయే సమాధియనఁబడుచున్నది. ఒకేవిషయమునందు, ధారణా, ధ్యాన సమాధులు మూఁడునుగూడియుండుట సంయమమనఁబడును ఈ సంయమ మేవిషయమునుగూర్చి కావించినఁ దద్విషయికజ్ఞానము కలుగును. సూర్యునియందుఁ గావించినచో భూర్భువాది చతుర్దశలోకముల జ్ఞానము కలుగును. చంద్రునియందుఁ గావించినచో నక్షత్రసమూహజ్ఞానము కలుగును. ఇటులు భూతభవిష్యజ్జ్ఞానమును, పూర్వజన్మజ్ఞానమును, దేశాంతరజ్ఞానమును గలుగునని పాతంజలయోగశాస్త్రవిభూతిపాదమున విస్తరించి వివరింపఁబడినది.

• ఇట్లు సమాధి సిద్ధించుటచే యోగబలమును, తన్మూలక జ్ఞాననిష్ఠయుఁ గలిగి మృత్యువును జయించి అమృతత్వమును జెందు మహనీయుఁడు, పూజనీయుఁడు. "శ్లో. యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వాఽత్మ శుద్ధయే." అను గీతావాక్యప్రకారము కొందఱు కర్మనిష్ఠులు అంతఃకరణ శుద్ధికొఱకు ఫలాసక్తిని వదలి కర్మల నొనరించెదరు.

"శ్లో. తావత్కర్మాణి కుర్వీత ననిర్విద్యేత యావతా,
మత్కథాశ్రవణాదౌవా శ్రద్ధాయావన్న జాయతే."

ఎంతకాలము విషయములనుండి విముఖుఁడు (విరక్తుఁడు) కాఁడో, భగవంతుఁడగు నాకథను వినుటయందును, శ్రవణకీర్తనాదులయందును శ్రద్ధ కలుగదో, అంతవఱకు కర్మల ననుష్ఠించుచుండవలయునని శ్రీకృష్ణభగవానులు నుడివియున్నారు. సత్కర్మానుష్ఠానము వలనఁగాని, జన్మాంతరార్జిత పాపవాసనాచయము క్షయించి అంతఃకరణ శుద్ధికలుగదు. అంతఃకరణ శుద్ధికలిగినఁగాని, యోగము సాధించుటకు వలనుపడదు. దీనివలన సత్కర్మానుష్ఠానము, అంతఃకరణశుద్ధికిఁ గారణమగుచున్నది. అదియునుంగాక, ఉపాసన (భక్తి) వలనను అంతఃకరణశుద్ధి కలుగుచున్నది. కావున, కర్మ, భక్తి, జ్ఞానయోగములు మూఁడును, అమృతత్వ(మోక్ష)మునకు కారణములగుచున్నవి. హఠయోగ, రాజయోగ, మంత్రయోగ, లయయోగములను నీ చతుర్విధయోగములు అంతఃకరణశుద్ధికిఁ గారణములు.

యోగరహస్యములు, మనశ్శాంతికరసాధనోపాయములు లోనగునవి మత్కృత మానసిక శాస్త్రమునందు విపులముగ విశదీకరింపఁబడినవి; గనుక, ఇచట సంగ్రహముగఁ జెప్పఁబడినవి. దానం జూడనగు.

"శ్లో. లబ్ధ్వా సుదుర్లభ మిదం బహుసంభవాంతే
మానుష్య మర్థద మనిత్య మపీహ ధీరః;
తూర్ణం యతేత నపతే దనుమృత్యు యావత్
నిశ్శ్రేయసాయ విషయఃఖలు సర్వత స్స్యాత్"
శ్రీభాగవతే, ౧౧ స్కంధే.

అనేక జన్మములకుఁ బిమ్మట పున్యావిశేషముచే శ్రేష్ఠమగు మానవజన్మనొంది యే ధీరుఁడు మృత్యువు ప్రాప్తించులోపల అమృతత్వము (మోక్షము) కొఱకుఁ బ్రయత్నింపఁడో వానిజన్మమువ్యర్థము. విషయసుఖము, పశుపక్ష్యాదులకు నంతటఁగలదు. కాఁబట్టి దుర్లభమగు మానవజన్మ నొందినవారు, అంతఃకరణశుద్ధిని బడసి, శ్రీజగదీశ్వరు ననుగ్రహమ్మున అమృతత్వమును బడయుదురుగాతయని కోరుచు, నాపరమేశ్వరుఁడు, యోగీశ్వరుఁడు యోగసిద్ధినిఁ బ్రసాదించుఁ గాతయని ప్రార్థించుచున్నాఁడ.




## అతఁడు ముందు!

పెనుమర్తి వెంకటరత్నము [యువకవిమండలి]

ప్రశ్న

ఇరు లలముకొన్న విపినబంధురపథాల
నొంటరిగ నెచ్చటకుఁ బోవుచుంటివోయి?
చూడ్కి హరియించు నీతమస్సున జ్వలన్మ
ణీనవీన మాధుర్య మేదేనిఁ గలదె?
అతిభయంకర వ్యాఘ్రసంతతుల గర్జ
లవె వినంబడు హృదయశల్యములు తాఁకి
గుండె లవియించు నీకొండ కోనలెల్లు
దాఁటెదవొ యేమొ?-ప్రాణాల బైటపడెదొ!

నేను

నేనొకండన కాదు, మణికిరీట
ధారి, యాపుణ్యమూర్తి పథంబుముందు!
ఆయనంత తేజోరాశిననుగమింతు
దుర్నిరీక్ష్యరోచి స్సంతతుల వెనుబడి.

అతఁడు ముందు! నే నాతని ననుసరింతు
ఛాయవోలె చంద్రునివెంట శర్వరివలె
అతని మురళీరవోద్గతగతులలోన
నాదు కంఠస్వరంబు వెన్నాడియుండు!

అతని పదమంటి నాపద మరుగుచుండు
అతని దీప్తుల నీకాంతి కుతుకమొందు
అతఁడు ముందు నేనాతని ననుసరింతు
ఛాయవోలె చంద్రునివెంట శర్వరివలె!





చెన్నరాజధానియందు ౧౯౨౨వ సంవత్సరము

జూలై—సెప్టెంబరు నెలలలో ముద్రితములై ప్రచురింపబడిన

# ఆంధ్ర గ్రంథముల పట్టిక

## పద్యకావ్యము—౧. ప్రబంధము

ఏకాదశీమహిమాసర్వస్వము—కేశిరాజు వెంకట సుబ్బరాయకవి

## ౨. పురాణము

నాగరఖండము తృతీయ చతుర్థ పంచమాశ్వాసములు—జానపాటి పట్టాభిరామశాస్త్రి

## 3. ఇతిహాసము

ఆంధ్రశ్రీమద్రామాయణము—జనమంచి శేషాద్రిశర్మ

,, అరణ్య కిష్కింధా సుందరకాండలు

,, యుద్ధకాండ ఉత్తరకాండ

జైమినిభారత వచనము—ధూళిపాళ యజ్ఞనారాయణశాస్త్రి

## ౪. శతకము

ఒంటిమిట్ట రఘువీరశతకము

కాళహస్తి శతకము—బాణాల వీరశరభేంద్రకవి

కాళహస్తీశ్వరశతకము—ధూర్జటి

కుమారీశతకము—పక్కి వెంకట నరసింహకవి

కృష్ణశతకము—నృసింహకవి

టెంకాయచిప్పశతకము—వావిలికొలను సుబ్బారావు

దాశరథిశతకము—కంచెర్ల గోపకవి

దేవకీనందనశతకము—

నందనందన శతకము—నందివాడ జగన్నాథకవి

నాగానంద చిద్విలాసశతకము—డి. నాగానందస్వామి

నారాయణశతకము

నృసింహశతకము—శేషప్పకవి

ప్రసన్న రాఘవశతకము—వంగూరు ముద్దునరసకవి

భాస్కరశతకము—మాద వెంకయ్య

మానసబోధశతకము—తాడేపల్లి పానకాలరాయుడు

రఘురామశతకము—కడియం సత్యనారాయణ

రామచంద్రప్రభుశతకము—ఆదిపూడి సోదరకవులు

రామచంద్రశతకము—సరికొండ లక్ష్మీనరసింహరాజు

రామతారకశతకము

రామరామశతకము—వెంకటనరసింహకవి

రామలింగేశశతకము—అడిదము సూరకవి

వాసవాంబాశతకము—ఎ. సుబ్బరాయశ్రేష్ఠి

వృషాధిపశతకము—పాల్కురికి సోమనాథుడు

వేంకటేశ్వరశతకము—యన్. సుబ్బరాయకవి

శ్రీరామశతకము—నరహరిశెట్టి ఆంజనేయులు

శ్రీరామశతకము—తాడేపల్లి శ్రీరాములు

సర్వేశ్వరశతకము—యథావాక్కుల అన్నమయ్య

సుమతిశతకము

## ౫. ఇతరములు

ఆంధ్రపద్యరత్నములు—కె. సాంబయ్యశాస్త్రి

ఆంధ్రావలోకనము

దుష్టకష్టస్తుతి—అయాంచ వీరబ్రహ్మాచార్యులు

దైవబలము—అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి

శృంగారము

## వచనకావ్యము - ౧. కథలు

అయిదవతరగతి నాటకములకథలు—వి సుబ్బారాయుడు

ఆర్యకథానిధి—వావిలికొలను సుబ్బారావు

ఆర్యచరిత్రరత్నావళి

(వామనచరిత్రము)

ఏకాదశి—చింతా దీక్షితులు
కాళిదాసనాటకకథలు—చక్రావధానుల మాణిక్య శర్మ
జైమినిభారతవీరులు—మల్లాది లక్ష్మీనరసింహ శాస్త్రి
నాల్గవతరగతినాటకములకథలు—వి. సుబ్బారాయుడు
నీతికథామంజరి—కె వీరమల్లయ్య
మూడవతరగతినాటకములకథలు—వి. సుబ్బారాయుడు
మొదటి " " "
రవీంద్రనాథఠాగూరు రచియించిన కథలు— దివాకర్ల తిరుపతిశాస్త్రి
రాజశేఖరచరిత్రము—కందుకూరి వీరేశలింగం పంతులు
రెండవతరగతి నాటకములకథలు—వి.సుబ్బారాయుడు
" " —యం సుబ్బారాయుడు
హిందూదేశచరిత్రకథలు—వి. సీతారామకృష్ణయ్య

## ౨. నవల

కామరూపిణి—మామిడిపప్పుల వేంకటకృష్ణశర్మ
కొండపల్లిముట్టడి—బుద్ధిరాజు హనుమంతరావు
తపోభంగము—బలభద్ర కోటయ్య
దైవానుకరణము—రాజా యం భుజంగరావు
భయంకర నారీపిశాచి—వి. మల్లప్పరాజు
రత్నాబాయి—బూదూరు రామానుజులురెడ్డి
వసుమతి—కనుపర్తి వరలక్ష్మమ్మ

## 3. చరిత్ర

కళింగదేశము—విక్రమ దేవవర్మ
బ్రిటిష్‌చరిత్రము ప్రథమభాగము—వి. శ్రీనివాసరావు
హిందూదేశచరిత్రము—వి. రామమూర్తి
హిందూదేశ చరిత్రము—ఆర్. శేషగిరిరావు; వి. అప్పారావు

## ర. జీవితము

అల్లూరి సీతారామరాజుచరిత్ర—వై. కృష్ణరావు
దేశబంధు చిత్తరంజనదాసు జీవితము—కోన వెంకట రాయశర్మ
పెదసింగుస్వామి, సీతారామస్వామిగార్ల జీవితచరిత్ర—పెదసింగు వెంకటనారాయణ
బుద్ధుడు—యం. సీతారామరావు
వాల్మీకిః (సటీక)—కాశీ కృష్ణాచార్యులు
వివేకానందస్వామి జీవితబోధనలు
సౌందర్యజీవితము—వడ్డెపాటి నిరంజనశాస్త్రి

## ౫. ఇతరములు

అగ్నికులక్షత్రియమహాసంఘము
మచిలీపట్టణము సప్తమవార్షికచరిత్ర
అభిమన్యుడు—డి. సీతారామరావు
ఆంధ్రబాలబోధ—జోస్యుల నారాయణమూర్తి
ఆంధ్రరాష్ట్రజాతీయోపసంఘ ఆడిటరుగారి నివేదిక
ఆశ్రమచతుష్టయము—హరి బాపయ్యశర్మ
ఇహపరసాధని (సటీక)—యన్. లక్ష్మీనరసింహయోగానందస్వామి
జంతుశాస్త్రము-ప్రథమపాఠపుస్తకము— కె. సీతారామయ్య
జడభరతుడు—పులుగుర్త లక్ష్మీనరసమాంబ
తూర్పుఆఫ్రికా నరభక్షకసింహములు—కరవది రామకృష్ణారావు
ద్రోణచరిత్ర—చావలి శ్రీరామశాస్త్రి
నవగ్రహమండలబింబములు
నోములకథలు
పంటపొలము
పుష్పరసంచిక
ప్రకృతిబోధకవాచకము—వి. కృష్ణమాచార్యులు
ప్రాథమిక పాఠశాలలో వాచకము నేర్పు పద్ధతి—మూసాక్ రాబర్ట్సన్
బాలశిక్ష—యం. యస్. హరిహరఅయ్యర్
బ్రాహ్మణధర్మవ్యాఖ్యానములు—పి. లక్ష్మీనారాయణ
భజగోవిందశ్లోకములు (సటీక)
భద్రాచలయాత్ర
భారతసుధ—డి. సీతారామారావు
యయాతిచరిత్ర—వారణాసి వెంకటనరసింహశాస్త్రి
లోకజ్ఞానము, ఐదవతరగతి—జి. వి. రామమూర్తి
వృక్షశాస్త్రము, రెండవభాగము—కె. రంగాచారి
వ్యాసావళి, ప్రథమభాగము—ఆర్. వేంకటశివుడు
శాస్త్రవిషయములు—ఆపండి వెంకటశాస్త్రి
శృంగారవల్లి—పి. రామచంద్రయ్య

సరస్వతీవాచకము (మూడవతరగతి) గద్య పద్యముల టిప్పణి
సివిక్సు-మాన్యుయల్—యం. సుబ్బారాయుడు
సీతారామచిద్విలాసము—వై. సీతారామస్వామి
స్త్రీలవ్రతకథలు

## నాటకములు

అర్జునవిజయము—కోలాహలము బలరామరాజు
ఆర్టబాను—మల్లెల డేవిడ్
ఉత్తరరామచరితము—పామర్తి సూర్యప్రకాశశర్మ
కాంతామతి—గూడూరు కోటీశ్వరరావు
కురుక్షేత్ర సంగ్రామము—త్రిపురనేని రామస్వామి
చంద్రకాంతనాటకము—అవసరాల శేషగిరిరావు
చంద్రగుప్త—శ్రీపాద కామేశ్వరరావు.
జయప్రద—ములుగు చంద్రమౌళిశాస్త్రి
పాండవవిజయము—తిరుపతి వేంకటేశ్వరకవులు
ప్రసన్న కృష్ణదేవరాయ విజయము
బంగన్‌బకావలి అను భువనమోహిని—అయినాపురపు సుందరరామయ్య
బుద్ధ
బృహద్బలవ్యాయోగము—మొసలికంటిహనుమంతరావు
భోజరాజవిజయము—కవిరాజు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి
మారుతిమైరావణ సంగ్రామము—గూడూరు కోటీశ్వర రావు
మేవాడుపతనము
రత్నకేతనవిలాస నాటకము—కె. కోటంరాజు
రాజసూయము—బి. సోమనాథశాస్త్రి, పట్టాభిరామ శాస్త్రి
రాణీసంయుక్త—అవసరాల శేషగిరిరావు
రామదాసు బందిఖాన
రోహిణీసుధాకరవిజయము—హోతా వెంకటకృష్ణయ్య
లంకాదహనము—అవసరాల శేషగిరిరావు
లక్ష్మణమూర్ఛ—సోమరాజు రామానుజరావు
వరవిక్రయము—నాటక సరస్వతి
విరాటపర్వ నాటకము: ఉత్తర గోగ్రహణము—డి. వెంకయ్య
శిబిచక్రవర్తినాటకము—మాధవరపు రామదాసు
శ్రీ కృష్ణతులాభారము—పోతుకూచి సుబ్బయ్య
సంగీత జయంతజయపాలము—హనుమంతవఝ్ఝల జగన్నాథశర్మ
సంగీత జయంతజయపాలము—
సత్యహరిశ్చంద్రనాటకము—కాశీనాథుని వీరమల్లయ్య
సాక్షి (గోష్ఠీ వనమాహాత్మ్యము)—గోమఠం రామానుజాచార్యులు
సీమంతిని—ములుగు చంద్రమౌళిశాస్త్రి
హనుమద్రామసంగ్రామము—ద్రోణంరాజు సీతారామ రావు

## ప్రహసనము

కనకాంగి
క్రొత్తయల్లుడు—శ్రీపాద కామేశ్వరరావు
గుంటూరుగుంట—బద్దిరెడ్డి కోటీశ్వరరావు
గుమ్మైన బెజవాడరవ్వ అను త్రిపురాంబ—కాళహస్తి సూర్యప్రకాశరావు
చలాచల్ పాలకొల్లుభామ
చీట్లాటషోక్—భువనగిరి పరదేశి సోమయాజులు
నాగామణిఫార్సు—పి. సోములు
ముసలిమగడు, పడుచు పెండ్లాము—బద్దిరెడ్డి కోటీశ్వర రావు
మోహలత—వాడపల్లి నారాయణమూర్తి
విజయనగరం వింత లేక కళావరు రింగు—కాళహస్తి సూర్యప్రకాశరావు
వేశ్యాలాలన—చావలి వెంకటరత్నయ్యశర్మ
సర్వజననీతిబోధనచేయు అగ్రికల్చర్ నాటకము—పేల చిన్న ఓబులరెడ్డి
సున్నపుబొట్లు—శిష్టా రాధాకృష్ణయ్య
సుబ్బిశెట్టి దిక్భ్రాళి

## గణితము

గణితసంగ్రహము—డి. రామమూర్తి
తెనుగులెక్కలబాలశిక్ష—వై. మల్లయ్య, టి. వెంకట రెడ్డి
బాలగణితబోధిని

## వైద్యము

జీవధనరక్షణి—జి. వి. రంగయ్యానాయుడు
పథ్యాపథ్యమంజరి—కందుల లక్ష్మీపతి

## మతము

ఆమస్ మహాత్ముడు—యస్. యస్. సుబ్బయ్య

## వేదాంతము

అధ్యాత్మరామాయణము — కోటమరాజు నాగయామాత్య
తత్త్వదీపిక—మహావాది వెంకటరత్నము

## స్తోత్రము

ఆంజనేయతారావళి—దామచర్ల వీరరాఘవయ్య
కనకదుర్గాంబా స్తోత్ర దండకము—ఉద్దండం లక్ష్మీనారాయణ
జగన్నాయికా స్తవము—యన్. వీరరాజు
త్రైలోక్యమోహన కవచము
త్రిపురసుందరీస్తోత్రము—
త్రిపురాస్తవరాజము (సటీక)
పంచముఖివీరహనుమత్పంచవింశతి—కంభంమెట్టు శోభనాచలపతి రావు
మత్తిలి శ్రీరామస్తోత్రము—చింతలపూడి లక్ష్మణరావు
లక్ష్మీనారాయణ స్తవరాజము — లింగం లక్ష్మీజగన్నాథరావు
లక్ష్మీనృసింహస్తోత్రము (సటీక)—శ్రీశంకరాచార్య
వెంకటేశాక్షరమాల—రామానుజ
వేదగిరి నృసింహస్వామి దండకము
శోభనాద్రీశ్వరదండకము—ఆర్. వెంకటరామ సుబ్బయ్య శాస్త్రి
శ్రీనారాయణకవచము
శ్రీరామదండకము—చట్టి రామారావు
సరస్వతీదండకము—సి. వీరేశ్వరరావు
హరిహర నామావళి

## కల్పము

అశ్వత్థవ్రతకల్పము (సటీక)
ఆకాశదీప వ్రతకల్పము (సటీక)
ఆబ్దికశ్రాద్ధవిధి (సటీక)
ఉపనయనక్రమము (సటీక)
విఘ్నేశ్వరపూజ (సటీక)
వినాయకవ్రతకల్పము (సటీక)
వ్రతరత్నావళి (సటీక)
సంధ్యావందనము (సటీక)

## యక్షగానము

గరుడాచలము యక్షగానము—అహోబలకవి
విప్రనారాయణచరిత్రము—సుందరాపుర మల్లేశ్వరస్వామివారి సేనాకలాపము
గానము—ఆరవల్లి శేషప్పకవి

## హరికథ

కేశవదాసుచరిత్ర హరికథ—వనము శంకరశర్మ
క్రీస్తువిజయధ్వజము—వై. జాన్ యేలై షా

## గేయము

ఆత్మారామకీర్తనలు
ఆనందసుధాలహరి—పోతనబోయన వెంకయ్య
కనకదుర్గావిలాసము మొదటిభాగము—ప్రఖ్య వేంకటసుబ్బమాంబ
గీతాలరంగిణి—వడ్డాది తిమ్మరాజకవి
తారావళి—శీలంపుట్టమరాజుమూర్తమ్మాళ్
దశావతారముల కీర్తన
దశావతారములపాట—బద్దిరెడ్డి కోటేశ్వరరావు
భగవన్నామ సంకీర్తనలు
యడ్లరామదాసుచరిత్రము అను సుజ్ఞానచంద్రిక—యడ్లరామదాసు
రామదాసుచరిత్రము—సింగరి దాసు
రామనామసంకీర్తనము
రామావతారముల పాట—మస్తాన్ షరీఫ్
శైవనామములు—పామూరు సద్గురుమూర్తి
శ్రావణమంగళవారముల పాట

## ౧౭. భూగోళము

చెన్నరాజధాని భూగోళము—దొరస్వామిఅయ్యంగారు

౧౦. నటభూషణ, నటకావతంస, శ్రీయుత స్థానం నరసింహారావుగారు



రోషనార



సత్యభామ (శ్రీ కృష్ణతులాభారము)

రాజకీయము



నీతి





# మంజుల

అనంతపంతుల వెంకటేశ్వర్లు గారు, బి. ఏ., బి. యల్., (భారతీసమితి)

మఱువంబోలునె నన్నుఁ జంద్రవదనా! మర్యాద యొక్కింతయున్
గలువం జెల్లదె? తొల్లి నీసరసపుం జల్పంబు, దళ్కారు నీ
యఱకన్దోయి కటాక్షముల్, ప్రణయకోపావేశముల్, ముత్తెపుం
జిఱునవ్వుల్ గిలిగింతలుం, మనమునం జింతింపుమా మంజులా!

మ. పగలెల్లం బనిఁ బోయి తీవ్రమగు వాగ్వాదంబులం బుద్ధి ని
ల్పగ నే డస్సి గృహంబుఁ జేరి కురిచీపై మేనువాల్పంగ వె
న్కఁగ మెల్లన్ననుఁ జేరి ముద్దుచిలుకా! కంపించుఁ గెంజేతులన్
వగగుల్కం గనుమూసెదిప్డు పలుకే బంగారమా మంజులా!

శా. నీలాబ్దంబులనీటుఁ దాల్పగఁ గురుల్ నీరంబులం దాడి, యా
ప్రాలేయాంశునిభాననాన మెఱుఁగుం భంగించు లేనవ్వుతో
లీలం దేలెడువేళఁ గందుకసుకేళీలోలవై మున్ను, నే
రా, లీలావతి! పైఁటదాఁచి వెదుకం రాఁ బిల్వవో మంజులా!

మ. తలిరుంబోఁడి! యొకప్డు నీవలపుఁ జైదంబుల్ ననుం మోదసం
కలితుం జేయ వరూథినీసమము నిం గావింపనే, నీవుచిం
తిలుచుం, బ్రహ్మణనాయకోపమకు నెంతే నిచ్చగిం; తబ్రమా
విలసద్దివ్యవిమర్శ నౌచితికళా విన్యాస మోమంజులా!

మ. సములే నీ కమరాంగనాతిలకముల్, శారీరశృంగారమా
త్రములే తద్వికచాంబకాదులకె యాత్మత్యాగమున్ జేయు న్యా
సమతుల్; మానవభామినీ తిలకమైనం "వర్ణనాబంధ" చి
త్రములం మెచ్చి వరించుధీమతియొకా త్వత్సామ్య మోమంజులా!




# వేదభూమి

శ్రీ స్వధర్మప్రకాశినీపత్రిక యందు "వేదభూమి" యను పేర ప్రకటింపబడుచుండిన వ్యాసములే యిప్పుడు గ్రంథరూపమును దాల్చినవి. గ్రంథకర్త శ్రీయుత అవ్యాతుని వేంకటాచలపతిరావు పంతులుగారు.

ఆర్యుల ప్రథమనివాసమును గూర్చి అనగా వారి జన్మభూమిని గూర్చి ప్రాక్ప్రతీచీవిపశ్చిద్వరేణ్యులు సిద్ధాంతముల నొనర్చియుండుట సర్వవిదితము. ఆంగ్లేయ పాఠశాలలలో హిందూదేశచరిత్రాధ్యాపకులు పాశ్చాత్య విద్వాంసుల సిద్ధాంతముల ననుసరించి ఆర్యులు మధ్యఆసియా నుండి బయలుదేరి గుంపులుగా నన్నిదిక్కులకును వలస పోయిరనియు, వారిలో కొందరు హిమనగ[illegible]ములను పడమటికొనయందుగల కైబరు బోలను కనుమల గుండా హిందూదేశమును ప్రవేశించి పాంచాలమున నివసించిరనియు బోధించుచున్నారు. పాశ్చాత్యపండితులలో మరియొక పక్షమువారు ఉత్తరధ్రువఖండసిద్ధాంతమును బయల్పరచిరి. సుప్రసిద్ధదేశభక్తులును, మహావిద్వాంసులును అగు బాలగంగాధరతిలకు మహాశయులు సైతము పై సిద్ధాంతము నంగీకరించి గ్రంథమును వెలువరించియున్నారు. ఈరెండుపక్షములవారును ఎవరికిఁదోచిన యుక్తిప్రయుక్తులను వారాధారముగా గొని హేతువాద మొనర్చియున్నారు. కాని యీవిషయ మంతసులభముగ సిద్ధాంతీకరింపఁబడినది కాదని యస్మదాదుల యాశయము.

శ్రీ చలపతిరావుపంతులుగారీ గ్రంథమున పై రెండుసిద్ధాంతములను సహేతుకముగ ఖండించి భరతఖండమే ఆర్యులజన్మభూమియనియు, ఇచ్చటినుండియే పెక్కుమారు లార్యసంతతులు పరదేశముల కేగి యందు స్థిరనివాస మేర్పరచుకొనినవనియు నిరూపించిరి.

వీరివాదమునకు వేదశాస్త్రములును, పాశ్చాత్యచరిత్రకారుల సిద్ధాంతములును, భూగర్భశాస్త్రకపాలశాస్త్రసిద్ధాంతములును ఆధారములుగా గైకొనబడినవి. వీరుదహరించిన శ్రుతిస్మృతి వాక్యముల ననుసరించి యార్యులు పరదేశములనుండి వచ్చి సప్తసింధుప్రాంతముల వాసస్థానములు నేర్పరచుకొనియేయుండినచో వారు తమప్రథమవాసస్థానమును గూర్చియు, యచ్చటి వింతవిషయములఁగూర్చియు ఇందుకైనను ప్రశంసింపక జన్మభూమిని నిరసించునంతటి కృతఘ్నులు కాజాలరని నమ్మవలసియున్నది

అదియునుంగాక వారుహిందూదేశమునకు వచ్చి యిచ్చటియనాగరకజాతుల జయించి స్థానమును బొందగల్గినచో వారు తమగ్రంథములలో నాచరిత్రవిషయములను సగర్వముగా బ్రకటించుకొనకుందురా యను ప్రశ్న కవకాశ మేర్పడుచున్నది.

ఉదాహృతశ్రుతివాక్యములనుబట్టి యార్యావర్తమునందే ప్రథమమున మనుష్యసృష్టి యొనర్పబడినదనియు ఆర్యులు మేఘము, వర్షము, సంధ్యాకాలము మొదలగు వానిని ప్రకృతివలన నీదేశమునందే ప్రప్రథమమున జూచి యానందాతిరేకమున, వానినిగూర్చి గానముచేసినట్లును దెలియుచున్నది. వారిముఖ్యవృత్తియగు వ్యవసాయము, యజ్ఞాదికర్మలు, జీవితవిధానము వీనితత్త్వము గ్రహించినచో భరతభూమియే యార్యులజన్మభూమియని తెల్లమగుచున్నది.

పెక్కురు పాశ్చాత్యవిద్వాంసులు హైందవ నాగరకతాప్రాశస్త్యము నంగీకరింప నిష్టములేనివారై

సంస్కృతభాష సైతము పాశ్చాత్యభాషయగు లిథూని యన్ భాషనుండి యుద్భవించినట్లు వ్రాసియుండిరి. కాని వారిలో గొందరు నిష్పక్షపాతబుద్ధితో సంస్కృతమునకు సకలభాషాజననీత్వము నొసంగకపోలేదు. అట్టి వారల సదభిప్రాయములను సేకరించియు ఫైలాలజీ శాస్త్రానుసారముగాను గ్రంథకర్తలు గీర్వాణికిగల మాతృపీఠమును సువ్యక్తమొనర్చిరి.

ఈసిద్ధాంతములమూలమున హిందూదేశ (సప్తసింధుప్రాంతము) మార్యులకు జన్మభూమియనియు, వారన్యదేశములనుండి యిచ్చటికి వచ్చినవారు కారనియు దస్యులు, కిరాతులు, ద్రావిడులు మొదలగు పేళ్లతో చరిత్రగ్రంథముల బేర్కొనబడినవారు సైత మార్యసంతతులవారేయనియు తేలుచున్నది.

ఆంధ్రులందఱును ఆర్యసంతతి చరిత్రముయొక్క యథార్థస్థితిని దెలియుటకీగ్రంథపఠనము తోడ్పడునని విశ్వసించెదను. వెల 2-0-0. కలికోబైండు రు. 2-8-0. గ్రంథములభించు స్థలము:

మేనేజరు, 'స్వధర్మప్రకాశిని'
బృందావనము, కీల్పాకము, చెన్నపురి.

**మం. వెం. పు.**

" * * *

# నీతినిధి

ఆంధ్రగ్రంథమాలలోని అయిదవకుసుమము నిదియొక అపూర్వమైన నీతిబోధక గ్రంథము. ఎప్పుడో రెండువేల సంవత్సరములకు పూర్వము భారతీయుడైన బ్రాహ్మణుడెవ్వడో దీనిని సంస్కృతమున రచియించెను. ఆగ్రంథమెట్లో మాతృదేశమునుండి టిబెట్టు దేశమునకుపోయి, యచ్చట ఆదేశభాషలో క్రీస్తుశకము కడపటి శతాబ్దివరకును తనజీవము నిల్పికొన్నది. పిదప గుణగ్రహణపారీణులైన విబుధుల విజ్ఞానసంపాదనాకాంక్షవలన ఇది చీనాభాషలోనికిని, పిదప ఇంగ్లీషు భాషలోనికిని బరివర్తితమైనది. ఇంగ్లీషుభాషలోనుండి యిప్పుడది తెనిగింపబడినది. తెనిగించినవారు ఆంధ్రలోకమునకు సుపరిచితులైన బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు.

సృష్టియంతయు నియమబద్ధము. పిపీలికాది బ్రహ్మపర్యంతముగల సృష్టిలో నియమనిబంధనములకు లోబడనిదియు లేదు. అందువలన మానవుడును నియమనిబంధనాబద్ధుడు. హద్దుమీరి ప్రవర్తించెనా, అతడు బహువిధములగు కష్టములకు లోనై యాతని జీవితము విధ్వస్తము కావలసినదే. మానవుని కుత్తమలోకప్రాప్తికి నియమబద్ధమైన యైహికజీవితము ఒకనిశ్రేణి, సోపానపంక్తివంటిది. సోపానక్రమమును నిరూపించునవి జీవితనిబంధనసూత్రములు. బహుకాలసంచితానుభవజ్ఞానసంపన్నులైన జిజ్ఞాసువులుకాని అట్టి సూత్రములను వేయజాలరు. అట్టి దివ్యసూత్రముల ప్రోవే ఈ 'నీతినిధి'.

తండ్రివలె నీతినిబోధించుచు, తల్లివలె ప్రీతితో మంచిచెడ్డ లెఱింగించుచు, గురునివలె నుత్తమధర్మముల నుపదేశించుచు, స్నేహితునివలె హితము చెప్పుచు మానవజన్మమును సార్థకపఱచుటయే యీ 'నీతినిధి' యొక్క పరమోద్దేశము.

అనువాదకులు 'ఆంగ్లభాష నేరనివార' లయినను, 'తీర్చిదిద్ది' నేటితెనుగున నీరచనము చేసిరి. 'ఆంగ్లభాష నేరని' లోపమును యమకాలంకారశోభితమైనవారి మధురశైలి తీర్చినది. రచనమునందలి యందములైన పోకడలచేతను, చక్కని నేటితెనుగుపదములచేతను గ్రంథము చదువుటకింపుగను, మెచ్చుటగనునున్నది. కాని గంభీరోదాత్తభావములు సంకుచితములై చిన్నచిన్నవాక్యములలో నిండి నిబిడీకృతములగుటచేతను, శైలియందలి పలు తెఱంగుల పోకడలచేతను, రచనమునందలి వివిధములైన రీతులచేతను కొన్నికొన్నిపట్ల విపులమైన వ్యాఖ్యానము లేనిదే సుబోధముకాదు. కావున నీగ్రంథమునకు విపులమైన వివరణమున్నచో నమితప్రయోజనకారి యగును.

గ్రంథము రెండువేలయేండ్లక్రిందనే రచియింపబడినదైనను కొన్నికొన్ని విషయములనుగుఱించి యిందలి సూక్తిరత్నము లియిరువదవ శతాబ్దిలో ప్రబలియున్న యభిప్రాయములనే తెల్పుచుండుట గొప్పవిశేషము.

ప్రాతదైనను గ్రంథము క్రొత్తది. అర్థము తెలిసికొని పారాయణముచేయదగిన గ్రంథము; ఆంధ్రభాషకలంకారప్రాయమైనది. వెల రు. ౧-౮-౦
ఆంధ్రగ్రంథమాల; తపాలుపెట్టె నెం. 212, చెన్నపురి.

**ను. సో. శర్మ.**




ఈదిగువ బేర్కొనిన గ్రంథములను
వందనములతో నందుకొంటిమి.

౧. భూతగృహము (భాగము ౨) డిటెక్టివు నవల: గ్రంథకర్త: శ్రీ. సి. సుబ్రహ్మణ్యశర్మగారు; ప్రకాశకులు, శ్రీ వేంకట పార్వతీశ్వరకవులు, ఆంధ్రప్రచారిణీ గ్రంథనిలయము, పిఠాపురము.

౨. దీక్షారామాయణము: గ్రంథకర్త: శ్రీ. భాగవతుల లక్ష్మీపతిశాస్త్రిగారు, రామచంద్రపురం. వెల రు ౦-౧౨-౦

3. జీవధనరక్షణి: గ్రంథకర్త: శ్రీ. జి. రంగయ్యనాయుడుగారు; వెల రు ౧-౪-౧. పుస్తకము వలయువారు 'జీవధనరక్షణి' ఆఫీసు, గూడూరు అని వ్రాసిన బడయగలరు.

౪. మతోద్ధారకుడు: శైవమతోద్ధారకుడగు బసవేశ్వరునిచరిత్ర మీపద్యగ్రంథమున సరసముగవర్ణింపబడినది. గ్రంథకర్త: గంటి జోగిసోమయాజిగారు, బి. ఏ., యల్. టి, ఆదోని. వెల రు ౦-౧౨-౦

౫. అవల, ఒక ఆంధ్రస్త్రీరత్నముచే సరసముగ రచియింపబడిన నవల: ప్రకాశకులు: గౌరాంగసోదరులు, పిఠాపురము. వెల రు ౦-౧౨-౦

౬. శ్రీ ప్రసన్నమార్కండేయము, ఆరంకముల నాటకము: శ్రీ తిరుకోవిలూర్ మహాస్వామి శ్రీకుమార ఆదివరాహాచార్యులుగారు రచించినది. వెల రు ౧-౦-౦

౭. చంద్రరేఖ: అయిదంకముల సాంఘిక నాటకము. గ్రంథకర్త, శ్రీ వల్లూరి శ్రీ పద్మనాభరాజు గారు, బి. ఎ., డి. ఒ., కాకినాడ. వెల రు ౧-౦-౦

౮. ప్రాచీనసాహిత్యము: శ్రీ రవీంద్రనాథ టాగూరు గారి వంగభాషాగ్రంథమున కనువాదము; అనువాదకులు. వి. వి. సుబ్బారావు, టి. రామశర్మగార్లు; (వెల లేదు)

౯. దృష్టాంతశతకము: శ్రీకుసుమదేవ విరచితము. గోవిందరాజు హరిశ్చంద్రరావుగారు వ్రాసిన ఆంధ్రతాత్పర్యమును గలదు. వీరి పేర కాకినాడకు వ్రాసిన పుస్తకము లభించును. వెల ౦-౩-౦

౧౦. రామప్రభుశతకము, ప్రథమభాగము: శ్రీ చిల్లరిగె యోగానందయ్య పంతులుగారు. వలయువారు గ్రంథకర్తగారి పేర రాజోలునకు వ్రాసిన బడయగలరు. (వెల లేదు)

౧౧. కాళికాశతకము: గ్రంథకర్త: శ్రీ గార్లంక వీర వేంకటసత్యనారాయణగారు, బి. ఎ., యల్. టి., (వెల లేదు.)

౧౨. ఖిలాపతుచరిత్ర: గ్రంథకర్త: పన్నీరు సత్యకేశవరావుగారు. వెల రు ౦-౬-౦

౧౩. పాటలరత్నావళి: గ్రంథకర్త: కీ. శే. అక్కిపెద్ది లక్ష్మీనారాయణప్పగారు. ప్రకాశకులు: గుంటూరి రామమ్మగారు, నరసాపురము. వెల రు ౧-౧౨-౦

౧౪. కేథరిన్: గ్రంథకర్త: శరణు రామస్వామి చౌదరిగారు, అమృతలూరు; స్వాతంత్ర్య సేవాగ్రంథమండలి ప్రథమకుసుమము. వెల రు ౦-౬-౦

౧౫. శారదాంబాశతకము. గ్రంథకర్త: సత్తెనపల్లి హనుమంతరావుగారు, దుగ్గిరాల. వెల రు ౦-౪-౦

౧౬. శ్రీ మిత్రశతకము గ్రంథకర్త: ఏనుగు తమ్మిరాజుగారు, తాపేశ్వరము. (అర్ధణాబిళ్ల పంపిన వారికి ఉచితము)

౧౭. రాఘవశతకము. గ్రంథకర్త: జనమంచి సీతారామస్వామిగారు, అనకాపల్లి. వెల రు ౦-౨-౦

౧౮. చతుర్ముఖీ కందపద్యరామాయణము. గ్రంథకర్త: నాదెళ్ల పురుషోత్తమ కవిగారు. (బందరు) వెల రు ౦-౪-౦




‘ఎవరో?’

తొలకరి పిల్లమబ్బొకటి తూరుపుదిక్కునఁ దోఁచి, యంతలో
నలముకొనెం దిగంతముల నాతపతప్త తృణప్రకాండముల్
తలలను మీఁదికెత్తుచు వలాహకదర్శన లోలతర్షరసా
తలమునుండి బైటికి ముదంబునఁ బొంగుచుఁ దొంగిచూడఁగన్.

చ. అవిరళభాస్కరాతప జలాశయశోష విశేషభీతమీ
నవితతి, శంబరాంతరమునం దిరుగాడుచు మేఘఘోషముం
జెవులను దోరఁబెట్టి విని, చేరి తటాకజలోపరిప్రదే
శవిహరణప్రమోదరస సంగతి నింగికి దూఁకె మాటికిన్.

ఉ. రాఁగల పచ్చమేఁతలఁ దలంచి సమంచితమోద మొందుచున్
నాగలి జ్ఞప్తివచ్చిన మనమ్మున నుమ్మలికమ్ముఁ జెందె వ
ర్షాగమకాలమందు వృషభావళి జీవనదాళిఁ జూచుచున్
బాగును నోగు నొక్కటనె ప్రాపిలుగా, పలుమాఱు దేహికిన్.

చ. పడవలఁగట్టి నీటఁ బడవైవఁగ నెంతయు నుత్సహించుచున్
బుడుతఁడొకండు లోనఁగల పొత్తము లత్తఱిఁ జింపుచుండ, నా
దుడుకుతనంబుఁ జూచియును దూషణ సేయక, యెండినట్టిచేల్
తడిసి ఫలించుఁగా యను ముదంబున నేమనె వానితండ్రియున్.

చ. చిటపట నింటిమీఁదఁ బడు చిన్కులు జోలపదంబుఁ బాడ, సం
దిటఁ బువుఁబోలునట్టి తరుణీమృదుదేహ మెసంగుచుండ, దు
ప్పటిముసుఁగందు నిద్రఁగను వర్షపురాతిరి వచ్చెనంచు, ను
త్కట ముదమందసాగిరి జగాన నవీనవధూజనప్రియుల్.

ఉ. ఇందఱు సంతసింప, నొకరిద్దఱు క్రొత్తగ నిండ్లఁగట్టువా
రుందురటంచు సందియము నొందునె మేఘుఁడు, వర్షమిచ్చి యా
నందము నీయకుండునె మనంబులఁ బల్వుర; కీజగంబునం
దందఱమెప్పు నెంతఘనులైనను జెందఁగనేరరేకదా!



# దుర్వారశక్తి విరక్తియే, దోసకారి!

గున్నేపల్లి అక్షయలింగము గారు

కఠిన హృదయుఁడా! నీ వెంత కపట మతివి
నీదు గాఢానురాగమ్ము నిత్యమంచు
నెంచితినిగాని తుదకిట్లు లెన్నరాని
దుస్సహ విచారవార్నిధిఁ ద్రోచివైతు
వంచనించుకేని నెఱుఁగనైతి నకట!

పూర్వకృతపుణ్యపరిపాకమునను నీదు
పొందు లభియించెనని యానందమందుఁ దలఁచి
గారవించితి; నంతియకాని నిన్నుఁ
గనలి యెఱుఁగను బరిహాసమునకునైన
నన్ను వేధింప నింతయు న్యాయ మగునె?

మున్ను గావించు వాగ్దానమును గణించి
తేటపఱిచితి నీపరాధీన వృత్తి
యక్రమమటంచుఁ దప్పానె? యింతమాత్రఁ
గనుకలఁక వానియెడ నీపకళిక వోలె
నద్దిరా! నీకు నపరాధ నైతిఁ గాని
దలఁప నాయెడ దోసమ్ము గలదె? చెపుము!

నన్ను వంచించుటయె ప్రధానముగ నెంచి
పరవధూటీ కటాక్షకింకరుఁడ వగుచు
సంచరించుట సుంతయు సైఁపలేక
మనసుపడి నాఁటిరేయి నీ కనిపియున్న
వలపుజాబైన నీప్రాపుఁ బసయఁ జేసి
సౌఖ్య మిడుమంచు నెంచితి; నంతెకాని
యదియె నీవిరక్తికి హేతువగుచు నిట్లు
దుర్భరవిషాదవహ్నిలోఁ ద్రోయు ననుచు
స్వప్నమందేని నెఱుఁగ నీపాదమాన!

నీమృదూక్తులఁ బాటించి నిలువలేదా?
నీవిహిత కృత్యములయందు ననరు లేదో?
నీమనోభావములఁ గాంచు నేర్పు లేదో?
నీవయోరూపములు మెచ్చి నెమ్మి గనవో?
నీయెడల నేను గావించు నేరమేమొ?

ఎట్లు దుఃఖాబ్ధిఁ ద్రోయ నూహించినావొ?
యౌవనోన్మాదము నను నీ వంపినట్టి
కుటిల సందేశమునఁ గల్గు కొందలమును
మఱవనేర్తునె? యిన్ని జన్మములకైన?

సోదరీభావమునఁ జూచి యాదరింప
నిచ్చగించితి; వౌర! నో రెట్టులాడెఁ
దొల్లిటి ఋణమ్ము చెల్లినఁ జెల్లుగాక!
అనుఁగుఁ జెల్లెలనౌదునే? యక్కటకట!

విమలమతులై గురూపదేశమున నలరు
తత్త్వవేత్తలకేని సాధ్యమ్ము కాదు
చెనఁటివై యెట్లు సంతరించితొ విరక్తి?
దుర్వారశక్తి విరక్తియే, దోసకారి!




శ్లో. యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్.

భారతజాతీయ స్వాతంత్ర్యమున కిహలోకమునం దష్టకష్టముల ననుభవించినను అమరత్వమును బడసిన లోకమాన్య బాలగంగాధరతిలకు పరమపదమును బొంది యారేండ్లు గతించినవి. లోకమాన్యుని షష్ఠసాంవత్సరికారాధనము ఆషాఢ బహుళ అష్టమీ భానువారమున దేశబాంధవులు సలిపి ధర్మనిర్వహణమును జేసిరి. ఆరాధనదినమునందు వక్తలు చేసిన యుపన్యాసములు లోకమాన్యుని మహత్త్వమును సంస్మరింప జేయుటకు దోడ్పడుచున్నను లోకమాన్యుని జీవితసందేశము మృతప్రాయముగ నున్నది. బాలగంగాధరుడు దేశముకొరకు, ధర్మముకొరకు, దైవముకొరకు, ప్రాణమానధనములను త్రికరణశుద్ధిగ సమర్పించి లోకమాన్యపదము నధిష్ఠించెను. తిలకుమహానుభావుడు ధర్మారాధనమునందు జూపిన భక్తిశ్రద్ధలలో శతాంశమునైనను పదవులమీదను సంపదలమీదను, నుద్యోగములమీదనునిలిపి యుండిన ప్రభుత్వకృపాకటాక్షమునకు బాత్రుడై యుండును. తిలకు మహాశయుడు భారతీయులకు లోకమాన్యుడైనను ప్రభుత్వమునకు నింద్యుడుగ నుండెను. సర్. వేలెంటైనుచిరోలు' లోకమాన్యుడు బ్రిటీషు ప్రభుత్వమునకు పరమశత్రువు' అనివర్ణించెను. భారతమాతకు ప్రియపుత్రులు నిరంకుశప్రభుత్వమునకుపరమశత్రువులుగ నుండుట సహజముగదా! లోకమాన్యుడు పొందినసత్కారమునే దేశబంధుదాసు, ఆలిసోదరులు, దేశభక్తవేంకటప్పయ్య, గాంధిమహాత్ముడు మొదలగు దేశభక్తులు పొంది భారతీయులకు పూజాపాత్రులయిరి. నిష్కాములైన దేశభక్తిపరాయణులు ప్రజలకు పూజాపాత్రులగుటయును, ప్రభుత్వమునకు దండనార్హులగుటయును ధర్మవిపర్యస్తమని ప్రపంచేతిహాసములు విశదము చేయుచున్నను మానవులకు జ్ఞానోదయము గలుగకున్నది. దేశోద్ధారకులైన మాజ్జిని గెరిబాల్డి బ్రూసుహాంప్డను వాషింగ్టను, మొదలగుమహానుభావులు రాజద్రోహదండనములకు గురియైనను మానవహృదయమునందు శాశ్వతప్రతిష్ఠను బడసిరి.

మాతృభూమిసేవకై లోకమాన్యుడనుభవించిన దండనములు భారతభూమి నావరించిన ధర్మగ్లానికి నిదర్శనములుగ నున్నవి. లోకమాన్యుని హృదయమునందు ప్రజ్వరిల్లిన త్యాగాగ్ని వారిశిష్యప్రశిష్యుల హృదయములందు సన్నగిల్లి సంశయపరంపరలను

గలుగజేయుట దేశదురదృష్టము. లోకమా
న్యుడు యథోచిత సహాయవాది యనియును,
సహాయవాది యనియును, అసహాయవాది
యనియును భేదాభిప్రాయములు వారి శిష్యుల
హృదయములందు బయలువెడలి యంతఃకల
హములకు గారణంబులైనవి. చింతామణి,
కేల్కారు, ముంజి, జయకరుగారు లోకమార్గ
మును జూపుచున్నారు. అభయంకరు, కరండి
కరుగారులు వేరొక మార్గమును బోధించు
చున్నారు. మరికొందరు మూడవమార్గము
నవలంబించుచున్నారు. కర్మయోగారూఢు
డైన లోకమాన్యున కీవాద ప్రతి వాదములు
పరమవిషాదమును గలిగించియుండును. బహు
నాయకమైన దేశమునందు కార్యాచరణసంకు
చితమైనను సిద్ధాంతముల కంతములేదు. నాయ
కుల సిద్ధాంతరాద్ధాంతములు ప్రజాహృదయ
మునందు గలుగజేయుచున్న మహా సంక్షో
భము కర్మయోగారూఢుడైన లోకమాన్యు
నకు మహాసంతాపమును గలుగజేసియుండెడి
దని లోకమాన్యుని సాంవత్సరికారాధకులు
సంస్మరించుట ధర్మము. కర్మయోగ పరమైన
గీతాభాష్యమునందు లోకమాన్యుడు ధర్మా
నుష్ఠానసాధనములనువిశదముచేసెను. ఆధర్మ
రహస్యమునే యవసానకాలమునందు లోక
మాన్య బాలగంగాధరతిలకు వారి శిష్యప్రశి
ష్యులకును భారతీయులకును లోకమునకును
బ్రకటించి పరమపదమునుబొందెను. ధర్మము
చెడి యధర్మము ప్రబలునపుడు ధర్మసంస్థాప
నమునకు పరమేశ్వరు డవతరించుచుండును.

ధర్మానుష్ఠానము:

విజయుడు భారత రణరంగమునందు
యుద్ధపరాఙ్ముఖుడై యస్త్రవిసర్జనము చేసిన
పుడు శ్రీకృష్ణపరమాత్మ పార్థునకు కర్మ
యోగరహస్యమును బోధించి యర్జునుని
యుద్ధాభిముఖుని జేసినవిధమునను వైరాగ్యోప
హతులై నిర్లేపత్వమును బూనిన భారతీయు
లకు లోకమాన్యుడు కర్మయోగప్రాశస్త్య
మును బోధించి వారిని స్వరాజ్యాభిముఖులను
జేసినవిధమును లోకమాన్యుని జీవిత మనంత
ముఖములను బోధించుచున్నది. లోకమా
న్యుని వలెను ధర్మారాధనమును త్రికరణ
శుద్ధిగను జేయుటవలననె వారియారాధనము
సార్థకము గాగలదు. భారతీయులకు వర్తమా
నకాలమునందు పరాధీనతను తొలగించి
స్వరాజ్యమును స్థాపించుట పరమధర్మమని
యన్ని పక్షములవారునునంగీకరించుచున్నారు.
స్వరాజ్యసాధనములందు భేదాభిప్రాయములు
బయలుదేరుచున్నవి. స్వరాజ్యానుభవము వ్య
క్తులకునుజాతులకునుస్వధర్మము. పరరాజ్యాను
భవము వ్యక్తులకును, జాతులకును, పరమ
ధర్మము. లోకమాన్యుడు స్వరాజ్యము భార
తీయుల జన్మహక్కని నిర్భయముగ దిగంత
ములందు చాటి స్వధర్మ నిర్వహణమును
జేసి చరితార్థుడయ్యెను. పరధర్మారాధనము
వలనను గలిగెడి ప్రయోజనములను తిలకు
మహాశయుడు నిరసించి స్వధర్మానుష్ఠానవిధా
నమును భారతీయులకు వ్యక్తము చేయగలి
గెను. భయావహమైన పరధర్మారాధనమును
జేయుటకంటెను స్వధర్మానుష్ఠానమునందు

మరణము శ్రేయస్కరమని శ్రీకృష్ణుడు చేసిన ధర్మనిర్ణయమును లోకమాన్యు డారాధించి ధర్మానుష్ఠానవిధానమును లో క ము న కు వ్యక్తముచేసెను. "స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః" యను గీతో పదేశము స్వారాజ్యసంరంభమునందు భారతీయులకు స్వధర్మానుష్ఠాన విధానమును విశదముచేయుచున్నది.

అనంతవిభూతులతో నిండియున్న మాతృదేశ సందర్శనము మహానుభావులకు సాధ్యముగాని సామాన్యులకు సాధ్యముగాదు. వందేమాతరం కీర్తనను బంకించంద్రుడు రచింపగలడుగాని సామాన్యులు రచింప జాలరు. ముప్పది మూడుకోట్ల ప్రజలను బ్రహ్మజ్ఞాన సంపన్నత్వమును సహజ సంపదలను జూచుటకు దివ్యదృష్టి గావలసియున్నది. ఆ దివ్య దృష్టి గలుగుట కనన్యమైన భక్తియె సాధనమని లోకమాన్యుని జీవితము విశదముచేయుచున్నది.

శ్లో. భక్త్యా త్వనన్యయాశక్యః అహ మేవం విధోఽర్జున!
జ్ఞాతుం ద్రష్టుంచ తత్త్వేన ప్రవేష్టుంచ పరంతప!

స్వారాజ్యమును తెలిసికొనుటకును, గనుగొనుటకును అనుభవించుటకును అనన్యమైన స్వధర్మానుష్ఠాన మవసరమని తిలకు మహానుభావుని జీవితము విశదముచేయుచున్నది. కాని సర్వత్ర స్వధర్మానుష్ఠానమునకు బదులు పరధర్మానుష్ఠానము ప్రత్యక్ష మగుచున్నది. విద్యాలయములు, న్యాయస్థానములు, పదవులు, బిరుదములు, ఉద్యోగములు, జీవిత విధానము పరధర్మారాధనమునకు సా ధ న ము లు గ నున్నవి. పర ధర్మారాధనము నందు గల వ్యామోహమే హిందూమహమ్మదీయ విభేదములకు బ్రాహ్మణబ్రాహ్మణేతర విభేదములకు మితవాద స్వతంత్రవాద విభేదములకు గారణంబులుగ నున్నవి.

భేదములకుమూలము స్వప్రయోజనముగాని అనన్యమైనధర్మారాధనముగాదు. లోకమాన్యునివంటి దేశభక్తులకు భారత జాతీయ బృందావనమునందు భేదావరణములు దుర్లభము. స్వప్రయోజనపరాయణులకు భేదావరణములు గనుపించుట సహజము. పరధర్మ ప్రతిష్ఠాపకు లిట్టిభేదములను చిరస్థాయి చేయ గోరుటయును రాజ్యనీతియై యున్నది. రీడింగు బర్కెనుహెడుప్రభువులు కోరెడి సహకారము పరధర్మారాధనమునకు వినియోగపడునటులు స్వధర్మారాధనమునకు వినియోగపడజాలదు. బర్కెనుహెడుప్రభు వనవరతము పరధర్మారాధనమును బ్రిటీషుసామ్రాజ్యప్రయోజనములకు బోధించుచున్నాడు. బర్కెనుహెడుప్రభువుకోరెడి పరధర్మానుష్ఠానము స్వారాజ్య సంపాదనమునకు ప్రతిబంధకముగ నుండగలవిధమును శాసనసభా వ్యవహారములు విశదముచేసినవి. శాసనసభాప్రవేశముతోనే పరధర్మారాధన మారంభమై ఆరాధన మవిచ్ఛిన్నముగను సాగుచుండును. అధికారపువలయందు జిక్కుకొనిన దేశమునకు మోక్షమార్గము దుర్లభముగ నుండును. ఆంగ్లపరిపాలకుల కీరహస్యము తెలిసియున్నది. ఉద్యోగముల వ్యామోహముతో విభేదములను బురికొల్పుచు దేశమును సుఖముగను

పాలించుచున్నారు. హిందూ మహమ్మదీయ విభేదములకును బ్రాహ్మణేతర కక్షులకును మితవాద తీవ్రవాదభేదములకును నుద్యోగ కాంక్షయె మూలకారణముగనున్నది. పాశ్చాత్యవిద్యాసంస్కారము విద్యావంతుల లక్ష్యమును దేశమునుండి ధనమునకును నుద్యోగములకును మరల్చినది. ఈ స్వార్థలక్ష్యము ధర్మారాధనమును దుర్లభముచేసినది. ఆంగ్ల విద్యాభ్యాసమును, నుద్యోగములును జీవితమునకు పరమావధియైనది. ఈలక్ష్యము దేశ పరిస్థితులను వ్యత్యస్తముచేసినది. విద్యావంతుల కుద్యోగలాభ మున్నంతవరకును రామ రాజ్యమైనను, రావణరాజ్యమైనను సమానముగనున్నది. స్వార్థపరత్వము ధర్మాభ్యుదయమును దుర్లభముచేసినది. శ్రీయుతశాంతి రామమూర్తిగారు మధురయందు గతవారముచేసిన యుపన్యాసమునం దావిషయమునే విశదముచేసిరి. విద్యావంతులు స్వార్థమును పరిత్యజించి ధర్మారాధనమును జేయవలసిన యవసరమును దేశమునందలి విషమపరిస్థితులు విశదము చేయుచున్నవి. అనారోగ్యము, అజ్ఞానము, దారిద్ర్యము, పారతంత్ర్యము దేశమునందు యథేచ్ఛగను రాజ్యముచేయు చున్నవి. ఈ దుర్దశకు గారణభూతులైన యాంగ్ల విద్యాసంభవులే యీదుర్దశను దొలగించుటకు సమర్థులు. ఆంగ్లవిద్యావంతులీ భారమును నిర్వహింపవలసినవిధమును లోక మాన్యుడు స్వీయచరిత్రమునందును, గీతారహస్యమునందును, అవసానకాలసందేశము నందును పరిస్ఫుటముచేసెను. ఆధర్మమేపరార్థధర్మము; దేశధర్మము; ఆత్మధర్మము. లోకమాన్యు డవసానకాలమునందు బోధించిన యాత్మధర్మమునే గాంధిమహాత్ముడు స్వారాజ్యసాధనమునకు వినియోగించి విద్యావంతుల లక్ష్యమును బాహ్యసాధనములనుండి యంతస్సాధనములకు మరల్చి ఆత్మశక్తిని భారతీయులకు వ్యక్తముచేసి ధర్మారాధన విధానమును త్యాగసాధనమునను వ్యక్తముచేసి విద్యావంతులకు, ప్రభుత్వమునకు భయభ్రాంతులను గలుగజేసెను.

**త్యాగము—ధర్మారాధనము:**

ధర్మారాధనమునకు త్యాగము పరమసాధనమని సకలమతములును బోధించుచున్నవి. ధర్మారాధనమునకువలె నర్థారాధనమునకును త్యాగము పరమసాధనమైనను సామాన్య దృష్టికి ప్రత్యక్షముగ నున్నది. మానవులకు ప్రస్తుతలాభమునందుగల లక్ష్యము భావిలాభమునందు గనుపడదు. రాజ్యాంగములం దీవిషయము ప్రత్యక్షముగ గనుపడుచున్నది. విద్యావంతుల కధికారమునం దుండెడి లక్ష్యము స్వరాజ్యమునందు గనుపడదు. అధికారమునందు వెంటనే లాభము గనుపడు చుండును. ఈభ్రమయే అసహాయోద్యమ నాశనమునకును భిన్నపక్షములకును మూలమైనది. స్వరాజ్య సంపాదనమునకు గాంధి మహాత్ముడు నిర్ణయించిన నిర్మాణ కార్యవిధానమును త్యాగమును గోరుచున్నది. దేశ సేవకులు భాగ్యభోగములను విడిచి సేవాదీక్షను స్వీకరించినపుడె నిర్మాణకార్యవిధానము సాధ్య

మగుచున్నది. లోకమాన్యు డుపదేంచిన కర్మయోగమును గాంధిమహాత్ముడు దేశమునందంతటను వ్యాపింపజేయుటకు విశ్వప్రయత్నములను జేయుచున్నాడు. రాటము ఖద్దరు కర్మయోగాభ్యాసమునకు లక్ష్యములుగ నున్నవి. ఉద్యోగాపేక్షగల విద్యావంతులకీ లక్ష్యారాధనము దుర్లభముగ నున్నది. విద్యావంతులలక్ష్యము నాకర్షించగల శాసనసభలు స్వరాజ్యసాధనమునకు శరణ్యములైనవి. ఆలక్ష్యమునె కాంగ్రెసు స్వీకరింపవలసిన యవసరమేర్పడినది. శాసనసభా ప్రవేశమునందైనను త్యాగపరమైన యుద్యోగనిరాకరణము దురారాధ్యముగ నున్నది. దేశమునందు భిన్నాభిప్రాయము లీ యవాంతరముల వలన నేర్పడి త్యాగపూర్వమైన ధర్మారాధనము దుర్లభమైనది. ఈ విషమపరిస్థితులందు వోట్లసంరంభము తటస్థించినది. స్వార్థపరులకు వోట్ల సంరంభ మ్ముత్సాహమును గలుగజేయుచున్నను త్యాగపరాయణులకు నిరుత్సాహమును గలుగజేయుచున్నది. ఈ నిరుత్సాహసమయమునందైనను త్యాగలక్ష్యముగల కాంగ్రెసు స్వరాజ్యమునకు త్యాగమునె లక్ష్యముగ గ్రహించి యుద్యోగ నిరాకరణ ధర్మము నంగీకరించి ఎన్నికలయందు వోట్లను కాంగ్రెసుఅభ్యర్థులకు గోరుచున్నది. కాంగ్రెసుఅభ్యర్థులత్యాగము విశాలముగాకపోయినను నితర పక్షములందుగల స్వార్థపరత్వము కాంగ్రెసు పక్షమునందు గనుపడదు. కాంగ్రెసుపక్షము బర్కెనుహెడు ప్రభువుగారి బెదరింపులను పాటింపక త్యాగపరమైన యసహాయయోగనాదమును పూరించుచున్నది. గాంధిమహాత్ముని యాదరణమును లోకమాన్యుని యాశీర్వాదమునుగల కాంగ్రెసు పక్షమునకె ప్రజలు వారి వోట్ల నిచ్చి ధర్మారాధనమును జేయుట వర్తమాన విషమ పరిస్థితులం దవసరము.



Edited and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No.7, Thambu Chetty Street, G. T. Madras.


విషయానుక్రమణిక

# చిత్రములు








(మూఁడవసంపుటము, ౭వ సంచిక తరువాయి)

వ. రావణాంతకా! నీవు దేవసంరక్షణార్థమై పాయసంబులోఁ బ్రవేశించి కౌసల్యాగర్భంబున జన్మించి తాటకాహరణంబును, సుబాహురాక్షసవధయును, కౌశికయజ్ఞసంరక్షణంబును, అహల్యాశాపమోక్షణంబును, ధనుర్భంగంబును, సీతావివాహంబును జేసికొని పరశురాముఁడు మింటికిం గట్టిన త్రోవలు బెగనేసి దశరథుండు పట్టంబుగట్ట సమకట్టినఁ గైకేయిచేతఁ బదునాలుగేండ్లు మితి చేసికొనిన కారణం బేమి? అవులే; దశకంధరునికిఁ బదునాలుగేండ్లు ఆయుశ్శేషము నాఁటికిఁగలిగెఁ గాఁబోలును; తావత్పర్యంతమును, శూర్పణఖానాసికాచ్ఛేదనంబును, మారీచకబంధఖరదూషణాది వాలిహరణంబును, సుగ్రీవాదిహరణంబును, వానరనియోగంబును, సముద్రబంధనంబును జేసి రాక్షససంహారంబు గావించి, లంక విభీషణున కిచ్చి సీతాసమేతుండవై అయోధ్యాపట్టంబుఁ గట్టికొంటివట! ఎంతకపటనాటకసూత్రధారివి? నమోనమశ్శ్రీ వేంకటేశ్వరా! ౫౦

వ. కేశవా! నీవు విరక్తులకు మోక్షసుఖంబవై యుండుదువు; నిన్ను ధ్యానంబు సేయువారలకు సాక్షాత్కారంబవై యుండుదువు; ఇతరులకు ముప్పురిలో నొక్కండవై యుండుదువు; మూఢులకు నభేద్యుండవై యుండుదువు; దనుజులకు నహంకారంబవై యుండుదువు: దేవతలకు బ్రహ్మపదంబవై యుండుదువు; ఈరీతి వారివారికిఁ దగినట్లు నీరుకొలఁది తామరవై యుండుదువు. ఓపినవారి కోపినంత భాగ్యంబవు; నీకు శరణనేర్చినవారిని నీవే రక్షింతువు; నీవలనఁ గడమ లేదు; నమోనమశ్శ్రీ వేంకటేశ్వరా! ౫౧

వ. అచ్యుతా! మిమ్ము నేమియు నడుగనని యెడు నహంకారంబు గలవాఁడఁగాను; మీకును యెడ నపరాధంబు లేకుండెడు నట్లు కొలుతు నని యెడు గర్వంబు గలవాఁడం గాను; మిమ్ము నమ్మితినని సారె సారెకుం గొసరెడివాఁడఁ గాను; మీకు విశ్వాసిననని యెమ్మెలఁబొరలెడివాఁడఁ గాను; వేదశాస్త్రంబు లెఱుంగుదురని పెద్దల ధిక్కరించినవాఁడఁ గాను; ఆశ్రమాచారంబులు చూపి ఉత్తమలోకంబులు చొరఁ బాఱి సరిగెల్పు నెఱపెడివాఁడఁగాను; మీమీఁదిభక్తిగలదని బలిమిచూపెడివాఁడఁగాను; శేషత్వపాత్రములవలన మ్రుక్కుంగున నిల్చి మిమ్ము సేవింపు మీదాసానుదా

సుండ నని యెఱుంగుదు; నమోనమ శ్రీ వేంకటేశ్వరా! ౫౩

వ. భుజగేంద్రశయనా! లక్ష్మీసమేతుండవై యేమేమి సేయుచున్నాఁడవో మీయవసరం బెఱుంగక మిమ్ముఁ దలంపరాదు. రుక్మిణీదేవితో నెత్తంబు లాడెడువేళ ద్రౌపది 'హాకృష్ణా'యని తలంచిన అక్షయంబని పాచికలు వైచితిరట; కరీంద్రుండు మిమ్ముఁ దలంచిన వైకుంఠభోగంబు లటు వెట్టి వత్తిరట; ప్రహ్లాదుండు కంబంబునం జూపినఁ జించుకొని వెడలితిరట; యీరీతి మీచరిత్రంబులు విన వెఱఁగయ్యెడిని. మీ రెప్పుడు విచ్చేయుదురో యని మీ శ్రీపాదపద్మంబులచప్పుడు నాలకింపుదును. మీకై నేనేవేళయైనను హృదయవాకిళ్లుగాచుకుండెద; నమోనమ శ్రీ వేంకటేశ్వరా!

వ. పరధామాధిపా! మీమహిమసముద్రమునకుఁ గారుణ్యంబు జలంబు; మీకల్యాణగుణంబులు తరంగంబులు; మీ నిగ్రహానుగ్రహంబులు తిమితిమింగిలంబులు; మీశ్రుతులు ఘోషంబులు; మీగాంభీర్యంబు లోఁతు; మీప్రతాపంబు బడబానలంబు; మీ కపటనాటకవ్యాపారంబులు మకరకచ్ఛపాదిజంతువులు; ఇట్టి మీ మహిమసముద్రంబు మీ దాసులు మిమ్ముఁ గూడి తరవఁగాను భక్తియను కామధేనువు వొడమెను; జ్ఞానంబనియెడి చంద్రోదయం బాయె; అనంతానందంబనియెడి యైరావతంబు, సాత్త్వికంబనియెడి పంచతనువులు, అనంతనామంబు లనియెడి అప్సరఃస్త్రీలు; మీ తిరుమంత్రంబులనియెడి యమృతంబునుం బొడమె; మీ యష్టాక్షరామృత మనుభవించుచున్నారము; నమోనమ శ్రీ వేంకటేశ్వరా! ౫౪

వ. కాలాంతకా! బ్రహ్మాండకోట్లు కుక్షిం బెట్టుకొన్న నిన్ను గర్భంబున మోచెనట దేవకీదేవి; విశ్వరూపుండవైన నిన్నుఁ గౌఁగిలించుకొన్నారట గోపికలు; సర్వతోముఖుండవైన నిన్ను ముద్దాడెనట యశోద; అపరిమితబ్రహ్మంబైన నీకు ద్వారకానగరంబు గట్టెనట విశ్వకర్మ; సర్వవ్యాపకుండవైన నీకు రథముఁ గడపెనట దారుకుండు; అనంతనామంబులు గల నీకు నామకరణంబు చేసెనట గర్గుండు; వేదాంతవేద్యుండవైనఁ నీకుఁజదువు చెప్పెనట సాందీపుండు; ఇది యెటువంటి యద్భుతంబు; విన నగోచరం బయ్యెడిని. అట్లౌకదా నీకన్న నీదాసు లధికులౌట తేటపడె. నమోనమ శ్రీ వేంకటేశ్వరా! ౫౫

వ. జగదేకవీరా! నాయర్థాతురత్వంబున నిన్ను 'దైవమా'యని దూరి సొలసితి; అప్రైశ్వర్యగర్వంబుచేత మీగుళ్లముందఱ వాహనంబు దిగనైతి; మీసన్నిధిని దాంబూలచర్వణంబులు చేసితి; బాల్యయౌవనకౌమారగతులచేత మీకు మ్రొక్కనైతి; మఱియును గొన్ని యేమియపరాధంబులుచేసితినో? నేఁ జేసిన యపరాధము క్షమకముగా నిప్పుడే మీ తిరుమంత్రోచ్చారణంబుచేతను చంచలత్వంబు విడిచి చిత్తము

శాంతమునం బొందె. మీశేషరతత్త్వంబని
తెలిసి శరణాగతుండనై మీదాసులలోఁ
జేరితిని. నేఁ జేసిన యపరాధమునకు బరిహా
రముగా మిమ్ము నాకుం జూటి చెప్పిన యాచా
ర్యుల శ్రీపాదతీర్థవిశేషములకుం జేయొ
గ్గెద; మీదాసులపాదరజులు పట్టెద;
మీదాసుల సేవకుండ నయ్యెద; మీదాసీ
జనంబులకు నీళ్లు మోసెద; మీ లెంకలకు
లెంకతనంబు చొచ్చి యచ్చువేసికొని
యెద; నాసర్వాపరాధంబులు క్షమింపఁ
జేయవే; నమోనమ శ్రీ వేంకటేశ్వరా!

వ. లంకాపహారీ! వైష్ణవజ్ఞానంబనియెడి యం
జనంబుచేత నీవనియెడి నిధానం బెత్తి
కొంటి. అదియునుగాక, నీపై భక్తి
యనియెడి నావచేత సంసారసముద్రంబు
దాఁటి వైరాగ్యంబనియెడి పదార్థంబు నీకు
సుంకంబు వెట్టక బలిమిం దెచ్చుకొంటిమి.
నీ పాదంబులమీఁది తులసీమాలికలచేత
నజరామరపదంబుం జూఱగొంటిని. ఇవి
నాదుర్జనకృత్యంబులు; నీవు భూమీ
శుండవు గనుక నేనును బ్రమోసంబు
నేయకయున్నప్పుడే విన్నవించితి. నేఁ జే
సిన చేఁతలివి; ముందఱ నీచిత్తం బెట్లుం
డునో? ఇదిగో నీకు విన్నవించితిని, మఱి
వక విననవధరించి రక్షింపవే; నమోనమ
శ్రీ వేంకటేశ్వరా! ౫౮

వ. ముచికుందప్రసన్నా! సంసారధర్మంబులని
యెడు సంగళ్లలోపల నీతిసంగతులనియెడు
వ్యవహారులు కోరికలనియెడు సరకులు
పచరించుకొని అగ్గువతో నమ్మఁగా నేను
బహుళంబుగా సంపాదించుకొంటిని. ఆకో
రికలకు నోడిఁగట్టుకొని అనుభవించనే
వేడుకయగుచున్నది. నిన్ను ధ్యానంబుసే
యంజనదు. నామనస్సు క్రొత్తకోడె వం
టిది. జ్ఞానంబనియెడు కంబంబునఁ గట్టి
వైరాగ్యంబనియెడు సాదుపసరముతో లం
కెవైచి నీకృషికి దిద్దుకొనవే; నమోనమ
శ్రీ వేంకటేశ్వరా! ౫౯

వ. హిరణ్యగర్భా! నీకుఁ బాన్పైన శేషుండు
బ్రహ్మాండం బెత్తుకొనియె; నీకు వాహ
నంబయిన గరుత్మంతుండు అమృతంబుఁ
గొనిచనియె; నీకూఁతురైన గంగాభవాని
హరుశిరస్సునెక్కె; ధ్రువుండు బ్రహ్మలో
కం బతిక్రమించె; నారదుండు సురలకుఁ
బోరు వెట్టుచున్నాఁడు; రుక్మాంగదుండు
యమలోకంబుఁ బాడుచేసె; శుకుండు
చూఱఁగొనియె; ఇందుచేతను నీదాసులు
నీకన్న నధికులౌట తేటపడియె; నమో
నమ శ్రీ వేంకటేశ్వరా! ౬౦

వ. రామరామ! నీవు లోకంబెల్ల నొకపాదం
బునఁ గొల్చితివట; నీరూపం బేమని
చెప్పుదును? అనంతవేదంబులు నిన్నుం
బొగడునట! నీ గుణంబు లెన్నియని
యెన్నుదును? నీరోమకూపంబుల నజాండ
కోట్లు నిండుకొన్నవట! నిన్ను నేమనివర్ణిం
తును? సర్వదేశసర్వకాలపరిపూర్ణుండవై
యుండఁగాను నీప్రభావం బేమని పొగడెద
ను? పురాణపురుషుండవట; నీతుదమొదళ్లె
ఱుంగువా రెవ్వరు? నిన్నుఁ దెలియ నుద్యో
గంబుఁ జేసెద. నాయాస లేమని చెప్పుదు

నంతయు నీ వెలుంగుదువు; నమోనమ
శ్రీ వేంకటేశ్వరా! ౮౧

వ. శరణాగతవజ్రపంజరా! నీవు లోకసంరక్ష
ణార్థంబై నీస్వతంత్రంబున (నెత్తిన) రామా
వతారంబున నీశక్తిని నీ వెట్లు వెలుంగవని
యందురు కొందఱు. హరువిల్లు నెక్కుపెట్టి
విఱిచినదియును, పరశురాముఁడు గడి
యించిన స్వర్గసోపానంబులం దెగ్రేసినది
యును, సుగ్రీవునికి వాలిం జంపెదనని ప్రతిజ్ఞ
చేసినదియును, శరణుచొచ్చిన విభీషణు
నకు మున్నుగా లంకారాజ్యంబునకుం
బట్టంబుగట్టినదియును, సీతను వెదకంబో
యిన వానరులలోన హనుమంతుచేతికి
నుంగరం బొసంగినదియును, జలధిపై విల్లు
దొడిగినదియును నీభుజబలిమియకాదె! నీ
ప్రతాపంబు నీవెలుంగని దేమి? నీవు సర్వ
జ్ఞుండవు. నిను నెఱుంగనివారలె అజ్ఞులు
గాక! నమోనమ శ్రీ వేంకటేశ్వరా! ౮౨




# నా కోర్కులు

పండిత పెనుమెచ్చ సత్యనారాయణ రాజు గారు

జలదము లాకసంబు నతిసాంద్రతఁ గప్పి వినీల కాంతులన్
గలిగి యెసంగువేళ నొకకాననసీమ మహీధ్ర సానుభూ
స్థలముల నాల మేపుచుఁ బిసాళిగఁ బిల్లనగ్రోవి నూఁదుచున్
జలనము లేకయే ప్రకృతిజాలమునం గలియంగఁ గోరెదన్

ఉ. తారలుఁ జంద్రుఁడున్ దివిని దారుచుఁ గ్రమ్మరుచిన్ వెలుంగఁ జో
వారిధితీరశాద్వల విభాసుర సైకతలంబులందు నే
నే రహిఁ గూరుచుండి తటినీశతరంగమృదంగనాదముల్
గూరిన భావగీతములుఁ గోయిలపాటలు పాడఁ గోరెదన్

చ. లలిత వసంత సంపద, నిలాతల మెల్ల లతాంతకాంతమై
లలి విలసిల్లువేళ సుఖలాలసవృత్తిని గోకిలంబనో,
చిలుకనొఁ భృంగమో యవుచు సృష్టి విచిత్రముఁ గూర్చి గానముల్
సలుపుచు నేను ప్రేమమయసౌధమునం జరియింపఁ గోరెదన్.





చెన్నపురిరాజధానియందు

1926 సం. జనవరి—మార్చి నెలలలో ముద్రితములై ప్రచురింపబడిన

# ఆంధ్ర గ్రంథములపట్టిక

### పద్యకావ్యము- ౧. ప్రబంధము

శుద్ధాంధ్ర నిర్వచన సత్యావివాహము—జంగా హను
మయ్య చౌదరి

### ౨. పురాణము

రుక్మిణీకల్యాణము

శివపురాణము (మూడవసంపుటము)

### 3. ఇతిహాసము

వాల్మీకి రామాయణము, ఆరవసంపుటము, సంస్కృతము,
సటీక.

### ౪. శతకము

ఉపదేశశతకము సంస్కృతము,సటీకము

కేశవశతకము—పంచాల కేశవదాసు

చిత్తప్రబోధశతకము—గొల్లపూడి నారాయణశర్మ

చిత్తోపశమనశతకము—వెలమకన్ని వేంకటశోభనాద్రిక

చూళి మాళీశ్వరశతకము—సుతిమంచిసాంబశివరావు [వి

పక్షోడీశతకము—వి. యస్. పద్మనాభ రాజు

పరమపురుష శతకము—మంత్రిరావు వెంకటరత్నము

పొగచుట్టశతకము—కొమ్మూరిసంగమేశ్వరకవి

వేమనశతకము

శ్రీకామాక్షీశతరత్నమాల—చిదంబరకవి

శ్రీరంగనాయకశతకము—చింతమనేనిజగ్గయ్య [ర్య

శ్రీసమీరాత్మజశతకము—ధనకుధారము రామానుజాచా

సకలేశ్వరశతకము—నందూరు లక్ష్మీనరసింహారావు

### ౫. ఇతరములు

ఆంధ్రపాండవగీతలు—వేదము వెంకటకృష్ణశర్మ

ఆంధ్రభజగోవిందశ్లోకములు సం.—ఆంధ్రపద్యసహితము
—టి. సీతారామమూర్తి

ఋణబాధ—సుందరలక్ష్మీశాస్త్రి

కడుపుతీపు—వేటూరి ప్రభాకర శాస్త్రి

కపోత కథ— డిట్టో

సుకవి—బండి రామిరెడ్డి

గురుసేన—గొల్లపూడి శ్రీరామ శాస్త్రి

ధర్మగుప్త చరిత్ర—కారుపర్తి నాగలింగ దాసు

నీతికథావళి—ఓలేటి భాస్కరరామమూర్తి

పద్యవాచకము, ఐదవతరగతి—కొప్పర్తి నారాయణ
మూర్తి, శేషాద్రి రమణ కవులు

పురాణ మణిమంజరి ఆంధ్ర వాఙ్మయపాఠావళి— ఏ.
సూర్యనారాయణ, యస్. సర్వారాయుడు

ప్రసంగోపయుక్త నీతిపద్యావళి—పుల్లేపు సత్యనారా
యణ

లోకవైచిత్ర్యము—రాజా యం. భుజంగరావు

వివాహమహోత్సవ నవరత్నము ల—రత్నాకర వేంకట
రాజు

వివాహ శుభసమయాశీర్వాదపద్య రత్నావళి—సి. ఎ.
బ్రహ్మశాస్త్రి, ఓ. వెంకటరామ శాస్త్రి

స్త్రీనీతి రత్నావళి—చెలికాని వెంకటనరసింహారావు

స్త్రీ సాహసము—బద్దిరెడ్డి కోటేశ్వరరావు

### వచనము-౧. కథలు

అంబ చరిత్రము—దేవరకొండ రామజోగి శాస్త్రి

కాళిదాసనాటకకథలు—యన్. రంగారావు

గోరాకుంభార్ చరిత్ర—బద్దిరెడ్డి కోటేశ్వరరావు

తులసమ్మ నోముకథ

నోముల కథలు—ఎ. జగన్నాథ శాస్త్రి

పంచాక్షరీ ప్రభావము అను చిక్కయ్య చరిత్ర—సి.
మాణిక్య శర్మ

పతివ్రతా శిరోమణులు—ఎ. వెంకటరత్నం
బాలకథామంజరి—అవసరాల శేషగిరి రావు
భరతఖండ సంబంధమైన కట్టుకథలు
రెండవకథా వాచక పుస్తకము
శశిరేఖ—గుడిపాటి వెంకటాచలము
సుశీల

## ౨. నవల

ఉగ్రభైరవము—పోడూరి రామచంద్రరావు
చంద్రగుప్త—యస్. శివరావు
చెన్నపట్టణము—వేమూరి శ్రీనివాసరావు
నరేంద్రగుప్తుడు, రెండవసంపుటము—వాసుదేవరావు
మంజువాణి—ఎ. వీరరాఘవయ్య, ఎ. సూర్యనారాయణ
మణిహారము—బులుసు సుబ్బారావు
మొగలాయి దర్బారు, ప్రథమసంపుటము
మోహినీమనోహరము—జొన్నలగడ్డ వెంకట రాధాకృష్ణయ్య
సేనాటివీరుడు—కె. జయరామారావు
విజయశ్యామ్—పోడూరి రామచంద్రరావు
సతీనారాయణి—పి. వి. రాజు

## ౩. చరిత్ర

అగ్నికులక్షత్రియవంశసంగ్రహచరిత్ర—పెదసింగు వెంకటనారాయణ
గండికోటచరిత్ర—కలవటాల జయరామారావు
మారుతి హిందూదేశచరిత్ర, నాలుగైదు తరగతులకు—యమ్. వి. నరసింహారావు, యస్. యస్. సోమయాజులు
రామా హిందూదేశచరిత్రము—వి. వెంకటరంగారావు
శ్రీనాథకవిచరిత్రము—వద్దూరు శ్రీరామమూర్తి
హిందూదేశచరిత్రకథలు—సి. ఆర్. నమశ్శివాయ మొదలి
హిందూదేశచరిత్రలోని సులభమైన పాఠములు

## ౪. జీవిత చరిత్రలు

కీ. శే. శ్రీ తిరుమల వీరరాఘవాచార్యస్వామివారి సంగ్రహచరిత్రము—యస్. సి. వి. వెంకటరంగాచార్య
కృతజ్ఞత—యస్. వీరబ్రహ్మం
దేవినేని సుబ్బయ్య చౌదరిగారి దివ్యజీవచరిత్రము—నందివాడ జగన్నాథ కవి
రామ్సే మెక్డొనాల్డు జీవితసంగ్రహము

## ౫. ఇతరములు

అజ్ఞాతవాసము—జనమంచి సీతారామస్వామి
అభిమన్యుడు—భోగరాజు నారాయణమూర్తి
కుమారవాచక పుస్తకము, ఆరవతరగతి—పి. వెంకటరామశాస్త్రి, యం. సుబ్రహ్మణ్యం
పరమగురు సరసన్నిధి—జి. కృష్ణమూర్తి
ప్రహ్లాద
సుందరకాండ, లక్ష్మణమూర్తి

## సంగీతము - హరికథ

యోబుచరిత్రము, హరికథరూపకము—జేసుదాసు సింగ్
శ్రీకృష్ణ రాయబారము—నందివాడ జగన్నాథ కవి
శ్రీరామానుజ చరిత్ర హరికథ—బృందావనం రాఘవాచార్య

## సంగీతము - గేయము

అధ్యాత్మరామాయణ కీర్తనలు—సుబ్రహ్మణ్య కవి
కాలజ్ఞానతత్త్వములు
కుశలవ పట్టాభిషేకము—హస్సాన్ షెరిఫ్
కొడకా పిచ్చోడా పాట—సోమరాజు రామానుజరావు
చమత్కార కీర్తనలు—కళభవాని శంకర శర్మ
చల్ మోహనరంగ పాట—సోమరాజు రామానుజరావు
దశావతారములు—వి. యస్. పద్మనాభ రాజు
ధర్మాంగద చరిత్ర పాముపాట
నిట్టల ప్రకాశదాసుగారి కీర్తనలు
నూతన శృంగార కోలాట కీర్తనలు, బల్లాస్వామి పాటలు—డి. వాసుదేవం
బాలగీతములు—కోపూరి పట్టాభిరామ శర్మ
బ్రాహ్మణగీతసుధాలహరి—ఇప్పగుంట సుబ్బకృష్ణయ్య
భువనరంజనీ నాటక కీర్తనలు—యం. నరసింహారావు
మంగళ హారతులు
మేలుకొలుపులు, మంగళ హారతులు
రామకీర్తనలు శ్రీకృష్ణలీలలు—కంఠస్ఫూర్తి సత్యనారాయణదాసు

లక్ష్మణమూర్తి, పదము [రావు
వెంకయ్య చంద్రమ్మపాట—సోమరాజు రామానుజ
వేదాంతార్థ దేవతిలకులకథ
శుద్ధనిర్గుణతత్త్వకందార్థములు
" " భాగవతకృష్ణదాసు
శ్రీమద్రామాయణ భజన నవీన సంవాదనాదికీర్తనలు—
గాదె పోలమరాజు
శ్రీరామభజనకీర్తనలు—సోమరాజు రామానుజరావు
శ్రీలలితాపరమేశ్వరీకల్యాణము—గూడ కృష్ణకవి
శ్రీసరస్వతీ భజనకీర్తనలు—వసంతపురం లోకరాజుము
షట్త్రింశత్తత్త్వకీర్తనలు, ప్రథమభాగము [య్య
సిరిసిరిమువ్వపాట—సోమరాజు రామానుజరావు
స్త్రీలపాటలు—ద్రోణంరాజు సీతారామారావు
స్త్రీలశృంగారపాటలు—కాశీవిశ్వనాథం

భూగోళము

నాల్గవతరగతినూతనవిశాఖపట్టణజిల్లాజాగ్రఫీ—జి. సో
మన్న పంతులు
భూమియొక్క సామాన్య వివరము, ఇండియా, మొదటి
ఫారము—జి. రత్నంపిళ్లై
మాక్మిలన్ నూతనభూగోళశాస్త్రము, మొదటిపుస్తకము
మూడవఫారముజాగ్రఫీ—జె. వీరరాఘవులు

జ్యోతిషము

ప్రశ్నోతిచంద్రిక (సం) సటీకము
బృహత్పారాశరసంహిత — భావఫలాధ్యాయము (సం)
శ్రీక్షయసంవత్సర ఫలప్రకాశిక—నేమాని వెంకటరా
మయ్య

వ్యాకరణము

తెలుగువ్యాకరణము—పి. అబ్బాయినాయుడు

జంతుశాస్త్రము

జంతుశాస్త్రము, రెండవభాగము, రెండవఫారము

ప్రకృతిశాస్త్రము

ప్రకృతిశాస్త్రవిషయములు, రెండవభాగము, రెండవఫా
రము—కె. సూర్యనారాయణ
రెండవఫారమునకు సైన్సురీడరు—యుం. సుబ్రహ్మణ్యం

క్రీస్తుమతము

అనుదినాహారము—మిస్సరస్సెయొడ్డి
ఇరువదినాల్గు బైబిలు కథలు—జార్జిమేరీ ఇంగ్రామ్ రివ
క్రీస్తునాథుని అనుసరణము రెండ్ [రాబర్ట్సుజాక్ గార్ల
దివ్యపూజకు సహాయమంత్రములు
భ్రాతృద్రోహి—పూలాజోసెఫ్
మంచికథలు, పటములు
మంచిసమరియుడు—పట్టపుప్రసంగి
మన్నేసా అను జ్ఞానధ్యానవ్యాఖ్యానము

ఇతరము

అల్లూరిసీతారామరాజు—యనమంద్రకృష్ణారావు
అష్టావధానము—వెల్లూరు శ్రీనివాసరంగేశ్వరశర్మ
ఆంధ్రపత్రికపదునేడవసంవత్సరాదిసంచిక
ఆంధ్రోత్కలసమస్య—డి. ఆదినారాయణ
ఆడపోడు—బద్దిరెడ్డికోటేశ్వరరావు
ఆర్యసుభాషితరత్నావళి, సాంగ్రపద్యము—యన్. సత్య
నారాయణ, జి. సన్యాసిరాజు
ఖింగాఖనుచరిత్ర—సబ్బని సత్యాకేశవరావు
గాంధిమహాత్మునీతిమంజరి—యస్. సుబ్బారావు
గోవింగగీతము—(సం) ఆంధ్రపద్యసహితము—పి. చిదం
బరశాస్త్రి
గ్రామపునర్నిర్మాణము—దిట్టకవిరామకృష్ణయ్య
తాంబూలము—వేమూరు ఆండాలమ్మ
తిరుప్పావై, (అరవం) సటీకము
త్రినాథమేళ
దారిద్ర్యబంధవిముక్తి—వి. వెంకటరత్నం
నారదమునీంద్ర స్తోత్రత్రయం—హరిదాసు
నిత్యప్రార్థన—పెద్దిభొట్ల యజ్ఞేశ్వర శర్మ
పతిపూజా విధానము—డి. నారాయణదాసు
పరలోకయాత్ర—కె. వి. హెచ్. రఘుపతిరాయి
బాలధర్మబోధిని—డి. సీతారామరావు
బాల్యవివాహ ఖండనము—శిఖరం కోటేశ్వర గుప్త
మగపోడు—బద్దిరెడ్డి కోటేశ్వర రావు
మణిత్రయి (సం) ఆంధ్రపద్యరహితము
మహాకవి కాళిదాసు చరిత్ర—యమ్. సి. శేషగిరిరావు
మహాలింగ లీల—చదువుల బసవశంకరయ్య
రామాయణరత్నములు
లోకజ్ఞానము—జి. వి. రామమూర్తి

వంకాయ—ధేరం సత్యనారాయణ
విద్యాదీపము—బోలె చెన్నయ్య
వ్యవహారబంధు [మూర్తి
శిశు తత్త్వదీపిక—కె. హెచ్. వి. యస్. నారాయణ
శృంగార పద్యములు—గరికిపాటి కామేశ్వర రావు
శ్రీకొల్లూరు చెన్న కేశవస్వామి చరిత్రము—ధరణిరామ
చంద్ర రావు [హనుమంత రావు
శ్రీదాశరథిస్తోత్రనిరోష్ఠ్యతారావళి—బలభద్రపాత్రుని
శ్రీభగవద్గీతాంశ పుష్పమాల—బి. టి. రంగాచార్య
శ్రీమన్నారాయణ [illegible]—పోతన్న
సరస్వతీవాచక పుస్తకము, ఎనిమిదవతరగతి—పోరాసి
సహకారప్రబోధము [రానువేంద్రరావు
సహకారోద్యమము—తల్లాప్రగడ రామారావు
సృష్టిపరిశీలన—యస్. లక్ష్మీనరసయ్య
బాలహితోపదేశము—డి. సీతారామరావు
రామావాచకము రెండవతరగతి—పి. యస్. రామశర్మ

## నా ట క ము

ఎస్తేరు చరిత్రనాటకము—సి. డానీలు (క్రీ. మ.)
కృష్ణలీలలు—మలకపల్లె చిన శేషగిరిరాయ కవి
తుకారాం—కలవటాల జయరామారావు
నర్తనశాల—విశ్వనాథ సత్యనారాయణ
నాయకురాలు—ఉన్నవ లక్ష్మీనారాయణ
పద్మవ్యూహము—సోమరాజు రామానుజరావు
బాలభట నాటకము—కె. హెచ్. వి. యస్. నారా
మంగతాయి—కాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రి [యణ
రామదాసు నాటకము—యస్. గోపాలాచారి
రామనిర్యాణనాటకము—రామకృష్ణ సుబ్రహ్మణ్య
రుక్మిణీ కల్యాణము—డి. రామమూర్తి శాస్త్రి [కవులు
వరవిక్రయము—చెళ్లపిళ్ల వెంకటరామయ్య
శతకంఠరామాయణము—ద్రోణంరాజు సీతారామరావు
సంగీతసావిత్రి—మంగిపూడి శ్రీరామచంద్రశాస్త్రి
సంగీతహరిశ్చంద్ర—అవసరాల శేషగిరి రావు
సంపూర్ణోత్తరరామాయణము—రామనారాయణకవులు
సారంగధర నాటకము—అధికార్ల సత్యనారాయణమూర్తి
సీత—యస్. కామేశ్వరరావు
సీతాకల్యాణము—గుమ్మనూరు కోటేశ్వర రావు
సుగ్రీవపట్టాభిషేకము—సోమరాజు రామానుజరావు
సోహ్రాబురుస్తుములు—యస్. కామేశ్వరరావు

## ప్రహసనము

అమ్మలక్కలసమావేశము—గొన్నాబత్తుల నరసింహాచారి
గడుసుగంగయ్య
నరాలగంగి—బూసం మల్లయ్య
నారాయణమ్మ—నాయుడుబావ—బద్దిరెడ్డి కోటేశ్వరరావు
ముసలివాగకు, పడుచు పెండ్లాము—బద్దిరెడ్డి కోటేశ్వరరావు
రాజరంగేళి ,,
వంటబ్రాహ్మణస్వాములవారు
వోట్లపండుగ—సుబ్రాగోపాలకృష్ణయ్య
సంగీతకాంతామతి—చెళ్లపిళ్ల వెంకటరామయ్య
స్వరాజ్యము—కంఠమూర్తి సత్యనారాయణదాసు

## గణితము

గణితబోధిని
గణితసంగ్రహము, మొదటిభాగము—డి. రామమూర్తి
ప్రారంభగణితము మొదటి పుస్తకము—వి. వెంకటసుబ్బయ్య

## వైద్యము

అంటువ్యాధులు
అంటువ్యాధులు—జి. వి. రామమూర్తి
అనుపానదీపిక—ద్విభాష్యం వెంకటేశ్వర్లు
అనుభవచికిత్సా దర్పణము—లోకరాజు ము[illegible]య్య
ఆంధ్ర తాత్పర్యసహితాంధ్ర భైషజ్య రత్నావళి (సం. సటీ.)—శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి
ఆయుర్వృద్ధి—జి. వి. రామమూర్తి
ఆరోగ్యవారము, గోదావరిజిల్లాము లేరి మాసంవారము—బి. రామచంద్రరావు
ఆరోగ్య శిశువారము, ఉపాధ్యాయుల కర్తవ్యము—కె. హెచ్. వి. యస్. నారాయణమూర్తి
ఆహార నియమములు—జి. వి. రామమూర్తి పంతులు
ఉబికము—కె. పార్వతీశము పంతులు
ఉపవాసము—జి. వి. రామమూర్తి పంతులు
గర్భిణీ[illegible]—జి. వి. రామమూర్తి పంతులు
చంటిబిడ్డ

దినచర్య ఆరోగ్యవిధులు—శి. వి. రామమూర్తి పంతులు
దుస్తురభ్యాసము—యం. వి. సుబ్బారావు
పశువుల అంటువ్యాధులు—యం. రామచంద్ర మొదలి
మహాభాగ్యము—ఐ. యస్. యన్. భట్నాయిక్, వి. యస్. చౌదరి
వస్తుగుణదీపము—జి. వి. రామమూర్తి [మూర్తి
శిశుసంరక్షణము—కె. హెచ్. వి. యస్. నారాయణ
సామాన్యవ్యాధులు, చికిత్సలు—యం. వెంకటరత్నము

## మతము

పారమార్థిక గీతావళి—రాజా. యం. భుజంగరావు
బ్రాహ్మ్యధర్మప్రశ్నోత్తరమాల—పాలపర్తి నరసింహము

## వేదాంతము

ఆత్మానుభవము అను సనాతన గీతలు—నిమిషకవి వేంకయ్య
జ్ఞానానంద సుధార్ణవము—కారుపర్తి నాగలింగదాసు

## స్తోత్రము

జానకీవిభుస్తవకదంబము—నూతి సూర్యనారాయణపంతులు
తమ్మగర శ్రీసీతారామస్తవరాజము—చందాల కేశవదాసు
శివమహిమ్నస్తోత్రము (సం.) ఆంధ్రపద్యసహితము
శ్రీగోవిందమంజరికాస్తుతి (సం.) ఆంధ్రపద్యసహితము
శ్రీమంగళాచల నారసింహస్తోత్రతారావళి(సం.)
తెలుగుపద్యములు—పి. రంగేశ్వరశర్మ
శ్రీరామస్తవచంపకోత్పలమాల—విశ్వనాథమ్ రామానుజో గారావు
శ్రీరామస్తవమార్ణిక—ముద్దుంబి వెంకటకృష్ణమార్య

## మాహాత్మ్యము

కాశీసారము (సం.) సటీకము
భద్రాద్రిప్రభావము—కొప్పర్తి లక్ష్మీనరసింహము

## కల్పము

ఆబ్దికమంత్రార్థదర్పణము, (సం.) సటీకము
ఆరుద్రవ్రతములు, (సం.) సటీకము
కూపప్రతిష్ఠ, సటీకము
తటాకప్రతిష్ఠ, (సం.) సటీకము
తైత్తిరీయస్మార్తబ్రాహ్మణనిత్యకర్మాష్టకము(సం) సటీక కనుపర్తిమార్కండేయశర్మ
త్రికాలసంధ్యావందనము, (సటీకము)
పూర్వప్రయోగవృత్తి, (సం) సటీకము
మంత్రపుష్పము (సం) సటీకము
యజ్ఞోపవీతమంత్రము, పరిషేచన అమావాస్యతర్పణము, సటీకము
వనప్రతిష్ఠ, (సం.) సటీకము

## సంగీతము - యక్షగానము

శ్రీ ద్రౌపదీ వస్త్రాపహరణము, యక్షగాన ప్రబంధము, గోపాలుని హనుమంతరాయశాస్త్రి






# సమరాహ్వానము

శ్రీనివాసరావుగారు

ధైర్యము త్యజించి ఘోరయుద్ధంబునందు
ననుచిత పలాయనపథంబు ననుసరించి
ఓ సుయోధన! యుండేగి యుంటి విపుడు?
రమ్ము, క్షత్రియోచితసంగరం బొనర్ప.

వినవు భోజన మొసఁగి చంపింపలేవు
విస మహార్ణవమునఁ బార వేయలేవు
మించి లాక్షాగృహంబుఁ గాల్పించలేవు
ద్యూతమున గెల్చి మిగుల సంతోషమొంది
ద్రౌపదిని భంగపుచ్చంగఁ దలఁపలేవు;
ఎట్టి లీల మమ్ము శిక్షింప నెంచినావు?
ఆజికంటెను వేఱుపాయంబు లేదు
కలదు త్రొక్కంగఁ దగిన మార్గం బదొకటె
రమ్ము! క్షత్రియోచితసంగరం బొనర్ప

ద్వాదశాబ్దముల్ గహన నివాస మందు
జెప్పరాని పిలుగులఁ జెందినాము!
మాఱువేసంబుల విరాట మాన్య వాటి
పతి పురంబున నజ్ఞాత వాసదీక్ష
జయపురస్సరముగఁ దీర్చఁ జాలినాము
చేయుమన్నట్టి పనులెల్లఁ జేసినాము!

తుదకుఁ బరపంచకముఁ గోర తుచ్ఛుఁడవయి
కృష్ణు సందేశము తిరస్కరించినావు
ఘోర సంగరమొనరింపఁ గోరినావు
ధర్మమే జయమను మాటఁ దలఁపవైతి!
కోరి కొఱవి చేకొని నెత్తి గోకి కొంటి
బంధు మిత్రులు పరిజనుల్ భండనమున
తీవ్ర యుద్ధంబు నొనరించి త్రెళ్లినారు!
ఇప్పుడేమి యొనర్పఁగ నెంచినావు?
హస్తములు కాలిపోయిన నాకు లేమి
చేయునో యింత యోచించి చెప్పుమయ్య!
ఇఁక విచారింప లాభ మింతేని లేదు!
ఆజికంటెను వేఱుపాయంబు లేదు!
కలదు త్రొక్కంగఁ దగిన మార్గంబ దొకటె!
రమ్ము! క్షత్రియోచిత సంగరంబొనర్ప!

ఏవురము మేమనుచు మది నెంచ వలదు
ఐదుగురిలోన నీ కోరినట్టి వాఁడె
ద్వంద్వయుద్ధంబు నొనరింప వచ్చుఁ గాన
రమ్ము! క్షత్రియోచిత సంగరం బొనర్ప!
పాఱుఁబోతువై దాగంగ వలవ దింక!!






## ౧. గురుప్రసాదము

మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయ శాస్త్రిగారిచే (ప్రధానోపాధ్యాయులు, మహారాజా సంస్కృతకళాశాల, విజయనగరము) రచింపఁబడిన యీ గ్రంథము, పాణినీయవ్యాకరణశాస్త్రమునందు నాగోజి భట్టవిరచితలఘుశబ్దేందుశేఖరమునకు వ్యాఖ్యానము. శబ్దేందుశేఖరమున కీవఱకు ననేకవ్యాఖ్యానము లున్నవికాని, యవియెల్ల నాగోజిభట్టునభిప్రాయమును సరిగ నిర్ణయించికొనలేక వాఁడు మిక్కిలి యాతనిగ్రంథములందు లేని తప్పులను గల్పించునవిగా మాత్రమేయుండి వ్యుత్పిత్సువులకు దుష్పథావేదకములుగా నున్నవి. మహామహోపాధ్యాయులవారు బహుగ్రంథద్రష్టృతచే నాగేశుని సిద్ధాంతమును బాగుగ నెఱింగినవారై యీదురవ్యాఖ్యానముల నెల్ల యుక్తియుక్తముగా ఖండించి పాతంజల మహాభాష్యానుసారముగ దమగ్రంథమును వెలయించిరి. కువ్యాఖ్యావిషమూర్ఛితమైన కాశికాసభారతిని మఱల నాగేశుని సంజీవని యెట్లుజ్జీవింపఁజేసెనో యశ్లోకోప ప్రవృత్తములగు వ్యాఖ్యానములనెల్ల ఖండించి యీగురుప్రసాదము నాగేశోద్దేశమును వెల్లడించునదిగా నున్నది. శ్రీ శ్రీ దివాన్‌బహదూరు కిలాంబి రామానుజాచార్యులవారు వ్రాసిన యీగ్రంథపుఁ బీఠికయు, శ్రీయుతులు కుప్పుస్వామిశాస్త్రిగారు (చెన్నపుర రాజధానీకళాశాలా సంస్కృతాధ్యాపకులు) మొదలగు పండితవతంసము లొసఁగినసదభిప్రాయములు నీగ్రంథరచనమున శాస్త్రిగారు కావించిన పరిశ్రమమును, వారి ప్రతిభావిశేషమును, గ్రంథప్రాశస్త్యమును చెప్పక చెప్పుచున్నవి. గ్రంథము స్వరసంస్కృతము మాత్రము ముద్రింపఁబడినది. 336 పు. సాగరలిపి.

శ్రీ శాస్త్రిలవారు తాము రచించినది యేతావన్మాత్రమేననియు వార్ధకమునను, కార్యాంతరరాసంగమునను నీ గ్రంథమును రచింపఁజాలననియు, తమశిష్యులుగాని, యితరవిద్వన్మణు లెవ్వరేనిగాని పూరించిన బాగుండుననియు వ్రాసియున్నారు. కాని వారట్లువ్రాయుట సమంజసముగాఁ గాన్పింపదు. ఇట్టి యుపస్థితి, పరికరములు గలవా రొరు లుండుటయేయరుదు. ఉన్నను వారి కవకాశము లభించుటసున్న. కావున శ్రీ శాస్త్రిగారే యీ గ్రంథమును సంపూర్ణముగ రచియించి నాగేశునిఅపకీర్తికళంకమును బూర్తిగాఁ బోఁగొట్టవలయును. గీర్వాణవ్యాకరణశాస్త్రవృక్షమున కిదియొక నూతనకుసుమ మగుటచే సంస్కృతభాషాభిమానులు - ముఖ్యముగ వ్యాకరణాభిమానులు—తదామోదసౌఖ్యమును బడసి శ్రీశాస్త్రిగారియెడఁ దమకృతజ్ఞతను వెల్లడింతురుగాక!

గ్రంథమునకు మూల్యము నిర్ణయింపబడలేదు. వాస్తవముగ నిదియనర్ఘము. ఆంధ్రదేశమునందలి పండితులు, వ్యుత్పిత్సువులు నీగ్రంథమును సేకరించికొని లాభమునొంది శ్రీ శాస్త్రిగారి పరిశ్రమమును సఫలపఱతురుగాక!—విద్వాన్ క. సా. శాస్త్రి.

## ౨. సర్వతంత్రసిద్ధాంత పదార్థ సంగ్రహము

ఇయ్యది సమస్తశాస్త్రములందునుగల సాంకేతిక (పారిభాషిక) పదముల యథార్థవివరణరూపమయిన చిన్ని సంస్కృతభాషాగ్రంథము. దీనిని సంగ్రహించినవారు భిక్షుగౌరీశంకరులు. దీనియందు వేద వేదాంగదర్శన

స్మృతిపురాణకావ్యసాంప్రదాయికాదివివిధశాస్త్రప్రసిద్ధములగు రెండువేల యేడువందల పదములకు లక్షణములు గలవు. సంస్కృతభాష నేర్చినవారికెల్ల నీ చిన్నగ్రంథ మత్యంతోపకారక మనుటకు సందియములేదు. సకల శాస్త్రములు నధ్యయనము సేయఁగలవారికాలమున నరుదుగదా? ఈగ్రంథము చేతనున్నచోఁ బ్రాకరణికము గావచ్చిన యేశాస్త్రసంకేతపదమున కైన నవలీలగా నర్థము తెలిసికొనఁగలరు. ఇంతయేల! విజ్ఞానసర్వస్వము వలె నత్యంతోపకారక మనుట చాలును. ఈ గ్రంథము ను బొంబాయిరాజధాని, హిసారుజిల్లా, జమాల్పూరు పోస్టు, ఫుట్టిగ్రామనివాసినియగు మన్భరీదేవియను నొక వైశ్యవనితామతల్లి లోకోపకారబుద్ధిచే ముద్రింపించి ప్రకటించినది. ఈగ్రంథమున కిది ద్వితీయముద్రణము. ఇంతవఱకీగ్రంథమునఁ జేరని పదార్థలక్షణము లున్నచో వానినెత్తి కనీసము పదునేనింటినైనఁ బంపినచో నా విద్వన్మణుల నామోల్లంకనపూర్వకముగా నా లక్షణములఁజేర్చి గ్రంథము తిరిగి ముద్రించి వారి కొకగ్రంథము చితముగాఁ బంపుటయేకాక యితర పారితోషికము గూడ శక్త్యనుసారముగా నీయఁబడును. పేదలగువారికీగ్రంథ ముచితముగానే యీయఁబడును. పుస్తకము వెల అణాలు ౧౨ మాత్రమే. వలయువారు ప్రకాశకర్త్రి పేర వ్రాసి తెప్పించికొననగును. విద్వాన్ క. సా. శాస్త్రి.

## ౩. శ్రీబోధిసత్త్వావదానకల్పలత

ఈ జినజాతకకథల గ్రంథము సంస్కృతమున క్షేమేంద్రమహాకవిచే రచింపఁబడి జయంతిపురం జమీందారులగు శ్రీరాజా వాసిరెడ్డి దుర్గాసదాశివేశ్వర ప్రసాద బహద్దరు మన్నె సుల్తానువారిచే వచనరూపమున నాంధ్రీకరింపఁబడినది. ఇందు పదునేనవదానములు గలవు. రచనము సరళముగను, మధురముగను నున్నది. ఒక్కొక్క యవదానమును గూర్చి నీతివైరాగ్యధర్మముల బోధించు మనోహరమైన యొకకథ గలదు. బుద్ధభగవానుఁడు శిష్యులకు ననాయాసముగా ధర్మనిష్ఠ గలుగుటకై యీమతమునకుఁ బ్రధానములగు ధర్మములనెల్ల నీకథలతో నిమిడ్చి యుపదేశించినాఁడు. కావున నీగ్రంథము యొక్క ప్రశస్తినిగూర్చి వేఱె వర్ణింప నక్కఱలేదు. పండితుల కీగ్రంథమం దిమిడియున్న భావపరిశీలనమువలనను, పామరులకు కథాపరిశీలనమువలనను ననాయాసముగా ధర్మబోధము జనించును.

కృష్ణునిచే నర్జునున కుపదేశింపఁబడిన భగవద్గీత వలన నెంత పారమార్థికఫలము లభించునో యంత యనంతఫలము బుద్ధభగవానునిచే శిష్యుల కుపదేశింపఁబడిన యీ యవదానకల్పలతవలనఁ గూడ లభించును. శ్రీజమీందారువారు చిరకాలముననే మిగిలినపల్లవములఁ గూడ నాంధ్రీకరించి ప్రకటించి యాంధ్రుల కృతజ్ఞతకుఁ బాత్రులగుదురుగాక! నూటముప్పదిపుటల గ్రంథము. వెల ౧౨ అణాలు. విలాసము:—సరస్వతీకార్యాలయము, జగ్గయ్యపేట, కృష్ణాజిల్లా.

విద్వాన్ క. సా. శాస్త్రి.

## ౪. ధమ్మపదము (వచనము)

అనువాదకులు: శ్రీ జయంతిపురం జమీందారువారగు శ్రీరాజా వాసిరెడ్డి దుర్గా సదాశివేశ్వర ప్రసాద బహద్దరు గారు

మానవు డెంతటి యైశ్వర్యసంపన్నుఁ డైనను, ఎంతటిశక్తియుక్తుఁ డైనను పారమార్థిక చింత లేనిదే ఆతని జీవితము సార్థకము కానేరదు. మానవుని యైహిక ప్రవృత్తికి ఆముష్మికచింత కళ్లెమువంటిది. అది లేకపోయినా, మానవుని రాగద్వేషాదులకు పట్టుపగ్గము లుండవు.

మానవు డెంతటిపరిసు లెత్తినను, ఎన్నెన్ని క్రొత్తవింతలు కనిపెట్టుచున్నను, భూలోకమును ఎంత స్వర్గముగ మార్చఁజూచుచున్నను అపరిమితమైన యాతని సరభసకార్యాడంబరముయొక్క నిస్సారతను, అహంభావ పరిపూరితమైన యాతని భౌతికశక్తియొక్క వ్యర్థతను మరణమే వేవిధముల ఘోషించుచున్నది. ప్రకృతిశాస్త్రము లెంతవికసించినను, మానవుని మేధస్సు ఎట్టి వింతలను వెదచల్లి జీవితమును సౌఖ్యభాజనముగ జేయ బ్రయత్నించుచున్నను లోకమున దుఃఖమింకను ఇల్లు కట్టుకొని కాపురము చేయుచునేయున్నది. సౌఖ్యాభిలాషికి కష్టకంటకములు కాలికి గ్రుచ్చుకొనుచునే

యున్నవి. భూలోకజీవియొక్క యాయుర్దాయము పరిమితము; సౌఖ్యసంతోషములు పాలపొంగువంటివి; మానవజీవితము బుద్బుదప్రాయము: క్షణభంగురము. పుట్టునదియెల్ల గిట్టునదియే. జననమరణములు గలవాటికి దుఃఖము లెప్పటికి దప్పనివే.

తాత్కాలికముగ, శాశ్వతముగ దుఃఖమును బాపుకొని, దుఃఖప్రదమగు పునర్జన్మము లేకుండ చేసికొనుట యెట్లు?—యుగయుగములనుండి ఇదియే ప్రశ్న. ఇదియే సమస్యలలోనికెల్ల గొప్పసమస్య—శాశ్వతసమస్య. యుగయుగములందు ఈశ్వరాంశాసంభూతులైన మహనీయు లుదయించి దుఃఖపంకిలమైన యీలోకమునుండి మానవుల నుద్ధరించుటకై అర్థప్రాణములను సమర్పించి, రక్తమాంసముల నర్పించి, గాసికోర్చియోర్చి, తపస్సు చేసి చేసి, పెక్కుమార్గములను అన్వేషించి, పెక్కుసాధనములను దెలిపియున్నారు. ప్రపంచమునందలి మతములన్నియు నిట్టివే; శాశ్వతముగ నిలిచియున్న యీ క్లిష్టసమస్యను పరిష్కరించుటకు మొలకలెత్తినవే. అజరామరస్థితినందుటకు సాధనమేది? జన్మరాహిత్యమునకు త్రోవయెచ్చట? అని పలవించులోకులకు ఒక్కొక్కమతము ఒక్కొక్కదారి చూపినది. బౌద్ధమతమునట్లే.

బౌద్ధమతమును గురించిన గ్రంథములు దేశీయేతర భాషలలో పెక్కులున్నను ఆంధ్రమున నంతగా లేవు. ఇటీవల కొంతకాలమునుండి బౌద్ధకాలమునాటి దేశచరిత్రములు, బౌద్ధమును గురించిన మతగ్రంథములు ఆంధ్రసాహిత్యము నలంకరించుచున్నవి. ఆంధ్రభాషకలంకారములైన యట్టి గ్రంథములలో నూతనముగ పాలీభాషనుండి ఆంధ్రీకరింపబడిన యీధమ్మపద ముత్తమమైనది.

ముఖ్యములైన బౌద్ధమతగ్రంథములలో ధమ్మపదమొకటి. బౌద్ధమత మూలగ్రంథములు అసలుమూడు. వాటిని త్రిపిటకములందురు. హిందువులకు వేదములెట్లో బౌద్ధులకు ఈగ్రంథములట్లు: వినయపిటకము, సుత్తపిటకము, అభిధమ్మపిటకము అని వాని పేర్లు. ఇందు వినయపిటకము శిక్షావిధానమును, సుత్తపిటకము ప్రవృత్తిసాధనమును; అభిధమ్మపిటకము బౌద్ధమతతత్త్వమును బోధించునవి.

ఇందొక్కొక్క పిటకమునకు అనేక విభాగములు కలవు. అందు సుత్తపిటకమునకు దీఘనికాయమని, మజ్ఝిమనికాయమని, సంయుత్తనికాయమని, అంగుత్తరనికాయమని, ఖుద్దకనికాయమని అయిదునికాయములు (విభాగములు) కలవు. ఒక్కొక్క నికాయమునకు పెక్కువిభాగములు కలవు. పైనుడివిన వాటిలోని ఖుద్దకనికాయమున పదునైదు విభాగములు కలవు. అవి యేవన:

| | | | |
|---|---|---|---|
| ౧ | ఖుద్దకపాఠము | ౯ | థేరీగాథ |
| ౨ | ధమ్మపదము | ౧౦ | జాతకము |
| ౩ | ఉదానము | ౧౧ | నిద్దేశము |
| ౪ | ఇతివుత్తకము | ౧౨ | పటిసంభిదామగ్గము |
| ౫ | సుత్తనిపాతము | ౧౩ | అపదానము |
| ౬ | విమానవత్థు | ౧౪ | బుద్ధవంశము |
| ౭ | పేతవత్థు | ౧౫ | చరియాపిటకము |
| ౮ | థేరగాథ | | |

ఈఖుద్దకనికాయమునకు బౌద్ధులలో మఱికొందఱు మఱియొక విషయానుక్రమణిక నిచ్చెదరు. దాని ప్రకారమును విషయవిభాగములు పదునైదేకాని యనుక్రమణిక విషయములలో రెండునుమూడు భేదించును. అనుక్రమణిక విషయములలో నెట్టిభేదము లున్నను, ధమ్మపదము సుత్తపిటకముయొక్క అంతర్భాగమయిన ఖుద్దకనికాయవిభాగములలో నొక్కటియే యని యుభయపక్షములమతము. ఇది సుత్తపిటకవిభాగములోనిదే యైనను మూడుపిటకములలోని బౌద్ధమతసారమంతయు ఇందు కలదనియే చెప్పదగును.

బౌద్ధులేవిధమున ప్రవర్తించిన శాశ్వతముగ దుఃఖమును తొలగించుకొని నిర్వాణమును పొందగలరో ఆ ప్రవర్తనావిధానమంతయు గాథా (శ్లోక) రూపమున నిందు తెలుపబడినది. అందువలన ఇది నీతినిధివంటిదనవచ్చును. భగవానుడైనబుద్ధుడే మతవ్యాపనమునకై పర్యటనము చేయుచుండుతరుణమున తనశిష్యులకు ఈ నీతుల నుపదేశించెననియు, బుద్ధనిర్వాణానంతర మాతనిశిష్యులీయుపదేశములనన్నిటిని గ్రంథరూపమున సంధానించిరనియు నందురు. అందువలన నిందలి యుపదేశములన్నియు బుద్ధుడే తనశిష్యులకు; తదితరులకు నుపదేశించినట్లు కలదు.

ఈ గ్రంథమంతయు భిక్షువర్గము, అర్హత్వవర్గము, తృష్ణావర్గము మొదలగు ౨౬ వర్గములక్రింద విభాగింపబడి నది. వేఱువేఱువర్గములకు వేఱువేఱు నామము లున్నను మొత్తముమీద ప్రతివర్గమునందును ఇతివృత్తమొక్కటే. నీతిబోధ, ప్రవర్తనావిధాన నిర్ణయము.

"ముప్పులకుప్పయైన యీలోకమున జీవికి సంతోషమునకు స్థానమేది?........................

"నాయనా! యీ జగమంతయు నంధకారమయ మైనది. దానిలో దగుల్కొనినవానికి గన్ను పొడుచుకొనినను గానరాదు. దానినుండి తప్పించుకొనినవాడు వేటకాని యుచ్చులనుండి తప్పించుకొనిన పక్షివలె స్వేచ్ఛ ననుభవించునోయీ !........................

"చిక్కగా నేయని యింటికప్పునుండి వర్షబిందువులు లోపలికి జారునట్లు వివేకములేని మనస్సునుండి విషయవాంఛలు ప్రవహించును. ..................

"విషయవనమునందలి దగు స్త్రీవాంఛావృక్షమూల మించుకయైన నిలిచియుండునేని పాలు త్రాగుచూడ తల్లిని విడువనట్లది మానవుని మనస్సును విడిచి పోవదు. ........................................

"కాఱుచిచ్చువలె విషయవాంఛ దహించును. పిశాచమట్లు ద్వేషము విక్రమించును. పాశమట్లు మోహము బంధించును. నదివలె వేగాస ముంచివేయును....

"మన మేమగ మో యెఱుగుదురా? మనము మన విచారముచే గల్పింపబడిన రూపములము..........

"మనవిచారముల బుట్టించునది మన మానసికావస్థయే. వానిని భావించునదియు మనస్సే. వీనికన్నిటికి నాధారము విచారసంస్కారములు. మన మాటలలోను, చేతలలోను మనయాలోచనలు స్ఫురించుచుండును....

"దుఃఖము దుష్కర్మములఫలము గదోయీ!

"ఆకలికంటె మిక్కుటమైన రోగము లేదు. దేహధారణమునకంటె నధికమైన దుఃఖము లేదు.......

"వానికి (కోరికలకు) లోబడి సుఖమును బడయగోరువాడు జననమరణచక్రమున దగుల్కొని పరిభ్రమించుచుండును......................................"

అని బుద్ధుడీవిధమున నుద్బోధించి

"శ్రద్ధ, విశుద్ధవర్తనము, ధ్యానము, ధర్మజ్ఞానములను సాధనములతో నుత్సాహివై దుఃఖములు దొలగించుకొనుము .......................... .."

అని యుపదేశించుచున్నాడు.

"ద్వేషము ద్వేషమువలన నెన్నటికిని నశింపదు. ప్రేమవలననే యది శాంతించును. ఇది సనాతనమైన ధర్మము. సంసారమున బడి కొట్టుకొనువారు. "మనము గూడ నశించువారమే" యని తలపోయరు. ఆమర్మము నెఱిగినవారికి వైరము నశించును..................

"ద్వేషి ప్రతిద్వేషికి జేయు నపకారముకంటె వంకరటింకరగాబోవు చిత్తమే అధికముగా మనుజునకు హానిచేయును. .... ......................

"క్రోధమును ప్రేమచేత గూలద్రోయవలెను. చెడుగును మంచితనమున నడగద్రొక్కవలెను. లోభి నౌదార్యముచే లొంగదీయవలెను. అసత్యమును సత్యముచేత నపహరింపవలెను.......... . ...................

"ఎవ్వరినిగూడ నొవ్వనాడకుము. కల్యాణమును గాంక్షించువాడా! వారుగూడ నిన్నట్లు దూఱుదురోయీ! సిగపట్లు దెచ్చిపెట్టుమాట నొకటిగూడ నాడకుము. పిదప నది పీడించును సుమా! గ్రుద్దకుము; గ్రుద్దపడ్డెదవు. అది నీ వనుభవింపవలసినదే. ............

"'పరులయెడ మన మెట్లు ప్రవర్తింతుమో మనల వారట్లు మర్యాదచేయుదురు' అని తలచుచు బుద్ధిమంతుడు పరిహాసములోగూడ మాయమర్మముల మొట్టదలపెట్టడు. ................................

"నీవుగూడ నితరులచే బోధింపవలసినవాడవే అను మాట మనమున నుంచుకొని పరుల బోధింపకుము. బోధకుకారణభూతుడవు గూడ గాకుము.....................

"ధనము గూర్చుకొనక దేహరక్షణకొఱకు పరులొసంగెడు సామాన్యమైన యాహారమును మాత్రమును కొద్దిగా భుజించుచు, అనగా—జీవధారణము కొఱకు మాత్రమే తినవలెను గాని తిండికొఱకే బ్రతుకరాదను భావము కలవాడై కాలము పుచ్చుచుండువాడే దేవ

డో వాడు సమగ్రముగా నాత్మను వశీకరించుకొని నిర్వాణము జేరుచున్నాడు......................"

ఇదియే బుద్ధబోధసుధాసారము. గ్రంథమంతయు నిట్టి సూక్తిరత్నములకు నిధివలె నున్నది

"భిక్షుకుడు ఇతరుల నైచ్యములను, పాపకృత్యములును, అకృత్యములును వెదకుచుండరాదు. అవి తనయందు లేకుండునట్లు సదా శ్రద్ధాళుడై చూచుకొనుచుండవలెను...................................

"తన మౌర్ఖ్యము గుర్తింపగల్గిన మూర్ఖుడే బుద్ధిమంతుడు. తన్ను దాను బుద్ధిమంతు డనుకొను మూర్ఖుడే నిశ్చయముగా మూర్ఖుడు......................

"వనవాసము, జటాధారణము, ఉపవాసము, స్థండిలశయనము, భస్మోద్ధూళనము, మౌనము, తపశ్చర్య తృష్ణను జయింపలేనివానిని బవిత్రుని జేయజాలవు....

"ప్రతిమానవుడు ఇతరులకు జెప్పబోవుదానిని ముందుగా దా నాచరింపవలెను. తన్ను దాను వశము చేసికొనవలెను. అట్టివానికి బరులు తమంత దామ వశు లగుదురు...................................

"మనుజుడు దుష్టుడగుటయు, శిష్టు డగుటయు దనచేతిలోనిపనియే. పరులు వానిని బవిత్రుని జేయ జాలరన్నా!...................................

"పరులదోషములు లెక్కింప బాండిత్య మక్కరలేదు. తనదోషములను దాను దెలియుట కష్టసాధ్యము. మనుజుడు పరులదోషములను జొట్టువలె దూరుచుండును బట్టును కాని జూదగాడగు జూదరి పాచికనుబోలె తన దోషమును మాత్రము దాచికొనును.....................

"తల నెరిసినంతన వృద్ధుడు కానేరడు మనుజుడు.

"జడలు దాల్చిన నేమి? కృష్ణాజినము గట్టిన నేమి? వానివలన బ్రయోజనము లేదోయీ! నీ హృదయసీమను దృష్ణయను కాఱడవి పెరుగుచుండ నీవు బాహ్యశుద్ధికొఱకు బ్రాకులాడుచున్నావు........."

ఇట్టి సూర్యసూక్తు లేమతమువారికి రుచింపవు? వెనుకటికి, నిప్పటికిగూడ నివి శాశ్వతసత్యములే. వానికి మార్పు లేదు.

ధమ్మపదమునందలి బుద్ధబోధలలో చాలభాగము సంస్కృతగ్రంథములలోనికి, దేశభాషా గ్రంథములలోనికి నెక్కినది అందువలననే డీనిలోని పెక్కుగ్రంథములలో శ్లోకరూపముననో, పద్యరూపముననో గాన్పించును. ఈ సూత్రములకు సరిపోలు సంస్కృతశ్లోకములను, పద్యములును ఆయా గ్రంథములనుండి యెత్తి చూపవచ్చును గాని గ్రంథవిస్తరభీతిచే విరమించుచున్నాను.

గ్రంథకర్తగారు దీనికి విపులమైన పీఠికను వ్రాసియున్నారు. అందు జైన, బౌద్ధమతములు, వానివృత్తాంతము మహావీర, బుద్ధుల జీవితచరిత్రములు, బౌద్ధమతమునాటి కుండు సాంఘికమతపరిస్థితులు, బుద్ధనిర్వాణకాలనిర్ణయచర్చ ఈ మొదలగువానినిగుఱించి వ్రాసియున్నారు. పాలీమూలమును, గ్రంథాంతమున విశేషవిషయములను వివరించు అనుబంధమునుగలదు. వెల రూ. ౨—౮—౦.

గ్రంథ మమూల్యమైనది. ఇట్టి సత్కృతిని రచియించి ఆంధ్రదేశమునకు సమర్పించిన శ్రీ రాజావారు ప్రశంసాపాత్రులు.

విలాసము:—సరస్వతీకార్యాలయము,
జగ్గయ్యపేట, కృష్ణాజిల్లా.

మ. సో. శర్మ.






౧ (ఎ) ఏకావతారములు(వచనము).—(బి) శ్రీ లక్ష్మీకాంతశతకము (కందపద్యములు ౧౧౪) రచయిత: కావ్యపురాణతీర్థ జనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మ గారు, కడప మునిసిపల్ హైస్కూలు ఆంధ్రపండితులు.

ప్రకాశకులు:—వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండుసన్సు, 292, ఎస్ప్లనేడ్, చెన్నపురి వీరి వద్దను గ్రంథకర్తగారివద్దనుగూడ నీ పుస్తకములు దొరకును. వెల తెలుపలేదు

౨. శివసంహిత (యోగశాస్త్రము, వచనము) — అనువాదకుడు: శ్రీగంటి జోగి సోమయాజిగారు, ఉపాధ్యాయులు, మునిసిపల్ హైస్కూలు, ఆదోని వెల ౦-౫-౦.

3. (ఎ) స్త్రీనీతిరత్నావళి (గీతపద్యములు౧౦౧). వెల ౦-౨-౦

(బి) యావనతారావళి (ఇరువదియేడు వృత్తములు). వెల ౦-౦-౯

(సి) భక్తహృదయము (ప్రథమభాగము, అనువది వృత్తములు). వెల ౦ ౨-౬.

ఈగ్రంథములను రచియించినవారు శ్రీ [illegible] కాని వేంకటనరసింహారావు గారు

విలాసము:— శ్రీరామగ్రంథాలయము, లక్ష్మీనరసింహపురము, పిఠాపురము పోస్టు, తూర్పుగోదావరి

౪. స్వీయసుషమ, పద్యాత్మకఖండకావ్యము— కర్త: కావ్యవిశారద [illegible] శ్రీఅనుముల వెంకటశేషకవిగారు, [illegible] పండితుడు, యం యం యం. స్కూలు, [illegible] పుస్తకము వీరి వద్ద దొరకును. వెల ౦ ౪-౦

౫. పద్యలక్షణసారసంగ్రహము—దీనిని శ్రీ. శే. క్రొమ్మలూరు కప్పనయ్యంగారు రచియించిరి. ఇది మూడవ ముద్రణము. ఆంధ్రభాషయందు పద్యరచనమునకు వలసిన లక్షణముల నీగ్రంథము వివరించుచున్నది. ప్రకాశకులు: వెంకటరామ అండుకో, బెజవాడ. వెల ౧-౪-౦

౬. ద్రౌపదీస్వయంవరము(ఆంధ్రభారతాదిపర్వమునందలిది)— శ్రీ చెరుకూరి వెంకటజోగారావుగారు రచియించిన టీకాతాత్పర్యవిశేషార్థ విమర్శ్యాలక్ష్యసహితము, హైస్కూలుతరగతులబాలురకు ఉపయోగించును.

ప్రకాశకులు— ది ఎడ్యుకేషనల్ పబ్లిషింగ్ హౌస్, విజయనగరము. వెల రు ౧-౪-౦.

౭. శ్రీ మహాత్మ్యశతకము(నూటఏకప్రాసకందములు)—కర్త: శ్రీ పీనుగు తమ్మిరాజుగారు, తాడేశ్వరము వెలలేదు.

౮. రామశతకము(కందపద్యములు ౧౦౯)—కర్త: కొల్లిపర కోటేశ్వరశ్రేష్ఠిగారు, పుసులూరు వెల౦-౧-౦.

౯. శ్రీ సత్యనారాయణతారావళి (౨౭ పద్యములు)—కర్త: మహాశివభట్టు బుచ్చిరాట్కవిగారు, తాడేశ్వరము వెల రు ౦-౧-౦.

౧౦. కథామంజరి(వచనము) -గ్రంథకర్త: కొల్లపూడి శ్రీరామశాస్త్రిగారు. ఇది బాలురకుపయోగపడునట్లు వ్రాయబడిన నీతికథలు ఇరువదియైదుగలవు. ఇది విద్యావినోదినీ గ్రంథమాలలోని ౬వ గుచ్ఛము. వెల ౦-౨-౦ విలాసము: మేనేజరు, విద్యావినోదినీ గ్రంథమాల, చిత్తూరు.

౧౧. సంకల్పసిద్ధి—ప్రచారకులు : శ్రీ ఆర్య నారాయణమూర్తి గారు 'సంకల్పమును గురించి నితాంతము నేమియు తెలియక నష్టభ్రష్టులగుచున్న ఇప్పటి నవయువకులకు' దానిస్వరూప స్వభావ ప్రభావములను తెలియజెప్పి, అది సిద్ధి యెట్లగునదియు తెలియజేయుట ఈగ్రంథముయొక్క ముఖ్యోద్దేశము. ప్రచారకులగ్రంథములన్నియు కొన్నవారి కిదిబహుమానముగ నీయబడును.

విలాసము: ఆర్య నారాయణమూర్తి గారు, హిందూపురము.

౧౨ ప్రేమ—ఆంధ్ర గ్రంథరత్నాకరమున ఇది ఆఱవ అనుబంధము. భక్తియోగ కర్మయోగాది బహు గ్రంథప్రణేతలైన శ్రీయుత బాబూ అశ్వినీకుమారదత్తు గారు బెంగాలీభాషలో ప్రేమను గురించి యొసంగిన యుపన్యాసములకు శ్రీమతి గుడిసేవ నాగామణిదేవిగారి ఆంధ్రానువాద మిది. దీనివెల ౧-౬-౦ వలయువారు: ఆంధ్రగ్రంథరత్నాకరము, గుడివాడ, కృష్ణాజిల్లా అని వ్రాయవలెను

౧౩. హిందూ మతౌన్నత్యము— గ్రంథకర్త: శ్రీభద్రగిరి నంబెరుమాళ్లు, బి ఏ యల్.టి.గారు. గ్రంథమంతయు ప్రశ్నోత్తరరూపముననుండి హిందూమతౌన్నత్యము నుగ్గడించుచున్నది. ఇదివిజయనగరము శ్రీరామానుజవిలాస ముద్రాక్షరశాలయందు ముద్రితము. వెల తెలియరాదు.

౧౪ ప్రకృతిచందనము—గ్రంథకర్త: శ్రీ కవి కొండల వేంకటరావుగారు, నరసాపురము. ఇందు వీరు భిన్న భిన్న విషయములనుగుఱించి రచించిన వృత్తగీతాదులు కలవు ఇది 'అభినవాంధ్రకార్యస్థాన సుప్రకాశితము.' దీనివెల తెలియరాదు. గ్రంథకర్తగారివద్దదొరకునీపుస్తకము.

౧౫. పద్యమంజరి (ప్రథమభాగము)—శ్రీ తంగిరాల రామనాథశర్మగారు దీనినిరచించిరి. ఇందు అక్బరు జననము, బుద్ధచరిత్రము, శ్రీకృష్ణదేవరాయలు, హేమూవధ, కరుణదేవి, మొదలైన చారిత్రకవిషయములు పద్యరూపమున వ్రాయబడినవి.

సంపూర్ణము

# ప్రథమచుంబనము

జంధ్యాల శివన్నశాస్త్రిగారు

కంటకాకీర్ణ దుర్గమ గహనములను
　　అంధతమసావృతాద్రి గుహాంతరముల
నేను విడిచిన దొక్కటియేని లేదు
ఎందు నీదర్శనమ్ము లభింపదయ్యె.
మడువిరాశకుబదులుగ మకురుతనము
విమల సత్యాగ్రహవ్రతాపేక్ష హెచ్చె
ద్విగుణితోత్సాహమున నిన్ను వెదకుచుండఁ
గడకు విశ్వాస మందిరాంగణమునందు
తొలిసమాగమమయ్యె నీతోడనాకు
మధురదరహాసచంద్రికామహితమైన
తావకీన ముఖమ్ము ముద్దాడ మదిని
ప్రబలకాంక్ష జనించె దౌర్భాగ్యవిధమొ
లేక మామక సౌభాగ్య లీలయొక్కొ—
వెఱపు సంకోచమును ద్రపాభరము నెదను
బొలయుటను నాదుకోర్కె నిష్ఫలతఁగాంచె
హృదయ మెఱిఁగిన సహృదయ సదయమతివి
కావుటను నీవ వేగ నాకడకు వచ్చి
ప్రథమచుంబనభాగ్య మర్పణము నేసి
ఆశకును వాంఛకును మించు నధిక సుఖమొ
అధికసంక్షోభమునో కూర్చి యపుడ మెఱపుఁ
దీవవలె మాయమైతివి దివ్యమధుర
మానుకస్వప్న మప్పుడ మాయమయ్యె
ప్రథమచుంబన మింక నా భాగ్యమందు
గలుగదని నే నెఱుంగుదుఁగాని సతము
నవనవతఁదాల్చునీచుంబనమ్ము మరల
నలవడెడు భాగ్యమే నాకు నబ్బెనేని
తదధికానందమున నన్నుఁ దనుపకున్నె.

('పూఁదేనె' నుండి)



# సాక్షిప్రాయ విశేషములు

శ్లో. శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్,
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః.

శ్రీకృష్ణభగవానుడు ధర్మారాధనవిషయమున పార్థునకు జేసిన హితోపదేశము శ్రేయస్కాముల కాచరణీయముగ నున్నది. మానవుల కుత్కృష్టమైన పరధర్మారాధనము కంటె విగుణమైనను స్వధర్మారాధనము శ్రేయస్కరము. భయావహమైన పరధర్మానుష్ఠానముకంటెను స్వధర్మానుష్ఠానమునందు మరణము శ్రేయస్కరము. గీతాశాస్త్రమునందలి యితరధర్మోపదేశములవలె నిదియును సర్వత్ర సమన్వయమును బొందుచున్నది. కురుక్షేత్రమునం దాయుధపాణియై రణరంగమునందు ప్రవేశించిన విజయుని కస్త్రసన్న్యాసమును, ప్రాయోపవేశమును భయావహములు. యుద్ధముచేయుట శ్రేయస్కరము. ప్రజలు సామాన్యముగ నీధర్మలక్ష్యమునే యారాధించుచున్నను పండితులుమాత్రము భిన్నమార్గము నవలంబించుచున్నారు. ప్రజల నైతికమతరాజకీయసాంఘికజీవనమునం దిట్టి లక్ష్యవిభేదము గనుపడుచున్నది. ప్రజలు భక్తివిశ్వాసములను గలిగి వారి విశ్వాసముల కనుకూలముగను ప్రవర్తించుచున్నారు; నిత్యజీవనమునందు సరళజీవనమును గలిగి ప్రవర్తించుచున్నారు; సాంఘికవ్యవస్థలను పాటించుచున్నారు; మతధర్మముల ననుష్ఠించుచున్నారు; రాజ్యవ్యవహారములను యథావిధిగ నిర్వహించుచున్నారు. విద్యావంతులైన నాయకులు వేరుమార్గము నవలంబించుచు సంక్షోభమును గలుగజేయుచున్నారు. ప్రజలు ఫలాపేక్షలేకను స్వధర్మనిర్వహణమును జేయుచున్నను నాయకులు స్వప్రయోజనపరాయణులై మహాసాంకర్యమును గలుగజేయుచున్నారు. ప్రస్తుతము పర్యాప్తమగుచున్న యెన్నికలవ్యవహారము లీవిపర్యస్తస్థితిని విశదము చేయుచున్నవి.

* * * *

## అభ్యర్థులు — ఓటర్లు

అభ్యర్థులు విజయమును బొందుటకు విశ్వప్రయత్నములను జేయుట సహజము. ఆప్రయత్నములు సక్రమమార్గమును వీడి వామమార్గము నవలంబించుట సంతాపకరము. ఎన్నికలవాఙ్మయము దూషణభూయిష్ఠమై ద్వేషానలమును ప్రజ్వలింపజేయుచున్నది. కరపత్రములందును, ప్రసంగములందును గనుపడుచున్న నిందావాక్యములు సంఘము నావరించిన కాలుష్యమును విశదముచేయుచున్నవి. అభ్యర్థుల భూతవిషయములను ప్రకటించి జయమును బడయగోరుచున్నారు. వా రాత్మ

స్తోత్రములతోను, పరనిందలతోను సంతృప్తినిబొందక కేవల మసత్యములను గల్పించి విజయమును బడయగోరుట మహాదారుణముగ నున్నది. కులదూషణలు, వ్యక్తిదూషణలు, కుతంత్రములు, మాయావాదములు, నిందలు, తిట్లాటలు సర్వత్ర ప్రత్యక్ష మగుచున్నవి. ప్రజాసామాన్యమున కీప్రచారవ్యవహార మసహ్యమును గలుగజేయుచున్నది. అధర్మప్రచారము గలుగజేయగల హానిని ఎన్నికల ప్రచారము విశదము చేయుచున్నది.

ప్రజల కీయక్రమాందోళనము హేయముగ నున్నది. అభ్యర్థులు స్నేహధర్మమునాపాదించి వోట్లకు బాధించుచున్నారు; కులాభిమానమును చెప్పి వోట్లకు నిర్బంధించుచున్నారు; బంధుత్వము పేరుచెప్పి వోట్లకు ప్రార్థేయపడుచున్నారు; ధనప్రయోజనమును జూపి వోట్లకు పీడించుచున్నారు; అధికార దర్పమును వ్యక్తముచేసి వోట్లకు బాధించుచున్నారు; కాలువలను, రోడ్లను, వంతెనలను, పాఠశాలలను గనుపరచుచు వోట్లకు సాధనములను బన్నుచున్నారు; స్వరాజ్య ధర్మసంబోధనమును జేయుచు వోట్ల నడుగుచున్నారు. ఈ మహాసంకులమునందు ప్రజలకు కర్తవ్యమును నిర్ణయించుట దుస్తరముగ నున్నది. కులము, స్నేహము, బాంధవ్యము, ధనము, అధికారము, ధర్మము పరస్పరసంఘర్షణమును జేయుచు కర్తవ్యము నగమ్యగోచరము చేయుచున్నవి. ప్రచారకులు వోట్లకుగాను జేయుచున్న మాయాప్రచారములను ప్రజలు గ్రహించియును స్వధర్మనిర్వహణమును జేయుటకు సాహస ధైర్యములను బూనజాలకున్నారు. ప్రజలకు కాంగ్రెసుపట్ల గల భక్తిని ప్రచారము విశదముచేయుచున్నను, కులాభిమానము, ధనాధికారములు కార్యసిద్ధికి ప్రతిబంధకములుగ నున్నవి. భగవంతుడు ప్రజల నీసందిగ్ధస్థితినుండి రక్షించి వారిని స్వధర్మనిర్వహణదక్షులను జేయుగాత!

## కాంగ్రెసు - వోటర్లు

వోటర్ల కభ్యర్థుల గుణగణములను గనుగొనుట దుష్కరము. కృష్ణామండలమునందు 60,000 వోటరులు గలరు. వీరు 1800 గ్రామములందు నివసించుచున్నారు. వారియందు చాలమంది చదువురానివారు గలరు. వారి కభ్యర్థుల పేరులైనను తెలిసియుండవు. వారికి కాంగ్రెసు పేరు ప్రతిష్ఠలు కర్ణాకర్ణిగ వినబడినను స్వాయంవ్యక్తిత్వమును వ్యక్తము చేయుటకు దగిన శక్తిసామర్థ్యములు లేవు. వీరు స్వప్రయోజనపరాయణులచేతులందు కీలుబొమ్మలవలె మెలంగుచున్నారు. జమీందారులు, శ్రీమంతులు,విద్యావంతులు,వోటర్లను స్వప్రయోజనములకు బంట్లనువలె వినియోగించుచున్నారు. ధనము పలుకుబడి గలవారి స్వాధీనమునందు వోటరులున్నను ధర్మతత్పరత వోటరులహృదయములను బాధించుచున్నది. కాంగ్రెసుమీదను నవ్యక్తమైన భక్తి ప్రజాహృదయమునందు గలదు. తమవోట్లను కాంగ్రెసునకు సమర్పింప దలచిన కాంగ్రెసు భక్తులు దేశమునందంతటను గలరు.చలిదిమూటలను దీసికొనిపోయి వోట్లను కాంగ్రెసునకు

వేయదలచిన ధీరులు గలరు. కాని గ్రామకట్టడలు, కులకట్టడలు ధర్మనిర్వాహణమునకు ప్రతిబంధకములుగ నున్నవి. కాంగ్రెసుప్రచారకుల యవ్యాజమైనభక్తి పరమానందమును గలుగ జేయుచున్నది. నిద్రాహారములను విసర్జించి, భాగ్యభోగములను గోల్పోయి యువజనులు చేయుచున్న ప్రచార మాశాకళలను ద్యోతకము చేయుచున్నది. కాని వోటర్ల నావహించిన యజ్ఞానవ్యామోహమును భేదించుటకు దేశభక్తిపరాయణులైన ప్రచారకుల సంఖ్య చాలకున్నది. కులాభిమానము పెచ్చుపెరిగి స్వరాజ్యప్రకాశము నరికట్టుచున్నది. రెడ్డి, కమ్మ, కాపు, వెలమ, బ్రాహ్మణ ఘోష బయలుదేరినది. జస్టిసు, స్వతంత్ర పక్షములు భయసంభ్రమములను గలుగజేయుచున్నవి. ఈసంక్షోభసమయమునందు రాజ్యాంగమండలమునందు కాంగ్రెసుజ్యోతి యొక్కటియే తేజోవంతమై వెలుంగుచు ప్రజలకు ధర్మమార్గమును జూపుచున్నది. గతించిన నలువదేండ్లయందును కాంగ్రెసునం దెన్నియో మార్పులు గలిగినవి. కాంగ్రెసు గురుపరంపరలందు ఉమేశచంద్రబెనర్జి, గోపాలకృష్ణగోకలె, లోకమాన్యతిలకు, దాదాభాయినౌరోజి, గాంధిమహాత్ముడు, సరోజినిదేవి గలరు. కాంగ్రెసు ఆదర్శపరంపరలందు మార్పులు గలిగినను ఆదర్శజ్యోతి దివ్యకాంతులతో వెలుంగుచు ప్రజలకు స్వరాజ్యజ్యోతిని ప్రత్యక్షము చేయుచున్నది. కాంగ్రెసు ప్రతిభ వర్తమానసమయమునందు కొంత క్షీణించినను స్వధర్మనిర్వాహణమును జేయుటకును, స్వరాజ్యసంపాదనమునకును కాంగ్రెసు సంస్థయే సాధనభూతముగ నున్నది. కులాభిమానము కులతత్త్వమును, ధనాభిమానము ధనతత్త్వమును ప్రసాదింపగలవుగాని స్వరాజ్యసంపాదనమును జేయజాలవు. ప్రజలందరును కులాభిమానమును, అధికారాభిమానమును విసర్జించి 8-వ తేదిని వారి వోట్లను కాంగ్రెసు అభ్యర్థుల కిచ్చి స్వరాజ్యసంపాదనమునకు యథాశక్తిని దోడ్పడుటకు భగవంతుడనుగ్రహించుగాత !



Edited and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No.7, Thambu Chetty Street, G.T. Madras




# విషయానుక్రమణిక

## చిత్రములు

[illegible]లు:—భాగస్వాములు, వరూథినీ ప్రవరాఖ్యులు.
[illegible]ు:—తంజావూరు (కోట) లోని శిల్పచిత్రములు ౧౦; ఆంధ్రసభల
[illegible]వ్యక్తులు-ఏలూరు; చెన్నపుర రాజధాని నూతనమంత్రివర్గము;
[illegible]స వారి శివాజీపాత్రము; బ్రహ్మసమాజ ప్రార్థనమందిరము,
అయ్యంగారు; ఇతరచిత్రములును.





## క్షమాపణ

దీపాలపిచ్చయ్యశాస్త్రిగారు

పనిలేని పనిగ నే దనువు గైకొనఁబూని
నపు డేల వద్దన వైతివయ్య!
కానితలంపులు నేను దలంచునో
నపు డేల యిది తగ దనవు తండ్రి!
నియతిమాలినపల్కు నేఁ బల్కఁ దొడఁగుచో
నపు డేల యిది దోషమనవు దేవ!
నెడఁగని కార్యములఁ గావింపఁగ నే సిద్ధ
మైన నేల విదద్దు నమవు స్వామి!
చేయు దుష్కార్యముల్ నెల్లఁ జేయనిచ్చి
అనంతరం శిక్షింతువంట, నే మిన్యాయమయ్య?
అదుపునం దుంచుకొనుము, లేదా పొనర్చు
తప్పులు క్షమించుమయ్య, వందన మొనర్తు